# కూచిపూడి - భాగవతులు



రచయిత

"విద్వాన్" చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి

రిటైర్డు గ్రేడ్ I తెలుగు పండితుడు

ప్రథమ ముద్రణ
రుధిరోద్గారి
1983 మే

1000 ప్రతులు

ప్రతులకు :

విద్వాన్ చింతలపాటి పూర్ణచంద్రరావు
గ్రేడ్ I తెలుగు పండితుడు
పరిషత్ హైస్కూలు
పెదసనగల్లు పోస్టు
మొవ్వ తాలూకా, కృష్ణాజిల్లా

ముద్రణ :
శ్రీవేణి ప్రెస్, మచిలీపట్నం



THIS BOOK IS

PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

UNDER THEIR SCHEME

"AID TO PUBLISH RELIGIOUS BOOKS"

శ్రీ మహాగణపతయే నమః



" శ్రీ విఘ్నేశ్వర పాదపద్మములనే,
సేవించి నా యాత్మలో
భావింతున్ బరమేష్ఠి నచ్యుతుని
సద్భాలేందు మౌళిన్ దగన్.
శ్రీ వాగ్వాణి రమా హిమాచల సుతల్
శ్రీ లొంద మేల్సన్నుతుల్,
గావింతున్ గృతికర్త బ్రోచుటకు
నా కావ్యార్థ మీడేర్పగన్ ".

—శ్రీ సిద్ధేంద్రయోగి

# పితృపూజనము



శ్రీ చింతలపాటి లక్ష్మీపతిశాస్త్రి

సరసోదార విశుద్ధవర్తన
మహాసంస్కార సంభావ్యుడై
పరతత్త్వార్థ వివేచనాప్రథిత
భాస్వచ్చిత్త సందీప్తుడై
వరశాస్త్రాగమ పాండితీ పటిమ
విద్వద్వంద్యుడై నట్టి, స
ద్గురు లక్ష్మీపతిశాస్త్రి, మజ్జనకు
సంతోషంబునన్ గొల్చెదన్.

—గ్రంథకర్త

Dr. ప్రసాదరాయకులపతి, M. A., Ph. D
Head of the Dept. of Telugu & Sanskrit.
Hindu College, GUNTUR

# ముందుమాట

విద్వాన్, చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో పరిణతి చెందిన విద్వాంసులు. ఉత్తమశ్రేణికి చెందిన రచయితకేయే గుణము లుండవలయునో ఆయా గుణములు పుష్కలముగా నున్న మనీషివర్యులు శ్రీ శాస్త్రిగారు.

కూచిపూడి భాగవతులను గూర్చి పరిశోధన గ్రంథము వ్రాయుటకు వట్టి సాహిత్యపరిశ్రమ చాలదు. తిక్కనగారు చెప్పిన ఉదాత్త మనీష, ఉభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పము సాంగ తత్వము, కళాపిత్త్వము కావలయును. సాహిత్యబీజమన్య కళాక్షేత్రమున నాటినపుడే బలవత్తర ఫలము లభించునని ప్రాజ్ఞుల మతము. శ్రీ చింతలపాటివారిలో ఆ లక్షణములు స్పష్టముగా దర్శన మిచ్చును.

ఈ గ్రంథములో కూచిపూడి భాగవతుల సర్వవిశేషములు, సరళసుందరముగా వచ్చినవి. వారి సంప్రదాయ మేవిధముగా ప్రారంభమైనదను అంశమునుండి నేటివరకు ఆయా ప్రదర్శకుల, వంశముల, కుటుంబముల వివరములన్నియూ తెలుపబడినవి. భాగవతుల అభినయ కౌశలమునకు సంబంధించిన విషయములతో పాటు వారి మంత్రశాస్త్ర ప్రజ్ఞావిశిష్ట గాథలు కూడ ప్రస్తావనకు వచ్చినవి. వారు ధరించు వివిధ పాత్రలు, వాని అంతర చిత్రణములు, సంభాషణా చాతుర్యములు సోదాహరణముగా నీయబడుటచే వానిని గూర్చి ఒక సమగ్ర దర్శనము పొందుట కవకాశము కలిగినది.

ప్రాచీనాంధ్ర సంస్కృతిలో మనము గర్వింపదగిన ఒక ప్రధాన విభాగము కూచిపూడి నృత్యము. తెలుగువారి అభిరుచు

లను, మర్యాదలను, సంస్కారములను ప్రతిబింబించు ఒక మహత్తర విద్య అది. దానికి సంబంధించిన వివరములను శ్రమపడి సేకరించి రమణీయముగా కూర్చినారు శ్రీ లక్ష్మీనరసింహశాస్త్రిగారు. వారి గ్రంథ రచనలోని సౌందర్యమును చూపించుటకు చేసెడి ప్రయత్నము పెట్టెదనగా ఒక మధుర పదార్థములోని తీయదనము నెక్కి చూపించుట వంటిది. సాధ్యముగాని ఆ పనికి పూనుకొనక గ్రంథ మాధుర్యమును తనివితీర అనుభవింపుడని సహృదయులను కోరుచు, నింత చక్కని గ్రంథము నందించిన శ్రీ శాస్త్రిగారిని మనఃపూర్వకముగ అభినందించుచు ఈ శ్లోకమును స్మరింతును :

వ్యాసక్త్రాదయి తావనే ముకులితా
మాతంగ చర్మాంబరే।
సోత్కంపా భుజగే నిమేష రహితా
చంద్రేఽ మృతస్యందిని।
మీలద్భ్రూస్సుర సింధు దర్శన విధా
మ్లానా కపాలోదరే।
పార్వత్యా నవ సంగమ ప్రణయినీ
దృష్టి శ్శివా యాస్తువః ॥

— శ్రద్ధ మత్త —

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య
శాసన మండలి, మాజీ అధ్యక్షులు

# పరిచయము

“కూచిపూడి భాగవతులు” అను ఈ గ్రంథాన్ని రచించినది శ్రీ చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రిగారు. వీరి తండ్రి శ్రీ లక్ష్మీపతి శాస్త్రిగారు. మా తండ్రిగారికి సహాధ్యాయులు. ఆ తరువాత గురువుకూడ. ఈయన తర్క వేదాంత శాస్త్రాలలో అద్వితీయ ప్రతిభావంతులు. బహుశిష్య సంతానం కలవారు. తమ సంతానం చిన్నతనంలో వుండగానే పరమపదించారు. వీరికి స్నేహితులైన మా మేనమామ శ్రీ కొండపల్లి సుబ్బయ్యగారు, ఆ పసికందుల సంరక్షణా బాధ్యత వహించి, వ్యవహారాలు చక్కదిద్దుతూఉండే వారు. వీరి పర్యవేక్షణలో పెరిగి పెద్దవారై ఆ ముగ్గురు పిల్లలు విద్యావంతులై వృద్ధిలోకి వచ్చారు.

మా మామయ్య శ్రీ కొండపల్లి సుబ్బయ్యగారు తనువు చాలిస్తూ, వీరికి అవసరమైనప్పుడు సహాయ సంపత్తి అందించే బాధ్యత నాకు అప్పగించారు. ఈ విధంగా శ్రీ శాస్త్రిగారి కుటుంబానికి, మా సన్నిహిత సంబంధం పెనవేసుకుంది.

ఈ గ్రంథ రచయిత శ్రీ లక్ష్మీనరసింహశాస్త్రిగారు, తమ మామగారు, కూచిపూడి వాస్తవ్యులు, శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారి శిష్యులు అయిన శ్రీ భాగవతుల రామలింగశాస్త్రిగారి సన్నిధిని కావ్యపాఠం చేశారు. చిట్టిగూడూరు, శ్రీ నరసింహ సంస్కృత పాఠశాలలోను, తిరుపతి, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలోను విద్యాభ్యాసంచేసి, “విద్వాన్” పట్టభద్రులయ్యారు. వీరిది పండిత కుటుంబం. తాను జిల్లా పరిషత్తు హైస్కూళ్లలో ప్రథమశ్రేణి తెలుగు పండితునిగా పనిచేసి, తన పుత్రులలో ముగ్గురను తెలుగు పండితులనుగా తీర్చిదిద్దుతున్నారు.

ఈ గ్రంథాన్ని శ్రీ శాస్త్రిగారు చాలా కాలం క్రింద రచించారు. కూచిపూడి వారిని అచ్చు వేయించవలసినదిగా అర్థించారు. కాని, వారు ఆర్థికంగా భరించలేక వెనుకంజవేశారు. అయినా నిరుత్సాహ పడక శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి పంపి, ముద్రణ వేయించవలసినదిగా అభ్యర్థించారు. శ్రీ శ్రీనివాసుని కరుణా కటాక్ష వీక్షణాలు వీరిపై ప్రసరించాయి. అయిదువేల రూపాయల ఆర్థికసహాయం అందించారు. శ్రీ శాస్త్రిగారి కృషి ఫలించింది. గ్రంథం ముద్రణా సౌభాగ్యాన్ని పొందింది.

ఈ గ్రంథంలో నాట్యోత్పత్తి, భేదాలు కూచిపూడి వైదిక బ్రాహ్మణులు భాగవతులయిన విధం, కూచిపూడి అగ్రహార అవతరణ, మాచుపల్లి కైఫియత్తు, సిద్ధేంద్రయోగి, సిద్ధేంద్ర కళాక్షేత్ర ఆవిర్భావం అందుకు జరిగినకృషి. మున్నగు విషయాలు ఎన్నో సాధికారికంగా వివరించబడినాయి. దీనికి హిందూకళాశాల, గుంటూరు, ఆంధ్రసంస్కృత శాఖాధ్యక్షులు, శ్రీనాథపీఠం, ఎగ్జిక్యూటివ్ ప్రెసిడెంటు, గుంటూరు, డాక్టరు, ప్రసాదరాయ కులపతి. ఎం. ఎ., పి. హెచ్. డి. గారు పరిచయం వ్రాయటం సముచితంగా ఉంది.

బాల్యంలో పితృవియోగాన్ని పొందినా, పండితులై తమ కుటుంబ గౌరవాన్ని పెంచి పెద్దచేసిన వారి ప్రతిష్ఠను, విద్యనేర్పిన గురువుల మర్యాదను అతిశయింపచేసే విధంగా గ్రంథ రచన చేయుట, అందునా తిరుమలేశుని ఆర్థికసహాయాన్ని అందుకొనుట ముదావహము. శ్రీ శాస్త్రిగారు ఉద్యోగ విరమణచేసి విశ్రాంతి తీసుకొంటున్నా, తమ పాండితీప్రకర్ష ప్రకటితమగు రీతిలో సారస్వత సేవచేస్తూ, అనేక గ్రంథరచనలు చేయాలనీ, అందుకు తగిన ఆరోగ్య భోగభాగ్యాలు ప్రసాదించాలనీ శ్రీ శ్రీనివాసుని ప్రార్థిస్తున్నాను.

విజయవాడ
19-12-1982

గొట్టిపాటి బ్రహ్మయ్య

# అభిజ్ఞ

"కూచిపూడి-భాగవతులు" అను ఈ గ్రంథం శ్రీ సిద్ధేంద్ర నాట్యకళాక్షేత్ర చరిత్ర. కూచిపూడి అగ్రహార చరిత్ర. ఈ విధంగా ఇది రూపొందటానికి ప్రధాన కారకులయిన శ్రీ మత్తిరుమల తిరుపతి దేవస్థానముల అధికారులు స్తుతిపాత్రులు. ఆర్థిక సహాయ మొనరించి ఈ గ్రంథ ముద్రణకు సహకరించినందులకు వారికి కృతజ్ఞుడను.

ఈ గ్రంథానికి పరిచయ వాక్యాలు పలికిన శ్రీ శ్రీనాథ విద్యాపీఠ కార్య నిర్వాహక అధ్యక్షులు, గుంటూరు హిందూ కళాశాల తెలుగు, సంస్కృత భాషాశాఖ అధిపతులు, డాక్టరు (శ్రీ) ప్రసాదరాయ కులపతి, M. A.. Ph. D., గారికి కృతజ్ఞతా పూర్వకాభివందనములు.

రైతుపెద్ద, 'కళాప్రపూర్ణ' 'పద్మభూషణ' విధాన మండలి మాజీ అధ్యక్షులు, ప్రత్యేకించి మా కుటుంబ శ్రేయోభిలాషులు అయిన (శ్రీ) గొట్టిపాటి బ్రహ్మయ్యగారు వాత్సల్యంతో నన్ను గురించి, ఈ గ్రంథాన్ని గురించి విశదీకరించారు. వారికి నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

ఈ గ్రంథ ముద్రణ విషయంలోను, ఛాయాచిత్రాలు సమకూర్చటంలోను విశేషంగా శ్రమించి సహాయపడిన మా చిరంజీవి చింతలపాటి పూర్ణచంద్రరావునకు శుభాకాంక్షలు.

ఛాయాచిత్రాలను రమ్యంగా చిత్రించి సకాలంలో అందించిన (శ్రీ) పల్లి శంకరరావు, పామర్రు (కూచిపూడి S. V. R. శంకర్ ఫోటో స్టుడియో) వారికి, అడిగిన వెంటనే అట్టమీదిబొమ్మను కళాత్మకంగా గీసి ఇచ్చిన శ్రీ సి. ఎ. రాజు (ఆర్టిస్టు) గుడివాడ వారికి నా కళాంజలులు.

తక్కువకాలంలో ఎక్కువ శ్రమకోర్చి ఈ గ్రంథాన్ని సర్వాంగసుందరంగా అచ్చొత్తించి ఇచ్చిన శ్రీ త్రివేణి ప్రెస్, మచిలపట్టణం వారికి నా ప్రత్యేకాభివందనములు.

— చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి

## ఈ గ్రంథ రచనకు ఉపకరించిన గ్రంథములు, రచయితలు, మాస, వార, దిన పత్రికలు, వీటి రచయితలకు, అధిపతులకు హృదయపూర్వక కృతజ్ఞతలు

1. పండితారాధ్యచరిత్ర — పాల్కురికి సోమనాథుడు
2. బసవపురాణము ,,
3. శ్రీమదాంధ్ర మహాభారతము — నన్నయభట్టారకుడు
4. ,, — తిక్కన సోమయాజి
5. శ్రీమద్భారతము — వేదవ్యాసుడు
6. శ్రీమద్రామాయణము — వాల్మీకి
7. విక్రమోర్వశీయము — మహాకవి కాళిదాసు
8. గాథాసప్తశతి — హాలకవి
9. నాట్యశాస్త్రము — భరతముని
10. అమరకోశము — అమరసింహుడు
11. అభినయదర్పణము — నందికేశ్వరుడు
12 గొల్లకలాపము — శ్రీ భాగవతుల రామయ్య
13. సంగీతరత్నాకరము — శార్ఙ్గదేవుడు
14. క్రీడాభిరామము — శ్రీనాథమహాకవి
15. సర్వేశ్వరశతకము — యథావాక్కుల అన్నమయ్య
16. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము — తెలుగుభాషాసమితి
17. గ్రంథ సంజ్ఞాదర్పణము — ………………
18. భామాకలాపము — ఆంధ్ర సంగీత నాటక అకాడమీ
19. మీగడతరకలు — శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
20. ఆంధ్రవాగ్గేయకారులు — శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు
21. ఆంధ్రవాఙ్మయచరిత్ర — శ్రీ కె. వి. నారాయణరావు
22. విప్రనారాయణ - యక్షగానము — విజయరాఘవ నాయకుడు
23. దాక్షిణాత్యుల నాట్యకళాచరిత్ర — శ్రీ నటరాజ రామకృష్ణ
24. ఆంధ్రనాటక చరిత్ర — శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

25. సమగ్రాంధ్ర చరిత్ర — శ్రీ ఆరుద్ర
26. వాణి — ఆలిండియా రేడియో, మద్రాసు
27. Indian History and Culture — Vol : 1 Sri B. S. L. Hanumanta Rao and Sri K. Basaveswara Rao
28. Lives of Telugu Poets (From earliest lives to 1250 A.D.) — Sri N. Venkata Rao, M.A.
29. గ్రంథాలయసర్వస్వం — మాసపత్రిక
30. తెలుగుదేశం
31. కిన్నెర
32. కృష్ణాపత్రిక
33. నాట్యకళ
34. ఆంధ్రపత్రిక — దిన, వార పత్రికలు. విశేష సంచికలు
35. ఆంధ్రప్రభ — ,, ,, ,, ,,
36. ఆంధ్రజ్యోతి — ,, ,, ,, ,,
37. మాతృభూమి — దినపత్రిక
38. ఈనాడు —
39. ప్రజాశక్తి — ,,
40. కృషి — మాసపత్రిక
41. సూర్యరాయాంధ్ర నిఘంటువు — ...............
42. శబ్దార్థచంద్రిక — ...............
43. క్షేత్రయ్య పదస్వర సాహిత్యములు — శ్రీ బొక్కా కుమారస్వామి
44. భామాకలాపము — శ్రీ వేదాంతం పార్వతీశం
45. భరతకోశం — ...............
46. అమరవాణీ ప్రసారములు — 'కవిసమ్రాట్' పైడిపాటి సుబ్బరాయశాస్త్రి

# కూచిపూడి - భాగవతులు

## విషయానుబంధం

# కూచిపూడి - భాగవతులు

## కూచిపూడి :

అచటి విప్రులు మెచ్చ రధిక విద్యాప్రౌఢి
ముదిమడి దప్పిన మొదటి వేల్పు
నచటి రాజులు బంటు నంపి భార్గవునైన
బింకాన( బిలిపింతు రంకమునకు
నచటి మేటికిరాటు లలకాధిపతినైన
మును సంచి మొదలిచ్చి మనుపదక్షు
లచటి నాలవజాతి హాలముఖోత్త విభూతి
నాదిభిక్షువు భైక్షమైన మాన్పు
నచటి వెలయాండ్రు రంభాదులైన నోరయ
గాసె కొంగున వారించి కడప(గలరు
నాట్యరేఖా కళాధురంధర నిరూఢి
నచట(బుట్టిన చిగురు(గొమ్మైన(జేవ

—అల్లసాని పెద్దన

ఆంధ్ర దేశం అన్ని ప్రాంతాలలో, అన్ని రంగాలలో అఖండ ఖ్యాతి నార్జించింది. చాణుక్యుని చాతుర్యాన్ని మించిన రాజకీయ నాయకులకు, రాల గరగించే విధంగా గానం చేసే గాయకులకు, ముది మది దప్పిన మొదటి వేల్పును సైతం గేలి చేసే పండిత ప్రకాండులకు, నటరాజు నాట్యానికి వన్నె చిన్నెలు దిద్దే నాట్యాచార్యులకు ఇది జన్మభూమి. లలితకళల కాణాచి, సాహిత్య నందనోద్యానవనం. విమల గాంధర్వవిద్యాలలితాంగికి విహార భూమి.

1)

ఆంధ్రప్రదేశంలోని అన్ని జిల్లాలకు ఏదో ఒక విధమైన విశిష్టత ఉన్నది. కృష్ణా జిల్లా ప్రత్యేకత తెలుగుదేశానికి వెలుగుబాట. ఈ జిల్లాలోని దివిసీమ ఒక దివ్యసీమ, నాట్యసంగీత సాహిత్య సౌరభాలు గుబాళించే పుణ్యసీమ. లలిత లలిత పదకర్త లకు జన్మభూమి.

ఆంధ్రమహావిష్ణువునకు రాజధానీ నగరమైన శ్రీకాకుళం దివిసీమలోనిది. శ్రీకృష్ణలీలాతరంగిణి కర్త శ్రీ శివనారాయణ తీర్థుల వారు ఈ సీమలో విహరించారు. మృదు మధుర శృంగార పదకర్త శ్రీ క్షేత్రయ్యను కన్నతల్లి. లలిత నాట్యప్రయోక్త శ్రీ సిద్ధేంద్రయోగి పదమంజీరశింజినీరవాలు రవళించిన దివ్యసీమ. విమర్శక పరిశోధ పండిత ప్రభాకరులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిక జన్మభూమి. జాతీయ పతాక నిర్మాత శ్రీ పింగళి వేంకయ్య ఈ సీమామ తల్లి కన్నబిడ్డ. పదకర్త సారంగపాణి ఈ సీమలోని ఘంటశాల నివాసి. విశ్వవిఖ్యాత నాట్యకళా క్షేత్రమైన కూచిపూడి ఈ సీమలోని దివ్యక్షేత్రం. లలితకళాపిపాసువులకు నిలయం. సుధామధుర హృదయులకు ఆరాధనాలయం.

పావన కృష్ణాతరంగిణీ తీరాన, ప్రాగ్దిశగా సుమారు పది మైళ్ళ దూరంలోగల కూచిపూడి అగ్రహారం లలితకళాసరస్వతికి ఆటపట్టు. వెలనాటి వైదిక బ్రాహ్మణులకు నివాసభూమి. ఇచ్చటి విప్రవర్యులు వేదవేదాంగ విభూషితులు. షోడశ సంస్కార పరి పూర్ణులు. యజన యాజనాది షట్కర్మ నిరతులు. సదాచార సంపన్న పరిపూత చిత్తులు. ఈ అగ్రహారంలో సుమారు రెండువందల కుటుంబాలవారున్నారు. 1500 లకు మించిన జనసంఖ్యతో విరాజిల్లుతోంది.

ఈ కూచిపూడికి కొందరు విమర్శక పండితులు అనేక నామాంతరాలున్నట్టుగా ప్రతిపాదించారు. అవి : 1. కుచేలపురి 2. కుశీలవపురి 3. కూచెన్నపూడి మున్నగునవి. కాని అవి చారిత్రక

విమర్శల ముందు నిలువలేవు. వారి ప్రతిపాదనలను పరిశీలిస్తే ఆ విషయం విశదమౌతుంది.

1. కుచేలపురి : శ్రీకృష్ణుని సహాధ్యాయి కుచేలుడు ఈ అగ్రహార నివాసి. ఇక్కడ వెలసియున్న శ్రీ రామలింగేశ్వరస్వామిని ఆయన ప్రతిష్ఠించాడట. ఆయన పేరుమీద ఈ అగ్రహారానికి 'కుచేలపురి' అనే నామం వచ్చినదట. కొందరు అర్వాచీన కూచిపూడి పదకర్తలు తమ పదములలో ఈ నామాన్ని అంకితంకూడా చేశారు. ఇంతకుమించి వేరే చారిత్రకాధారా లేమీ లేవు.

2. కుశీలవపురి : ఈ పేరును శ్రీ బందా కనకలింగేశ్వర రావు, బి. ఎ., బి. యల్. ప్రతిపాదించారు. కుశీలవులు నివసించేది కనుక 'కుశీలవపురి' అన్నారు. కుశీలవ పదానికి సూర్యరాయాంధ్ర నిఘంటువులో, "నటుడు, వంది, బట్టువాడు, గాయకుడు, యాచకుడు, వాల్మీకి అని; శబ్దార్థచంద్రికలో అనేక దేశములు తిరుగునట్టి బట్టువాడు, వాల్మీకి" అని అర్థాలు చెప్పబడినాయి.

3. కూచెన్నపూడి : బ్రహ్మశ్రీ బొక్కా కుమారస్వామిగారు 'క్షేత్రయపదస్వరసాహిత్యములు' అను గ్రంథాన్ని రచించారు. ఆ గ్రంథానికి విజయవాడ వాస్తవ్యులు, సేల్సుటాక్సు, ఇన్‌కంటాక్సు ప్రాక్టీషనరు, ప్రముఖ న్యాయవాది శ్రీ ముక్తేవి రాధాకృష్ణ మూర్తి, బి. ఎ., బి. ఎల్. పీఠిక రచించారు. దానిలో కూచిపూడికి 'కూచెన్నపూడి' అనే పేరున్నట్లు పేర్కొన్నారు. కాని అందుకు కారణాలు వివరించలేదు.

ఇలా అనేక నామాలను కూచిపూడికి ఉన్నట్లు చెప్పడమే కాని, వానికి చారిత్ర్యకాధారాలు చూపడంలేదు. సాధారణంగా కొన్ని గ్రామాలపేరల చివర 'పూడి' అను శబ్దం ఉండటం మన మెరిగినదే. ప్రత్యేకించి కూచిపూడి పరిసరంలోఉండే గ్రామాలు : బార్లపూడి, ముల్లపూడి, పెదపూడి, యద్దనపూడి మున్నగునవి. వాటి నామాల చివర 'పూడి' అనేది యున్నదికదా! ఈ పూడి అనే

పదం గల గ్రామాలు ఒకప్పుడు నిజాం సంస్థానంవారి ఏలుబడిలోనివని తెలిపే చారిత్ర్యకాధారాలున్నాయి. క్రీ. శ. 1506 నాటి మాచుపల్లి కైఫియత్తులోను, క్రీ. శ. 1763 నాటి అబుల్ హాసన్ తానీషా వారి ప్రతినిధులు వ్రాయించి ఇచ్చిన ధర్మశాసనపట్టిలోను ఈ అగ్రహారం కూచిపూడి అనియే పేర్కొనబడింది. ఈ ఆధారాలను బట్టి ఇది కూచిపూడి అగ్రహారమేగాని వేరే నామాంతరాలు లేవనుట నిర్వివాదాంశము.

## పగటి వేషాలు, భేదాలు

కృష్ణానదికి ఆనకట్ట కట్టకపూర్వం ఈ ప్రాంతమంతా మెట్టభూమిగా ఉండేది. పంటలు సరిగా పండేవి కావు. ఘంటశాల గ్రామకాపురస్తులు విశ్వబ్రాహ్మణులు, సంపన్నగృహస్తు శ్రీ కొండ రామలింగం గుర్రంమీద వెళ్లి ఈ ప్రాంతి ప్రజలచే పద్దు వ్రాయించుకొని పెట్టుబడి పెట్టేవారు. కూచిపూడి బ్రాహ్మణులకు వచ్చే ఆదాయం ఏయేటికాయేడు చేసుకొన్న అప్పుల తాలూకు వడ్డీకికూడా చాలేది కాదు. వేదం చదువుకుంటూ, వ్యవసాయం చేసుకుంటూ వుంటే, అప్పులు తీరకపోగా భుక్తికి గడవటం దుర్ఘటమైంది. ధనార్జనానికి మార్గాంతరాన్ని ఆలోచించారు. ఈ అగ్రహారానికి అనతిదూరంలో 'గడ్డిపాడు' అనే అగ్రహారం ఉంది. ఇది ఈనాడు హనుమంతపురంగా మార్పుచెందింది. గడ్డిపాడు అగ్రహారంగా ఉన్నప్పుడు అక్కడి బ్రాహ్మణులంతా వేదవేదాంగ విదులు. నిత్యకర్మానుష్ఠానపరులు. మంత్రశాస్త్ర పారంగతులు. వీరు ధనసంపాదన కోసం పగటివేషసంప్రదాయాన్ని చేపట్టారు. ఈ సంప్రదాయం వీరికి మైసూరుప్రాంతంనుండి లభించింది. ఈ వేషాలలో వీరు సుప్రతిష్ఠితులై "గడ్డిపాటి భాగవతులు" గా ప్రసిద్ధిపొందారు. ఆనాడు గడ్డిపాడులో పల్లావఝులవారు, శ్రీకారంవారు, కూచివారు, కనుపూరువారు, బెల్లంకొండ వారు మున్నగు గృహనామాలవా రుండేవారు. పల్లావఝుల

వారిలో వేంకయ్యగారు వేషధారణలో అమేయప్రతిభావంతులు. వీరికి గోల్కొండ నవాబులు మణిమాన్యాలిచ్చి సత్కరించినట్లు దానపత్రాలవల్ల వెల్లడవుతోంది.

కూచిపూడివారు గడ్డిపాటి భాగవతుల ప్రఖ్యాతి ప్రాభవాల నెరిగినవారగుటవలన, వారితో సంబంధబాంధవ్యాలు కలవారగుట మూలాన, వారినుండి పగటివేష సంప్రదాయాన్ని గ్రహించి ఆర్థికస్థితిగతులను మెరుగుపరుచుకొంటూ వచ్చారు.

ఆంధ్రలో స్వతంత్ర రాజుల పరిపాలనాకాలంలో తమ సామంతరాజుల చిత్తవృత్తులు, ప్రవర్తనలు, పరిపాలనా విధానాలు తెలుసుకొనడానికి కొందరు ప్రభువులు ప్రచ్ఛన్నవేషాలు ధరించి సంచరిస్తూ ఉండేవారు. వారు ప్రజలలో కలసిపోయి తమ కర్తవ్యాన్ని గమనించుకొంటూ ఉండేవారు. ఇవి పగటివేళ ధరించు వేషాలు కనుక 'పగటి వేషా'లని ప్రఖ్యాతివహించాయి. ఈ పగటి వేషాలను బహురూపాలు అని కూడా అనేవారు. భరతకోశంలో "నానా వేషధరం యత్తద్బహు రూప మితీరితమ్" అనిచెప్పబడింది. ఒకే వ్యక్తి అనేకవేషాలు ధరించితే అతనిని "బహురూపుడు" అన్నారు. ఈబహురూపులు 12-వ శతాబ్దినాటికే ప్రసిద్ధులయ్యారు. యథావాక్కుల అన్నమయ్య తన 'సర్వేశ్వరశతకం'లో "నటుండై వచ్చి సంసార రంగము లోనం బహురూపమాడు వెలయంగా జీవి సర్వేశ్వరా!" అని పరిచయంచేశాడు. ఇక 13-వ శతాబ్దివాడగు పాల్కురికి సోమనాథుడు తన 'పండితారాధ్యచరిత్ర' పర్వత ప్రకరణంలో :

> "క్రమ మొంద బహునాటకము లాడువారు
> లలితాంగరసరేఖ లలవడ
> బహురూపమాడెడు వారు—"

అని పేర్కొన్నాడు. విజ్ఞాన వికాసాలు పెంపొందడంతో పాటు, ఈ పగటివేషాలు కూడ ప్రాముఖ్యత వహించి కొన్ని

రాజకీయ సమస్యలనుకూడ పరిష్కరించడానికి సాధనము లయినాయి. గాయకవేషాలు ధరించిన మరాఠీదండు సింహగడ దుర్గంలో ప్రవేశించి శివాజీ మహారాజుకు విజయం సమకూర్చింది. రాజ కళింగగంగు పగటివేషగాండ్రలో చేరి పోగొట్టుకొన్న రాజ్యాన్ని తిరిగి పొందగలిగాడు. కాకతీయ యుగంలో మహామంత్రి యుగంధరుడు పిచ్చివాని వేషాన్ని ధరించి ఢిల్లీసుల్తానును మోసగించి, ప్రతాపరుద్రదేవుని మరల ఓరుగల్లు సామ్రాజ్య సింహాసనాసీనుని చేశాడు. ప్రపంచవిజేత, గ్రీకుచక్రవర్తి అలెగ్జాండరు రాజదూతవేషాన్ని నటించి, భారతీయ ప్రతాపమూర్తి పురుషోత్తముని ఆస్థానంలో ప్రవేశించాడు. ఈవిధంగా పగటివేషాలకు సంబంధించిన అనేకవిధాల చారిత్ర్య కాధారాలున్నాయి.

పగటివేషాలకు ప్రత్యేకమైన ఇతివృత్తాలంటూ ఏమీఉండవు. ఆ యా కాలాల్లో సమాజంలో లేక ప్రభువులలో ప్రబలిపోయిన అక్రమాలు, అన్యాయాలు, అత్యాచారాలు, దొంగసన్యాసుల చరిత్రలు మున్నగునవి వీటికి ఇతివృత్తాలయినాయి. వీటిలో కొన్ని హాస్యరసప్రధానములై, జనసామాన్యానికి వినోదాన్ని, ఉత్తేజాన్ని కలిగించేవికూడ ఉన్నాయి. కొన్నిచోట్ల హాస్యం వేలాతిక్రమణం చేస్తుంది. ప్రేక్షకుల అభిరుచి, ప్రయోక్తల ఉదాత్తత ఆధారంగా ప్రదర్శనలు ప్రజాదరణ పొందుతాయి. పగటి వేషధారులు పలు ప్రాంతాలలో సంచారంచేస్తూ ఉంటారు. కనుక ఆ యా ప్రాంతాల వారి యాసకోసలు, ఊతపదాలు, పలుకుబళ్లు, కంఠధ్వని, టెక్కు నొక్కు చక్కగా ఆకళింపు చేసుకొని పాత్రోచిత రీతిలో ప్రదర్శిస్తారు. ఇవి వినోదాత్మకములే గాక విజ్ఞానాత్మకములుకూడనయి సమాజ సంస్కరణకు ప్రముఖంగా ఉపకరించాయి.

## పగటివేషాల భేదాలు

పగటివేషాలసంఖ్య మొత్తం అరువదినాల్గుగా పరిశోధకులు నిర్ణయించారు. కాని ఈనాడు ముప్పదిమూడు మాత్రం ప్రచారంలో ఉండి ఉపలభ్యమవుతున్నాయి. అవి : 1. బైరాగివేషం, 2. బుడబుక్కల, 3. పఠాను, 4. ఫకీరు, 5. సోమయాజులు - సోమిదేవి, 6. అర్ధనారీశ్వరి, 7. బ్రాహ్మణవితంతువు, 8. కోమటి, 9. పంతులు, 10. సాతాని, 11. జంగము, 12. భేతాళ, 13. శక్తి, 14. దేవరపెట్టె, 15. ఎరుకలసాని, 16. బోగపుసాని, 17 దొమ్మర 18. కోయ, 19. దాదిసమ్మ,20. గయ్యాళిపెళ్లాం, 21. ముసలి మొగుడు, 22. కాశీకావడి 23. పిట్టలదొర, 24. వానాలమ్మ, 25. అత్తకోడలు, 26. బ్రహ్మంగారి తత్త్వాలు, 27. భట్రాజు, 28. లింగబలిజ, 29. బోడిగాడు, 30. సింగి-సింగడు, 31. దాక్షిక పంతులు, 32. మరాఠీదండు. 33. శారద వేషం అని.

ఈ పగటి వేషాలు గడ్డిపాడు, కూచిపూడి భాగవతులేగాక క్రిష్టపాడు జంగాలు, గొల్లభాగవతులు, కొంతమంది విశ్వబ్రాహ్మణులుకూడా ప్రదర్శిస్తున్నారు. కూచిపూడి బ్రాహ్మణులు కొంతకాలం గడ్డిపాటివారితో కలసి ప్రదర్శనలిచ్చారు. అనంతరం వారు విడిపోయి స్వయంగా ప్రదర్శనలీయడం మొదలుపెట్టారు. వారు ఈ పగటివేష కళాసంప్రదాయాన్ని పవిత్రంగా సంభావించారు. ఇహపరసాధకంగా పరిగణించారు. కనుకనే వారు పురోభివృద్ధినంది, విశ్వవిఖ్యాతులై, యశఃకాయులై శాశ్వతంగా చరిత్రలో నిలచారు. అట్టివారిలో కొందరు ప్రముఖులు :

1. శ్రీ పెద్దిభట్ల దశరథరామయ్య, 2. శ్రీ పెద్దిభట్ల జానకీరామయ్య3. శ్రీ పిల్లలమర్రి రామయ్య, 4. శ్రీ పసుమర్తి శేషయ్య, 5. శ్రీ పసుమర్తి వేంకటాచలపతి, 6. శ్రీ పసుమర్తి గోపాలం

7. శ్రీ పసుమర్తి ఆంజనేయులు, 8. శ్రీ పసుమర్తి సూర్యనారాయణ 9. శ్రీ పసుమర్తి సుందరరామయ్య, 10. శ్రీ పసుమర్తి విశ్వనాథం 11. శ్రీ పసుమర్తి వెంకటేశ్వర్లు, 12. శ్రీ పసుమర్తి శ్రీరామమూర్తి 13. శ్రీభాగవతుల దశరథరామయ్య, 14. శ్రీ భాగవతుల రామయ్య, 15. శ్రీ భాగవతుల విస్సయ్య, 16. శ్రీ భాగవతుల వేంకటాచలపతి, 17. శ్రీ భాగవతులకుటుంబశాస్త్రి, 18. శ్రీ భాగవతుల నాగలింగయ్య, 19. శ్రీ భాగవతుల కుమారస్వామి, 20. శ్రీ భాగవతుల పిచ్చయ్య, 21. శ్రీ భాగవతుల రామదాసు, 22. శ్రీ మహంకాళి లక్ష్మయ్య, 23. శ్రీ మహంకాళి సుబ్బయ్య, 24. శ్రీ మహంకాళి సత్యనారాయణ, 25. శ్రీ మహంకాళిసుబ్బారావు, 26. శ్రీ మహంకాళి కృష్ణమూర్తి, 27. శ్రీవేదాంతం వేంకటేశ్వర్లు, 28. శ్రీవేదాంతం లక్ష్మీనరసింహం, 29. శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ, 30. శ్రీ వేదాంతం ఘంటయ్య, 31 శ్రీ వేదాంతం సాంబయ్య, 32. శ్రీ వేదాంతం మల్లికార్జునశర్మ, 33. శ్రీ వేదాంతం పార్థసారథి, 34. శ్రీ వేదాంతం పార్వతీశం, 35. శ్రీ చింతా శివరామయ్య, 36. శ్రీ చింతా చలమయ్య, 37. శ్రీ చింతా సూర్యప్రకాశశర్మ, 38. శ్రీచింతా బాలకృష్ణయ్య, 39. శ్రీ చింతా రత్తయ్య, 40. శ్రీ హరి లక్ష్మీనారాయణ, 41. శ్రీ హరి రామయ్య, 42. శ్రీ తాడేపల్లి పేరయ్య, 43. శ్రీ తాడేపల్లి సూరయ్య, 44. శ్రీ బొక్కా పార్వతీశం, 45. శ్రీ దర్భా దుర్గయ్య, 46. శ్రీ దర్భా శ్రీరాములు, 47. శ్రీ యేలేశ్వరపు వేంకటనారాయణ, 48. శ్రీ యేలేశ్వరపు పున్నయ్య, 49. శ్రీ యేలేశ్వరపు ఆంజనేయులు, 50. శ్రీ యేలేశ్వరపు ప్రకాశరావు, 51. శ్రీ యేలేశ్వరపు శివరామయ్య, 52. శ్రీ యేలేశ్వరపు వీరరాఘవయ్య, 53. శ్రీ యేలేశ్వరపు నారాయణమూర్తి, 54. శ్రీ జోస్యుల దుర్గయ్య, 55. శ్రీ వెంపటి వేంకట నారాయణ.

వీరుగాక ఇంకా ఎంతోమంది పగటివేష కళాప్రవీణు లున్నారు. పెద్దిభట్లవారు అనాదినుండి కూచిపూడి వాస్తవ్యులు కారు. మధ్యకాలంలో వచ్చి యీ భాగవత మేళంలో కలసి, ప్రదర్శనలలో సహాయపడుతూ ఉండేవారు. శ్రీ దశరథరామయ్య సుప్రసిద్ధ మంత్రశాస్త్రవేత్త. వీరు తమ మేళానికి అంగరక్షకులుగా ఉండేవారు. వీరి సహోదరులు శ్రీ జానకిరామయ్య భోగపుసాని వేషం, బ్రాహ్మణ వితంతు వేషం కట్టి ఎంతో చమత్కారం, వినోదం ప్రసాదించేవారు.

శ్రీ పిల్లలమర్రి రామయ్య బైరాగి వేషం ధరించి, భగవద్గీతకు చమత్కారపూరిత వ్యాఖ్యానం ప్రవచించేవారు. శ్రీ దర్భా శ్రీరాములు దాక్షీకపంతులుగా, పాములవానిగా ఎంతో సమర్థవంతంగా నటించేవారు. వీరి సహోదరుడు దుర్గయ్య వింత వింత కూతలు కూయడంలో అనన్యసామాన్య ప్రజ్ఞకలవారు. శ్రీ భాగవతుల కుమారస్వామి అర్థనారీశ్వర వేషం కట్టడంలో సిద్ధహస్తులు. ఈయన ముప్పదిరెండు వేషాలు ధరించి ప్రజాదరణ పొందిన నటకావతంసులు. శ్రీ వెంపటి వెంకటనారాయణ, శ్రీ భాగవతుల రామయ్య వీరి కుమారులు. శ్రీ విస్సయ్య, శ్రీ తాడేపల్లి పేరయ్యలు, దాదినమ్మ, బాలెంత, వేషాలు కట్టడంలో నేర్పరులు. బాలెంత వేషాన్ని ధరించి ప్రజలను అలరించిన శ్రీ భాగవతుల రామయ్యను, వారి ప్రతిభకు తార్కాణంగా 'బాలెంత రామయ్య' అని ప్రజలు ఆదరంగా పిలచేవారు. శ్రీ భాగవతుల విస్సయ్య పరమపదించడంతో కూచిపూడి భాగవతుల నుండి బాలెంత వేషం నిష్క్రమించింది.

శ్రీ పసుమర్తి శేషయ్య భట్రాజు వేషం ధరించి నానార్థాలు వచ్చే పద్యాలు అనర్గళంగా వేనకువేలు పఠించేవారు. శ్రీ యేలేశ్వరపు వేంకటనారాయణ, కాశీకావడి వేషం కట్టడంలో

అసమాన ప్రతిభావంతులు. శ్రీ హరి రామయ్య సంగీతకళానిధి. శ్రీ త్యాగరాజస్వామికి వీరు ప్రథమ సంగీతగురువులని చెబుతారు. వీరు పొడుంకాయమీద వీణానాదాన్ని విన్పించేవారట. శ్రీ మహంకాళి సత్యనారాయణ జంగంవేషం ధరించడంలో ప్రత్యేక ప్రావీణ్యం కలవారు. శ్రీ వేదాంతం మల్లికార్జునశర్మ అర్ధనారీశ్వర, శారద వేషాలు ధరించడంలో విశేష ప్రతిభావంతులు.

## భాగవతులు - పగటి వేషాలు

భగవంతుని సంబంధమైన కథలు, గాథలు ప్రదర్శించడంవలన ఈ బ్రాహ్మణులు "భాగవతులు" అని పిలవబడినారు. ఇది వారికి సమూహనామమేగాక, కొన్ని కుటుంబాలవారికి గృహనామంగా కూడ స్థిరపడింది. ఈ భాగవతులు కొంతమంది చేరి ఒక జట్టుగా చేర్పడేవారు. ఈ జట్టును 'మేళం' అనేవారు. ఈ మేళానికి ఒక నాయకుడుండేవాడు. ఆయనను 'మేళానికి నాయకుడు' అనేవారు. ఆయన చెప్పుచేతలలో ఈ భాగవత మేళాలుండేవి. మేళ నాయకుని ఇంటిపేరు మీదనో, ఆయన పేరు మీదనో, భాగవత మేళాలు వ్యవహరింపబడేవి. చింతావారి మేళం, మహంకాళివారి మేళం, శ్రీ వెంకట్రామ నాట్యమండలి అనేవి ఇలాంటివే. ఈ మేళాలు ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాలలో సంచారం చేసేవి. తెలంగాణా ప్రాంతం వీటికి ప్రధాన సంచార కేంద్రంగా ఉండేది.

ఒకమారు కూచిపూడి భాగవతుల మేళం తూర్పుగోదావరి జిల్లా సంచారం వెళ్ళింది. ముందుగా అక్కడి ఒక అగ్రహారంలో తమ ప్రదర్శనమిచ్చి, వారి ఆశీస్సుల నందుకొని, మిగిలిన గ్రామాలకు వెళ్లాలని భాగవతులు భావించారు. కాని ఆ అగ్రహారీకులు నట, విట, గాయకాదుల సాంక్తేయులు అను అభిప్రాయంతో భాగవతులను ఆదరించలేదు సరికదా! 'అగ్రహారీకులై, బ్రాహ్మణ ధర్మాన్ని మంటగలుపుతున్నారు' అను తలంపుతో ప్రదర్శనకు

అనుమతికూడ ప్రసాదించలేదు. భాగవతులు సాటివారి అవమానాన్ని అప్పటికి సహించి, తమ దారిని తాము వెళ్లి పోయారు.

కొన్ని దినాలు గడచిన తరువాత ఈ అగ్రహారం మీద ఎక్కడిదో ఒక మరాఠీదండు వచ్చి విరచుకు పడింది. ఆ దండు స్త్రీ, బాల, వృద్ధులను తప్ప మిగిలినవారి నందరినీ విపరీతంగా బాధించింది. ఆ శ్రోత్రియ బ్రాహ్మణులు భయభీతులై సిగ్గు బిడియాలు విడచి, గౌరవ మర్యాదలను ప్రక్కకునెట్టి, ఆత్మ ప్రతిష్ఠకు భంగకరంగా మరాఠీవారి పాదాలపై బడి ప్రణమిల్లుతూ, ప్రాణభిక్ష నర్థించారు. అప్పుడా కుహనా మరాఠీవారు "సాటివారిని అపాంక్తేయులని అనాదరించి, మరాఠీవారి పాదాలకు ప్రణమిల్లు తారా! ఇదేనా మీ శ్రోత్రియ బ్రాహ్మణ ధర్మం" అని గద్దించారు. "ఏదో తెలియక అపచారంచేసాం. తప్పు క్షమింపు" డని, ఇకముందు అలా ప్రవర్తింపము" అని ప్రాధేయపడ్డారు. ఆ అగ్రహారీకులు, అప్పటి వారి పరిస్థితి భాగవతులకు జాలి గొలిపించి వెంటనే వారి నిజస్వరూపాలు ప్రకటించారు. ఆ అగ్రహారీకులు భాగవతుల ప్రతిభా విశేషాలకు ఆశ్చర్యచకితు లయ్యారు. సహపంక్తి భోజనాలతోపాటు ఘనంగా సన్మానించి, హృదయ పూర్వకంగా ఆశీర్వదించి పంపారట.

ఈ పగటివేషాలకు రంగస్థల నిర్మాణంతో నిమిత్తంలేదు. చతుర్విధాభినయాలు ప్రదర్శించడానికి అనువైన మధుర సాహిత్య కళాఖండాలు ఈ పగటివేషాలు. వీటికి కావలసిన ఆహార్యం, వేషధారణకు కావలసిన సామగ్రి, వారి గణియంలో ఒక విధమగు తోలుపెట్టెలో భద్రపరుపబడి యుంటుంది.

### పగటివేషాలు - ఇతివృత్తాలు :

పగటివేషాలు కాలక్రమంగా ప్రజాదరణ పొందాయి. భారత, భాగవతాది గ్రంథాలలోని పాత్రలుకూడ ప్రదర్శనార్హా

లయినాయి. దినమున కొక్కటి చొప్పున పది దినాలు, పది వేషాలు (దశావతారాలు) కట్టేవారు. చివరినాడు శారద వేషం వేసి బహుమతులు వసూలు చేసుకొనేవారు. ఈ పగటి వేషాలకు సంబంధించిన కొన్ని ఇతివృత్తాలు హాస్యస్ఫోరకంగా, వినోదాత్మకంగా, విజ్ఞానగర్భితంగా ఉంటాయి.

బైరాగి వేషం : ఈ వేషం దొంగసన్యాసులు, అమాయక ప్రజలను మోసగించే విధానం బట్టబయలు చేస్తుంది.

కోమటి వేషం : కోమటులు వారి పారిభాషిక పదాలతో గోప్యంగా మాట్లాడుకోవడం, వారి యుక్తిప్రయుక్తులు హాస్య గర్భితంగా ఉండి కడుపుబ్బ నవ్వు పుట్టిస్తాయి

సోమయాజులు-సోమదేవి : ఈ పాత్రలద్వారా ఛాందస వైదిక కుటుంబాలలో ఒకప్పుడు ప్రబలిపోయిన మూఢాచారాలు, అవినీతి ప్రవర్తనలు, వారి మంత్రతంత్రాలు, వాటిలోని లోపాలు నిశితంగా విమర్శింపబడినాయి. అవినీతిపాలైన ఒక మూఢ బ్రాహ్మణ కుటుంబ చరిత్ర ఈ వేషానికి ఇతివృత్తం.

సోమిదేవి సోమయాజుల వారి ధర్మపత్ని. చాలకాలం వరకు ఆ దంపతులకు సంతానం కలుగలేదు. అందువల్ల సోమయాజుల వారు కాశీకి వెళ్లి, గుమ్మడికాయకు సూది గుచ్చి, దానిపై తన తలమోపి తలక్రిందుగా ఒక పుష్కరకాలం సంతానంకోసం తపస్సు చేసి ఇంటికి మరలివస్తారు.

భర్త కాశీకి వెళ్లినది మొదలు సోమిదేవి కోరిన విటులతో గూఢ విశృంఖలంగా విహరించింది. భర్త తిరిగి వచ్చే సరికి ముగ్గురు బిడ్డల తల్లయింది. ప్రస్తుతం ఆరుమాసాల గర్భవతి.

సోమయాజులవారు భార్య కన్న సంతానాన్ని చూచి, " ఇదేమి పాపకర్మమే ! " అని వాపోతాడు. సోమిదేవి మంద హాసం చేస్తూ, "స్వామీ! ఇదంతా మీ తపోమహిమ కాదంటారా!

నా వల్ల నేదైనా దోషముంటే నా పసుపు కుంకుమయే పోతుంది. మీ వల్ల దోషముంటే మీరే పోతారు" అని గద్గదితనాన్ని ప్రదర్శిస్తుంది.

ఈ వేషం పంచాంగశ్రవణంతో ప్రారంభమవుతుంది. మధ్యలో రామాయణకథ, ఆ తరువాత లగ్నాష్టకాలు. చూడండి

"కత్తిపీట మంగలి వాడిదేకదా!
బుర్రయితే మందేకదా!
గొరగడం వాడివంతేకదా!
కుర్వంతు వాం మంగళమ్.

మరొకటి,

"నిర్భాగ్య పుత్రీం! నంబికొండ పాత్రీం।
జ్యేష్ఠాంగనాం చుక్కమ నామధేయాం।
కల్యాణక్షౌరం తిల తండులానాం।
వధూవరాభ్యాం వరదా భవన్తు.

తరువాత మహాసంకల్పం, ప్రధానహోమాలు, చూర్ణిక చదువబడతాయి. పండిత పామరజన రంజకంగా, మహదానంద సంధాయకంగా, హాస్యరసభరితంగా ఉండే మహదాశీర్వచనం తిలకించండి:

"ఆఁ మహ్యాంహం, ఉచ్చాటి వారో, వీరో, చాకలాళ్ల గాడిదల్ని దొంగలు తోలుకుపోతున్నారర్రోయ్!

అమ్మమ్మా! చద్దన్నం పెట్టేవారు లేరటమ్మా! ఇంటి వెనకాల పిల్లికూస్తోందో!! అవ్వల్లా, తాతల్లా, ఆయుర్విశ్వా యుఁర్విశ్వం విశ్వమాయురసి. ఇమ్మహి ప్రాజాంత్వష్టారాహే! నిదేత్వామస్మై। శతంజీవేమ। శరవోవయంతో ఏ ఏ ఏ ఏ ఏ। సర్వాన్కామాన్ శ్రీమహి! శతమానంభవతి!! శతమైశ్వర్యంభవతి!! శతమాయుశ్శైవశ్శతేంద్రియే ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి॥ అని

స్వరయుక్తంగా పఠిస్తూ ఆశీర్వదిస్తాడు. ఇలాంటి వేషాలు ఆ దినాల్లో మనోవినోదాన్ని ప్రసాదించటమే కాక, సంఘసంస్కరణకు కూడా ఉపకరించాయి.

ఫకీరు వేషం : ఇది చూపరులకు వేషమనే భావం కలుగదు. వేషగాడు స్వచ్ఛమైన అరబ్బీ భాషలో భాషిస్తాడు. తలకొక ఎర్రగుడ్డ ధరించి, చేతిలోని కంజీరాను ప్రయోగిస్తూ, ఖురానులోని ఆయితాలు చదువుతాడు. ఈ వేషం చూచి మహమ్మదీయ ముల్లాలు, పాదుషాలు కూడా సలాం చేసేవారట. ఆ ఉచ్చారణ, పాండిత్యం చూచి మహమ్మదీయులకు ఫకీరు అనేభావం కలిగేది. యథార్థం తెలియగానే ఆశ్చర్యపోయేవారు.

అర్ధనారీశ్వరి : ఇది చాల కష్టమైన ప్రక్రియ. అందువలన ఇది సామాన్యులకు ధారణార్హంకాదు. ఒకే వ్యక్తి, ఏకకాలంలో స్త్రీ, పురుష పాత్రలు రెండూ అభినయించాలి. ఈ పాత్రలు ధరించింది ఒకే వ్యక్తి అను భావం ప్రేక్షక జనానికి కలుగరాదు. ఇందులోని స్త్రీ పాత్ర పార్వతి, పురుష పాత్ర పరమేశ్వరుడు. ఈ ఇరువురి అభేదస్వరూపమే అర్ధనారీశ్వరి.

పాత్రధారి తన పాపిటనుండి పాదాలవరకు, సగభాగం పార్వతిగాను, సగభాగం పరమేశ్వరునిగాను వేషధారణ చేసుకొంటాడు. ఈ రెండు వేషాలను తలనుండి పాదాల వరకు నిలువుగా ఒక తెర వేరుచేస్తుంది. పార్వతి వేషం, సంభాషణ వచ్చినపుడు పరమేశ్వరుని వేషం తెరతో ఆచ్ఛాదితమవుతుంది. పరమేశ్వరుని వేషం, సంభాషణ వచ్చినపుడు పార్వతి వేషం మరుగుపడుతుంది. ఈ పరమేశ్వరుడు మాయావటుడు. పార్వతికి, మాయా వటునికి వాదోపవాదాలు జరుగుతాయి. తుదకు పార్వతి మాయా వటువును పరమేశ్వరునిగా తెలుసుకుంటుంది. తన వ్యతిరేకతను విడచి లజ్జ నభినయిస్తుంది. పార్వతీ పరమేశ్వరులు ఏకమవుతారు. మధ్యనున్న

తెర తొలగింపబడుతుంది, అర్ధనారీశ్వరుడు ప్రత్యక్ష మవుతాడు. 'పార్వతీ పరమేశ్వరులు విడదీయరాని జంట'. అను మహత్తర పరమార్థం నిరూపిత మవుతుంది. ఒకే వ్యక్తి రెండు వేషాలు ధరించాడని అపుడు ప్రేక్షకులకు అవగతమవుతుంది.

శారద వేషం : ఇది పగటివేషాలలో కడపటిది. ఈవేషాన్ని ధరించిరామాయణ, భారత, భాగవత గాథలకు సంబంధించిన పదాలు, శబ్దాలు గానంచేసుకుంటూ "ఓ శారదా! కరుణానిధీ!" అనే మకుటంతో, అంత్యప్రాసాది శబ్దాలంకారభరితమైన పదాలతో పలుకరిస్తూ, ఇంటింటికీ వెళ్లిబహుమతులుగ్రహిస్తూ, ఆ యాగ్రామ, పట్టణ ప్రజల ఆదరాభిమానాలు చూరగొంటూ, కట్టిన వేషం కట్టకుండా ఆరువైనాల్గు వేషాలు ధరిస్తూ సంచారాలు సాగించారు. ఉదాహరణకు కొన్ని శబ్దాలు :

రామాయణ శబ్దము :

" దశరథ వరకుమారుడవైతివి.
దయను కౌశిక యాగము గాచియు.
ఆ జనకజ సీతను పెండ్లాడితివి.
రవి కులమున బలవంతుడవైతివి.
అంతట వనవాసము జేసితివి.
అరయక మృగమును వెంబడించితివి.
చింతింపక అది వశమనుకొంటివి.
జటాయువు దెలుపగ వినుమని అతనికి
చెడని పదవిగా నొసగిన వెనుక.
హనుమంతునకు నభయ మొసంగితి.
అల సుగ్రీవుని ఆదరించితివి.
జయముగ వృక్షము చాటున నుంటివి.
శరమున వాలిని గూలనేసితివి.

వానరసేనల దండు గూర్చితివి
వారధి గట్టిగ బంధించితివి.
శరణని వచ్చిన వాని గాచితివి.
హరి హరి హరిరణ బిరుదు గట్టితివి.
అసురుని కులమును హతము చేసితివి.
అరయగ తమ్ముని కథయు మొసగితివి.
లంకకెక్కి యా లంకిణి గూల్చితి.
అగ్గలించి రావణు త్రుంచితివి.
పట్టము గట్టి విభీషణు లంకలో
పెట్టి, వెడలి సీతా సమేతుడవై ...
అట్టి అయోధ్యా పట్టణమున-మరి
పట్టభద్రుడవై ప్రబలిన, రామా!...
దిట్టముగా పేరిమి చేతిని గూడి
గట్టిగ భక్తుల పట్టి శుభములను
కట్టడి చేసిన కరివరదా!
పెట్టెద, పదివేల నమస్సులు.
పెంపుగ జూడుము-పరాకు.
బహుపరాకు-రామా! పరాకు లేకను॥

కృష్ణ శబ్దము :

"సురలు పొంగ భూసురులు చెలంగగ,
మధురాపురమున జనియించీ—
పరమాదరమున నంద యశోదల
పట్టివాచు వర్తించీ—
గరళవిస్త కుచయుగళాంచిత
గయ్యాళి పూతనను వధించీ—
చరణహతి శకటాసురు ద్రుంచి
పరగ తృణావర్తుని మడియించీ—

వల్లవ గృహముల దధి నవనీతము
లెల్లనా హరియించీ
పిల్లలతో పశువుల గాచుచు
గోపికలను వలపించీ.

... ... ... ...

కాళియ ఫణి ఫణ రంగమునను
తాండవ కేళిని సవరించీ
కూళలైన రక్కసులను
పలువుర గూల్చి యశము బెంచీ.

... ... ... ...

వాసవ గర్వము భంగపరచి
గోవర్ధన గిరి ధరియించీ
రాసక్రీడను మధురగీతముల
రమణుల గరగించీ

... ... ... ...

అక్రూరునితో మధురకు జని
కంసాది ఖలులను ద్రుంచీ
శక్రాద్యమరుల ననుగ్రహించీ
జరాసంధ బలముల బొలియించీ

... ... ... ...

ద్వారావత పురమున నివసించీ
దయచే జగముల నేలిన శౌరీ!
నీ సరివారలు భువి నేరీ!
కోటిరెడ్డి హృత్సంచారీ!

... ... ... ...

మారుబారికి నోర్వలేనుర
మారజనక! ఇంపారగ జూడుము
సారసాక్షు! మది నమ్మితి నాపై
సత్కృప జూడుము నగధీరా!

—కోటిరెడ్డి

దశావతార శబ్దములు :

"మచ్చరమున మరి యంబుధిలో
జొచ్చి యున్న సోమకు ద్రుంచియు
వెచ్చర వేదము లజునకు
నిచ్చితివా మత్స్యవతారా! ॥

పలుమరు నిను బ్రస్తుతి జేయుచు
చెలగి సురలు జలధి మథింపగ
కలిమి బలిమితో నెలమి నొసగిన
కులగిరిధర! కూర్మావతారా! ॥

స్థిరముగ ధర నురవడి జేకొని
ఉరగపథం బిరవుగ జొచ్చిన
హిరణ్యాక్షు బరిమార్చిత వౌ
వరసుగుణా! వరాహావతారా! ॥

జంభారి సురప్రముఖ కదంబంబుల
రక్షింపంగా స్తంభంబున వెడలియు
దానవ డింభకు గాచిన నరసింహావతారా! ॥

మానితముగ ముల్లోకములను
జా నొప్పగ కాపాడంగా,
మానుగ మూడడుగులు బలిచే
దానము గొను వామనరూపా! ॥

తరిమి తరిమి ధరణీపతులను
పరశువుచే నురుమాడితి వౌ,

వర వీర పరాక్రమమున, ధర
బరగితి వౌ భార్గవరామా! ॥

దశరథ తనయుడవై సురలకు
వశముగాని దశముఖు ద్రుంచియు
విశదంబుగ నయోధ్యకు సీతతో వేం
చేసితి వౌ దశరథరామా! ॥

యాదవవంశాంబుధి సుధాకరు
డాదిదేవు డనుజుడుగా ఘన
మోద మొసగి మూర్ఖుల ద్రుంచియు
మేదిని భర ముడిపిన బలరామా! ॥

అంగనలకు సిగ్గడలింపగ
అంగజ సమ రూపముగను
రంగుగ పురకాంతల వ్రతములు
భంగపరచు బౌద్ధవతారా! ॥

గాటపు కలి బాధల నాపగ
సీటుగ కరవాలము బూనియు
ఘోటకమున నెక్కి దురాత్ముల
గీటడచిన కల్క్యవతారా! ॥

నిరతము నీ దాసుల బ్రోవగ
పరగగ వ్యాఘ్రపురమున వెలసిన
వరదరాజదేవా! ఆశ్రితసురభూజా!
దిక్నలాం - దిక్నలాం - దిక్నలాం ॥

— శ్రీ అన్నాబత్తుల వీరాస్వామి, పెదపులివర్రు

## శారదవేషం - శబ్దములు

పొద్దూ!

ఇది నాలుగు జాముల ప్రొద్దూ
మమ్మొగదిగ జూడా వద్దూ
ఈ ముతక శాలువ మా కొద్దూ
దుశ్శాలువ ఇస్తే మాపద్దూ
ఓ శారదా! కరుణానిధీ!

హాడూ!

ఈ జగముల మీదే హాడూ
మీ అన్నదమ్ముల జోడూ
మీ చెవులకు ఉన్నా జోడూ
నా చెవులకు పెట్టి చూడూ
ఓ శారదా! కరుణానిధీ!

హారం!

ఇది త్రిపురాసుర సంహారం
మేం కులమున బ్రాహ్మణవారం
మే ముండేది కృష్ణాతీరం
మాది కూచిపూడి అగ్రహారం
మీ మెడలోని చంద్రహారం
ఆ హారం ఇస్తే మీ భారం (మీవారం)
ఓ శారదా! కరుణానిధీ!

ఈ శబ్దాలకు తగినట్లు మృదంగ జతి స్వరాలు సమకూర్చి, మంచి యమకంగా దురితగతిలో కూచిపూడి భాగవతులు ప్రదర్శిస్తారు. వీరు తమ ప్రదర్శనలతో ప్రేక్షకులను ఆనందాబ్ధిలో నోలలాడిస్తూ, యావదాంధ్రలోనేగాక ఇతర ప్రాంతాలలో కూడా సంచరిస్తూ పగటివేషధారులుగా, మృదు మధుర దృశ్య ప్రబంధ

ప్రదర్శకులుగా, మంత్రశాస్త్రవేత్తలుగా ప్రఖ్యాతి నార్జించారు. సాధారణంగా వీరు సాత్త్వికవేషధారణ మాత్రమే చేసేవారు. ఒకనాటి వీరి యశస్సారభాన్ని తలచుకొంటే, ఈనాటికీ గుబాళిస్తూ తనువు పులకిస్తుంది. ఆ ప్రతిభా సంపత్తులు ఈనాడు లోపించాయి.

మంత్రశాస్త్రము-భాగవతులు : కూచిపూడి భాగవతులు పగటివేషాలతో పాటు మంత్రశాస్త్రం, ఇంద్రజాల విద్యలలో కూడ పేరు పొందారు. ఈ విద్యలు వీరికి ఆత్మరక్షణకు, జనవశీకరణకు విని యోగ పడినవట. ఈ విద్యలు ఏనాడు ఆవిర్భవించాయోగాని, ఈనాటికీ కొంతమంది ప్రజాసామాన్యంలో వీటిపట్ల ప్రగాఢ విశ్వాసం ఉంది.

ఒకమారు శ్రీ పెద్దిభట్ల దశరథరామయ్యా తన మేళంతో కేరళప్రాంతానికి సంచారం వెళ్ళారు. ఆయన స్వయంగా పఠాను వేషం కట్టి, తన ప్రజ్ఞా పాటవాన్ని ప్రదర్శించి, ఆనాటి జిల్లా కలెక్టరును మెప్పించి, సువర్ణ ఘంటా కంకణాది పురస్కారాలతో గౌరవింపబడిన ఘనుడు. సహజంగా ఆయనది పెంకి స్వభావం ఎంతటి వారినైనా లెక్కచేయని స్వాతిశయం. దానికి తగిన ఆత్మాభిమానం కూడా ఉంది. మంత్రశాస్త్రంలో అసాధారణ ప్రజ్ఞాధురీణుడు.

కేరళప్రాంతమంతా మంత్ర తంత్రాలకు ప్రసిద్ధిగాంచిన పోతుగడ్డ అని తెలిసియుండి కూడా, కూచిపూడి భాగవతులు ధైర్య సాహసాలతో ఈ ప్రాంతంలో సంచారార్థం వెళ్లారు. సామాన్యంగా వీరు ప్రదర్శన లివ్వదలచుకొన్న గ్రామంలోని పెద్దలను సందర్శించి, వారితో పరిచయం చేసుకొని, తమ ప్రదర్శనను దర్శించవలసిందిగా అభ్యర్థించడం ఆచారం. ఈ సంప్రదాయన్ని అనుసరించి శ్రీ దశరథ రామయ్య గ్రామంలోకి వెళ్లారు. అక్కడ వీరికి ఒక విచిత్ర సమాచారం శ్రవణగోచరమైంది. ఆ గ్రామంలో ఒక మాంత్రికు డున్నాడట. ఆయన యిష్టానుసారం ఆ గ్రామంలో ప్రతికార్యం జరగాలట. అందుకు భిన్నంగా జరిగితే అనేకకష్టాలు సంప్రాప్త

మాట తీయట. అందువల్ల ముందుగా ఆ మాంత్రికుని అనుమతి తీసుకోనమని గ్రామప్రజలు సలహా యిచ్చారు. ఈ మంత్రగాని విషయ మేదో తెలుసుకుందామని శ్రీ దశరథరామయ్య అతని యింటికి వెళ్లారు. మాంత్రికుడు ఇంటిలో లేడు. అతని భార్య ఉంది. ఆమె కూడా భర్తకు తగిన భార్య. శ్రీ దశరథరామయ్యను అరుగు మీద కూర్చోమని ఆదరించింది. ఈయనకు పొగచుట్ట కాల్చే అభ్యాసం ఉంది. మాంత్రికుడు వచ్చేలోగా చుట్టకాల్చుకోవచ్చునని మాంత్రికుని భార్యను చుట్టనిప్పు తెచ్చిపెట్టమని కోరాడు. అందు కామె ఏమని భావించిందో ఏమోకాని, కణకణ కాలే మండు బొగ్గులు తన దోసిలి నిండా తెచ్చింది. అది చూచిన శ్రీ దశరథ రామయ్య 'నీవూ ఘటికురాలివే'' అనుకుంటూ తన భుజంమీద నున్న అంగవస్త్రంలో ఆ బొగ్గులను పోయించుకున్నారు. చుట్ట ముట్టించుకోని, అగ్నితో ఆతిథ్య మిచ్చిన ఆ గృహిణికి బుద్ధి చెప్ప దలచారు. నిప్పుబొగ్గులున్న అంగవస్త్రాన్ని చుట్టచుట్టి ఆ యింటి చూరులో గ్రుక్కి చుట్టకాల్చుకుంటూ తమదారిని తాము వెళ్లి పోయారు.

గృహాగతుడైన మాంత్రికుడు శ్రీ దశరథరామయ్య చేసిన ఘాతుకకృత్యానికి ఆగ్రహోదగ్రు డయ్యాడు. ఎలాగైనా భాగవతు లను పరాభవించి, బదులు తీర్చుకోవాలని సంకల్పించాడు. సంధ్యా సమయానికి భాగవతులలో ప్రధానపాత్రధారికి జలోదర ప్రయోగం చేశాడు. అనంతరం అతని స్థితిగతులు ప్రత్యక్షంగా చూచి ఆనందించాలని ప్రదర్శనా ప్రదేశానికి వెళ్లి ముందు వరుసలో ఎదురుగా కూర్చున్నాడు.

'అంబాపరాకు 'తో ప్రదర్శనం ప్రారంభ మయింది. సూత్ర ధారుని సంధి వచనానంతరం ప్రధానపాత్రధారి రంగస్థల ప్రవేశం చేశాడు. కాని యథాపూర్వంగా అభినయించలేకపోతున్నాడు. విపరీతంగా బాధపడుతున్నాడు. క్రమక్రమంగా కడుపు ఉబ్బరిస్తోంది,

తట్టుకోలేకుండా ఉన్నాడు. సూత్రధారిత్వాం నిర్వహిస్తున్న శ్రీ దశరథరామయ్య అవలీలగా విషయాన్ని అర్థం చేసుకున్నారు. ద్వంద్వ యుద్ధానికి సంసిద్ధంగానే ఉన్నారు గనుక బొడ్డులో ఉన్న గంటాన్ని సర్రున లాగి పందిరి స్తంభానికి గ్రుచ్చారు. ఆ స్తంభం నుండి నీరు కారడం, వేషగాని కడుపుబ్బరం తగ్గడం ఒకేసారి జరిగింది. క్షణంలో పాత్రధారి స్వస్థుడై, ప్రదర్శనం నిర్విఘ్నంగా ముగిసింది. ప్రేక్షకులు తమ తమ ఇండ్లకు వెళ్ళిపోయారు. భాగవతులు తమ ప్రదర్శనం జయప్రదంగా ముగిసినందున ఆనందాతిరేకంతో వేషాలు తుడుచుకోవడానికి వెళ్లారు.

ప్రొద్దుపోయినా తన భర్త ఇంటికి మరలి రానందుకు మాంత్రికుని భార్య కలవరపడ సాగింది. ప్రదర్శనం జయప్రదంగా జరిగిందనే విషయం తెలుసుకొని మరింత ఆరాట పడింది. ఆనాటి ఉదయం జరిగిన సంఘటన తలచుకొని తన భర్తకు ఏదో కీడు మూడి ఉంటుందని శంకించింది. తక్షణం రంగస్థలం దగ్గరకు చేరుకుంది. అక్కడ మాంత్రికుడు కుప్పగా కూలిపోయి కూర్చుండి పోయి ఉన్నాడు. నిస్సహాయుడై దీనవదనంతో ఏమీ తోచక, లేవలేక ఉన్న స్థితిలో భార్యను చూడటంతో బావురు మన్నాడు. తనకు బృహద్బీజ ప్రయోగం జరిగిందని వాపోయాడు. దీనికి తోడు అష్టదిగ్బంధనం కూడ చేయబడినదట. ఈ భాగవతులు సామాన్యులు కారు. అనన్యసామాన్య ప్రజ్ఞాధురీణులని, వారి ముందు తన ప్రజ్ఞా పాటవాలు పనిచేయవని, తాను చేసిన తెలివి మాలిన పనికి ఇది ప్రతీకారమని వారిని ప్రశంసించాడు. బ్రాహ్మణ కోపములు తృణ హుతాశనము లని అంటూ వారి అనుగ్రహాన్ని అర్థించమని తన భార్యకు మాంత్రికుడు ప్రబోధించాడు. ఆమె శ్రీ దశరథరామయ్యను దర్శించి పాదాభివందన మాచరించి తన కష్టగాథ నంతా విన్పించి పతిభిక్ష పెట్టుమని కన్నీరు మున్నీరుగా విలపించింది. దయార్ద్రహృదయులైన

శ్రీ దశరథరామయ్య ఆమె దీనాలాపాలకు జాలి చెందారు. ఒక గ్లాసుతో జలం తెప్పించి మంత్రించి యిచ్చి, మాంత్రికునిచే త్రాగించమన్నారు. బుద్ధి కలిగి మసలుకోమని హితవు చెప్పారు. ఆమె మహాప్రసాద మని ఆ మంత్రజలం గ్రహించి భాగవతులకు నమస్కరించి వెడలిపోయింది.

మంత్రగాడు తీర్థాన్ని సేవించడంతోనే అతని నోటిలోని పళ్లన్నీ ఊడిపోయినాయి. దానితోపాటు బ్రహద్బీజం కూడ తగ్గిపోయింది. పండ్లూడిన మాంత్రికుని తాంత్రిక ప్రయోగం పని చేయదట. ఈవిషయం తెలిసిన శ్రీ దశరథరామయ్య లోక కల్యాణ కాంక్షతో దుర్మార్గుడైన ఆ మాంత్రికునికి ఈవిధంగా శిక్ష విధించి బుద్ధి చెప్పారని ప్రాచీన భాగవతులు అభివర్ణించారు. కూచిపూడి భాగవతుల మంత్రశాస్త్ర ప్రతిభను ప్రతిబింబింపజేసే కథ లెన్నో ఈనాటికీ బహుళ ప్రచారంలో ఉన్నాయి.

'కర్ణాటక ద్రావిడ కాంధ్ర గౌడ
లాటాది భాషా పరిశీలనేన।
ఏలా ప్రబంధాదిషు పాటపంచ
తథా చతుష్షష్టి కళా వివేకః॥

—సంగీతసుధ

## మాచుపల్లి కైఫియత్తు

"ధర్మ్య మర్థ్యం, యశస్యంచ। సోపదేశం ససంగ్రహమ్।
భవిష్యతశ్చ లోకస్య। సర్వకర్మాను దర్శకమ్॥"

—నాట్యశాస్త్రము

కాకతీయ సామ్రాజ్య పతనానంతరం, క్రీ. శ. 1336లో శ్రీ విద్యారణ్యస్వామి ఆశీస్సులతో విజయనగర సామ్రాజ్యం అవతరించింది. సంగమ వంశానికి చెందిన హరిహరరాయలు, బుక్కరాయలు ఈ సామ్రాజ్య సంస్థాపకులు. ఈ సామ్రాజ్యం

సుమారు మూడువందల సంవత్సరాలు అఖండ వైభవాన్ని అనుభవించింది. అనంతరం నామావశిష్టంగా నిలిచిపోయింది.

విజయనగర సామ్రాజ్యానికి ప్రప్రథమ పరిపాలకుడు హరిహరరాయలు. ఈయన 17 సంవత్సరాలు మాత్రం రాజ్యపాలన చేశాడు. తరువాత 1353 లో బుక్కరాయలు సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఈయన పాలనాకాలంలో సామ్రాజ్యం విస్తరించింది.

క్రీ. శ. 1505 లో సాళువవంశంవారు ఆధిపత్యం వహించారు. అనంతరం తుళువవంశంవారు పరిపాలన చేజిక్కించుకొన్నారు. వీరిలో వీరనరసింహరాయలు సుప్రసిద్ధుడు. ఈయన రాజ్యపాలన చేసింది నాలుగు సంవత్సరాలే అయినా చరిత్రలో శాశ్వత స్థానాన్ని ఆర్జించాడు. సమర్థుడైన ప్రజాపరిపాలకుడుగా ప్రజాభిమానాన్ని చూరగొన్నాడు. ఆయన పరిపాలనాకాలం సువర్ణయుగం.

విజయనగర సామ్రాజ్యం హిందూమత పరిరక్షణకు స్థాపింపబడింది. ఈ సామ్రాజ్యపాలకులు స్వాధికారాన్ని ప్రకటించుకొనక శ్రీ విరూపాక్షస్వామివారి ప్రతినిధులుగా వ్యవహరించి ధన్యులయ్యారు.

పల్లవులు పర్వతాలు చెక్కించి ఏకశిలాలయాలు మలపించారు. తూర్పు చోళులు ఆలయ నిర్మాణంలో విజ్ఞానాన్ని సంతరించి విమానాలు నెలకొల్పారు. తరువాత వచ్చిన చోళులు సుందరగోపురాలు నిర్మించారు. విజయనగర ప్రభువులు మహామంటపాలు స్థాపించారు. వీరి కాలంలో శిలలు సంగీతాన్ని ఆలపించాయి. నాట్యాన్ని అభినయించాయి.

వీరి పాలనలో హిందూమతం మహోన్నత స్థితి నందుకొంది. వేదాలకు వ్యాఖ్యలు వెలశాయి. లలితకళలు గౌరవింపబడినాయి. ఆంధ్ర సాహితీ సరస్వతికి ఆటపట్టుగా ఈ సామ్రాజ్యం వరిల్లింది.

4)

ఆలయాలు నిర్మించారు. మంటపస్తంభాలమీద అశ్వారోహకులు, దేవదాసీల నాట్యభంగిమలు మలపించారు. తమ కళాభిమానాన్ని, కళాపోషణను, ఆంధ్ర సాహిత్య వైశిష్ట్యాన్ని ఈ ప్రభువులు చిర స్థాయిగా నిలిపారు. లలితకళలలో విజయనగర సంప్రదాయము అను ఒక విశిష్టతను నెలకొల్పారు. శాశ్వత కీర్తి, ప్రతిష్ఠ నార్జించారు.

వీరనరసింహరాయల కాలం అల్పమే అయినా అనల్పకాలం నిలిచే కీర్తిప్రతిష్ఠల న దుకొన్నాడు. అత్యాచారులను, అనాచారు లను అంతమొందించాడు. గూఢచారులద్వారా సామంతరాజుల స్థితిగతులు ఆకళింపు చేసుకొన్నాడు. ఈ విషయంలో కళాకారులకు కూడా ప్రాధాన్య మిచ్చి, వారి మాటలకు విలువ నిచ్చి గౌరవించాడు. కళలకు, కళాకారులకు అవమానం జరిగినా, అనాదరణ జరిగినా సహించేవాడు కాదు. ఆనాటి కళాకారులు కూడ విశ్వశ్రేయస్సు కోసమే కళాప్రదర్శన లిచ్చారు.

రాయలసీమ ప్రాంతంలో సిద్ధవటం సీమను సంబెట గురవ రాజు పాలిస్తూ ఉండేవాడు. ఈయన విజయనగర ప్రభువులకు సామంతరాజు. ఈయన ప్రజాకంటకుడుగా, కఠినాత్ముడుగా పేరుపొందాడు. ప్రజలను దారుణంగా శిక్షించేవాడు. ఈ విషయాన్ని వెలువరించడానికి కూడా ప్రజలు భయకంపితులయ్యే వారు. పన్నులు వసూలు చేయడానికి కఠినమైన శాసనాలు చేశాడు. సకాలంలో ఎవరైనా పన్ను చెల్లించక పోయినట్లయితే, వారి భార్యలను నడివీథిలోనికి యీడ్చుకొని వచ్చి, వారి స్తనాలకు చిరుతలు పట్టించి అవమానించి బాధించేవాడు. ఈయన కుటిల పరిపాలనావ్యవస్థ చుట్టుప్రక్కల గ్రామవాసులకు సుపరిచితం.

ఈకాలం నాటికి కూచిపూడి భాగవతులు కేళిక ప్రదర్శన లివ్వడంలో ప్రసిద్ధి వహించారు. దేశం నలుమూలలా సంచారం చేస్తూ ప్రదర్శన లిచ్చేవారు. జనపదాలు, సంస్థానాలు సందర్శించే

వారు. ప్రజాదరణ, ప్రభుత్వాదరణ పొందుతూ ఉండేవారు. ప్రజలలోను, సామంత ప్రభువులలోను ప్రబలిన అన్యాయాలు, అక్రమాలు. అత్యాచారాలు ప్రజానీకానికి, ప్రభుత్వానికి తమ ప్రదర్శనల ద్వారా వినికిడి చేసేవారు. తాము ప్రదర్శించే కీర్తనల మధ్య, పాత్ర ప్రవేశాల మధ్య, ప్రత్యేక పాత్రధారుల ముఖాన ప్రత్యక్షంగా ప్రదర్శించేవారు. ప్రజలు, ప్రభువులు వాటిలోని సత్యాసత్యాలు పరిశోధించి తగిన ప్రతిక్రియలు చేస్తూ ఉండేవారు. దేశక్షేమాన్ని కాంక్షించి ఈ భాగవతులు ఇటువంటి ప్రదర్శన లివ్వడంవల్ల సాధారణ ప్రజ మొదలు మహాప్రభువుల వరకు వీరి రాక హృదయాహ్లాదకరంగా ఉండేది.

ఒకమారు కూచిపూడి భాగవతులు ప్రదర్శన లిచ్చుకుంటూ సిద్ధవటం చేరుకున్నారు. తమ ప్రతిభా పాటవాన్ని ప్రదర్శించి ఘనసన్మానాలు పొందాలని ఆశించారు. కాని అభిమానంగల ప్రజలు మాత్రం అందుకు అంగీకరించలేదు. గురువరాజు రాక్షస పరిపాలనా విధానాన్ని, ఆయన దారుణ చర్యలను వివరంగా చెప్పారు. ఇదంతా వినిన భాగవతులు "బ్రతికియుంటే బలుసాకైనా ఏరుకు తినవచ్చు' అనుకొని ఆ మరునాడు ఉషఃకాలమే అక్కడినుండి మకాం ఎత్తివేశారు. ప్రదర్శన లిచ్చుకుంటూ అంచెలంచెల మీద విజయనగరం చేరుకొన్నారు.

అనుకూలమైన సమయం చూచి, భాగవతులు శ్రీ వీర నరసింహరాయల వారిని సందర్శించారు. తమ కీర్తన ప్రదర్శించడానికి అనుమతి ప్రసాదించవలసినదిగా అభ్యర్థించారు. ఇంతకు పూర్వమే శ్రీ రాయలవారు ఈ భాగవతుల కళాప్రదర్శనా వైశిష్ట్యాన్ని గూర్చి వినియున్నారు. కాన రాణీవాసంవారు కూడ వీరి ప్రదర్శనం దర్శించాలనే అభిప్రాయంతో కోటలోనే ప్రదర్శించడానికి అనుమతి నిచ్చారు.

ప్రదర్శనకు తగిన యేర్పాట్లన్నీ కోటలో సిద్ధమైనాయి. నిర్ణీతసమయంలో ప్రదర్శనం ప్రారంభమైంది. రాణీవాసంవారు, మంత్ర సామంతాది పరివారవర్గం తమకు నిర్ణయించిన స్థానాలలో ఆసీనులైనారు. ప్రదర్శనం రసవంతంగా, మహోదాత్తంగా సాగిపోతోంది. ఔచిత్యానికి, రసానికి, ప్రకరణానికి భంగంలేని విధంగా అతి చాకచక్యంతో సంబెట గురువరాజు దురంతాలు వినుకలి చేశారు. భాగవతుల అభిప్సితం నెరవేరింది. సభాసదులలో కలవరం బయలుదేరింది. శ్రీ రాయలవారు మేళానాయకుని పిలిపించి తమ వినుకలిలోని యథార్థాన్ని తెలుసుకున్నారు. గురువరాజును నిర్దాక్షిణ్యంగా శిక్షించారు. ఈవిషయం మాచుపల్లి కైఫియత్తులో అభివర్ణింపబడింది.

[ Please see vide "Studies in the history of the third dynasty of Vizayanagara." By Dr. N. Venkata Ramanaiah garu. Appendix-C. Pages 462 - 463. ]

మాచుపల్లి కైఫియత్తు పూర్తిపాఠము :

మాచుపల్లి కైఫియత్తు - స్థానికసంపుటము. పుటలు 56-65-66

" వీరబుక్కరాయలవారి కుమారుడు శ్రీ మన్మహారాజ, రాజపరమేశ్వర, వీరప్రతాపరాయలవారు విద్యానగరమునందు రత్నసింహాసనమున నుండి సుస్థిరముగ రాజ్యపాలనము చేస్తూ ఉండగానూ, శ్రీమన్మహామండలేశ్వర సంబెట గురువరాజు గుండ్లకట్ట, బండ్లమ్మకొండ సామీప్యమున కోటలో ప్రభుత్వం చేస్తూ ఉండెను. ఈ గురువరాజు ప్రభుత్వంలో ప్రజలను అతిదారుణ శిక్ష చేస్తూ ఉండేవారు. ప్రజల యొద్దను, ద్రవ్య ఆకర్షణచేసే యెడల, త్వరగా సొమ్ము ఇవ్వకపోతే స్త్రీలను తీసికొనివచ్చి స్తనములకు చిరుతలను పట్టించి అనేకముగా బాధలను పెట్టించే వారు. ఈ లాగంటి దినములలో వినుకొండ, బెల్లంకొండ పట్టున కూచిపూడి అనే గ్రామంనుండి బ్రాహ్మణులు, భాగవతులు,

వేషధారులు కీర్తన నిమిత్తమై ఈ స్థలమునకు వచ్చియుండి, సంబెట గురవరాజుగారి యొక్క దారుణ ప్రభుత్వం చూచి, అక్కడనుండి లేచి పోయి, విద్యానగరమునకుపోయి అక్కడ వీరనరసింహరాయలు రాజ్యపాలన చేస్తూండగా, భాగవతులు దర్శనం అయి కేళిక అడుగగా సెలవు ఇచ్చినారు. కూచిపూడి మేళము వాండ్లు చాలా చాలా విద్యావంతులని వినికిడి యున్నందున రాయలవారూ, స్త్రీలూ సహా చూడవలెనని నగర్లవద్దను, దివాణములో కీర్తనకు సెలవు ఇచ్చినారు. అక్కడ కీర్తన వినికిచేసేటప్పుడు, సంబెట గురవరాజు వలెనే ఆ వేషగాడు కూర్చుండి రాయలసమక్షము నందున ఆ స్త్రీ యొక్క స్తనములకు చిరుతలు పట్టించి, అనేకవిధముల స్త్రీలను బాధించి సొమ్ము ఇవ్వమని తహాస్సీలు చేసినట్లు వినికిడి చేసినారు. అప్పుడు రాయలవారు చూచి 'అదియేమి?' అని అడుగగా, సమ్ముఖులైనవారు, భాగవతుల ముఖతః ఆ వర్తమానం తెలిసి, 'సిద్ధవటం సీమలో సంబెట గురవరాజు అనే ఆయన ప్రజలవద్దనుండి ద్రవ్యాకర్షణచేసే యెడల స్త్రీలను తీసికొనిపోయి ఈప్రకారంగానే తహాస్సీలు చేస్తున్నారు. కనుక ఏలినవారలకు తెలుపగలందులకై ఈప్రకారం వేషములు కట్టి, వినికిడి చేసినాము' అని విన్నపం చేయగా, చాలా తీక్ష్ణంచేసి 'మరునాడు ఉదయమందు ఆ సంగతి తిరుగ జ్ఞాపకం చేయు'మని ముఖ్యులైన వారికి ఆజ్ఞ ఇచ్చినారు.

ఆ రాత్రి కీర్తన సాంతమైన వెనుక, తెల్లవారిన పిదప రాయలవారు కాలోచితకృత్యములు తీర్చుకొని, ఆస్థానమునకు వచ్చి పేరోలగమున నుండి, తమవద్ద కార్యభారకులు వచ్చి సంబెట గురవరాజుగారి జ్ఞాపకం విజ్ఞాపనం చేయగా, ఆ ప్రధానులను, సేనానాయకులను పిలిపించి మోహీమునకు సైన్యము సిద్ధముచేయవలసినదిగా సెలవు ఇవ్వగా, ఆ ఆస్థాన పంజరంలోని చిలుక 'జయం, జయం' అనగానే అదే మనకు జయ మని ఇసుమాలు కానుదు అనే సరదారుణ్ణి పిలిపించి తాంబూలం ఇవ్వగా, 'సంబెట

గురవరాజు తలతేస్తున్నాను' అని ప్రతిజ్ఞ పలికి, కోటమీద లడాయిలు షురవు చేసినంత, కోటలోన ఘావు చేయలేక, కోట ఇవ్వగా, సరదారు గురవరాజును పట్టుకొని తలకోసి తీసికొని పోయినాడు.

ఈ కైఫియత్తు కూచిపూడి భాగవతుల జగత్కల్యాణ కాంక్షకు, లోకజ్ఞతకు ప్రత్యక్షప్రమాణం. దీనినిబట్టి కూచిపూడికి అన్యనామాలు ఈనాడు లేవని, వీరి ప్రదర్శనలు 'కేళిక, కీర్తన'లని వ్యవహరింపబడేవని, విరామకాలంలో కొన్ని విచిత్రవేషాలు, లోక వృత్తాలను విశదపరచే వేషాలు ప్రదర్శించేవారని బోధపడుతుంది. ఇంతకుపూర్వం వీరు శివలీలలు ప్రదర్శించేవారట. క్రమంగా వీధి భాగవతము, పగటివేషాలు ప్రదర్శించారు. సిద్ధేంద్రయోగి కాలంలో వీరి ప్రదర్శనలు హరికథలు అనిపించుకొన్నాయి. ఆ హరి కథలు కలాపాలుగా; యక్షగానాలుగా; ఏకపాత్ర ప్రయోగాలు, బహుపాత్ర ప్రయోగాలుగా రూపాంతర మొందినాయి. క్రమంగా అనేకవిధము లయిన ప్రక్రియలు కూచిపూడి సంప్రదాయంలో ప్రవేశించాయి. శ్రీ భాగవతుల రామయ్యగారు 'గొల్లకలాప' మనబడే మానస యోగాన్ని, పిండోత్పత్తి ప్రకరణాన్ని రచించారు. ఇందు ఇరువురు పాత్ర లుంటారు. పూర్తిగా వేదాంత సంబంధమైన విషయాలు ఇందులో ప్రతిపాదింపబడినాయి. శ్రీ చింతా మాధవయ్యగారు ఈనాటి యక్షగానాలను తంజావూరు నుండి తీసుకొని వచ్చారు. ఇవిగాక, 'క్షీరసాగర మథనము', 'పద్మావతీ శ్రీనివాస కల్యాణము', 'విప్రనారాయణ' మొదలయిన బహుపాత్ర ప్రయోగ ప్రధానము లయిన అర్వాచీన యక్షగానాలు అవతరించాయి. ఈవిధంగా భాగవతుల ప్రదర్శనలు ఈనాడు వైవిధ్యాన్ని సంతరించుకొన్నాయి.

"ముక్కర కుప్పలు డిచ్చె, నయమొప్పగ కమ్మలు సూర్యు డిచ్చె: పెం
పెక్కిన తారహారములు పేర్మిని చందురు డిచ్చె, నింద్రుడున్

యొక్కవలైన కంకణము లిచ్చెను, పాపటబొట్టు శంభుడున్
చక్కని సూర్యచంద్రులును శారద ఇచ్చెను- నాదుచల్లకున్ ''

— పారిజాతాపహరణం - మాతృభూతయ్య

## కళలు - లలిత కళలు

'' విద్యాశ్చతస్రో సాధ్యాస్యుః । జన్మనా సహ సంభవాః ।
గాంధర్వంచ, కవిత్వంచ, శూరతా, దానశీలతా ॥

భారత దేశంలో అతిప్రాచీనకాలంనుండి కళలు బహుళ ప్రచారంతో ఉన్నాయి. కళ అనే శబ్దానికి అనేకమంది పండితులు అనేక విధాల నిర్వచనాలు కల్పించారు. ఋగ్వేదంలో పదు నారవ భాగంగా పేర్కొనబడింది. అమరసింహుడు, '' కళాతు షోడశో భాగః '' అని నామ లింగానుశాసనంలో ప్రవచించాడు. హేమచంద్రుడు, '' శిల్పము, విజ్ఞానము '' అని నిర్ణయించాడు. ఇక దేవరాజపండితుడు. ''ప్రకళావిత్, ప్రకర్షేణకళాః, మనోన్మాన ప్రతిమానాది విషయాః ప్రకృష్టాశ్వగణిత, రత్నపరీక్షకాలేదతి జానాతి '' అని వ్యాఖ్యానించాడు. వాత్స్యాయనుడు. '' ఇతి చతుష్షష్టి రంగ విద్యాః కామసూత్రస్య అవయవిన్యః '' అని కళలు రంగవిద్యలని, ఇవి అరువైనాల్గుగా పేర్కొన్నాడు. ''జైనమతాను సారం ఇవి డెబ్బదిరెండు. బౌద్ధుల కాలంనాడు ఎనభైఅరయి నాయి '' అని లలితతిస్తరం చాటుతోంది. వేదవ్యాసుడు, వాత్స్యాయనుని వలెనే అరువదినాల్గుగా వివరించాడు. అవి,

''1. అక్షరలక్షణ, 2. అలంకార, 3. మీమాంస, 4. ఇతిహాస, 5. తర్కశాస్త్ర, 6. స్త్రీలక్షణ, 7. అశ్వలక్షణ, 8. గజలక్షణ, 9. పురుషలక్షణ, 10. గోలక్షణ, 11. కన్యావాద, 12. విషవాద, 13. బలవాద, 14. రసవాద, 15. ధాతువాద, 16. బ్రహ్మవాద, 17, మృషావాద, 18. ముద్రారక్షక, 19. క్షాత్ర కర్మ, 20. భూతశిలాపాత, 21. అశ్వవైద్య, 22. గజవైద్య,

23. పశువైద్య, 24. నరవైద్య, 25. ఇంద్రజాల, 26. మహేంద్ర జాల, 27. గోకర్ణ, 28. గజకర్ణ, 29. తృణావధాన, 30. శబ్దావధాన, 31. భుజావధాన, 32. ఘంటావధాన, 33. హస్తచాలన, 34. నయనసంజ్ఞ, 35. భాషావిశేష, 36. భ్రమణ, 37. లోమణ, 38. విద్వేషణ, 39. ఉద్ఘాటన, 40. ఆకర్షణ, 41. అంజన, 42. అదృశ్య, 43. భృగుతుద, 44. భేతాళమత, 45. ఆయుధాభాస, 46. వాస్తుశాస్త్ర, 47. శిల్పశాస్త్ర, 48. భరతశాస్త్ర, 49. యోగశాస్త్ర, 50. చిత్రక్రియ, 51 రథారోహణ, 52. గజారోహణ, 53. అశ్వారోహణ, 54. మోహస్తంభన. 55. వయస్తంభన, 56. అగ్నిస్తంభన. 57. జలస్తంభన. 58. ఖడ్గ స్తంభన, 59. ఘటికా స్తంభన, 60. పాదుక స్తంభన, 61. మంత్రసిద్ధి, 62. పరకాయప్రవేశ, 63. దూరదృష్టి. 64. దూరశ్రవణము "లని గ్రంథసంజ్ఞాదర్పణమున వివరింపబడినాయి.

భారతీయ సంస్కృతికి అధికంగా కళల ప్రాముఖ్యత ఉంది. ఈ కళలు నాగరికతకు, అంతర్దృష్టికి, ఆత్మవికాసానికి లక్షణం. సృష్టిలోని మానవజాతి కంతటికి ఒకేవిధమైన సంస్కారం ఉండదు. వారిలోని భిన్నత్వం ఆధారంగా, విభిన్నసంస్కారాలు, కళలు అవతరించాయి. కొందరు వీటిని 'విద్యలు' అన్నారు మరికొందరు 'కళలు' అన్నారు. ప్రాచీన భారతీయ సంప్రదాయానుసారం కళలు 'అరువదినాలుగు' అనే ప్రాచీన పండితుల మతం.

లలిత కళలు : మానవుని విజ్ఞాన వికాసాలు పెంపొందటంతో అన్నిరంగాలలో సంస్కరణలు ప్రారంభమైనాయి. కళారంగంలో కూడ ఈ సంస్కారం జరిగింది. చతుష్షష్టి కళల సారాన్ని గ్రహించి కుదించి, మదింపుచేసి అయిదు కళలుగా రూపొందించారు. వాటికి 'లలిత కళలు' అని నామకరణం చేశారు. వీటిలో కొన్ని ఆపాత మధురాలు కాగా, మరికొన్ని ఆలోచనా మధురాలు. ఇవి అన్యోన్యాశ్రయాలు 1. సంగీతము, 2. సాహిత్యము,

3. కవిత్వము, 4. శిల్పము, 5. నాట్యము అని పేర్కొన్నారు. వీటిలో శిల్పానికి బదులు చిత్రలేఖనాన్ని చేర్చి కొందరు, కవిత్వాన్ని తొలగించి చిత్రలేఖనాన్ని చేర్చి మరికొందరు వ్యవహరిస్తున్నారు. అయితే సంఖ్యా విషయంలో మతభేదం లేదు.

1. సంగీతము : ఇది ఆపాత మధురము. పండిత పామర రంజకము. శ్రవణేంద్రియం ద్వారా మహానంద సంధాయకము. సాహిత్య విరహితంగా రాణింపదు.

2. సాహిత్యం : ఇది ఆలోచనా మధురం. కేవల పండిత జన మనోరంజకము. కవిత్వాశ్రయం లేకుండా పరిపుష్టి పొందలేదు. సంగీత సాహచర్యంతో మరింత రాణిస్తుంది. శ్రవణేంద్రియం ద్వారా ఆనందాన్ని ప్రసాదిస్తుంది.

3. కవిత్వము : ఆలోచనా మధురము. సంగీత సమన్వయంతో రాణిస్తుంది. సాహిత్యం దీనికి ప్రధానాంగం. సర్వజన మనోరంజకం. శ్రవణేంద్రియంద్వారా ఆనందాన్ని అందిస్తుంది.

4. శిల్పము : ఇది నయనేంద్రియంద్వారా ఆనందాన్ని సమకూరుస్తుంది. ఈ కళ నాట్యానికి మాతృక అని కొందరి అభిప్రాయం. పండిత పామరజనానందప్రదము.

5. నాట్యము : సర్వేంద్రియానందప్రదము. ఇది పైన పేర్కొన్న నాలుగుకళల సంపూర్ణ సమన్వయం కలిగి ఉంటుంది. ఆబాలగోపాలాన్ని అలరించే మధురాతి మధురమైన కళ.

ఈ కళలు భారతీయ సంస్కృతీ సభ్యతా వికాసానికి దర్పణాలు. ఆనందప్రదానం వీటి ప్రధాన ధ్యేయం. మన ప్రాచీనులు "ఆనందో వై బ్రహ్మ" అని ఆనందాన్ని బ్రహ్మ స్వరూపంగా [కీ]ర్తించారు. మతాలకు, కళలకు సన్నిహిత సంబంధాన్ని సమకూర్చారు. వారి ఆధ్యాత్మిక సిద్ధాంతాలకు, ఆలోచనలకు

అనుకూలంగా తీర్చిదిద్దారు. అందువల్ల సంస్కృతీ సభ్యతలతోపాటు కళలూ, కళలతోపాటు సంస్కృతీ సభ్యతలు, ఈ రెండింటితో దేశం అభివృద్ధిచెంద నారంభించింది.

కళలు భారతీయ నాగరికతకు ప్రతిబింబాలని విశదం చేయబడిందికదా! ఆ యా కాలాలలో వ్యాప్తిపొందే మతాలకు ఇవి ఆలంబనము లయినాయి. మతప్రచారాలకు, మతాభివృద్ధికి, మనుగడకు దోహదము లయినాయి. మతాలు వేరయినా; ఆచార్యులు, ఆరాధకులు భిన్నులయినా ; కళలు వివిధము లయినా ధ్యేయంమాత్రం ఒక్కటే అయింది. కనుక సర్వకాలాలలో సర్వజనులకు ఆదరణీయాలు, ఆరాధనీయాలు అయినాయి.

నాట్యోత్పత్తి : భారతీయ కళాప్రయోజనానికి, పాశ్చాత్య కళా ప్రయోజనానికి వ్యత్యాసముంది. భారతీయ కళలు మానవ జీవితాన్ని పరమాత్మతో అనుసంధానం చేస్తాయి. ప్రకృతికి, పరమాత్మకు గల సంబంధాన్ని నిరూపిస్తాయి. పాశ్చాత్య కళలు ఇందుకు భిన్నలక్షణాలు కలిగి ఉంటాయి.

ప్రకృతి స్త్రీరూపం కాగా పురుషుడు జ్ఞాన స్వరూపం. ఈ ప్రకృతి పురుషుల సమైక్యత దంపతి. సృష్టిచేయడం దంపతికి ప్రధాన ధర్మం. ఈ జంగమ స్థావరాత్మకమైన విశ్వమంతా ఈ దంపతి యొక్క సృష్టిరచనా విలాసం.

పురుషుని ఆనందపరచడంకోసం, ప్రకృతి పరిణామం చెందుతుంది. భారతీయ తాత్త్వికులు పరమశివుని విశ్వపురుషునిగా భావించారు. ఆ శివుడు విశ్వనర్తనం చేశాడు. నర్తించే శివునికి 'నటరాజు' అని నామకరణం చేశారు. విశ్వపురుషుని నటరాజు నటనలో "సృష్టి, స్థితి, లయం, తిరోభావం, అనుగ్రహం" అను పంచక్రియలు ఉన్నట్లు అభివర్ణించారు. ఈ పంచక్రియలకు పంచ అధిదేవతలను కల్పించారు. వారు బ్రహ్మ,

విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివులుగా రూపొందించారు. విశ్వనర్తన రూపుడయిన శివుని ;

"ఏకాస్యంతు చతుర్భుజం, త్రినయనం, వామేతు దుష్టోరగం।
చంద్రం పత్ర శిఖి ప్రసారితకరం, ఊర్ధ్వం పదం కుంచితం
సర్వేస్వస్తి కమండలం, డమరుకం, గంగాం జటేబిభ్రతం।
వందే కీర్ణజటం, నటేశ మనిశం, భస్మాంగరాగం సదా"

అని అభివర్ణించారు. ఈయన చేతిలోని డమరుకం సృష్టికి చిహ్నం. అభయముద్ర స్థితికి లక్షణం. వేరొక చేతిలోని జ్వాల లయానికి ప్రతీక. పైకి ఎత్తిన కాలు మోక్షానికి గుర్తు. వంచిన చేయి అనుగ్రహానికి సూచన అని నిర్వచించారు. ఇది నాట్యోత్పత్తికి ఒకనాటి అభిప్రాయం.

హైందవ పురాణాల్లో నాట్యోత్పత్తిని గురించి మరొక విధంగా వివరింపబడింది. తరంగ మను మహావనంలో కొందరు ఋషులు తీవ్రంగా తపస్సు చేశారు. తపోబలంతో వారు మదోన్మత్తులై ఎవరినీ లక్ష్యపెట్టకుండా, విశృంఖలంగా విహరించారు. వారి గర్వాన్ని అడగించి బుద్ధి గరపడంకోసం పరమశివుడు ఆ అరణ్యంలోకి ప్రవేశించాడు. ఆయనను దర్శించిన మునులు నిర్లక్ష్యాన్ని చూపడమే కాక కోపోద్రిక్తులై ఒక వ్యాఘ్రాన్ని సృష్టించి ప్రయోగించారు. పరమేశ్వరుడు దానిని తన కొనగోటితో చీల్చి, చర్మాన్ని వస్త్రంగా ధరించాడు. నాటినుండి వ్యాఘ్ర చర్మాంబరు డయ్యాడు. ఈ సంఘటన మహర్షులకు మరింత క్రోధహేతువైంది. అహంకారపూరితులైన వారికి ఇది అవమానకరంగా తోచింది. వెంటనే విషసర్పాలను సృజించి ఆయన పైకి వదలారు. పరమశివుడు ప్రశాంతచిత్తంతో వాటిని ఆభరణాలుగా ధరించి 'నాగాభరణు' డనిపించుకున్నాడు. అయినా పరమశివుని పరతత్త్వాన్ని గుర్తించని మునులు మూయాలకుడు అను కుబ్జాకారుని సృష్టించి మహేశ్వరునితో మల్లయుద్ధానికి

ప్రేరేపించారు. విశ్వనర్తకుడు నర్తనంచేస్తున్నట్లు నటించి, తన కుడికాలి బొటనవ్రేలితో మూయాలకుని నడుమును నొక్కాడు. వెంటనే అతని వెన్నెముక విరిగింది. పరమశివుడు తాండవం చేశాడు. నృత్యాన్ని ప్రదర్శించాడు. లాస్యాన్ని ప్రయోగించాడు. మహర్షులు అప్రతిభు లయ్యారు. శరణు జొచ్చారు. మధురాతి మధురమైన ఈ ప్రదర్శనాన్ని దేవతలు తిలకించి మహదానంద పరవశు లయ్యారు.

" బ్రహ్మా తాళధరో హరిశ్చ పటహీ
వీణా కరా భారతీ।
వంశజ్ఞా శశి భాస్కరా శ్రుతి ధరా
స్సిద్ధాప్సరాః కిన్నరాః ।
నందీ భృంగి రిటాది మర్దళ ధరా
స్సంగీతకో నారదః।
శంభోర్నృత్త కరస్య మంగళతనోః
నాట్యం సదా పాతునః ॥

బ్రహ్మ తాళం చేపట్టాడు. విష్ణుమూర్తి తప్పెట వాయించాడు. వాణి వీణ మీటింది. సూర్యచంద్రులు వేణు వూదారు. సిద్ధ సాధ్యాదులు శ్రుతు లాలపించారు. నంది, భృంగి మొదలగువారు మార్దంగికు లయినారు. నారదముని సంగీతదర్శకుడు కాగా పరమేశ్వరుని నాట్యప్రదర్శనం జగన్మోహనంగా సాగింది. సమస్త జీవరాశికీ అది చైతన్యప్రదమైంది.

" నృత్యావసానే నటరాజరాజో ననాద ఢక్కాంనవ పంచవారం ఉద్ధర్తుకామాస్సనకాది సద్ధా । ఏతద్విమర్శే శివసూత్రజాలం. "

నటరాజు నృత్యావసాన సమయంలో డమరుక నినాదం చేశాడు. దాన్ని వినినవారు తమ తమ సంస్కారానుగుణ్యంగా భావించు కొన్నారు. పాణిని వ్యాకర్తకు ' అ, ఇ, ఉణ్ ' అను అక్షరరూపాలు గోచరించాయి. నాట్యాచార్యులకు, 'తక్కిణం తరి తరికు ధింకుకు'

అనే నాట్యజతులుగా భాసించాయి. పతంజలి వాటిని వ్యాఖ్యానించాడు. విఘ్నేశ్వరుడు రచించాడు. నారదుడు మైమరచి గానం చేశాడు. కాగా, నాట్యం విశ్వనర్తకుడైన పరమేశ్వరుని అనుగ్రహం వలన, లోకకల్యాణం కోసం అవతరించింది అని ఈ పై సంఘటన విశదం చేస్తోంది. నాట్యోత్పత్తికి ఎవరు ఎన్ని విధాల కథలు వివరించినా నాట్యానికి అధిపతి నటరాజు అనే విషయం నిర్వివాదం.

నాట్యకర్తలు: నాట్యాచారులు అనేకమంది ఉన్నారు. వారిలో ముఖ్యంగా పేర్కొనదగినవారు: 1. శివుడు, 2. పార్వతి, 3. బ్రహ్మ, 4. విష్ణుమూర్తి, 5. నందికేశ్వరుడు, 6. తత్తిలుడు. 7. కోహలుడు, 8. యాజ్ఞవల్క్యుడు, 9. నారదుడు, 10. ఆంజనేయుడు, 11. విఘ్నేశ్వరుడు, 12. కుమారస్వామి, 13. బృహస్పతి, 14. రావణుడు, 15. అర్జునుడు, 16. ఉషాసుందరి అను 16 మందిని మన ప్రాచీన నాట్యాచార్యులు, పండితులు పేర్కొన్నారు.

నాట్యకళ - ప్రాచీనత: భారతీయ నాట్యకళ అతి ప్రాచీనమైనది అనటానికి అనేక చారిత్ర్యకాధారాలున్నాయి. మహర్షి వాల్మీకి విరచితమైన శ్రీమద్రామాయణం మన ఆదికావ్యం. దీనిలో నాట్యానికి సంబంధమైన విషయాలు కోకొల్లలుగా వివరింపబడినాయి. అయోధ్యకాండలో :

"ఉత్సవశ్చ మహానాసీ । దయోధ్యాయాంజనా కులః ।
రథ్యాశ్చ జన సంపాదా । నటనర్తక సంకులాః ॥

అని ఆ కాలంనాటికి నటులు, నర్తకులు ఉన్నట్లు వివరింపబడింది. మహారాజులను నిద్రపుచ్చడానికి, మేల్కొల్పడానికి రాజభవనాలలోను, రాణీవాసాలలోను గీత, వాద్య, నృత్య ప్రదర్శనలు జరిగేవి. స్త్రీలుకూడ ఆటపాటలతో వినోదంగా కాలం గడిపేవారు. రావణాసురుని నిద్రపుచ్చడానికి ఒక నాట్యకళాధురీణ

నాట్యం సల్పేది. ఒకనాడు ఆమె నాట్యం చేస్తూ, నిద్రాపరవశయై ఒక భంగిమలో నిద్రించింది అని సుందరకాండలో అభివర్ణితమైంది. శ్రీ మద్భాగవతంలోని శ్రీకృష్ణలీలలు నృత్యవిశేషాలే కదా!

పాండవులు అజ్ఞాతవాసం చేస్తున్న సమయంలో అర్జునుడు 'బృహన్నల' అను పేడివాని రూపు ధరించి, అంతఃపుర నాట్యాచార్యుడై ఉత్తరాకుమారికి నాట్యాన్ని గరిపినట్లు శ్రీమద్భారతం, విరాటపర్వంలో వర్ణితమైంది.

కవికులతిలకుడు కాళిదాసు తన 'మాళవికాగ్నిమిత్రము' నాటకంలో గణదాస, హరదత్తులను నాట్యాచార్యులను పరిచయం చేశాడు.

మొహంజోదారో శిథిలాల త్రవ్వకాలలో ఒక నర్తకి లోహప్రతిమ లభించింది.

బౌద్ధయుగంనాటి నాట్యవిశేషాలు, కుడ్యచిత్రాలు, ఇంకా పలువిధాల నాట్యభంగిమలు, శిలాఫలకాలు ఆనాటి నాట్యకళా ప్రాచీనతను, అస్తిత్వాన్ని చాటుతున్నాయి.

భారతదేశంలో నాట్యకళ ప్రాచీనకాలం నుండి మహోన్నత స్థితియం దున్నట్లు పైనపేర్కొన్న ఆధారాలనుబట్టి ఋజువవుతోంది. ఆనాటి నుండి తత్కాలానుగుణ్యంగా ప్రధాన స్థితికి భంగం కలుగని విధంగా మార్పులు, చేర్పులు, కూర్పులు సంతరించుకుంటూ, ఈనాటికీ సర్వజనహృదయాహ్లాదకరంగా పెంపొందుతోంది.

**భరతశాస్త్రము - నాట్యవేదము :** భారతీయ సంప్రదాయంలో నాట్యకళకు సంబంధించిన రెండు మహోత్కృష్ట గ్రంథాలు ప్రచారంలో ఉన్నాయి. కాని వాటి కాలనిర్ణయం మాత్రం వివాదాస్పదం. అవి 1. భరతశాస్త్రము. 2. నాట్యవేదము. చతుష్షష్టి కళలలో భరతశాస్త్రం పేర్కొనబడింది. ఈ చతుష్షష్టి కళావిభాగాన్ని చేసినవాడు వాత్స్యాయనుడు. ఈ భరత

శాస్త్రాన్ని రచించినది భరతముని అని అంటారు. దీన్ని అనేక మంది నాట్యాచార్యులు ప్రశంసించారు.

"ఉత్తమం భరతం శాస్త్రం, జ్ఞాన వైరాగ్య సాధనం."

—నారదమహర్షి

"ఉత్తమం భరతం శాస్త్రం, భక్తి ముక్తి ఫలప్రదమ్ ।
జ్ఞాన వైరాగ్య సద్బోధ కారణం మోక్షదాయకం."

—రావణుడు

"నృత్యగీతాభినయైః రాజానం దైవతం గురుమ్ ।
తోషయే భరతం శాస్త్రం భక్తి ముక్తి ఫలప్రదమ్"

—కోహలుడు

అని కీర్తించారు. ఈ ప్రమాణాలను బట్టి ప్రాచీన నాట్యకర్తల కాలంనుండి భరతశాస్త్రం ప్రసిద్ధిలో ఉంది. కాని భరతాచార్యుని పేరు ప్రఖ్యాత నాట్యాచార్యులలో పేర్కొనబడలేదు. అందువల్ల కొంతమంది నాట్యవేత్తలు ఈయన అస్తిత్వాన్ని శంకిస్తున్నారు.

"భకారో భావ వాచీస్యా। ద్రకారో రాగ వాచకః।
తకారో తాల వాచీస్యా। త్రిత్రయం భరతం విదుః"

అని భరతశబ్దాన్ని నిర్వచిస్తున్నారు. శ్రీ పోణంగి శ్రీరామఅప్పారావు భరతముని కాళిదాసమహాకవి కంటె ప్రాచీనుడని నిర్ణయింపగా, శ్రీ మానవల్లి రామకృష్ణకవి నాట్యశాస్త్రం క్రీ. పూ. నాల్గవ శతాబ్దానికి చెందినదని చెప్పారు. ఇంచుమించుగా ఈ ఇరువురి అభిప్రాయాలు ఒకేవిధంగా ఉన్నాయి. భరతముని రచించింది నాట్యశాస్త్రము. అది భరతమునిచే రచింపబడుటవలన భరతశాస్త్రంగా ప్రసిద్ధిచెంది ఉండవచ్చు. కవుల పేరుల మీాద వారి రచనలు ప్రసిద్ధి పొందటం మన అనుభవంలోని విషయమే. "అమరము", "మాఘము" మున్నగు గ్రంథాలు ఇటువంటివే.

ఇక నాట్యవేదాన్ని గురించి,

" జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్
సామభ్యో గీతమేవచ ।
యజుర్వేదా దాభియాన్
రసా నాధర్వణా దపి ॥

" వేదోప వేదై స్సంబద్ధో నాట్యవేదో మహాత్మనా ।
ఏవం భగవతా సృష్టో బ్రహ్మణా లలితాత్మకః ॥

ఋగ్వేదం నుండి వాచకాన్ని, యజుర్వేదం నుండి అభినయాన్ని, సామవేదం నుండి సంగీతాన్ని, అధర్వవేదం నుండి రసాలను గ్రహించి బ్రహ్మ నాట్యవేదాన్ని సృజించాడని; ఇది లలితాత్మకము, అత్యంతప్రాచీనము అని నాట్యవేదాన్ని సమర్థించే వారి ప్రతిపాదనము. ఏది ఏమైనా నాట్యము క్రీస్తు పూర్వం నుండి భారతావనిలో ప్రచారములో ఉన్నదనుట నిర్వివాదము,

నాట్యము - భేదాలు : నాట్యం ప్రధానంగా 1. నాట్యము, 2. నృత్తము, 3. లాస్యము, 4. తాండవము అని నాలుగు విధాలుగా విభజింపబడింది.

నాట్యము : నటుని కృత్యము నాట్యము. ఇందు అభినయం ప్రధానంగా నిర్వహింపబడుతుంది.

నృత్తము : తాళము, లయలతో కూడుకొని, అంగ ప్రత్యంగ విన్యాసాదులతో భావాన్ని అభినయించడం నృత్తము.

లాస్యము : " స్త్రీ నృత్యం లాస్య ముచ్యతే " అన్నారు. మృదువైన పదఘట్టనలతో స్త్రీలు చేసే నృత్యాన్ని లాస్యమని వివరించారు.

తాండవం : " పుం నృత్యం తాండవం ప్రోక్తం. " పురుషుడు చేసే నృత్యాన్ని తాండవ మన్నారు. ఈ పద్ధతికి ప్రథమాచార్యుడు తండుడు. ప్రళయ సమయంలో శివుడు కాళీయ ఫణి ఫణముల మీద శ్రీకృష్ణుడు చేసినది ఈ తాండవ నృత్యము

నాట్యానికి సంబంధించిన అనేక గ్రంథాలు ఆవిర్భవించి ఆ యా కాలాలలో బహుళ ప్రచారాన్ని అందుకొన్నాయి. వాటిలో 'అభినయదర్పణం', 'భరతార్ణవం,' 'సంగీతరత్నాకరము' మున్నగునవి సుప్రసిద్ధ గ్రంథాలు. ఇవిగాక మరికొన్నికూడ ఉన్నాయి.

భారత దేశంలోని నాట్యరీతులన్నీ ఒకేవిధంగా లేవు. జయదేవకవి గీతగోవిందశ్లోకాభినయ విషయంలో మాత్రం నాట్యాచార్యులందరు ఏకాభిప్రాయులు. మిగిలిన విషయాలలో భిన్న ప్రాంతాలకు భిన్నరీతుల నాట్యాలు ప్రచారంలో ఉన్నాయి. అవి 1. భరతనాట్యము, 2. కథాకళి, 3. కథక్, 4. మణిపురి, 5. కూచిపూడి నాట్యం అని అయిదు విధాలు. ఇవిగాక మరికొన్ని సంప్రదాయాల నృత్యాలు కూడా ఉన్నాయి.

1. భరతనాట్యము : ఇది నాట్యశాస్త్రానుసారం రూపొందింప బడిన ప్రక్రియ. ప్రాచీనకాలం నుండి ఇది ప్రచారంలో ఉంది. ఆంధ్ర, తమిళ ప్రాంతాలలో విశేష ప్రచారంలో ఉంది. ఒకప్పుడు దేవదాసీలచే సంప్రదాయ బద్ధంగా ఆరాధింపబడేది. దేవాలయాల ఆవిర్భావంతో దేవదాసీలు ఆవిర్భవించారు. దేవాలయాలలో వీరు ఆరాధన, పూజాది నృత్యాలద్వారా దేవుని ఆరాధించేవారు. వీరికి మడి మాన్యాలు కూడా ఏర్పాటు చేశారు. వీరివలన భరతనాట్యం అధిక ప్రచారంలోకి వచ్చింది.

భరతనాట్యం లాస్య పద్ధతికి చెందినది. మృదుమధురమైన వాచికాంగికాభినయాలతో నయనానందకరంగా ఉంటుంది. దీనిలో వాయికాపాత్రాభినయానికి ప్రాముఖ్య ముంటుంది. లోకధర్మి, నాట్యధర్మి చక్కగా పోషింపబడుతుంది.

ఈ నాట్య పద్ధతిలో గీతాలు, జావళీలు, అష్టపదులు, తరంగాలు, శ్లోకాలు మున్నగునవి రసవంతంగా అభినయింప

బడతాయి. దీని సర్వాంగ సమగ్రతను గమనించి ఔత్తరాహులు సైతం ఈ నాట్య పద్ధతి పట్ల ఔత్సుక్యాన్ని చూపుతున్నారు.

2. కథాకళి: ఇది మలబారు ప్రాంతంలో జన్మించింది. ఎంత పాండితీపాటవమున్న నటుడైనా, శ్రావ్యమైన గాత్ర సౌలభ్యమున్నా వాచికాభినయానికి స్థానం లేనందున నిరుత్సాహాన్ని చెందుతాడు. ఆశ్చర్యం గొలిపే వేష భూషాది ఆహార్యాలు ధరించి భావప్రకటన మాత్రం చేయబడుతుంది. ముద్రా ప్రధానమైన నాట్యవిశేషం ఇది. తాండవ విధానానికి చెందినది. లోకధర్మి అధికంగా ఉంటుంది. లాలిత్య సౌకుమార్యాలకు అంతగా స్థానముండదు. మూకాభినయం ఉంటుంది. పేరణి నాట్యవిశేషం ఈ సంప్రదాయనికి చెందుతుంది. 'నాట్యాచార్య' కులకుర్ణి కథాకలి నృత్యంలోను, 'నాట్యచార్య' నటరాజు రామకృష్ణ పేరణి సంప్రదాయంలోను సిద్ధహస్తులు.

3. కథక్: ఇది 'జైపురి, లక్నోఘురానా' అని రెండు విధాలు. ఈ సంప్రదాయానికి పాదవిన్యాసమే ప్రధానం.

జయపురి పూర్తిగా హిందూ సంప్రదాయానికి చెందిన నృత్యం. అభినయం మధురభక్తి సంభరితమై ఉంటుంది. ఈ పద్ధతి మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్, పంజాబు, రాజపుత్రస్థానం మున్నగు ప్రాంతాలలో విశేష ప్రచారంలో ఉంది.

లక్నోఘురానా మహమ్మదీయ సంప్రదాయానికి చెందిన నాట్యవిశేషం. వేషధారణ కూడ దానికి అనుగుణంగానే ఉంటుంది. మహమ్మదీయయుగం నాటి పాదుషాల వినోద విలాసాల నిమిత్తం ఈ నాట్యం అవతరించింది. ఈ సంప్రదాయంలో అభినయం యాంత్రికతాన్ని ఆశ్రయించి ఉంటుంది. తాళ, నృత్తాలకు ప్రాధాన్యత వహించి, ఏతాళంలోనైనా గంటల తరబడి నృత్యం చేయడానికి అనువుగా ఉంటుంది.

4. మణిపురి : బెంగాలు, అస్సాం, మణిపురి ప్రాంతాలలో ఈ నృత్యవిశేషం అధిక ప్రచారంలో ఉంది. సామాన్య మానవుల నిత్యకృత్యాలలో ఇది ఒక భాగంగా ఉంటుంది. అందమైన ఆంగికాభినయం నేత్రపర్వంగా ఉంటుంది. ఇది లాస్యపద్ధతికి చెందిన నాట్యం. దీనిలో బృందనాట్యానికి, గానానికి ప్రాధాన్యత ఉంటుంది.

దీనిని 'కృష్ణభక్తి ఆరాధనా నృత్యం' అనికూడ చెప్పవచ్చు' భక్తిపారవశ్యంతో అష్టపదులు అభినయిస్తూంటే ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. ద్వాపరయుగంలో, ఆ యమునా తరంగిణీ తీరాన శ్రీకృష్ణుడు సల్పిన 'రాసక్రీడలు' ఈ నాట్యప్రదర్శన సందర్శన సమయంలో స్మృతిపథాన గిలిగింతలు పెడతాయి.

5. కూచిపూడి నాట్యం : ఆంధ్రదేశంలోని కృష్ణా జిల్లా, కూచిపూడి వాస్తవ్యులు ప్రదర్శించే నాట్య సంప్రదాయాన్ని కూచిపూడి నాట్యం అంటారు. ఇందులో చతుర్విధాభినయాలకు సమాన ప్రాధాన్యం ఉంటుంది. క్షేత్రయ్య పదాలు, కలాపాలు, దశావతారాలు, తరంగాలు, అష్టపదులు, జావళీలు మున్నగు అన్నివిధాల నాట్యప్రక్రియలు ఈ సంప్రదాయ నాట్యంలో ప్రయోగించవచ్చు. నాట్యపరిపూర్ణత్వానికి, కవితా పరిపూర్ణత్వానికి యక్షగానాలు మహాకావ్యాల వంటివి. ఈ సంప్రదాయాన్ని నాటకరూపంలో కూచిపూడి భాగవతులు దక్షిణదేశం నుండి సంపాదించారు. కొంతమంది భాగవతులు దక్షిణాదికి సంచారం వెళ్లి, తంజావూరు ప్రాంతంలోని మేలటూరు శూలమంగళం, ఊత్తుకుడి మున్నగుచోట్ల స్థిరనివాసం ఏర్పాటు చేసుకొన్నారు. వారినుండి తమిళులు ఈ నాట్యాన్ని అభ్యసించారు. అందువల్ల ఈనాటి తెలుగు, తమిళ నాట్యాలకు సాజాత్యం, సాదృశ్యం ద్యోతక మవుతోంది. మరియొక విశేషమేమంటే తమిళులు ప్రదర్శించే యక్షగానాలు వారు గానంచేసే త్యాగరాజకృతుల వలె తెలుగు భాషలోనే ఉన్నాయి.

సర్వప్రక్రియలు కలిగి సమగ్ర నాట్య విశేష సంభరితములు కనుకనే యక్షగానాలు ఈనాటివరకు కూచిపూడిలోను, కొంత వరకు తంజావూరు ప్రాంతంలోను సజీవంగా ఉన్నాయి.

19-వ శతాబ్దంలో తమిళనాడుప్రాంతాన ఈ యక్షగాన సంప్రదాయానికి ప్రాచుర్యం తగ్గనారంభించింది. ఆనాటి తంజావూరు సంస్థానాధీశ్వరుడు శరభోజి, ఆస్థానపండితులు శ్రీ పొన్నయ్యా, శ్రీ చిన్నయ్యా, శ్రీ వడివేలు, శ్రీ శివానంద అను ప్రముఖ కళావేత్తలు 'సాదిర్' అను నాట్యసంప్రదాయాన్ని సృష్టించారు. అనంతరం వారు ముత్తుస్వామి దీక్షితులవారి శిష్యులు కలసి తక్కువ కాలంలో బాగా రక్తికట్టే విధంగా, రాజాస్థానాల్లో నర్తించే దేవదాసీల కనువైన వేరొక సంప్రదాయాన్ని రూపొందించారు. దేవాలయాలలో ప్రదర్శన లిచ్చే దేవదాసీల యక్షగానాలకున్న సమగ్రత, గంభీరత వీటికి లేదు. కవితా ప్రక్రియలో ఖండకావ్యం లాటిది. మనోరంజకత్వమున్నా క్రమంగా మాన్యత కోల్పోయింది. ఈవిషయం గ్రహించిన శ్రీమతి రుక్మిణీ అరండేలు ఒక విధమైన ప్రత్తిపత్తి కలిగించి ఈ సంప్రదాయానికి 'భరతనాట్యం' అను పేరు ప్రసాదించి, ఖండఖండాతర ఖ్యాతి సమకూర్చింది. ఈ విషయాన్ని 'కవి సమ్రాట్' శ్రీ పైడిపాటి సుబ్బరాయశాస్త్రి తమ "అమరవాణీ ప్రసారములు" అను గ్రంథపీఠిక పుట 193 లో ఈ విధంగా వివరించారు: "సాదిర్ నృత్యమునకే భరతనాట్య మనే పేరు కల్పించి శ్రీమతి రుక్మిణీదేవిగారు ప్రచారములోనికి తెచ్చినారు. శాస్త్రీయమైన నాట్యమునకు దేనికైనా భరత నాట్యమను పేరు రావలసియుండగా, శ్రీమతి రుక్మిణీదేవి ఖండాంతర ప్రచారము వలన సాదిర్ నాట్యమునకే ఆ పేరు రూఢమైనది. వారి అభిప్రాయములో భరతనాట్యమునకు ఉపశాఖ సంగీత నాటకం (చూ. 1-3-1955న ఆకాశవాణి ఢిల్లీ కేంద్రము నుండి చేసిన ప్రసంగము)." కాని అది – ...

భరతనాట్యమని పిలుచుటకు అత్యంతము అర్హమైనది సంగీత నాటకము. అనగా యక్షగానము. అందే నాట్యము పరిపూర్ణమైన స్వరూపమును పొందును. దానిలోని ముఖ్యాంశములను సౌకర్యం కోసం సేకరించి నేడు తమిళనాడులో చేయబడేది భరతనాట్యనామకమైన సాదిర్ నాట్యమే.

భరతశాస్త్రానుసారం ప్రవర్ధమాన మగుచున్న నాట్యాలన్నీ శాస్త్రీయ నాట్యములే అనవచ్చు. ఒక కథను ప్రధానాంశంగా గ్రహించి అభినయించే ప్రక్రియ పరిపూర్ణ నాట్యమవుతుంది. ఇది కూచిపూడి నాట్య విశిష్టత. మిగిలినవాటిలో ఒక అంశము మాత్రమే ప్రాముఖ్యత వహిస్తుంది.

**నాట్యకళ - ఆంధ్రదేశం :** ప్రాచీనకాలం నుండి ఆంధ్రజాతి ప్రత్యేక జాతిగా ప్రవర్ధమాన మవుతోంది. ఈ జాతికి ప్రత్యేకమైన రాజ్యం, పరిపాలనా విధానం, సంస్కృతి, సభ్యత, సాహిత్యం ఉన్నవి. చరిత్రకందినంతవరకు ప్రథమాంధ్ర చక్రవర్తి శాతవాహనుడు. క్రీ. పూ. 220 నుండి క్రీ. శ. 218 వరకు గల నాలుగు వందల ముప్పది ఎనిమిది సంవత్సరాల కాలంలో ముప్పది మంది శాతవాహన చక్రవర్తులు ఆంధ్ర సామ్రాజ్యాన్ని పాలించారు. వీరి రాజధాని ప్రతిష్ఠాననగరం. ఆనాడు కృష్ణా గోదావరీ మండలాలు, హైదరాబాదు సంస్థానం కూడ వీరి ఏలుబడిలో ఉండేవి.

శాతవాహన చక్రవర్తులలో పదునాల్గవవాడు హాలుడు. ఈయనను 'హాలశాతవాహనుడు' అని కూడ అంటారు. ఈయన ప్రాకృతభాషలో మహాపండితుడు. 'గాథాసప్తశతి' అను మహోత్కృష్ట గ్రంథాన్ని రచించాడు. కొందరు పండితులు దీనిని 'సంకలనగ్రంథ'మని అంటారు. ఈ గ్రంథంలో రసవంతములైన ఏడు కథలున్నాయి. ఆంధ్రదేశానికి సంబంధించిన అనేక కళాత్మక

సర్వప్రక్రియలు కలిగి సమగ్ర నాట్య విశేష సంభరితములు కనుకనే యక్షగానాలు ఈనాటివరకు కూచిపూడిలోను, కొంత వరకు తంజావూరు ప్రాంతంలోను సజీవంగా ఉన్నాయి.

19-వ శతాబ్దంలో తమిళనాడు ప్రాంతాన ఈ యక్షగాన సంప్రదాయానికి ప్రాచుర్యం తగ్గ నారంభించింది. ఆనాటి తంజావూరు సంస్థానాధీశ్వరుడు శరభోజి, ఆస్థానపండితులు శ్రీ పొన్నయ్యా, శ్రీ చిన్నయ్యా, శ్రీ వడివేలు, శ్రీ శివానంద అను ప్రముఖ కళావేత్తలు 'సాదిర్' అను నాట్యసంప్రదాయాన్ని సృష్టించారు. అనంతరం వారు ముత్తుస్వామి దీక్షితులవారి శిష్యులు కలసి తత్కాలంలో బాగా రక్తికట్టే విధంగా, రాజాస్థానాల్లో నర్తించే దేవదాసీల కనువైన వేరొక సంప్రదాయాన్ని రూపొందించారు. దేవాలయాలలో ప్రదర్శన లిచ్చే దేవదాసీల యక్షగానాలకున్న సమగ్రత, గంభీరత వీటికి లేదు. కవితా ప్రక్రియలో ఖండకావ్యం లాటిది. మనోరంజకత్వమున్నా క్రమంగా మాన్యత కోల్పోయింది. ఈవిషయం గ్రహించిన శ్రీమతి రుక్మిణీ అరండేలు ఒక విధమైన ప్రత్తిపత్తి కలిగించి ఈ సంప్రదాయానికి 'భరతనాట్యం' అను పేరు ప్రసాదించి, ఖండఖండాతర ఖ్యాతి సమకూర్చింది. ఈ విషయాన్ని 'కవి సమ్రాట్' శ్రీ పైడిపాటి సుబ్బరాయశాస్త్రి తమ "అమరవాణీ ప్రసారములు" అను గ్రంథపీఠిక పుట 193 లో ఈ విధంగా వివరించారు: "సాదిర్ నృత్యమునకే భరతనాట్య మనే పేరు కల్పించి శ్రీమతి రుక్మిణీదేవిగారు ప్రచారములోనికి తెచ్చినారు. శాస్త్రీయమైన నాట్యమునకు దేనికైనా భరత నాట్యమను పేరు రావలసియుండగా, శ్రీమతి రుక్మిణీదేవి ఖండాంతర ప్రచారము వలన సాదిర్ నాట్యమునకే ఆ పేరు రూఢమైనది. వారి అభిప్రాయములో భరతనాట్యమునకు ఉపశాఖ సంగీత నాటకం (చూ. 1-3-1955న ఆకాశవాణి ఢిల్లీ కేంద్రము నుండి చేసిన ప్రసంగము)." కాని అది వాస్తవంకాదు.

భరతనాట్యమని పిలచుటకు అత్యంతము అర్హమైనది సంగీత నాటకము. అనగా యక్షగానము. అందే నాట్యము పరిపూర్ణమైన స్వరూపమును పొందును. దానిలోని ముఖ్యాంశములను సౌకర్యం కోసం సేకరించి నేడు తమిళనాడులో చేయబడేది భరతనాట్య నామకమైన సాదిర్ నాట్యమే.

భరతశాస్త్రానుసారం ప్రవర్ధమాన మగుచున్న నాట్యాలన్నీ శాస్త్రీయ నాట్యములే అనవచ్చు. ఒక కథను ప్రధానాంశంగా గ్రహించి అభినయించే ప్రక్రియ పరిపూర్ణనాట్యమవుతుంది. ఇది కూచిపూడి నాట్య విశిష్టత. మిగిలినవాటిలో ఒక అంశము మాత్రమే ప్రాముఖ్యత వహిస్తుంది.

**నాట్యకళ-ఆంధ్రదేశం :** ప్రాచీనకాలం నుండి ఆంధ్రజాతి ప్రత్యేక జాతిగా ప్రవర్ధమాన మవుతోంది. ఈ జాతికి ప్రత్యేక మైన రాజ్యం, పరిపాలనా విధానం, సంస్కృతి, సభ్యత, సాహిత్యం ఉన్నవి. చరిత్రకందినంతవరకు ప్రథమాంధ్ర చక్రవర్తి శాతవాహనుడు. క్రీ. పూ. 220 నుండి క్రీ. శ. 218 వరకు గల నాలుగు వందల ముప్పది ఎనిమిది సంవత్సరాల కాలంలో ముప్పది మంది శాతవాహన చక్రవర్తులు ఆంధ్ర సామ్రాజ్యాన్ని పాలించారు. వీరి రాజధాని ప్రతిష్ఠానగరం. ఆనాడు కృష్ణా గోదావరీ మండలాలు, హైదరాబాదు సంస్థానం కూడ వీరి ఏలుబడిలో ఉండేవి.

శాతవాహన చక్రవర్తులలో పదునాల్గవవాడు హాలుడు. ఈయనను 'హాలశాతవాహనుడు' అని కూడ అంటారు. ఈయన ప్రాకృతభాషలో మహాపండితుడు. 'గాథాసప్తశతి' అను మహోత్కృష్ట గ్రంథాన్ని రచించాడు. కొందరు పండితులు దీనిని 'సంకలనగ్రంథ'మని అంటారు. ఈ గ్రంథంలో రసవంతములైన ఏడు కథలున్నాయి. ఆంధ్రదేశానికి సంబంధించిన అనేక కళాత్మక విషయాలు వీటిలో అభివర్ణింపబడినాయి. అనేకవిధము లయిన

దృశ్యరూపక ప్రబంధాలు, సంగీత వాద్య పరికరాలు, మృదంగం, మురజ, వీణ మున్నగు జంత్ర విశేషాలు విశేష ప్రచారంలో ఉన్నట్టు ఆ గాథలవలన విదితమవుతోంది.

శాతవాహన చక్రవర్తులు హిందూమతం పట్ల ప్రగాఢమైన అభిమానం కలవారు. అయినా వీరికాలంలో బౌద్ధమతం అధిక ప్రచారంలోకి వచ్చింది. శాతవాహనుల పరమత సహన స్వభావమే దీనికి కారణం కావచ్చు. ఒక్క బ్రాహ్మణ జాతి తప్ప మిగిలిన జాతులన్నీ బౌద్ధమతాన్ని స్వీకరించాయి. ఎక్కువగా స్త్రీలే ఈ మతాన్ని ఆదరించారు. అయినా శాతవాహన చక్రవర్తులలో సమదృష్టికి భంగం కలుగలేదు.

వీరి కాలంలో శిల్పకళ అత్యంతాభివృద్ధిలో ఉండేది. క్రొత్తగా స్వీకరించిన బౌద్ధమతంపట్ల భక్తిభావాన్ని ప్రకటించ డానికి ప్రతివాడు శిల్పాచార్యుడయ్యాడు. విగ్రహాలు చెక్కడం ప్రారంభించారు. ప్రజలు ఆ విగ్రహాలను ఆదరించారు. ఈ విధానం మతాధికారులకు తలనొప్పి కలిగించింది. బౌద్ధులు విగ్రహారాధనను హర్షిస్తారా, నిరసిస్తారా అను మీమాంస బయలు దేరింది. అభిప్రాయభేదాలు అంకురించాయి. అవి క్రమంగా బలపడి హీనయానం, మహాయానం అని రెండుగా చీలిపోయి నాయి. హీనయానం విగ్రహారాధనను నిరసింపగా, మహాయానం అంగీకరించింది.

మహాయానశాఖ క్రమేణ అభివృద్ధి చెందింది. ప్రపంచ మంతటా వ్యాపించింది. తమ పదవులకు భంగం కలుగుతుందని భయభ్రాంతులుకల రాజాధిరాజులంతా బౌద్ధాన్ని స్వీకరించారు. ఆదిలో వర్ణవ్యవస్థపట్ల వ్యతిరేకత, పట్టుదల చూపిన మతప్రవక్తలు, ఇప్పుడు తమ అభిప్రాయాలను కొంతవరకు సడలించుకున్నారు. ఈ పరిణామంవల్ల బౌద్ధమతం అందరకు అందుబాటులోకి వచ్చింది. తగినంత ప్రచారాన్ని పొందింది. శిల్పాచార్యులు శిల్పాలు

చేశారు. గాయకులు గాన మాలపించారు. కవులు కావ్యాలు రచించారు. నర్తకులు నాట్యమాడారు.

నాగార్జునుడు - నాట్యకళ : బౌద్ధ సాహిత్యంలో ఇరువురు నాగార్జునులు కనిపిస్తారు. వీరి కాలాలు విభిన్నములైనా మత ప్రచారానికి, మతాభివృద్ధికి ఇరువురు విశేషంగా కృషిచేశారు. ఒకరిది క్రీ. శ. రెండవ శతాబ్దము కాగా రెండవ వారిది ఆరవ శతాబ్దము.

మొదటి నాగార్జునుని 'నాగార్జున బోధిసత్త్వ' డని, 'నాగార్జున పూస' అని అనేవారు. ఈయన గౌతమబుద్ధుని వలె మహత్తర శక్తిసంపత్తి కలవాడు. ఈయన ప్రతిభా వ్యుత్పత్తులు సాటిలేనివి. విదర్భదేశంలో సాధారణ బ్రాహ్మణ వంశంలో జన్మించాడు. మహామేధావి. బాల్యంలోనే సమస్తశాస్త్రపారంగతు డయ్యాడు. తర్కశాస్త్రం, ఇంద్రజాల విద్యలలో అశేష శేముషీ ధురంధరుడు. మహాయాన బౌద్ధశాఖ నవలంబించి అనేక మత గ్రంథాలు పఠించాడు. అనేక ప్రామాణిక గ్రంథాలకు వ్యాఖ్యలు వెలయించాడు. 'శుశ్రుతం' అను ఆయుర్వేద ప్రామాణిక గ్రంథానికి భాష్యం రచించిన వైద్యవేత్త. స్వర్ణయోగాన్ని పొంది, రాళ్లను సైతం సువర్ణంగా మార్చిన రససిద్ధుడు.

మహాయాన బౌద్ధశాఖను ఆంధ్రప్రాంతంలో ప్రచారం చేయ డానికి నాగార్జున బోధిసత్త్వుడు అరుదెంచాడు. శ్రీపర్వతం మీాద నివాస మేర్పరచుకొన్నాడు. ఆయన పేరు మీాద ఆ పర్వతరాజం 'నాగార్జునకొండ' నామాన్ని ధరించింది.

నాగార్జునుడు మాధ్యమిక వాదాన్ని ప్రతిపాదించాడు. రసాయనశాస్త్రంలో మహాప్రజ్ఞావంతుడు. ధాన్యకటకాన్ని రాజధానిగా చేసికొని, ఆంధ్రసామ్రాజ్యాన్ని పాలించిన యజ్ఞశ్రీ శాతకర్ణి ఆస్థానంలో కొంతకాలం ఉన్నాడు. ఈ దినాల్లోనే ఈయన దేశ విదేశాలు సంచారం చేశాడు. ఈయనకాలంలో ఆంధ్రుల

లలితకళలు విశేష ప్రచారాన్ని, అభివృద్ధిని పొందాయి. అమరావతి, భట్టిప్రోలు, ఘంటశాల, ధరణికోట, జగ్గయ్యపేట, నందిగామ, గుడివాడ మున్నగు పలుప్రాంతాలు లలితకళా నిలయాలుగా నాడు ప్రసిద్ధి వహించాయి. బౌద్ధారామాలు వెలసిన చోటు లందు, ఆనాడు ప్రముఖ శివాలయాలు నిర్మించారు. ఆ శివాలయాల మీద సంగీత వాద్య విశేషాలు, నృత్య భంగిమలు మలచబడినాయి.

నాగార్జునకొండ దగ్గర ఒక ఆరుబయలు రంగస్థలం, (open theatre) ఉండేది. ప్రేక్షక సమూహం సుఖంగా కూర్చొను టకు, ప్రదర్శనలు అందరికి సమానంగా కనుపించడానికి అనువుగా ఈ రంగస్థలం నిర్మింపబడింది. ఆంధ్రనాట్యసరస్వతికి ఇంతకంటె ఘనగౌరవ మేంకావాలి! మతపరంగా కళాభివృద్ధి అంతా బౌద్ధులదే అయినా, రాజకీయంగా శాతవాహనులకు దక్కింది. వీరిని అంతమొందించి ఇక్ష్వాకులు ప్రభువు లయ్యారు. వీరు లలిత కళలు అభివృద్ధిచేయక పోయినా, శాతవాహనరాజుల కాలం నాటి కళలను గౌరవించారు.

పల్లవులు -కళాపోషణ : పలనాడు రాజధానిగా చేసుకొని పల్లవులు ఆంధ్రసామ్రాజ్యాన్ని పాలించారు. వీరి విజృంభణతో ఇక్ష్వాకులు అంతరించారు. బౌద్ధులు అడుగంటారు. చైత్యాలు, మహాచైత్యాలు నేలకూలాయి. ఆరామాలు సర్వనాశనమైనాయి.

పల్లవ రాజులు మొదట శాతవాహనులకు సామంత రాజులుగా ఉండేవారు. ఇరువదిఒక్కమంది పల్లవ ప్రభువులు ఆంధ్రదేశాన్ని పాలించారు. వీరిలో మొదటివాడైన మహేంద్ర వర్మ మాత్రమే కళాహృదయుడు. ఈయన సంగీతాచార్యుడైన, రుద్రాచార్యుని శిష్యుడు. గురువర్యులు రచించిన సంగీత గ్రంథాన్ని, కుడిమామలై అనుచోట శిలాఫలకాలమీద చెక్కించాడు. అనేక దేవాలయాలు కట్టించాడు. ఈ సత్కార్యాలు ఈయనను యశఃకాయునిగా చేశాయి.

విష్ణుకుండినులు : శాలంకాయనుల అనంతరం విష్ణుకుండినులు పరిపాలకు లయ్యారు. వీరి రాజధాని పశ్చిమ గోదావరి జిల్లాలోని దెందులూరు. వీరు వాస్తుశిల్పానికి ప్రాముఖ్యం ఇచ్చి పోషించారు.

కళింగగాంగులు : గాంగ వంశంలో మొదటి నరసింహ వర్మ సుప్రసిద్ధుడు. ఈయన ఒరిస్సా రాష్ట్రంలోని కోణార్క దేవాలయ నిర్మాణం చేయించాడు. ప్రాచీన దేవాలయాలలో ఇది మహోత్కృష్టమైన సూర్యాలయం. ఈ ఆలయ ప్రాంగణంలో ఒక నాట్య మందిరం నిర్మింపబడి ఉంది.

చోళరాజులు - కళాభిరుచి : కళింగాధిపతుల అనంతరం చోళ చాళుక్య రాజులు పాలకు లయ్యారు. రాజ్యవిస్తరణ కోసం వీరు దండయాత్రలు చేశారు. విజయం లభించినపుడల్లా, తమ విజయ సూచకంగా శైవ, వైష్ణవ దేవాలయాలలో ధూప దీప నైవేద్యాలు, అంగరంగ వైభోగాలు జరిపించారు. దేవదాసీలను పోషించారు. పూజా నృత్యాలు, ఆరాధనా నృత్యాలు జరిపించారు. మడి మాన్యాలిచ్చి వసతులు కల్పించారు. మంటప స్తంభాలమీద వివిధ నాట్యభంగిమలు, శిల్పాలు చెక్కించారు. ఎన్నో ఆలయాలు వెలయించారు.

తూర్పుచాళుక్యుల కాలంనాటి కళాపోషణ, కళాభిమానం ప్రత్యేకంగా పేర్కొన తగినది. వీరు ద్రాక్షారామం, సామర్లకోట, భీమవరం మున్నగుచోట్ల పలురకాల శివాలయాలలో నర్తకీమణుల ప్రతిమలు చెక్కించారు. ద్రాక్షారామ భీమేశ్వరాలయం క్రీ. శ. పదవ శతాబ్దంలో నిర్మింపబడినదని ప్రతీతి. వీరి ఏలుబడిలో ఆంధ్రులకు చిత్తశాంతి, స్వస్థత ఏర్పడింది.

రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసుకొని ఆంధ్రదేశాన్ని పాలించాడు. ఈయన క్రీ. శ. 1022

మొదలు 1063 వరకు పాలన చేశాడు. ఈ కాలం ఆంధ్రచరిత్రలో మహోజ్జ్వల ఘట్టం. సంస్కృతభాషలో భాస, కాళిదాసాదులు రసవత్తర కావ్యాలు రచించారు. వాటి ప్రభావం ఈయన కాలంలో ఎక్కువగా ఉండేది. అందుకు కారణం నన్నయభట్టులాటి మహాకవి, పండితుడు ఈయన ఆస్థానమున ఉండటమే. రాజనరేంద్రుని సాహితీ సదస్సును 'ధర్మాసనం' అనేవారు. ఆ సదస్సులో సకల శాస్త్ర పారంగతులైన పండితులు, కవులు ఉండేవారు. నిరంతరం శాస్త్ర చర్చలు, కవితాగోష్ఠులు జరుగుతూ ఉండేవి. 'ఆదికవి,' 'వాగనుశాసనుడు' నన్నయభట్టు ఆస్థానకవి గౌరవాన్ని పొందాడు. ఈయన మహాభారతాన్ని ప్రసన్న కథాకలితార్థ యుక్తులతో తెలుగు సేతకు శ్రీకారం చుట్టాడు.

రాజరాజనరేంద్రుని కాలంలో నాట్య, నాటక ప్రదర్శనలు విరివిగా జరిగేవి.

"విమల మతిన్ బురాణములు వింటి ననేకము లర్థ ధర్మశా
స్త్రముల తెరం గెరింగితి, నుదాత్త రసాన్విత కావ్య నాటక
క్రమములు పెక్కు సూచితి, జగత్పరిపూజ్యములైన ఈశ్వరా
గమముల యందు నిల్పితి, ప్రకాశముగా హృదయంబు భక్తితో."

(శ్రీమదాంధ్ర మహాభారతము – ఆది)

"నాటక ప్రయోగంబునుం బోలె ఘన రసపాత్ర శోభిత రంగరమ్యంబైన దాని..." (శ్రీమదాంధ్రమహాభారతము - ఆది)

క్రీ. శ. 1260 ప్రాంతంలో నెల్లూరు నగరాన్ని రాజధానిగా చేసుకొని మనుమసిద్ధి మహీపాలుడు తెలుగునేలకు అధిపతి అయ్యాడు. ఈయనకు ప్రధానామాత్యుడుగా, ఆస్థానకవిగా తిక్కన సోమయాజి వెలుగొందాడు. ఈయన 'ఉభయకవి మిత్రుడు', 'కవిబ్రహ్మ' అని కీర్తి నార్జించాడు. ఆంధ్రావలి మోదముం బొరయునట్లు, నన్నయ్య విడచిన భారత భాగాన్ని

విరాటపర్వం మొదలు తుదివరకు ఆంధ్రీకరించాడు. విరాట పర్వంలో అనేక నాట్యవిశేషాలు వివరించాడు.

కురవంజి - యక్షగానాలు : పదమూడవ శతాబ్ది చివరి భాగం వరకు ఆంధ్రదేశంలో శైవమతం ప్రజాదరణ పొందింది. మతప్రచారం కోసం శివలీలలు ఆడారు, పాడారు. శివాలయాలలో నాట్యవేదికలు, సంగీత సదస్సులు వెలశాయి. పర్వదినాలలోను, అర్చనా సమయాలలోను శివమహిమా ప్రదర్శన లివ్వడానికి కళా వేత్తలు ప్రత్యేకంగా నియమింపబడి, మడి మాన్యాలతో గౌరవింపబడినారు. రాజాధిరాజులు, శ్రీమంతులు భూరి విరాళాలు సమర్పించారు.

శ్రీశైలం, శ్రీకాళహస్తి, ద్రాక్షారామం, మహాకాళేశ్వరము మున్నగు శివక్షేత్రాలలో శ్రీశైలం ప్రఖ్యాతి వహించింది. "శ్రీశైలే శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" అని భావించారు. కాని ఇక్కడకు చేరుకోవడం మహా ప్రమాదభూయిష్ఠంగా ఉండేది. ఇది నల్లమల అడవులలో పవిత్ర కృష్ణానదీ తీరాన ఉన్నది. ఇక్కడ శ్రీ భ్రమరాంబా, మల్లికార్జునస్వామి వెలసి ఉన్నారు. ఈ ప్రాంత మంతా క్రూరమృగాలు యథేచ్ఛగా విహారం చేస్తూ ఉంటాయి. ఈ క్షేత్రాన్ని దర్శించి నిరపాయంగా రావడం, మరో జన్మ ఎత్తినట్లు భావించేవారు.

యాత్రికులు నల్లమల అడవులలో కాలుమోపగానే చెంచులు, కురవలు మున్నగు అడవిజాతివారు దర్శన మిస్తారు. ఈ దుర్గమారణ్యంలో క్రూరమృగాల వలన ఏవిధమైన భయం, ప్రమాదం కలుగకుండా, పరమేశ్వర దర్శనం చేసుకోవడానికి వీరు పూర్తిగా సహకరించేవారు. ఈ ఆటవికులు కొన్ని దళాలుగా ఏర్పడి శ్రీశైలం వరకు సంచరిస్తూ ఉండేవారు. కొంతమంది యాత్రికులను వెంటనిడుకొని ఒకజట్టు మొదటి మజిలీనుండి బయలు

దేరి, రెండవ మజిలీ దగ్గరఉన్న వేరొకజట్టుకు వారిని అప్పగిస్తుంది. తిరుగు ప్రయాణంలో అక్కడకు చేరుకున్న యాత్రికులను ఈ జట్టు మొదట బయలుదేరిన చోటుకు చేరుస్తుంది. ఇలా అంచెలంచెల మీద పాదచారులై శ్రీపర్వతంమీదికి కొన్నిదినాలకు చేరుకుంటారు. మార్గమధ్యంలో ప్రొద్దుక్రుంకితే అక్కడి మజిలీలోనే ఆగిపోయే వారు. రాత్రిసమయంలో ప్రయాణీకులందరు ఒక్కచోటచేరి ఉండే వారు. వారి చుట్టూ కొంచెం దూరంగా కట్టెలు, కంప పేర్చి సెగడులు వేసేవారు. క్రూరమృగాలు ఆ దరికి రాకుండా, చెదరి పోవడానికి ఆటవికులు శృంగనాదాలు, చర్మవాద్యాలు, నిరర్థక మైన పొలికేకలు, పాటలు, గంతులు మొదలైన అట్టహాసాలు చేసేవారు. సూర్యోదయమైన తరువాత మరు మజిలీకి ప్రయాణం సాగించేవారు. ఆటవికులు రాత్రివేళగాని, పగలు ప్రయాణ సమయంలోగాని యాత్రికులకు భయము, బడలిక తెలియకుండా ఉండుటకు, వినోదం కలిగించుటకు నోటికి వచ్చిన రీతిగా పాడుతూ, కాలికితోచిన రీతిగా గెంతుతూ,చిత్రవిచిత్రగతులతో ప్రయాణించే వారు. ఇట్లు గెంతటం ఆంధ్ర దేశంలో దేశి నాట్యసంప్రదాయానికి ప్రాథమికావస్థ అని చరిత్రకారుల మతం.

అడవిజాతివారు ప్రదర్శించు అర్థరహిత గానాలు, క్రీడలు, అభినయాలు కొంతకాలానికి యాత్రికులకు విసుగుదల పుట్టించాయి. ఈ విషయాన్ని వారు కూడ గ్రహించారు. వీటిలో కొంత సంస్కారం, పరివర్తనం అవసరమని భావించారు. అర్థ వంతమై, ఆనందసందోహకములైన ఆటపాటల కోసం ఆరాట పడ్డారు. అన్వేషణ సాగించారు. కొంతకాలానికి పరిష్కారమార్గం లభించింది. వారి మనోవాంఛిత మీడేరింది. కాల విపరిణామాన్ని బట్టి వారు విజ్ఞానవంతు లయ్యారు. అర్థరహితమైన ఆటపాటలకు సార్థకత సమకూరింది. శైవపండితులనుండి నూతన ప్రక్రియలు సంపాదించుకొన్నారు. అవి కాలానుగుణ్యంగా అనేకరూపాలు

ధరించాయి. యాత్రికులకు ఆనందాన్ని, ఆహ్లాదాన్ని ప్రసాదించాయి. ఆటవికులకు ఆర్థికంగా అభివృద్ధిని అనుగ్రహించాయి.

ఈ సాహిత్య ప్రక్రియలు ఆదిలో ఏకపాత్రాభినయాలుగా, అనంతరం ద్విపాత్రాభినయాలుగా, మరికొంత కాలానికి బహురూపాలుగా, ఇంకా ఎన్నో విధాల రూపులు సంతరించుకొన్నాయి. మార్గ సంప్రదాయంలోని నటీ నటులు దేశీ సంప్రదాయంలో సింగి, సింగడుగా అవతరించారు. సూత్రధారుడు చోకుదారుడయ్యాడు. విదూషకుడు కోణంగిగా మార్పుచెందాడు. మార్గ సంప్రదాయంలోని ధ్రువ, గానం దేశీ సంప్రదాయాలలో దరువుగా మారింది. ఇలా మార్పు చెందిన నాట్యవిశేషం 'కురవంజి' అను పేరు ధరించింది. అంజి అనగా 'అడుగు' అని అర్థం. కురవలు ప్రయోగించే అడుగు కాన కురవంజి అయింది.

కురవలు, కెంచులు తమ ఉదరపోషణ నిమిత్తం అడవిపండ్లు, అడవి జంతువుల కోరలు, గోళ్లు మొదలయినవి విక్రయించడానికి నగరాలకు వెళ్ళేవారు. నాగరికుల వినోదంకోసం తాము అభ్యసించిన ఆట పాటలు, అభినయాలు ప్రదర్శించేవారు. ఈ ప్రదర్శనలకు ఇతివృత్తం ఆ యా స్థల దేవతా మాహాత్మ్యాలకు అనుగుణంగా ఉండేది. వీరి ప్రదర్శనలను దర్శించిన మరికొంత మంది అనుకరించడం మొదలు పెట్టారు. ఇవి ప్రజాదరణ పొంది క్రమంగా విశేషప్రచారంలోనికి వచ్చాయి. ఈ కురవంజిలోని ఎరుకత వేషం గూర్చి.

జిలుగు బంగారు చీర
తెల్లని జారు కుచ్చులు
మెరయగా గరిమతో
గుత్తంపు చందురు
కావి రవికయు దొడగుచు
వచ్చె నెఱుకత, అహాహా!

మరియొక వర్ణన :

చుట్ట శిరసున బెట్టుకొని
కుందనపు కట్లమీద వేసిన
కురుచ బెత్తము చేత బట్టుకు
ఫాలమున నసియాడు అల నెలవంక,
పాపిట బొట్టు సోగకన్నులు, వాలు
చూపులు వైడూర్యపు పచ్చబొట్టుతో
అంద మలరగ ఎడమ మూపున
ఆడశిశువును గట్టుకూ ...!

ఇది కురవంజి ఆటకత్తె వేషం. వీరి ఇలవేలుపు వీరభద్రుడు. వెడయాట, కోణంగి ఆట, పేరణి, బహునాటకములు, బహురూపులు, అమర గంధర్వాంగనల నృత్యానుకరణములు, పక్షుల ఆటలు మున్నగు వాటిని వీరు ప్రదర్శించేవారు. 'పండితారాధ్య' చరిత్రలో పాల్కురికి సోమనాథుడు వీటి నన్నిటిని ఉదహరించాడు.

జక్కులు - యక్షగానం : కురవ పదం వలెనే జక్కు అనేది కూడ జాతివాచక శబ్దం. మన ప్రాచీన ఆంధ్ర సాహిత్య గ్రంథాలలో ఈ పదం విరివిగా ప్రయోగింపబడింది. ఈ జాతివారు కామేశ్వరి లాటి శక్తిదేవతలను ఆరాధిస్తూ ఉండేవారు. పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథుడు మున్నగు దేశి, మార్గ సంప్రదాయాలకు చెందిన ప్రాచీనాంధ్ర మహాకవులు మనకు జక్కుల పురంధ్రిని పరిచయం చేశారు,

శిరమున నురమునఁ జెవుల గంత యనఁ
గరము నర గూకట్లం గాళ్ల జెల్వార
గన దండలును గనుగవ గదణికలు
నవరంబులునుఁ గలశంబు దండలును.

భసితంపుఁ బూతపైఁ బరగు బచ్చెనలు
నసలారు చిరు గజ్జియలును నందియలు
సరి రత్నపంక్తుల జలపోషణములు
గరమొప్ప తొంగిళ్ళ గల చల్లడములు
బొల్చు దంతావళుల్, పుష్పమాలికలు
దాల్చి యద్భుతోత్సవలీలఁ దనర
జనులు వార్షింప నాస్థానముల్ సొచ్చి
అనుకూల వివిధ వాద్య సమ్మేళవమున
నార్భట యిచ్చి యొయ్యన జవనికల
గర్భంబు వెడలి......"

—పాల్కురికి సోమనాథుడు

ప్రత్యక్ష మవుతుంది. 'క్రీడాభిరామం'లోని కవిసార్వభౌముడు శ్రీనాథుని జక్కుల పురంధ్రిని దర్శించండి.

కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమధ్వని, తార
కంఠ స్వరంబుతో గారవింప
మసిబొట్టు కోనాన నొసలు కొచ్చిన కన్ను
నొడుపుచే దాటించు నెడవ దడవ
శ్రుతికి నుత్కర్షంబు జూపంగ వలయుచో
జెవిత్రాడు బిగియించు జీవగర్ర
గిల్కుగిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప

రాగమున నుండి లంఘించు రాగమునకు
నురు మయూర ద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లి, మహాలక్ష్మి, కైటభారి
వలపుఁ బాడుచు వచ్చె, జక్కుల పురంధ్రి."

—శ్రీనాథుడు

జక్కు అను శబ్దానికి 'యక్ష' అనేది ప్రకృతిపదం. సంస్కృతంలోని యక్షులు తెలుగులో జక్కులయ్యారు. ఈ యక్ష కన్యలు బాల్యంలో సాము గరిడీలు సాధనచేసి, ఒకవిధమైన నాట్య ప్రక్రియను అభ్యసించారు. కాలాంతరంలో జక్కుల కీర్తిప్రతిష్ఠలు పెంపొందాయి. ఆంధ్ర కావ్యాలలో చోటు చేసుకొన్నారు. 'పెండెలనాగి' పాత్రధారణలోను, నటనలోను ప్రసిద్ధి పొందింది. జక్కులు పాడు పాటలు జక్కుల పాటలు. అవి యక్షగానాలుగా సంస్కృతీకరింపబడినాయి. ఇవి ఆంధ్ర కర్ణాటప్రాంతాలలో ప్రముఖస్థానాన్ని గడించుకొన్నాయి.

ఓబయమంత్రి రచించిన 'గరుడాచల' యక్షగానం మొదటిది కావచ్చు. కందుకూరి వీరభద్రకవి 'సుగ్రీవవిజయం' రచించాడు. యక్షగాన ప్రబంధాలలో హాస్యం అధికంగా ఉంటుంది. అది ఈనాటి ప్రజలకు మోటుగా తోచవచ్చు. కాని ఆ కాలం వారికి రమ్యంగా, ఆహ్లాదకరంగా ఉంది. అందువల్లనే ఆదరణ పొందింది. ఈ యక్షగానాలను గూర్చి 1957 జనవరి స్వర్ణ సంక్రాంతి 'కృష్ణాపత్రిక' సంచికలో ప్రచురితమైన వ్యాసం వలన అనేక విషయాలు అవగతమవుతాయి.

యక్షగానములు మధుర కవితలకు సంబంధించినవి. ఇవి నాటకములకు మూలకములు. ఈ రచనలు నేటికి పది శతాబ్దములకు పూర్వంనాటివని చెప్ప నొప్పును. ఈ యక్షగానములు నన్నయ భట్టారకుని కాలమునాటికి లేవనియు, నిటీవలనే కల్పింపబడిన వనియు కొందరి యభిప్రాయము. కాని, నన్నపార్యునకు రెండు వందల సంవత్సరముల తరువాతవాడగు పాల్కురికి సోమనాథుడు రచించిన 'పండితారాధ్య' చరిత్రలో పర్వతప్రకరణమున.

"అద్భుతంబుగ బొమ్మల నాడించువారు
నాదట గంధర్వ యక్ష విద్యాధరాదులై।
పాత్రల నాడించువారు........"

అని చెప్పుటచేతను, ఈ యాటలకు పూర్వ మనేకవిధములగు ఆటలను కూడ అందే సూచింపబడియుండుటచేతను, ఈ యక్ష గానములు నన్నయభట్టారకుని కాలమునకు పూర్వమే ఉండి యుండునేమో యను భావ ముదయించుచున్నది.

నన్నయభట్టునకు పూర్వము నియమరహితమైయున్న భాష నేకదా సంస్కరించి భారత సంహితారచన బంధురుడైనది. కాన, నివి నన్నయకు పూర్వము నుండియు నుండెననుట అనుచితము కాదు.

తెలుగు ద్రావిడభాషా కుటుంబమునకు చెందినది. ద్రావిడ భాషలలో దృశ్య ప్రబంధములను 'కురవంజి' అందురు. అంజి అనగా 'అడుగు'. ఇదియొక నృత్యవిశేషము. ఆ అంజియే మన కీనాడు 'అంగ' అయినది. కురవలు కోయ వారైనారు. ఈ కురవంజినిగూర్చి విజయ రాఘవ నృపాలునిచే రచింపబడిన 'ప్రహ్లాదచరిత' మనెడి యక్ష గానమునందు ఒకనాట్య విశేషముగ పేర్కొనబడినది. కురవ లను వారు తరచుగ శివక్షేత్రములయందు జాతరలు జరిగినప్పుడు తీర్థ సంవాసుల వినోదార్థమై ఆడుచుండెడివారు. తక్కిన దినములందు పరిసర గ్రామములందు. నగరములందు తమ ప్రదర్శనల నిచ్చి, అచటివారిని మెప్పించి బహుమానములనుగొని జీవయాత్ర సాగించు చుండెడివారు.

కాలక్రమమున వారికి భారత, భాగవత, రామాయణాదుల లోని కథలు ఇతివృత్తములై తదనుకూల నాట్య సంగీతములను సమకూర్చుకొని ప్రదర్శించుచూ వచ్చిరి.

ఇవి దశరూపకములలోని వీధినాటకమును బోలి యుండెడివి. వీనిలో ఇరువురు పాత్ర లుండెడివారు. స్త్రీపాత్రను 'సింగి' అనియు, పురుషపాత్రను 'సింగడు' అనియు ననుచుండెడివారు. మరికొంత కాలమునకు కథానుసంధానమునకై సంధివచనములు

పలుకుటకు 'కోణంగి' యనెడి పాత్ర యొకటి ప్రవేశించినది. వీరి గేయములను 'దరువు' లందురు. కోణంగిపాత్ర కాలాంతరమున 'చోడిగాడు' గా మారినది. ఆ కురవంజులు కాలక్రమమున 'కూచిపూడి భాగవతుల భాగవతములుగా మారియుండవచ్చును. ఈనాడు వారు ప్రదర్శించు భాగవతములలో కొన్నిటియందు ఒక పాత్ర, ఇంకకొన్నిటిలో రెండుపాత్రలు, మరికొన్నిటియందు మూడుపాత్రలు నుండుటచే మన కీ సందియము కలుగుచున్నది. ఈ భాగవతములు 'కేళిక, కీర్తన, హరికథ' అను నామములు ధరించి తరువాత కాలమున కలాపములుగా మారి యక్షగానములై ఈనాడు అధిక ప్రచారమునందున్నవి. ఒకప్పుడు వీటియందు గల కథావస్తువునుబట్టి, ఆనాటి సింగిపాత్ర స్త్రీపాత్రగను, సింగని వేషము పురుషపాత్రగను మార్పుచెందినది. ఈనాటి కూచిపూడి భాగవతులుకూడ పూర్వకాలమున, 'దాదినమ్మ', 'కొండాయి', మొదలగు ద్విపాత్రాభినయ ప్రదర్శనముల నిచ్చుచుండెడివారు.

ఇట్టు లా కాలమున ప్రదర్శించుచుండెడి కొరవంజులే కాలాంతరమున రామాయణ, భారతాది యుద్గ్రంథములనుండి రమ్యములగు నితివృత్తములను గ్రహించి, సంస్కారముకలవారిచే ప్రదర్శితములగుట వలన 'యక్షగానము' లుగ మార్పులు చెందినవి. ఈ యక్షగానములే ఆనాడు జక్కుల పాటలుగా ప్రసిద్ధి పొందినవి.

ఈ యక్షగానముల పద్ధతి, ఈనాటి దశరూపకములలోని నాటకములకంటె విలక్షణ పద్ధతిగ నుండుటను బట్టియు, కొన్ని తావులలో నాటకమును బోలి యుండుటను బట్టియు నాటకములకు యక్షగానములే మూలములై యుండవచ్చునని సాహిత్యక పరిశోధక పండితుల యభిమతము.

యక్షగానములలో ప్రతిపాత్రయు రంగప్రవేశము చేయుట తోడనే తన పేరు, లక్షణములు, విశేషములను చెప్పుకొనుచూ,

ప్రేక్షకులకు పరిచయము చేసుకొనుచూ ఆడుచూ, పాడుచుండును. క్రీ. శ. 1550 వాడుగ నిర్ణయింపబడిన చిత్రకవి పెద్దన తన 'లక్షణ సారసంగ్రహాము' అను లక్షణ గ్రంథమునందు యక్షగాన లక్షణము నీవిధముగా వివరింపబడినది :

సీ॥ వృషభగతి త్రిపుటరేకంఘ్రి యుగమున
దుద నేడు లఘువులు తొలగజేయ,
జంపె రేకునకు లక్షణము ద్విరదగతి
యగుఁగాన నొకలఘు వంద మాన
రచరేకగును దురగ వల్గము గతి
మరి యేకతాళియా మధురగతిని
అటతాళమున మాత్ర లంఘ్రి కిర్వదినాల్గు
నాల్గింట విరతి పద్యాలుగీఁట
నిలుచు నర్థంపు నర్ధచంద్రికలు దీన
యక్షగానాది కృతులలో నార్యులిడిన
రగడ భేదంబు లివియాను రమ్యచర్య

*    *    *

అని ఉదహారించినాడు. క్రీ. శ. 1656 లో వెలసిన 'అప్పకవీయ' మందును యక్షగాన లక్షణ మీ విధముగానే చెప్ప బడినది. ఇది 'లక్షణసార సంగ్రహాము'ను జూచి ఇట్లు వివరించెనా యన్నట్లున్నది.

కావ్యాలంకార సంగ్రహాము అను 'నరసభూపాలీయము' 'లక్షణసార సంగ్రహాము'నకు తరువాత ఆవిర్భవించినది. అయిననూ నాటక ప్రకరణమున యక్షగానమును గూర్చి చర్చించలేదు. సంస్కృతమున విద్యానాథ పండితునిచే రచింపబడిన 'ప్రతాపరుద్ర యశోవిభూషణము' అను అలంకార గ్రంథము రచింపబడినది. ఆ గ్రంథమునకు నరసభూపాలీయము తెలుగుసేత కాన అందు ఉదాహారింపబడనిది యిందును ఉదహారింపబడలేదు. కాని నరస భూపాలీయము మూడవకూర్పు పీఠికలో శ్రీ బులుసు వేంకట

రమణయ్య "ఇందు ఉదహరింపబడని నాటక లక్షణములు, తెనుగున కావ్యాలంకార సంగ్రహము నాటికి లే"వనిరి. అట్లయిన ఆ గ్రంథము నకు ముందే ఆవిర్భవించిన 'లక్షణసార సంగ్రహము' న వివరింప బడుటకు కారణమేమో తెలియదు.

ఈ పై విషయములను బట్టియు, కూచిపూడి భాగవతులు నన్నయ కాలమునకు పూర్వము నుండియు మధురకవితల జాతికి చెందిన యక్షగానమో, ఉదాహరణమో, మరి ఏదియో ప్రదర్శించుచు వాటి యందు నేర్పరులై యుండబట్టియు, శ్రీ సిద్ధేంద్ర యోగీంద్రులు తాము రచించిన హరికథను, భామాకలాపమును గూడ ప్రదర్శింపుడని యర్థించెను. యథార్థమునకు లలితకళాభి నివేశము లేనివారిని ప్రదర్శింపుడని ప్రార్థించుటయన్న పొసగని విషయముగదా! ఆ యోగివరేణ్యుడును అనేక ప్రదేశముల దిరుగాడినవాడై యుండి, అచటివారల నందరను విడనాడి, కేవలము కూచిపూడి బ్రాహ్మణులనే తన వాంఛిత మీడేర్పుడని ప్రార్థించుట సత్యదూరమైన విషయముగా నున్నది. కాన. సిద్ధేంద్రుడు కూచిపూడి భాగవతుల కాది నాట్యగురువు కాడు.

ఈ కూచిపూడికి అనతిదూరమున మువ్వ అను గ్రామము కలదు. క్షేత్రయ్య ఈ మువ్వ గ్రామమున వెలసిన గోపాలదేవుని గూర్చి పదములను రచించెను. ఇవి అభినయానుకూలములు. కాన, సిద్ధేంద్రయోగి కూచిపూడివారిని తన కీర్తనను ప్రదర్శింపుడని ప్రార్థించుటకు ముందే భాగవతులు నాట్యకళావిశారదులై యుండి రను విషయమును బలపరచుచున్నది. మొత్తముమీద సిద్ధేంద్రయోగీంద్రుని రచనను ప్రదర్శించుటనుబట్టి కాకున్నను. ఆయన అనుగ్రహ విశేషమున ఈ భాగవతులు అఖండకీర్తి నార్జించిరి. వీరి ప్రదర్శనలకు గౌరవము లభించినది.

(స్వర్ణసంక్రాంతి పంచిక, 1957 జనవరి, కృష్ణాపత్రిక)

గాంధార ప్రముఖ స్వర శ్రుతి కళాగంభీర వారాంగనా
గాంధర్వంబు ఘనస్వనంబు తతనిక్వాణంబు వంశాది సం
బంధిస్వాన పరంపరా మహిమయున్. మద్దెళ్ల దిం డిం ధిమిం
ధిం ధోం ధిక్కి ధిమిక్కి శబ్ద భరమున్ దీపించనా పూర్ణతన్.
(పింగళి సూరన)

## దేవదాసీలు - ఆలయాలు

"గీతిగానేన యోగ స్స్యాత్ । యోగా దేవశివైక్యతా ।
గీతిజ్ఞోయది యోగేన । సం యాతి పరమేశ్వరమ్ ॥"

దేవదాసీలకు, ఆలయాలకు అవినాభావసంబంధ ముండేది. అలాగే భాగవతులకుకూడ ఘనిష్ఠ సంబంధముండేది. శైవ, వైష్ణవ మతాల విజృంభణంతో ఆలయాల ప్రాముఖ్యం పెరిగింది. లలిత కళలు సాధనంగా మతప్రచారాలు తారస్థాయి నందుకొన్నాయి. శైవులు శివాలయాలలోను, వైష్ణవులు విష్ణ్వాలయాలలోను అంగ రంగ వైభోగాలు జరిపించడం ప్రారంభించారు. దేవదాసీలు నియమింపబడినారు. వారు నాట్యాచార్యుల సహాయ, సహకారాలు అర్థించారు. ఆరాధనా నృత్యాలు, పూజా నృత్యాలు, రంగ నృత్యాలు అవతరించాయి. ఉత్తమ నర్తకీమణుల నాట్యభంగిమలు ఆలయద్వారాలమీద, మంటప స్తంభాలమీద మలపించారు. శైవ వైష్ణవ సంప్రదాయ నర్తకినులు వెలశారు. ఆనాటి నాట్యకళాభి వృద్ధికి, పోషణకు ఈనాటికి ఆలయాలమీద, మంటప స్తంభాలమీద సాక్షాత్కరించే నాట్యభంగిమలు ప్రబల సాక్ష్యాలు.

**ఊర్వశీ జననం:** మేనక, రంభ, ఊర్వశి, ఘృతాచి, తిలోత్తమ, సుకేశి, మంజుఘోష అను ఏడుగురు దేవవేశ్యలుగా అభివర్ణింపబడినారు. వీరు చతుష్షష్టి కళలలోను నిపుణులు. వీరి పుట్టుకల గురించి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. ఇవి హేతువాద బద్ధములు కాకపోయినా, మనోహారంగా ఉంటాయి. విని ఆనందించడానికి అనువుగా ఉంటాయి.

దేవవేశ్యలలో ఊర్వశి మూడవది. ఆమె చాల సౌందర్యవతి. సకలకళా విశారద. శ్రీ మహావిష్ణువు ఊరువులనుండి జన్మించినదట. అందువలన 'ఊర్వశి' అను పేరు వచ్చినదట.

ఒకమారు నరనారాయణులు బదరికావనంలో ఘోరంగా తపస్సుచేయ నారంభించారు. ఇది దేవేంద్రునికి కన్నెర్ర అయింది. ఆయన వీరిని సాధారణ వ్యక్తులుగా భావించాడు. తనకున్న అధికారాన్ని, శక్తి యుక్తులను ప్రయోగించి వారికి తపోభంగం కలిగించాలని తలపోశాడు. తన ఆస్థాన నర్తకీమణి రంభను పిలిపించాడు. 'నరనారాయణులకు తపోభంగం కావించిరమ్మ'ని ఆదేశించి భూలోకానికి పంపాడు. తనకంటె సౌందర్యవతులు, నాట్యధురీణలు లేరనే అహంకారము రంభలో దృఢంగా ఉంది. ఇపుడు నరనారాయణుల తపోభంగ కార్యభార్యం తనకు లభించినందున తన ఆత్మాభిమానం మరింత పెరిగింది.

తన అధీనంలో అఘటనఘటనా సమర్థులైన అంగనామణులున్నారని, వారికి అండదండలుగా మన్మథ, వసంతులున్నారని, వీరి సహాయంతో హరిహరాదులనైనా జయించ గలననే అహంకారము దేవేంద్రున కున్నది. ఇపుడు ఈ అహంకార పరిపూర్ణ లిరువురు ఏకమయ్యారు.

నారాయణుడు సర్వాంతర్యామి. సర్వవ్యాపకుడు. ఆయనకు తెలియని విషయంలేదు. రంభా ఇంద్రుల చిత్తవృత్తులు ఆయనకు అనుభవమే. ఆ ఉభయులకు గర్వభంగం చేయడానికి తగిన సమయం లభించిందని తలంచాడు. సంకల్ప మాత్రంతో తన ఊరువులనుండి ఒక అపరూప సుందరిని సృష్టించాడు. అనుగ్రహమాత్రంతో సర్వకళా వైదగ్ధ్యాన్ని ప్రసాదించాడు. 'ఊర్వశి' అని నామకరణం చేశాడు. ఆమెను నర్తించమని ఆజ్ఞాపించాడు.

ఆ సమయానికి రంభ మహాసంరంభంతో బదరికావనం ప్రవేశించింది. అచట త్రిలోకసుందరి ఊర్వశి అత్యద్భుతంగా అనేక రీతులలో, గతులలో నాట్యం చేస్తోంది. నరనారాయణులు

తపోమగ్నులై ఉన్నారు. ఊర్వశి నాట్యవిన్యాసాలవంటి వాటిని, ఇంతకుపూర్వ మెన్నడూ రంభ చూడలేదు. తానే సౌందర్య వతినని, నాట్యకళావిదుషీమణినని భావించింది. ఇపుడు ఊర్వశీ సౌందర్యం తనకే మోహజనకంగా ఉంది. నాట్యం అభ్యస నీయముగా తోచింది. ఊర్వశి గానానికి శిలలు ద్రవించి ఏరులై పారుతున్నాయి. స్థావరాలు చలించి ప్రయాణిస్తున్నాయి. నర నారాయణులు మాత్రం నిశ్చల తపస్సమాధిమగ్నులై ఉన్నారు. ఈ స్థితిని గమనించిన రంభ, "ఆహా! ఏమి సౌందర్యం? ఏమి నాట్య కళా పరిపూర్ణత? దీనికే వీరు చలింపనిది, నా నాట్యానికి తపో భంగమై, నా సౌందర్యాన్ని అపేక్షిస్తారా?" అనుకొంది. నిశ్చేష్టు రాలై ఆ నాట్యప్రదర్శనను దర్శిస్తూ, ఆమె సౌందర్యాన్ని నేత్రాలతో సేవిస్తూ వచ్చిన కార్యాన్ని, తన శరీరాన్ని విస్మరించింది. రంభ తిరిగి రాకపోయేసరికి అమరేంద్రునకు అనుమానం కలిగి బయలుదేరి వచ్చాడు. ఇక్కడి పరిస్థితి అగమ్యా గోచరంగా ఉంది. రంభ తన మోకాళ్లపై నిలబడి ఊర్వశికి వందన మాచరిస్తోంది. ఊర్వశి దురితగతిలో లాఘవంగా నాట్యాన్ని ప్రదర్శిస్తోంది. ఆమె రూప లావణ్య సౌకుమార్యాలు తిలకించిన సురపతికి చిత్తచాంచల్యం కలిగింది. ఆమె రూప మాధుర్యాన్ని కనులతో గ్రోలి మత్తెక్కి మైమరచాడు.

నారాయణుడు కనులు తెరచాడు. ఊర్వశి నాట్యాన్ని నిలిపివేశింది. రంభా, సురేంద్రులు ఒడలు తెలిసి భూలోకంలో ఉన్నట్లు గ్రహించి సిగ్గు చెందారు. వారిరువురకు గర్వభంగమైంది. అజ్ఞానాంధకారం తొలగింది. తమ తప్పులు గ్రహించారు. 'క్షమింపు' మని నారాయణుని పాదాలపై ఒరిగారు. వారి అవనతికి నారాయణుడు సంతసించాడు. ఊర్వశిపై మరులుగొన్న మహేంద్రు నకు ఆమెను సమర్పించాడు. ఆనాటి నుండి ఇంద్రునకు ఆమెపై మక్కువ ఎక్కువ.

ఊర్వశీ శాపం : ఊర్వశీ, పురూరవసులు ఒకప్పుడు గాఢంగా ప్రేమించుకొన్నారు. అప్పుడపుడు వారు భూలోకంలో కలుసుకొనేవారు. కారణాంతరాల వలన వారికి వియోగం సంభవించింది. ఈ తరుణంలో సరస్వతీదేవి రచించిన 'లక్ష్మీకల్యాణం' స్వర్గంలో ప్రదర్శించవలసి వచ్చింది. భరతముని ప్రయోక్త. ఇంద్రాజ్ఞచే ఊర్వశి లక్ష్మిగా పాత్రధారణ చేసింది. త్రిలోక ప్రసిద్ధులైన పండితులు, రసజ్ఞులు, కవులు, కళావేత్తలు ఆహూతులైనారు.

రూపకం రసవత్తరంగా సాగుతోంది. పాత్రధారులు మహోదాత్తంగా తమ ధర్మాన్ని నిర్వహిస్తున్నారు. ఊర్వశి తన పాత్రలో లీనమై మైమరచి నటిస్తోంది. అది లక్ష్మీనారాయణుల విరహ ఘట్టం. ప్రస్తుతం ఊర్వశి పురూరవసుని విరహాన్ని అనుభవిస్తోంది.

లక్ష్మి చెలికత్తె, "ఓ లక్ష్మీ! నీ హృదయ దర్పణంలో చోటు చేసుకొన్న ఆ భాగ్యశాలి ఎవరమ్మా?" అని ప్రశ్నించింది. లక్ష్మి "పురుషోత్తముడు" అని చెప్పబోయి నామసామ్యంతో అనాలోచితంగా "పురూరవసుడు" అంది. రూపకం రసాభాసమైంది. భరతముని భగ్గుమన్నాడు. వెంటనే "పాతకీ! నీ వా పురూరవసుని దగ్గరకే పో! నీ వీ పవిత్ర లోకంలో ఉండ తగవు. పో, పో" అని నిర్దాక్షిణ్యంగా శపించాడు. "తెలియక చేసిన తప్పిదాన్ని క్షమింపు" డని ఊర్వశి ప్రాధేయపడింది. కాని ఔచిత్య ప్రియుడైన భరతుని హృదయం కరుగలేదు. విక్రమోర్వశుల ప్రణయ వృత్తాంతం ఇదివరకే ఎరిగిన దేవేంద్రుడు, "సంతానవంతురాల వైనంతనే తిరిగి ఈ లోకానికి చేరుకోగలవు" అని శాపావసానాన్ని ప్రసాదించాడు. విధి ఎవ్వరికైనా దాట శక్యం కాదుగదా!

ఊర్వశి భూలోకావతరణమే నాట్యావతరణమని కొందరు పండితుల భావన. ఊర్వశి విక్రమార్కుల సంతానం దేవదాసీలట. ఈ దేవదాసీలలో రంభా సంతానం కూడా కొంత ఉన్నదట. ఎవరు ఎవరి సంతానమైనా ఉత్తమ సంప్రదాయానికి చెందిన దేవదాసీలు మాత్రమే ఆలయ నృత్యాలకు, భరతనాట్య ప్రదర్శనలకు అర్హులుగా పరిగణింపబడ్డారు.

**ఆలయాలు-నాట్యాలు :** దక్షిణదేశంలో మొట్టమొదటగా ఆంధ్రదేశంలోనే ఆలయ నిర్మాణం జరిగింది. పల్లవ ప్రభువులు ఈ వ్యవస్థకు దోహదం చేశారు. పల్లవ, చోళ సంప్రదాయాలు క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దంలో ఏకమైనాయి. చోళులు నిర్మించిన ఆలయాలకు గర్భాలయం కంటె గోపురం చిన్నదిగా ఉండేది. కోణార్కులోని సూర్యాలయం 227 అడుగుల ఎత్తుంది.

క్రీ. శ. 850 నుండి 1100ల వరకు చోళులు ఆంధ్రదేశాన్ని పాలించారు. వీరికాలంలో దేవాలయాలమీద పెద్దపెద్ద విమానాలు నిర్మితమైనాయి. సుందర గోపురాలు వెలశాయి. ఆలయ నిర్మాణమీ విధంగా దినదినాభివృద్ధినందుకొంది.

శైవుల కాలంలో ఆలయంలో నిత్య ధూప దీప నైవేద్యాలు, అంగరంగ వైభోగాలు జరిపించడానికి భక్తులు మడి మాన్యాలు దాన మిచ్చారు. ఈ విషయాలను గూర్చిన వివరాలు ఆలయాలలోని శాసనాల వలన లభ్యమవుతున్నాయి.

**ఘంటశాల కామక శాసనము :** ఇది శా. శ. 1047 నకు సరియగు క్రీ. శ. 1125 నాటిది. దీనిలో,

౧

కం. భూవిదిత శక మహాశ
బ్దావళి ముని (7) వారిధి (4) వియత్ (0) చంద్ర (1) మిత
శ్రీ విభ్రాజిల్లగ వి
శ్వావసు వత్సరమున జన వినుతముగాన్ ।

సూచిక: ముని-7. వారిధి-4. వియత్-0. చంద్ర-1. "అంకానాం వామతో గతిః" అను న్యాయానుసారము శా. శ. 1047. ఇది విశ్వావసునామ సంవత్సరము.

౨

కం. కరమొప్పు ఘంటశాలా
పురి కామిని, కామినీ విభూషణము, గుణా
కరుడైన పోతినాయకు
వరసుత, సుకుమార రూపవతి, వసుమతిలోఁనన్,

3

గీ, రమణితోడ నుత్తరాయణ తిధిని-(ను)
త్తము (న భ) క్తి వెలయ ధర్మయుక్తి,
......రసమాన (న)మిత చరణున కఖిల లో
కే (శ్వరు) నకుఁ బార్వతీశ్వరునకు ॥

ఘంటశాల కామక తమయయ్య పోతి నాయకునకు తమయమ్మ ప్రోలమకు ధర్మార్థముగా నఖండవర్తి దివియకుం బెట్టిన గొఱి 50. వీనిం జేకొని బేడుగ బోయండు తన పుత్రాను పౌత్రికము.

ఇతని తొండేశ్వర దేవరను నిత్య మానెండు నెయి వోయం గలవాడు.

ఇల్లుపట్టు మాల్లు ౨, భూమి న ర. యీ ధర్మువు ఎవ్వరైన దప్పిరేని

బారనాసి ప్రచ్చినవారు

ఇవని కరణ మైన తనచ్రాలు.

సూచన: ఈ శాసన రచయిత ఈమని కరణం అయితన—అదిత్య శబ్దభవము.

*Bibliography :*

1. A. R. 683 of 1920
2. S. I. I. Vol. x No. 84. Page 36.
("Lives of Telugu Poets" : By N. Venkatara Rao, M. A.
Pages 189-90)

## దత్తైన సోమన క్రీ. శ. 1149 లో
## రాజమహేంద్రవరమున నిల్పిన శాసనము

"ఈకాలమున సోమన ప్రెగ్గడు, మహామాండలిక బొద్దన కొడుకు నారాయణదేవుని ప్రధానిగ నుండెను. ఈ శాసనమున సోమన ప్రెగ్గడ ఏ ఏ స్థలములలో దానము లొనరించెనో తెలుపబడి యున్నది.

సీ॥ భీమాపురము, దాకరేమి, యమరడాలు
గుడిపూడియును, పాలకొలన, వీర
భద్రేశ్వరంబును, భావపట్టును, తామ్ర
పురి, పిష్టపురమునం బరగు దూబ
ఘంటశాలా పురిం గౌతరంబునను నే
లేశ్వరంబునను, వేగేశ్వరమున
విజయవాటిక, నుండవల్లిని, వేల్పూర
గర మొప్ప గుంటూరి, కడలుపల్లి

తే. గీ. కనక వలయములును, ఘన లోహ వరదండ
ములు నఖండ దీపములునుఁ బెట్టి
మరలఁ బెక్కు గుడులుం జెఱువులు గుంటూర
నిలిపె మంత్రి మంత్రి యలఘు భుజుఁడు.

పై పద్యమున పేర్కొనపడిన స్థలములు :

భీమాపురము = భీమారామము (చాళుక్య భీమవరము), దాకరేమి = ద్రాక్షారామము, అమరడాలు = అమరారామము, గుడిపూడి = సోమారామము, పాలకొలను = క్షీరారామము, వీరభద్రేశ్వరము = పట్టిసము, భావపట్టు=బాపట్ల, తామ్రపురి = చేబ్రోలు, పిష్టపురము = పిఠాపురము, ఘంటశాల = గంటసాల, కౌతరము = కౌతవరము, ఏలేశ్వరము = ప్రసిద్ధమైన ఏలేశ్వరోపాధ్యాయులవారి స్థానము, వేగేశ్వరము = వేంగి, విజయవాటిక =

విజయవాడ, ఉండవల్లి = ఉండవల్లి, వేల్పూరు = వేలుపూరు, గుంటూరు = గుంటూరు. కడలువల్లి = కళ్లేపల్లి.

(A. R. 40 of 1912 శా. ప. 2-10. Please see "Lives of Telugu Poets" By N. Venkata Rao. M. A. Page 240 A and B.)

గోకర్ణ దేవచోడుడు నిల్పిన శాసనము-క్రీ. శ. 1127

1. ,, స్వస్తి శ్రీమ త్శచ్చా (చా)
2. ,, శుక్య వర్షము
3. ,, లు౩౩ గుప్లవస (ం)
4. ,, వత్సర ఆసా (షా) డ (ఢ) సు (శు)
5. ,, ౧౧|బుధవారము
6. ,, నాండు స్వస్తి పమది (ధి)
7. ,, గర (త) పంచమహాశ
8. ,, బ్ద మహామండ లే
9. ,, శ్వర వి (ప) రమ (మా) హేశ్వర
10. ,, కోడూపూర్ణ రవ
11. ,, రేశ్వర సూర్య వం
12. ,, శోద్భవ కుళ తిలక
13. ,, కాశ్యపగోత్ర కరికా
14. ,, లాన్వయ నామా
15. ,, ది సమస్త ప్రస (శ) స్తి
16. ,, శ(స) హితము శ్రమ
17. ,, హామండలేశ్వర
18. ,, కందుకూరి గోకన్నర
19. ,, దేవచోడమహారా
20. ,, జులు శ్రీ ఏలేశ్వరదే
21. ,, వర, అంగ భోగరంగ

22. భోగములకూ (కు) ధ (ధూ)
23. పదీప నై వేద్యముల
24. కూం (కుం) జెర కోడూరు ఆ (ఇ చ్చి,)
25. ఆ చంద్రా కర్ణాస్తా (స్థా) ఇ (యి) గా ఈ
26. తి మి ఈ దత్తి ఆ చంద్రా
27. కర్ణముగా నడుపం గల
28. వారు

(Please see "Lives of Telugu Poets" : By N. Venkata Rao M. A. Pages 190-191.)

ఈవిధంగా అనేక శాసనా లున్నాయి. ఇవిగాక అర్చక మాన్యాలు, నర్తకి మాన్యాలు, స్వస్తివాచక మాన్యాలు మున్నగునవి ఎన్నో ఉన్నాయి. ఆగమశాస్త్రానుసారం ఆలయ మర్యాదలన్నీ జరగడం కోసం ఈ మాన్యాలు వెలశాయి.

శ్రీ వైష్ణవం ప్రచారంలోకి వచ్చిన తరువాత వైష్ణవ భక్తులు కూడ తమ ఆలయాలకు మాన్యాలు సమకూర్చారు. అన్నివిధాల అర్చనాపరమైన అవకాశాలు ఏర్పాటు చేశారు. వందల కొలది దేవదాసీలను నియమించారు. ఆంధ్రమహావిష్ణువు రాజధానీ నగరమైన శ్రీకాకుళములో మూడువందల దేవదాసీ కుటుంబా లుండేవి. బౌద్ధక్షేత్రంగా ప్రసిద్ధికెక్కిన ఘంటశాల, తూర్పు గోదావరీ మండలంలోని ద్రాక్షారామము, చిత్తూరు జిల్లాలోని శ్రీకాళహస్తి మున్నగు చోట్ల గల ప్రాచీన శివాలయాలలో కూడ దేవదాసీ లుండేవారు.

శ్రీశైలంలోని మల్లికార్జునస్వామివారి దేవస్థానంలో శృంగనాట్యము జరిగేదట. శ్రీకాకుళంలో ఆరాధనా నృత్యం, మాచెర్ల చెన్నకేశ్వరాలయంలో కేళిక మున్నగు సంప్రదాయాలు పోషింపబడినాయి. అవి క్రమ క్రమంగా పెంపొందాయి.

కూచిపూడి భాగవతులు ప్రగతిపథంలో పయనిస్తూ శైవ, వైష్ణవ సంప్రదాయ నాట్యాచార్యు లయ్యారు. ప్రజాదరణ ప్రభుత్వాదరణ సంపాదించుకున్నారు.

దేవదాసీలు-నాట్యకళ: దేవదాసీల వంశంలో జన్మించినంత మాత్రాన ప్రతివారు దేవదాసి కాజాలరు. అందుకు ప్రత్యేక నియమా లున్నాయి. దేవదాసి అనగా దైవాంశతో జన్మించిందని భావం. ఆలయాలలో ఆరాధనా నృత్యాలు చేయటానికి వీరు మాత్రమే అర్హులు. ఈ నృత్యం కూడా ప్రతివారు అభ్యసించరాదు. స్వామివారి విగ్రహానికి అత్యంత సమీపంలో ఈ నృత్యం చేయ బడుతుంది. ఆగమశాస్త్రాను గుణ్యంగా, ఆలయ విధుల నతిక్రమించ కుండా ఈ నృత్యం సమకూర్చబడుతుంది. ఇతరులు ఈ నృత్యాన్ని అభ్యసించినా గర్భాలయ ప్రవేశం లభించదు.

ఉత్తమ వేశ్యా కుటుంబంలో జన్మించి రూప గుణ సంపన్నత గల బాలికను దేవదాసిగా రూపొందించుటకు చిన్నతనంలోనే ఎన్నుకుంటారు. ముందుగా వ్యాయామంలోను, అడుగులు పట్టడం లోను శిక్షణ ఇస్తారు. ఒక శుభముహూర్తాన నాట్యాచార్యుని తమ గృహానికి ఆహ్వానించి ఆ బాలికను చూపుతారు. ఆయన అవయవ సౌకుమార్యం, గాత్ర సంపత్తి మున్నగు లక్షణాలు పరీక్షిస్తాడు. ఆరాధనా నృత్యానికి ఆమెకు గల అర్హతా నర్హతలు నిర్ణయిస్తాడు. అర్హురాలని భావించితే నాట్యాభ్యాసానికి అంకు రార్పణ చేయిస్తాడు.

ఈ నాట్యాభ్యాసానికి ముందు శంకుస్థాపన చేయబడుతుంది. అనంతరం నవగ్రహ, అష్టదిక్పాలక మంటపారాధనలు చేయిస్తారు. గురుపూజానంతరం శాస్త్రీయ పద్ధతిలో నాట్యం జరుపబడుతుంది. సంగీతం, సంస్కృతం, మాతృభాషలు నేర్పబడతాయి. నాట్య శాస్త్రం, అలంకారశాస్త్రం అధ్యాపనం చేస్తారు. నాట్యాభ్యాసం పూర్తికావడంతోనే నర్తకి తాను స్వయంగా పాడుతూ, భావాను

గుణ్యంగా అభినయించాలి. అది రసోచితంగా, లలిత మనోహరంగా, ఉదాత్తంగా ఉండాలి. ఇప్పటికి ఆమె పదునాలుగు, పదునారు వత్సరాల నవయౌవనవతియై అంగసౌష్ఠవ మేర్పడి యుంటుంది.

ఒక శుభముహూర్తాన, ఒక ప్రసిద్ధ దేవాలయ ప్రాంగణంలో పండిత పరిషత్తు ఆహ్వానింప బడుతుంది. ఆగమశాస్త్ర పండితులు; సంగీత, సాహిత్య, నాట్యశాస్త్ర పారంగతులు ; అలంకార, ధర్మ శాస్త్రవేత్తలు ఆ పరిషత్తు సదస్యులుగా ఉంటారు. వారి సమక్షంలో గురువు నపేక్షింపకుండా నర్తకి స్వతంత్రంగా అభినయించాలి. తన పాండిత్య ప్రకర్షను ప్రదర్శించాలి. అనంతరం ఆమె యోగ్యత ననుసరించి దేవదాసిగా నిర్ణయిస్తారు. అర్హత లభించిన దేవదాసిని ఆ దేవతా సంబంధించిన మఠాధికారులు (శైవ, వైష్ణవ మఠాధి కారులు) ముద్రాంకితాలతో సంస్కరిస్తారు. శైవ నర్తకిగా నిర్ణయింపబడితే త్రిశూల చిహ్నాన్ని, వైష్ణవ నర్తకి అయితే శంఖ చక్రాలను అంకితం చేస్తారు. ఈ తతంగమంతా పూర్తి అయిన తరువాత, ఆయా దేవతాసంబంధమైన మహామంత్రోపదేశం చేయ బడుతుంది. ఇదంతా ఆలయ ప్రాంగణంలో పండిత సమక్షంలో సమంత్రకంగా జరుగుతుంది. ఇపుడు ఆ నర్తకి దేవదాసియై ఒక శుభముహూర్తాన గర్భాలయ ప్రవేశం చేస్తుంది.

భగవంతునికి పుష్పాంజలి సమర్పించే అధికారం, అర్హత దేవదాసికే ఉంది. ఇతరుల కిది లేదు. తన యౌవనమంతా ఆ దేవునకు జన్నికట్టి, ఆయననే తన సర్వస్వంగా భావించి సేవించుతూ, పవిత్రంగా జీవితమంతా గడపాలి. వీరికి సమాజంలో గౌర వాదరాలు, ప్రతిష్ఠలు అధికంగా వుండేవి. వీరు ప్రదర్శించే నాట్యాలు స్థూలంగా రెండు విధాలు. 1. ఆరాధనానృత్యం 2 వినోద నృత్యం.

**ఆరాధనా నృత్యం :** ఈ నృత్యం కుంభ హారతితో ప్రారంభ మవుతుంది. తరువాత పుష్పాంజలి. అటుపిమ్మట భక్తిపరమైన

పదాలు, కీర్తనలు అభినయింపబడతాయి. నర్తకికి సహాయకులుగా సమర్థుడైన నాట్యాచార్యుడు, మార్దంగికుడు ఉంటారు. ఈ ముగ్గురకు 'మేళం' అను సమూహనామ ముంటుంది. యాజ్ఞికుడు ఆగమశాస్త్రనుసారం ఆ దేవతా సంబంధమైన వాద్యాలు, తాళాలు, రాగాలు, నృత్యాలు, ముదలు సమకూర్చి యిస్తాడు. తదనుసారంగా నర్తించాలి. దినమున కొకరు చొప్పున సంవత్సరమంతా పూర్వం ఆలయాలలో దేవదాసీలు ప్రదర్శించేవారు. అనగా ఈనాడు అభినయించిన నర్తకి, మరల సంవత్సరానికి వంతుప్రకారం నర్తించేది. ఈమధ్యకాలమంతా శాస్త్రవిషయాలు అధ్యయనం చేసేది. పండుగలు, పర్వదినాలలో జట్లుజట్లుగా అందరు అభినయించేవారు. ఆంధ్రదేశమంతటా శైవ వైష్ణవ దేవాలయాలలో ఈ దేవదాసీలు నియమితులై ఉండేవారు. వీరి మేళాలకు మాన్యాలు ఏర్పాటయి ఉండేవి. ప్రతినర్తకికి ఒక్కొక్క మేళం ప్రత్యేకంగా ఉండేది.

వినోద నృత్యం : దీనిని "కేళిక, కీర్తన, హరికథ" అని అనే వారు. కాలాంతరంలో ఇది కలాపంగా, యక్షగానంగా రూపొందింది. ఆరాధనా నృత్యానికి అర్హులుకాని వేశ్యకాంతామణులు ఈ నృత్యాలు అభినయించేవారు. అందచందాలలో నేమి ; అభినయ, శాస్త్రాది విషయాలలోనేమి వీరు దేవదాసీల కంటె తక్కువ వారుకారు. కాని, ఏవో స్వల్పమైన లోపాలవల్ల, దేవదాసీత్వానికి అనర్హులయ్యారు. అందువల్ల వినోద నృత్యానికి అంకితులయ్యారు. వీరి ప్రదర్శనాల ప్రధాన ఉద్దేశ్యం వినోదప్రధానం.

ఈ వినోదనృత్యం రాజాధిరాజుల, సంస్థానాధీశ్వరుల ఆస్థానాలను ఆశ్రయించింది. అభినయదర్పణం, భరతశాస్త్రం, భరతార్ణవం, భరతసారసంగ్రహం, సంగీతరత్నాకరం మున్నగు శాస్త్రాలు ఆధారంగా అభినయాన్ని రామాయణ, భారత, భాగవతాది గ్రంథాలు ఆధారంగా ఇతివృత్తాని గ్రహించి ఇది రూపొందింపబడింది. కాలక్రమంగా జయదేవుని అష్టపదులు, క్షేత్రయ్యపదాలు,

నారాయణతీర్థులవారి తరంగాలు, జావళీలు మున్నగు ప్రక్రియలన్నీ చోటుచేసుకున్నాయి. ఈ నృత్యాన్ని అభినయించే నర్తకీమణులకు దేవదాసీలకు వలె కఠిన నియమాలు ఉండవు. సంపన్నులు, మహారాజులు వీరిని పోషించేవారు.

ప్రత్యేకించి స్త్రీలతో గూడిన మేళాలు 'సట్టువమేళా' లని, పురుషులతో గూడినవి 'నాట్యమేళా'లని అనేవారు. దివితాలుకా శ్రీకాకుళం, ఉభయగోదావరీమండలాలు, విశాఖ జిల్లాలో ఉన్నన్ని మేళాలు ఆంధ్ర దేశంలో మరెక్కడా లేవు. కృష్ణాజిల్లా కూచిపూడి నాట్యమేళాకూడ ప్రసిద్ధిలో ఉండేది.

'కేళిక' అను నృత్యప్రక్రియలో కాలానుగుణ్యమైన పరిణామం ఏర్పడింది. ఏకపాత్రాభినయం, బహురూపాభినయాలు గాను; కీర్తనలు, పదాలు, భారత, భాగవత, రామాయణాదుల నుండి కథలు, గాథలు గ్రహించి కలాపాలు, యక్షగానాలుగాను రూపొందినాయని వెనుక చెప్పుకున్నాం. కాని ఈనాడు అవి ఆనాటి రూపాలను కోల్పోయాయి.

దేవదాసీలు దేవాలయాల్లో కుదురుకొని అన్యజనదుర్లభు లయ్యారు. మిగిలినవారు రాజాధిరాజుల సంస్థానాలలో నెలకొని సామాన్యజనుల కందుబాటులో లేకుండాపోయారు. వీరి కళాతృష్ణ తీర్చడానికి ఇతరులుకూడ నాట్యకళ నభ్యసించారు. ఏనాది, ఎరుకల, చిలక, కోటకొండ, జంగం, గంటె, దాసరి భాగవతులు మున్నగు వారంతా ఇట్టివారే. వీరు అన్నివిధాలప్రక్రియలు అభినయించే వారు. అందరికివలెనే ఈనాడు వీరికి ఆదరణ తగ్గింది.

శ్రీకాకుళం, విశాఖ జిల్లాలలోను, కూచిపూడిలోను ఉన్న భాగవతు లందరు పురుషులే. వీరి కలాప, యక్షగానాలలో ఇటీవలి వరకు స్త్రీలకు స్థానంలేదు. స్త్రీపాత్రకూడ పురుషులే ధరించి మనోహరంగా అభినయించేవారు. ఆధునిక నాట్యాచార్యులు

కొందరు ప్రత్యేకించి స్త్రీలచేతనే అభినయం చేయిస్తూ పురుష పాత్రలు కూడా ధరింపచేస్తున్నారు.

భాగవతులు ప్రదర్శించే కలాపాలు చాలా ఉన్నాయి. ఈ కలాప శబ్దం ఎప్పుడు ఎలా ఏర్పడిందో తెలియదు. సిద్ధేంద్రయోగి రచించినది 'హరికథ' అని స్వయంగా గ్రంథంలో చెప్పుకొన్నా, దానిని 'భామాకలాప' మన్నారు. అలాగే 'పిండోత్పత్తి', 'మానస యాగం' అనే గ్రంథం శ్రీభాగవతుల రామయ్యచే రచింపబడింది. దానిని 'గొల్లకలాప'మన్నారు. తరువాత తరువాత 'వంకాయల వారి కలాపం', 'చింతలపాటివారి కలాపం', 'కసింకోటవారి కలాపం' మొదలైనవి అవతరించాయి. శ్రీ సిద్ధేంద్రులవారి భామాకలాప మని చెప్పబడుతున్న హరికథకు, ఈనాటివారు ప్రదర్శించే భామా కలాపానికి సంబంధంలేదు. దీనిలో ఎన్నో మార్పులు, చేర్పులు జరిగాయి. ఈ విషయాన్నిగూర్చి ముందు ప్రకరణంలో చర్చింప బడుతుంది.

కూచిపూడి భాగవతులు కృష్ణాజిల్లాలోని మొవ్వ, ఘంటశాల, శ్రీకాకుళం, మేడూరు, గుడివాడ, నంగెగడ్డ, గుంటూరు జిల్లాలోని రేపల్లె, తెనాలి, గుంటూరు, పొన్నూరు, ఉభయగోదావరి జిల్లాలలోను, ఇంకా పలుప్రాంతాలలోను ప్రఖ్యాతి వహించారు. స్థానిక దేవదాసీలకు నాట్యాచార్యత్వము వహించారు. కాలక్రమేణ ఈ నాట్యప్రయోగ పద్ధతులలో మార్పులు వచ్చాయి.

" ఆత్మమధ్యగతః ప్రాణః । ప్రాణమధ్యగతో ధ్వనిః ।
ధ్వనిమధ్యగతో నాదః । నాదమధ్యేసదాశివః ।"

"...సాని ఈశానినైమె మహోత్సవములందు
కేల నవచంద్రకాంతపుఁ గిన్నెపూని
వీథి భిక్షాటన మొనర్చు వేళ జేయు
మరులు నృత్యంబు జగముల మరులు కొలుపు."

(శ్రీనాథుడు-భీమఖండము)

నాయకరాజులు - నాట్యకళ : క్రీ. శ. 1529-'42 మధ్య కాలంలో నరసరాయల మూడవ కుమారుడు అచ్యుతరాయలు విజయనగరాన్ని పాలించాడు. ఈకాలంలో మధుర నుండి తంజావూరు వేరుచేయబడింది. 1535 లో అచ్యుతరాయలకు తోడల్లుడు, తిరుమలాంబ చెల్లెలి భర్త అయిన చెవ్వప్పను తంజావూరునకు, విశ్వనాథనాయకుని మధురకు అధిపతులుగా నియమించారు.

చెవ్వప్ప మరణానంతరం కుమారుడు అచ్యుతప్ప క్రీ. శ. 1561-1614 వరకు రాజ్యాన్ని పాలించాడు. అపుడు వేంకటపతి రాయలు చంద్రగిరిని పరిపాలిస్తూ ఉండేవాడు. ఈయన అచ్యుతప్ప నాయకునకు అన్నివిధాల సహాయ సహకారాలు అందించేవాడు.

అచ్యుతప్పనాయకుడు రసికశిఖామణి. కళాభిమాని. కళాపోష కుడు. గత అర్ధశతాబ్ది నుండి ఈ ప్రభువుల ఆదరాభిమానా లందు కొంటున్న కూచిపూడి భాగవతులు ఒకమారు 'కేళిక' ప్రదర్శించారు. ఆ ప్రదర్శనకు సంతసించి అచ్యుతప్పనాయకుడు వారిని తమ ఆస్థాన నాట్యాచార్యులనుగా నియమించాడు. ఇంతేకాక ఒక అగ్రహారాన్ని కూడా దానం చేశాడు. భుక్తికి మాన్యాలు కల్పించాడు. ఆ అగ్రహారం 'అచ్యుతప్ప' అగ్రహారంగా ప్రసిద్ధి పొందింది. ఈనాడు 'మేలట్టూరు'గా నామాంతరం ధరించింది. అచటి భాగవతులు మేలట్టూరు భాగవతు లయ్యారు. వీరి గృహనామాలు కొంత కాలం క్రిందటి వరకు యథాపూర్వంగానే ఉండేవి. కాని కారణాం తరాలవలన ఇప్పు డవి మార్పుచెందాయి. అయినా గోత్రనామాలు మాత్రం మారలేదు. మాతృభాష తెలుగుగానే ఉండిపోయింది. దక్షిణందేశంలో మేలట్టూరు కూచిపూడి నాట్యకళా సరస్వతీ పీఠంగా వెలుగొందుతోంది.

అచ్యుతప్పనాయకుని తరువాత ఆయన కుమారుడు రఘు నాథరాయలు క్రీ. శ. 1614 లో తంజావూరు రాజపీఠాన్ని

అధిరోహించాడు. నాయకరాజు లందరిలోను అశేష శేముషీధురం ధరుడు. ఈయన పరిపాలన సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయల పాలనను తలపించింది. ఈయన లలితకళా విశారదుడు, పోషకుడు. స్వయంగా 'వాల్మీకి చరిత్ర' అను నవరస భరితమైన ప్రబంధాన్ని రచించిన మహాకవి. ఆయన కవిత ద్రాక్షాపాకంలా ఉంటుంది.

"చెప్పవలెఁ గప్పురంబులు
కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపై
గుప్పిన క్రియ, విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలన్" (1-15)

అని తన కృతులలో వెలయింప జేసిన రసహృదయుడు. శ్రీకృష్ణదేవరాయలవారి సాహితీసభ భువనవిజయం కాగా ఈయన సాహితీసభ ఇందిరా మందిరం. ఇది కళామతల్లికి విహార భూమి. కవి, గాయక, నాట్య, పండిత శిరోమణులతో విరాజిల్లుతూ ఉండేది. ప్రధానమంత్రి గోవింద దీక్షితుడు. ఈయన రాజకీయ చతురుడే కాదు, పదవాక్య ప్రమాణ పారావారపారీణుడు. అద్వైత విద్యాచార్యుడు. షడ్దర్శన పారగుడు. "సంగీత సుధానిధి", "సాహిత్యసుధ" మున్నగు గ్రంథా లనేకం రచించిన మహామనీషి.

కవి పండిత కళావేత్తలతో కొలువుండి రఘునాథరాయలు భువనమోహనంగా భాసించేవాడు. ఈయన సంగీత సాహిత్య నాట్యకళా వైదుష్యం అమేయం. "సంగీతసుధ" అను ప్రామాణిక సంగీతగ్రంథాన్ని రచించాడు. "జయంతసేనము" అను క్రొంగ్రొత్త రాగాన్ని ప్రతిపాదించాడు. "రామానందం" అను విలక్షణ తాళాన్ని ఆవిష్కరించాడు. "రఘునాథమేళ" అను మేళాంతరాన్ని తన పేరు మీద సృష్టించిన మేళకర్త.

ఈయన బాల్యంలో ఆశువుగా "పారిజాతాపహరణం" అను ప్రబంధాన్ని చెప్పి, కవితావైదుష్యాన్ని ప్రదర్శించి తండ్రి

అచ్యుతప్ప నాయకునిచే కనకాభిషేక గౌరవమందుకొన్న ఘనుడు. పితృఋణం తీర్చుకోవడంకోసం, ఆయనను నాయకునిగా చేసి "అచ్యుతాభ్యుదయం" అను ద్విపద కావ్యాన్ని సంతరించాడు. ఈయన కవి గాయక నాట్యకళా వేత్తలకు కల్పతరువు వంటివాడు.

ప్రధానామాత్యులు గోవింద దీక్షితులవారి పెద్దకుమారుడు యజ్ఞనారాయణ దీక్షితుడు. ఈయన రాయలవారి శిష్యుడు. "సాహిత్యరత్నాకరం" అను అలంకార గ్రంథాన్ని రచించాడు. చేమకూరవంటి కవివతంసుడు, రామభద్రాంబ, మధురవాణి వంటి కవయిత్రులకు సమకాలికుడు.

**విజయరాఘవ నాయకుడు:** రఘునాథరాయల తరువాత క్రీ. శ. 1633–1677 వరకు ఆయన కుమారుడైన విజయరాఘవ నాయకుడు రాజ్యపాలన చేశాడు. ఈయన సంగీత సాహిత్య నాట్య నాటక యక్షగాన కళాకోవిదుడు. వైష్ణవమతాన్ని విశేషంగా ఆదరించాడు, అభివృద్ధి పరచాడు. ఆలయాలలో నాట్య సంగీత సభలు జరిపించాడు. ఈయన కాలంలో మధురభక్తి ప్రచారం లోకి వచ్చింది. ఆంధ్ర సాహితీ సరస్వతి సంభోగ శృంగారాన్ని ఆశ్రయించింది. కవులు ఈయనను భూలోకమం దవతరించిన రాజగోపాలదేవునిగా అభివర్ణించారు. స్వయంగా అనేక యక్ష గానాలు రచించి అభినయింప చేశాడు. నాటకరచనా విధానంలో భరతవాక్య ప్రక్రియను ప్రవేశపెట్టిన సంస్కారాభిలాషి.

విజయనగర సామ్రాజ్య పతనానంతరం, సాహితీ సరస్వతి దక్షిణదేశానికి తరలి వెళ్ళింది. పరంపరాగతములైన 'అభిలషితార్థ చింతామణి', 'సంగీత చూడామణి', 'సామ్రాజ్య పీఠికాతంత్రం' తంజావూరు చేరుకున్నాయి. ఆలయనిర్మాణాలు, రంగస్థల నిర్మాణాలు విరివిగా జరిగినాయి. సంస్కృత, ఆంధ్ర, ద్రవిడ కావ్య సౌధాలు నిర్మింపబడినాయి. కవితాగోష్ఠులు, సంగీతసభలు, నృత్య యక్షగాన ప్రబంధ ప్రదర్శనలు, ఒకటేమిటి అన్నివిధాల కళలు ప్రదర్శింప

బడినాయి. విజయనగర సామ్రాజ్యాన్ని ఆశ్రయించిన లలితకళాకారులు, పండితవర్యులు తంజావూరు చేరుకున్నారు. 'అష్టభాషా కవితా సర్వంకషమనీషావిశేషవిశారద', 'రాజనీతివిశారద,' 'శారదాస్వరూపిణి' అనబరగిన రంగాజమ్మ ఈయన ఆస్థాన విదుషీమణి. గౌరవాభిమానాలు చూరగొన్న తరుణీమణి. కనకాభిషేక సన్మానాలతో పాటు అర్ధాసన మర్యాద లందుకొన్న చతుర శిఖామణి.

గతకాలంనాటి కళా సాహిత్య గౌరవ మర్యాదలు ఈయన కాలంలో పతనమైనాయి. సాంఘికవ్యవస్థ తారుమారైంది. భోగవిలాసాలు ప్రబలిపోయినాయి. కళాపోషణ, సాహిత్యపోషణ జరిగింది. కాని ఔచిత్యం దిగజారింది. విచక్షణ అంతరించింది. వివేకం అడుగంటింది. సంభోగ శృంగారం ప్రధానమైంది. పవిత్రాశయంతో అవతరించిన లలితకళలు మైలపడిపోయాయి.

ఒకనాడు గర్భాలయ గౌరవాన్ని పొందిన ఆరాధనా నృత్యాదులు పవిత్రత కోల్పోయినాయి. ప్రభువుల విషయలోలు పత్వానికి దేవదాసీలు బలి అయ్యారు. వారు పడుపు పడతులయ్యారు. భగవంతుని స్తోత్రపాఠాలు దూరమై మహారాజుల కీర్తి కీర్తనలు ప్రచారా న్నందుకొన్నాయి. ఈకాలం పవిత్ర లలిత కళలకు భరతవాక్యం, ప్రభువుల కీర్తి గానానికి నాంది అయింది. ఆంధ్రుల సాహితీ సంస్కృతుల కిది పతన స్థితి. విజయరాఘవుని 'విప్రనారాయణ' యక్షగానాన్ని తిలకిస్తే ఈ విషయం బోధపడుతుంది.

పదం - కాంభోజి - ఆటతాళము

విప్రనారా : ద్రావిడ వేదము చదివినవాడనే
ధవళాక్షీ ! నీవు నన్నేలవే ।
దేవదేవి : ద్రావిడవేదము చదివినవారు, కం
దర్పుని వేదము విందురయా ।

విప్ర : అంగన! మన్నారు దళిగ ప్రసాదమా
పొంగలి చవిగొన్నానే!

దేవ : పొంగలి చవిగొన్నవానికి వనితల
ఎంగిలి చవి మనసాయెనా!

విప్ర : ఆరామకైంకర్య మాచరించి మన్నారుని
గొలిచినవాడనే!

దేవ : ఆరామకైంకర్య మాచరించెడి వాని
కీ రామకైంకర్య మేలనయా!

విప్ర : చెలువ! మన్నరు పాద తులసీదళములు
శిరమున ధరియించువాడనే!

దేవ : తులసీదళములు ధరియించు వానికి
తొలుతటి ముడి పువ్వులేలయా!"

ఈవిధమైన చౌకబారు సాహిత్య ప్రక్రియలు మధుర కవితలుగా ప్రచారంలోకి వచ్చాయి. ఈకాలపు సహృదయ విమర్శక చక్రవర్తి చంద్రశేఖరుడు తన "చంద్రశేఖర చరిత్ర"లో ఈవిధంగా వర్ణించాడు :

"సేరువ వాడవల్లి నరసిమ్ముడి
తీరతమోయి, భోగ మ
మ్మోరుల ఆట సూస్తి: దని ముంగల
దేవుడెంత ? ఇద్దెతో
తీరు; పయానగంటి నొక తిత్తి
గు కిక్కున కూడె; దాని కా
లూరికె మొక్క బుద్దగు, నహో! అను
మూర్ఖుడు చంద్రశేఖరా!"

ఆనాటి భోగమువారిని గూర్చి వివరించాడు. ఇక భాగవతులను గూర్చి :

" రాతిరి సూ_త్తి ఏసములు,
రమ్మ్యముగా గురులాన, బా
గోతుల సత్తెభామ, అనగూడని
తాపము లెల్ల సేసె: మా
పాతుకురాలు రాద, వలపచ్చము ;
రుక్మిణి సుద్ది కిట్ట మం,
చీ తెర గేమిటంచు వచియించును
మూర్ఖుడు, చంద్రశేఖరా ! ".

అని వివరించాడు. కావ్యాలలోను, ప్రదర్శనలలోను అంగ ప్రత్యంగ వర్ణనలు, రసాభాసాలు అధికమైనాయి. శాశ్వతానంద సంధాయకములైన వాటిని కాలదన్ని, క్షణికానందములైన ప్రక్రియల నాదరించారు, ఆరాధించారు. కాలమంతా ఆటపాటలతో గడచిపోయేది.

విరూపాక్షస్వామి అనుగ్రహంతో, విద్యారణ్యుని ఆశీస్సులతో అవతరించిన విజయనగర సామ్రాజ్య వీధులలో, సంస్థానాలలో ఆదర గౌరవాలతో అలరారిన ఆంధ్ర సంగీత సాహిత్య నాట్యకళా సరస్వతి, నాయక రాజుల కాలంలో ఆలయాలనుండి, ఆస్థానాలకు ప్రవేశించింది. శాఖోపశాఖలుగా విస్తరించింది. దేవదాసీల సౌశీల్యాన్ని దోచుకొంది. ప్రభువుల కామతృష్ణ తీర్చింది. తుదకు అపహాస్యం పాలయింది.

" ఆకాశంబున నుండి శంభుని
శిరం బందుండి శీతాద్రి ; సు
శ్లోకంబైన హిమాద్రి నుండి భువి
భూలోకంబు నందుండి యు
స్తోకాంభోధి; పయోధినుండి
పవనాంధో లోకమున్ జేరె, గం
గా కూలంకష, పెక్కుభంగులు
వివేకభ్రష్టసంపాతముల్ !"

— భర్తృహరి

"కాంతా కటాక్ష విశిఖా, న, లునంతి యస్య
చిత్తం న నిర్దహతి కోప కృశానుతాపః
తర్షంతి భూరి విషయాశ్చ న లోభపాశా
ల్లోకత్రయం జయంతి కృత్స్నమిదం స ధీరః."

—భర్తృహరి

సిద్ధేంద్రయోగి - భాగవతులు : కూచిపూడి భాగవతులకు, సిద్ధేంద్రయోగికి అవినాభావ సంబంధం ఉంది. ఈయన అనుగ్రహ విశేషం వల్లనే వీరికి నాట్య సంప్రదాయం లభించిందని, తుదకు ఈయన ఈ గ్రామంవాడే అనేటంత వరకు ఈ సంబంధం పెన వేసుకుంది. ఈ అభిప్రాయాలను బలపరచడానికి అనేక కథలు కూడా ప్రచారంలో ఉన్నాయి. ఈయన కాలాన్ని 11-వ శతాబ్దం వరకు తీసుకు వెళ్లారు. ఇవన్నీ చెప్పుకోనటానికి బాగా ఉండ వచ్చునేమో కాని చరిత్రమాత్రం ఒప్పుకోదు.

లోకానికి తెలియటంకోసం ఆయనకు సంబంధించిన ఒకటి రెండుదంత కథలను వివరించడం అనుచితంకాదని భావిస్తున్నాను. వీటిలో యథార్థాలు పాఠకలోకం నిర్ణయించగలదు.

శ్రీ సిద్ధేంద్రులవారు పూర్వాశ్రమంలో సిద్దయ్య నామధారి. ఈయన కూచిపూడిలోని చింతావారి కుటుంబంలో జన్మించారు. బాల్యంలో చదువు సంధ్యలులేక ఆకతాయితనంగా తిరిగాడు. తలిదండ్రులు ఈయనను పసులకాపరిగా నియ మించారు. ఉపనయన సంస్కారం చేస్తే చదువు సంధ్యలబ్బివంశ గౌరవం నిలుపుతారని భావించి ఆ ముచ్చట జరిపించారు. అయినా ప్రయోజనం లేకపోయింది.

కొంత కాలానికి భాగవతులవారి పిల్లనిచ్చి వివాహం చేశారు. అప్పటికీ ఈయనకు విద్యావ్యాసంగం మీదికి బుద్ధి మరల లేదు. ఒకనాడు ఏ కారణంవల్లనో చదువుకోవాలనే కాంక్ష బయలు

చేరింది. ఎవ్వరితోనూ చెప్పకుండా మూటా ముల్లా సర్దుకొని ఇల్లు వదలి వెళ్లిపోయాడు. సంపూర్ణంగా విద్యల నార్జించిగాని మరలి రాకూడదని నిశ్చయించుకున్నాడట.

సిద్దయ్య జాడ తెలియకపోయేసరికి తల్లిదండ్రులు, అత్త మామలు నూతులు, గోతులు గాలించారు. ఎక్కడ వెతికినా అంతుపట్టలేదు. సంచారం వెళ్లే భాగవత మేళాలవారిని 'సిద్దయ జాడ విచారించి జాబు వ్రాయ' మని ప్రాధేయపడ్డారు. బిడ్డ నిచ్చినవారు, "బుద్ధిమంతుడుకదా అని పిల్ల నిచ్చి పెండ్లిచేసి దాని గొంతుకోశా" మని వాపోయారు. "ఆయువుంటే ఏనాటికైనా తిరిగిరాకపోతాడా! ఇదంతా మేం చేసుకున్న పురాకృత దుష్కృత ఫలం" అని తలిదండ్రులు దురపిల్లారు. కాలం గడిచి పోతోంది. సిద్దయ్య స్మృతిపథంలోంచి జారుకుంటున్నాడు.

సిద్దయ్య కతిపయ ప్రయాణాలు సాగించి కాశీ నగరానికి చేరుకున్నాడు. అదృష్టవశాన అక్కడ ఆయనకు ఒక మహా పండితుని ఆశ్రయం లభించింది. ఆయన సర్వశాస్త్రపారంగతుడే కాదు. అలంకార, అభినయశాస్త్రాలలో నిధి. కృష్ణభక్తుడు. గురు శుశ్రూష చేస్తూ ఓర్పుతో. నేర్పుతో సిద్దయ్య విద్యాభ్యాసం చేస్తున్నాడు. పూర్వజన్మ సంస్కార విశేషంవల్ల అచిరకాలం లోనే సాహిత్యజ్ఞానం అలవడింది. వేదవేదాంగాల, అలంకార, అభినయ శాస్త్రాలు అభ్యసించాడు. సిద్దయ్య గుణగణాలు, మేధా సంపత్తి కాశీపండితులను ముగ్ధులను చేసింది.

సిద్దయ్యను జూచి ఒకనాడు గురువులు ప్రసంగవశాన "కుమారా! నీవు అధీత సకల విద్యుడ వయ్యావు. నీ దేశం విడచి వచ్చి చాలా కాలమైంది. ఇంటికడ నీ తలిదండ్రులు, నీ భార్య దారి కెన్నులు చూస్తూ ఉంటారు. కనుక స్వగృహం చేరుకొని మాతా పితరులను సేవిస్తూ స్వధర్మ కర్మాచరణంతో చక్కగా గార్హస్థ్య జీవితం నిర్వహించుకో" అని హితోపదేశించారు.

తన అంతరాత్మలోని విషయాన్ని గురువులు తమ ముఖతః వెల్లడించినట్లయింది. గురూపదేశానికి సిద్దయ్య సంతోషాంతరంగు డయ్యాడు. గురువుల పాదాలకు అభివాదనంచేసి, ఆశీస్సులు గ్రైకొని గృహోన్ముఖు డయ్యాడు.

ఆ మరునాడు శ్రీకృష్ణజయంతి. కృష్ణవేణీమతల్లికి ఇంత వరకు వరదనీరు తగులలేదు. సిద్దయ్య అంచెలంచెలమీద ఉరకలు పరుగులు వేసుకుంటూ తన గ్రామానికి మరలి వస్తున్నాడు. తలి దండ్రులకు, సమవయస్కులకు, గ్రామస్థులకు తన పాండితీ పటిమ చూపి, ఆశ్చర్యచకితులను చేసి వారి మన్ననలు పొందాలని ఉబలాట పడుతున్నాడు. ఈ సరికి తనభార్య యుక్త వయస్కురాలే. నేత్ర పర్వంగా దర్శనమిస్తుందని ఆమె రూపును తన హృదయఫలకంమీద ఊహా రేఖలతో చిత్రించుకుంటున్నాడు. ఎప్పుడు స్వగ్రామం చేరుకుంటామా అను ఆతురత అధికమైంది. కృష్ణానదీ పశ్చిమతీరాన ఉన్న కొల్లూరు గ్రామం చేరుకున్నాడు. నదికి వరద వచ్చే సూచనలేవీ అప్పటికి కాన రాలేదు. అయినా వరదవచ్చే సమయమే అగుటవలన ఎవరూ సాహసించి ఏరుదాటే ప్రయత్నం చేయడంలేదు. ఎప్పుడో బిళ్లబీటుగా వచ్చిపడుతు దని ఊహించుకుంటున్నారు తీరవాసులు.

సిద్దయ్యకు ఈ విషయాలేమీ పట్టలేదు. నదిని ఉత్తరించి త్వరలో కూచిపూడి చేరుకోవాలనే అభిలాష తొందరించింది. ఎంతోమంది 'ఈ ప్రమాద పరిస్థితిలో ప్రయాణం చేసే సాహసం చేయవల'దని ప్రబోధించారు. వారి మాటలు లక్ష్యపెట్టక నదిలో ప్రయాణం సాగించాడు సిద్దయ్య. ఆవలి తీరాన శ్రీకాకుళేశ్వరస్వామి 'వెంటనే తీరం చేరుకో'మ్మని హెచ్చరిక చేస్తున్నాడు. సిద్దయ నట్ట నడి నదిలోకి చేరాడు. ఇంకా సగభాగం దాటాలి. ఇంతలో ఉవ్వెత్తుగా పరవళ్లు త్రొక్కుతూ వరదనీరు వచ్చి పడుతోంది. అంతకంతకు నీరు పెరుగుతోంది. వెనుకకు మరలి పోవడానికి ఎంత దూరం వెళ్లాలో ముందు తీరానికి చేరుకోవడానికి అంతేదూరం

పోవాలి. కనుక సిద్దయ్య ముందుకు పోవడానికి నిర్ణయించుకున్నాడు. కాని నీరు పుక్కిలింతలుగా వచ్చింది. కాళ్లు పట్టు తప్పాయి. జీవితాశ సడలిపోయింది. ప్రాజ్ఞుడు కనుక ఆతర సన్యాసాన్ని స్వీకరించాడు. కళ్లు మూతలు పడ్డాయి. మైకం క్రమ్మింది. ఏమి జరుగుతోందో తెలియని స్థితి యేర్పడింది. ఒక్క నిమిషంలో తెలివి వచ్చింది. కాలిక్రింద నేల తగిలింది. కనులు తెరచి చూచేసరికి తీరాన్ని చేరుకున్నాడు. భగవంతుని లీలావిలాసానికి అచ్చెరువు పొంది ఆత్మలో ప్రస్తుతించాడు. స్వగ్రామంలో బంధుమిత్రులతో ఆనందంగా కాలం గడుపుమని భగవంతుడు అనుగ్రహించాడని తలపోశాడు. ఇంతలో తాను సన్యసించిన విషయం తలంపుకు వచ్చి తళుక్కున మెరిసింది. ఆశాపాశాన్ని నిర్మోహ ఛురికతో మొదలంట ఛేదించాడు. సిద్ధేంద్రయోగిగా రూపొందాడు.

(శ్రీ పసుమర్తి ఆదినారాయణ)

రెండవ కథనం

చింతా శ్రీధరుడు అనే కుర్రవాడు విద్యాభ్యాసం నిమిత్తం కాశీకి వెళ్లి, స్వదేశానికి తిరిగివస్తూ, అస్సాం దేశంలో కొన్ని సంవత్సరాలు నిలిచిపోయి అక్కడ స్వాములను సేవించి, వారి వలన నాట్యప్రయోగములను కూలంకషంగా గ్రహించి యతియై స్వదేశానికి తిరిగివచ్చాడు. అతడే సిద్ధేంద్రుడు. అస్సాంలో మతాచార్యులు, పీఠాధిపతులు ప్రజలకు ఆస్తిక్యబుద్ధి కలిగించడంకోసం, ధర్మబోధచేయడానికి, పురాణ ఇతిహాసాలనుండి కథలను ఎన్నుకొని, వాటిని రూపకములుగా రచించి, దేశినాట్యరీతుల నన్నింటిని మేళవించి ప్రదర్శించేవారు. నటులకు వారే స్వయముగ క్రమశిక్షణ యిచ్చి, మంచి కట్టుబాట్లతో శిష్యులను తీర్చిదిద్దేవారు.

ధర్మప్రచారమునకు ఇది చక్కని మార్గముగ సిద్ధేంద్రునకు తోచినది. అచటి ఆచార్యుల ఆదేశము ననుసరించి దక్షిణదేశములో ఈ సంప్రదాయాన్ని నెలకొల్పినాడు.

(నాట్యదర్శకుడు శ్రీ వెంపటి సత్యనారాయణ)

## మరియొక అభిప్రాయం

సిద్ధేంద్రయోగి ఎక్కడివాడో ఎవరికీ తెలియదు. ఒకనాడు అకస్మాత్తుగా కూచిపూడి అగ్రహారానికి చేరుకున్నాడు. ఈ అగ్రహారానికి ఉత్తరంగా భీమనది ప్రవహిస్తోంది. ఆ నది ఒడ్డున ఒక వటవృక్ష ముంది. ఆ వృక్షచ్ఛాయను స్వాములవారు బడలిక తీర్చుకుంటున్నారు. కూచిపూడి అగ్రహారంలోని బ్రాహ్మణ వటువులు మోదుగ పుల్లలకోసం, దర్భల కొరకు వేదం వల్లన వేసుకుంటూ అక్కడకు చేరుకున్నారు.

స్వామి సిద్ధేంద్రయోగి వారి వేదగానానికి అబ్బురపడి "మీదేవూరు?" అని ప్రశ్నించారు. ఆ బాలకులు స్వాముల వారికి సాష్టాంగదండప్రణామములుచేసి వారిని తమవెంట అగ్రహారానికి గొని వచ్చారు. సిద్ధేంద్రులవారికి వారి వినయ సంపత్తి, గానమాధుర్యం మైమరపించాయి. ఇంతకంటె కూడ ఆ అగ్రహార వాతావరణం, వారి ఆదరణ, ఆచార సంపత్తి, ఆత్మీయత, కళావేతృత్వం, ప్రియత్వం ముగ్ధుడిని చేసాయి. ఒక బాలుడు ముందుగా ఆ అగ్రహారంలోకి వెళ్లి స్వాములవారు వచ్చిన విషయం పెద్దలకు, సభాపతిగారికి తెలియజేశాడు. వారు స్వామివారికి ఎదురువచ్చి నమస్కరించి, స్వాగత వచనాలతో ఆదరించి, ఆహ్వానించి ఆలయంలోని యజ్ఞశాలలో విడిది యేర్పాటు చేశారు.

సిద్ధేంద్రస్వామి 'భామాకలాపం' అనే శృంగార రసప్రధాన ప్రబంధంగా 'పారిజాతాపహరణ'కథ ఇతివృత్తంగా తీసికొని రచించారు. ఈ ప్రబంధాన్ని ఉచ్చారణా సౌష్ఠవం, సౌకుమార్యం, సౌలభ్యం కల సమర్థులయిన నటకులచేత ప్రదర్శనం చేయించి వైష్ణవ మతప్రచారంతోపాటు తమ జన్మసార్థకం చేసుకోవాలని తగినవారికై అన్వేషిస్తున్నారట. దేవదాసీలు తమ సౌశీల్యాన్ని భంగం చేసుకొన్నారు. అన్యస్త్రీలు ప్రదర్శనానుకూలురుకారు.

ఇది శృంగార ప్రబంధం. అందుచేత పురుష నటుల చేత ప్రదర్శనం చేయించి ఆనందించాలని మహోత్కంఠతో దేశదేశాలు పర్యటిస్తూ కూచిపూడి చేరుకున్నారు. ఇచట వీరిని సందర్శించటంతో తమ సంకల్పం ఫలోన్ముఖమైనట్లు భావించారు.

ఆనాడు సిద్ధేంద్రులవారిని సభాపతిగారు భిక్షకై ఆహ్వానించారు. భిక్షా సమయంలో వారు తమ అభిప్రాయాన్ని బయలుపెట్టి సభాపతిగారి నుండి వాగ్దానం తీసుకున్నారు.

( ఆంధ్రప్రభ సారస్వతానుబంధం. 1954 మే 2. )

సిద్ధేంద్రుడు కూచిపూడి నాట్యాచార్యుడు. విధి నియోగమున సన్యాసి అయినాడు. పూర్వాశ్రమమున ఆతని పేరు ఇంద్ర శాస్త్రి. అతడు పునస్సంధానమునకై తన పుట్టిన ఊరు, అత్తవారి ఊరు నైన కూచిపూడి బయలుదేరి మార్గమధ్యమున కృష్ణానదిలో మనస్సన్యాసము స్వీకరించెను.

('కవిసమ్రాట్' పైడిపాడి సుబ్బరాయశాస్త్రి. స్రవంతి 1972)

## ఆసక్తికరమైన చివరి కథనం

సమీప గ్రామమున సిద్దప్ప యను నొక యనాథ బాలుడుండెను. అతని తల్లిదండ్రు లెవరో తెలియదు. జన్మతః బ్రాహ్మణ బాలుడని మాత్ర మెరుగుదురు. నిరాశ్రయుడు, యథేచ్ఛాసంచారి. దయామయులగు నిరుగు పొరుగు వారు ఎవరో నితనికి ఉపనయనము చేసిరి. ఉపనయన ప్రాధాన్య మెద్దియో సిద్దయకు తెలియదు. ఆరునెలల పసికందు నిచ్చి యతనికి వివాహ మొనర్చిరి. ఆమె నెప్పుడో ఇతడు విస్మరించినాడు. దేవాలయములందుగాని, సభలయందుగాని నాట్యము జరుగుచున్నదని వినుటయే తడవు, అచట సిద్ధమయ్యెడివాడు. ఇతని అమాయకతను చూచి నటకులు సానుభూతి చూపుచుండిరి. వారెచట ప్రదర్శన లిచ్చిన నచట హాజరగుచుండెడివాడు. కాని దేవాలయ పూజాదులు మాత్రము ఇత డొక

పతితుడని నిరసించుచుండిరి. శ్రీకాకుళమున ఆనందతీర్థులవారిచే నెలకొల్పబడిన మఠమొకటి యుండెడిది. రేయంతయు నాట్య, నాటకముల సందర్శనమున జాగరణచేసి విసిగియున్న బాలుడు ఆ మఠములో తలదాచుకొని విశ్రమించుచుండెడివాడు. ఒకరోజున శ్రీకృష్ణుడు తన యుదరమున నాట్యము చేయుచున్నట్లు కలగని హఠాత్తుగా మేల్కాంచెను. "కృష్ణా, కృష్ణా!" యని కేకలు వేయుచు అచట అటునిటు పరుగెత్తుచుండెను. మఠాధిపతి కితని మనః పరివర్తన మర్థమైనది. ప్రసన్నచిత్తుడై యీ బాలుని కనికరించి ఉడిపి నగరమందున్న ప్రధాన మఠమునకు విద్యాసముపార్జనార్థము పంపెను. మరునాడితడేమయినది తెలియదు. క్రమముగ నందరు నతనిని మరచిరి.

ఉడిపి ఆచార్యులీ బాలునకు ఆశ్రమదీక్ష నిచ్చి, ఉత్తమజ్ఞాన మార్గమునకు, విద్యా సముపార్జనమునకు ప్రవేశము కల్పించిరి. కఠినములగు ఆశ్రమ నియమములకు, క్రమశిక్షణకు నలవడిన ఈ బాలుడు ఇరువది సంవత్సరములు నిరంతర కృషి ఫలితముగ వేద వేదాంగములను, షట్ శాస్త్రములను క్షుణ్ణముగా నభ్యసించి పండితుడాయెను. విశాల ఫాలతలము, తీక్ష్ణతేజోవిరాజమానము నగు కన్నుదోయి ఇతని ప్రతిభను వ్యక్తము చేయుచుండెను. నాట్య శాస్త్రము కూడ పాఠ్యక్రమమున నొకభాగము. అతని దేహము యొక్క ప్రతికదలికకూడ నొక శాస్త్రీయమగు ముద్రగ పరిణతి చెందినది. సంస్కృతమున నితడు శ్లోకములను రచించెను. గంధర్వు లను మరపించునట్లుగ గానము చేయగల్గెను. గురుపాదుల యాశీర్వాదమును పొంది స్వస్థానమున కరుదెంచెను. జన్మ స్థాన మెంతయో మార్పుచెందినట్లు కన్పించినది. అతనిని గుర్తించు వారే లేరైరి. అచిరకాలముననే తానెవరైనది వెల్లడించెను. సంపూర్ణ పాండితీ ప్రతిభతో వెలుగు నతనిని ఆ యూరి పెద్దలు సంశయించియు, తుదకు గుర్తించి సన్మానించిరి. నాటినుండియు

సిద్ధప్ప సిద్ధేంద్రుడైనాడు. కృష్ణానది కావలి తీరమున నొక పల్లెటూరు బుట్టినింట నివసించుచున్న భార్యను కాపురమునకు దెచ్చుకొమ్మని పెద్ద లతనిని ప్రోత్సహించిరి. మామగారికి తన యాగమనవార్త పంపెను. ఆ కుటుంబమువారు ఆశ్చర్యము నొందిరి. గర్భాధాన సుముహూర్తమును నిశ్చయించిరి. సిద్ధేంద్రుని ఆహ్వానించిరి. ఇప్పు డతని యర్ధాంగి సంపూర్ణ వికసిత కమలమువలె నున్నది. కృష్ణానదిని దాటి యతడు అత్తవారింటి కేగవలయును. ఆనందపూరితహృదయుడై సునాయాసముగ మహానది నీదికొనుచూ, పవిత్ర నదీజలముపై వీచు శీతల మంద మారుతమునకు తన్మయత జెందుచూ పయనించుచుండెను, ఇంతలో నాకస్మికముగ ఆకాశము మేఘాచ్ఛాదితమైనది. చీకట్లు గ్రమ్మెను. పెనుగాలి వీచదొడగెను. నదీ మధ్యమునందున్న సిద్ధేంద్రుడు వెనుకంజ వేయ నిచ్ఛగింపలేదు. పెద్ద తరంగ మొకటి యువ్వెత్తుగ వచ్చి యతని ముఖమును కప్పివేసెను. ఏమియు కనుపించుటలేదు. మునిగి పోదునను భీతి ఆక్రమించినది. ఇష్టదైవమగు శ్రీకృష్ణుని ప్రార్థించెను. తా నీ యాపద నుండి తరించి బ్రతికినచో సన్యసింతునని మొరలిడెను. భక్తపరవశుడగు శ్రీకృష్ణునిగూర్చి గాన మొనరించెను. ఆతుర సన్యాస స్వీకార చిహ్నముగ యజ్ఞోపవీతమును త్రెంపివేసెను. ఆ క్షణముననే యతడు సర్వసంగ పరిత్యాగి యయ్యెను. అభయ ముద్రాంకితుడగు శ్రీకృష్ణుని భాస్వద్రూపమును సందర్శించుకొనెను. మరునిముసమున అలల తాకిడికి ఆవలి తీరమునకు చేరెను. మామగారి యిల్లు చేరినాడు. తన్ను తానెరిగించుకొనిన పిదప మామగా రతనిని ఆప్యాయముతో కౌగిలించుకొని సన్మానించెను. కుటుంబములోనివా రందరు అతని రాకకు మిగుల సంతసించి తగురీతి నాతనిని గౌరవించిరి. అతనిని అభ్యంజనస్నాతునిజేసి, పంచభక్ష్య పరమాన్నములతో దివ్యభోజన మిడిరి. మనోహరముగా నలంకరింపబడిన గదిలో ప్రవేశించి,

సౌందర్య దేవతవోలె నునుసిగ్గున తలవాల్చి మౌనముద్రాంకిత యగు ప్రియసతిని జూచినాడు. క్రీగంట నామె కొన్ని నిమిషము లతనిని చూచి సంభ్రమాయత్త చిత్తయై, భీతావహయై "సన్యాసి, సన్యాసి" యని కేక లిడినది. ఆ క్షణమందే సిద్ధేంద్రుడు తన యపరాధమును గ్రహించి శ్రీకృష్ణునకు తానొనర్చిన ప్రతిజ్ఞ స్మృతిపథమున మెరయ దేవదేవుని స్తోత్రము చేసెను. సత్యభామా సమేతుడగు యదుకులనందనుడు ప్రత్యక్ష మయ్యెను. అతని యానంద మవధులు దాటెను. దివ్య దంపతులు అదృశ్యులైరి. నేలపై బడియున్న భార్య వదనమండలమున సత్యభామాదేవి ముఖలక్షణములు కనుపించినవి. వైవాహిక విషయ వాంఛలను మరచిపొమ్మని సతి కుద్బోధించి, యతడు గది వెలువడెను. తిరిగి నదినిదాటి శ్రీకాకుళము చేరెను. తనకు గల్గిన దివ్యానుభూతిని గురించి పదేపదే తర్కించినాడు. శ్రీకృష్ణదేవుని ప్రియ రాధ యని ఆచార్యులు ఉడిపియందుండగా బోధించిరి. రాధ ప్రకృతిస్వరూపిణి యని, కృష్ణ పరమాత్మ పురుషుడని. ప్రకృతి తన ప్రభువగు పరంధాముని యధీన, వారి పరస్పరాను రాగమున విషయలౌల్యత లేదని, దివ్యప్రణయమని ఆ ఆచార్యులు నిర్వ చించిరి. క్షణకాల మాలోచనా నిమగ్నుడై యుండ 'విషయ సుఖేచ్ఛ యెందువలన నేర్పడినది' అను ప్రశ్న మస్తిష్కమున బొడమినది. మనుజుని కామ క్రోధ మద మాత్సర్యాదులకు అలాటి ప్రభావ మేల కలిగినది అను ప్రశ్న లుదయించినవి. సృష్టికి మూలము ఆవశ్యకము కావున కామము పాపము కాదు. ధర్మబద్ధమైనపుడు దోషము కానేరదు. ధర్మనిర్వాహణ కిది సాధనము అని అతనికి తోచినది. సత్యభామ ప్రేమ అవధులు లేనిది. పరమపవిత్రము. తన నాథుడు సంపూర్ణముగ తనవాడు కావలెను అని ఆరాధించి, ప్రేమించినది. తన హృదయపద్మాన్ని దేవదేవుని పాదములపై నిడినది. నిష్కళంక పరిపూర్ణప్రేమయు భక్తికి చిహ్నమే. లక్ష్యము ధర్మబద్ధమైనచో అట్టిప్రేమ నిస్స్వార్థము. పాపము కాదు.

సత్యాదేవి ఆశయము తన నాథుడు తన కైవశము కావలెను అని, తాను మాత్రమే పరిపూర్ణ కటాక్షమునకు అర్హురాలు కా గోరినది. పరమాత్మతో తాదాత్మ్యము చెందుటకు ప్రతిజీవియు నూరట చెందుట సహజమేకదా! ఇది నేరమా? ఇదియే భామభక్తి. దీనికే 'మధురభక్తి' అని నామాంతరము. సిద్ధేంద్రుడీ భక్తిభావమునకు మూలపురుషుడు, ప్రతిభక్తుడు తానే భగవానుని ప్రియతమ సతినని, అతడే లోకభర్తయని క్షణకాలమేని ప్రాణేశ్వరుని వియోగము సహింపజాలని సత్యభామ స్థితిలో తానున్నట్లు భావించి తాదాత్మ్యం చెందెను. భక్తి తన్మయములో అనేక గీతములను రచించి గానము చేసెను. ఈ రచనమే 'భామాకలాప' మని పేరు గాంచినది. తన కృతులను తానే గానము చేయుచూ, భక్త్యావేశముతో నృత్యము చేయువాడు. ఆ యూరగల కళాకారులందరును ఆతని గీతములను నేర్చుకొని యాడుచూ, పాడుచూ, గానము చేయుచుండిరి. అప్పటివరకును జయదేవకృత 'గీతగోవిందము' ప్రజాభిమానమును చూరగొని వ్యాప్తియందుండెను. ప్రతివ్యక్తియు తానే రాధననే తన్మయంతో నటించిరి. క్రమేణ భామాకలాపము విస్తృతిచెంది రాధ స్థానమును సత్యభామ యాక్రమించినది. 'తమకును నేర్పవలసిన'దని ఆ యూరి దేవదాసీలుసిద్ధేంద్రు నర్థించిరి. కలాపము నందలి గేయములు కామోద్దీపకములు. దేవదాసీ లిట్టి గేయాభినయమున కలవాటు పడినందున సంఘ నైతిక స్థాయి పతనమైపోగలదన్న భీతివలన వారికి కలాప శిక్షణ నొసగుట కాయన విముఖుడయ్యెను. అందుచే వారి కోరికను త్రోసిపుచ్చెను. అందచందములుగల బ్రాహ్మణ బాలకుల నెన్నిక చేసి వారికీ విద్య నేర్పెను. బ్రాహ్మణు లింతకు పూర్వము నృత్యము చేయలేదు. వారిది ఆచార్యస్థానమే. జన్మతః ఆట పాటల నభ్యసించే పక్షములో కులబహిష్కృతులు అగుదురని వెనుకంజవేయ, ఉడిపి మఠాధిపతులనుండి యనుమతి దెత్తునని, ఈ కలాపము కేవలము ఒక

దైవారాధన విధానమని, నీతిదూరము కాజాలదని, విద్యనేర్చినవారు 'భాగవతు'లను పేర బరగుచూ గౌరవార్హులగుదురని, భామా కలాపము మోక్షదాయకమని కులపెద్దలకు నచ్చజెప్పెను. స్త్రీలు మాత్ర మీవిద్య నేర్చుట కనర్హులు, నిషేధితలు. బ్రాహ్మణ బాలుర నందరిచేత ఆజన్మాంతము ఈ కళావ్యాప్తికే అంకితమై యుండునట్లు ప్రమాణములు చేయించెను. ఈ ప్రతిజ్ఞకు చిహ్నముగ ప్రతి పసిబిడ్డకు కటిప్రదేశమునందు ఒక చిన్న గంటను కట్టించెను. తమ కులపెద్దలచే వెలివేయబడుటచే ఈ ద్విజబాలురకు గ్రామ సమీపమునందుగల యొక బంజరుభూమిలో ప్రత్యేకగృహ నివాసములు కల్పించెను. ఆనాటికే గ్రామాదులలో వారు పర్య టించుచూ ప్రదర్శన లొసగుచుండిరి. వీరికి 'కుచేలు'లని నామ మిడిరి. సిద్ధేంద్రుడు వారికి చక్కటి క్రమశిక్షణ నలవరచెను. ప్రతి నటకుడును వేదశాస్త్రములను క్షుణ్ణముగా నేర్చెను. వీరు త్రికాలముల యందును సంధ్యావందన మాచరింతురు. నాట్యమున కొక నిర్దిష్ట పాఠ్యక్రమమును నిర్ణయించెను. ఈవిధముగ 1350 - 1450 మధ్య కాలమందు వెలసిన సిద్ధేంద్రుడు కూచిపూడి విధానమునకు మూల విరాట్టు.

( నాట్యకళ, 1964, శ్రీ బందా కనకలింగేశ్వరరావు )

శ్రీ బందావారి వ్యాసం అది. వారు సిద్ధేంద్రయోగిని 13-14 శతాబ్దాల వానినిగా పేర్కొన్నారు. ఇక కొందరి అభిప్రాయాలు కూడా చూచి ఒక నిర్ణయం చేయడం మంచిదని భావిస్తున్నాను.

Sree Kuchipudi Nritya Nilayam
Twelfth Anniversary Celebration
1972—'73

It is about the 13th Century A. D. that Siddhendra Yogi evolved a new classical type of Andhra dance, which is today called Bhaamaakalaapam or the Kuchipudi Natyam named after the village wherein this style was originally initiated and practised. This unique combination of Lalita and Uddhata types and a fusion of pure dance, music and

Abhinaya. It is only in the Andhra country that we find that the dancers use Vachikabhinaya also while dancing. The Kuchipudi dancers later had taken up Yakshaganams or dance-dramas. Kshetrayya composed padas extensively for use in dance. The Andhra dancers influenced the other dance forms in the south through their tours and stay at the Tanjore courts.

"సిద్ధేంద్రయోగి 14 వ శతాబ్ద ప్రాంతమువాడు"

(నృత్యభారతి పీఠిక. 'కవి సమ్రాట్' పైడిపాటి సుబ్బరాయశాస్త్రి)

"సిద్ధేంద్రయోగి విధిగా క్రీ.శ. 16-వ శతాబ్దికి పూర్వుడగును. అనగా క్రీ. శ. 14-వ శతాబ్దిలో లేదా 15-వ శతాబ్దిలో చెందినవాడగును."

(భామాకలాపము పీఠిక. శ్రీ. పి. ఎస్. ఆర్. అప్పారావు)

"క్రీ. శ. 1400 సంవత్సర ప్రాంతంలో సిద్ధేంద్రయోగి కూచిపూడి గ్రామంలో నాటక రంగాన్ని స్థాపించి......"

(శ్రీ బి. రజనీకాంతరావు)

"17-వ శతాబ్దిలోను, 18-వ శతాబ్దిలోను ఇహలోక యాత్ర చేసిన శ్రీ సిద్ధేంద్రయోగి........."

(తెలుగుదేశం. 1955 మార్చి 17. శ్రీమతి రుక్మిణీ అరండేలు)

"క్రీ. శ. 17-వ శతాబ్ది ఉత్తరార్ధమునందున్నవాడు."

(శ్రీ విప్పా అప్పారావు)

"క్రీ. శ. 1100 ప్రాంతమువాడనియు, సిద్ధేంద్రయోగి నారయణాశ్రమి యను యతి శిష్యుడనియు కొందరందురు."

(భామ కలాపము. సిద్ధేంద్రయోగి)

ఈవిధంగా సిద్ధేంద్రయోగి కాలాన్ని 11-వ శతాబ్ది మొదలు 18-వ శతాబ్ది వరకు ప్రముఖ విమర్శకపండితులు నిర్ణయించారు. ఆయన జీవితచరిత్రకు సంబంధించిన కథలు చూచారు కదా! ఇక యథార్థ విషయ మేమంటే అంతర్దృష్టి, ఆత్మవికాసానికి తోడ్పడే లలితకళలకు గౌరవ మర్యాదలు కల్పించక వాటి పవిత్రతను, మహాత్మ్యాన్ని గుర్తించని ప్రజలకు,

ప్రభువులకు అభివృద్ధియుండదు అని ఋజువైంది. కళారాధనమే భగవతారాధనంగా భావించి గౌరవించిన దేశం ఆచంద్రార్కం వర్ధిల్లుతుంది. సిరి సంపదలతో తులదూగుతుంది అని మన ఆచార్యుల అభిమతం.

విజయరాఘవుని పరిపాలనాకాలంలో దేశపరిస్థితి అధ్వాన్నంగా ఉంది. ఆచార వ్యవహారాలు మంటగలిశాయి. సంప్రదాయాలు, కట్టుబాట్లు నశించాయి. భోగ విలాసాలు హెచ్చు పెరిగాయి. విశృంఖలత వ్యాపించింది. కళలు గౌరవాన్ని కోల్పోయాయి. పరదేశీయుల దండయాత్రలు అధికమైనాయి. ప్రజలలో ఐకమత్యం అడుగంటింది. ఈ స్థితి మఠాధికారులకు అవమాన హేతువైంది. దేవదాసీలు తమ సౌశీల్యాన్ని కోల్పోవటం నాట్యాచార్యులకు కంటగింపైంది. ఇక ఆ రాజ్యంలో ఉండరాదని నిర్ణయించుకున్నారు. స్త్రీలకు నాట్యకళ నేర్పరాదని నిశ్చయించుకున్నారు. శరీరసౌష్ఠవం, వాచిక స్పష్టత గల పురుషులకే నాట్యకళ నేర్పి, నవచైతన్యాన్ని కలిగించి, ప్రజాశక్తిని ప్రభుశక్తిని సంఘటితపరచి వారి హృదయాల నాకర్షించి ప్రాచీన గౌరవాన్ని పునః ప్రతిష్ఠించాలని అభిలషించారు. తంజావూరుని విడచి దేశం నలుమూలలకు ఈ మఠాధికారులు, నాట్యాచార్యులు బయలు దేరారు. అలా వచ్చి కూచిపూడికి చేరిన నాట్యాచార్యుడు శ్రీ సిద్ధేంద్రయోగి. కూచిపూడివారి ప్రశస్తిగతంలో ఈయన విని యుండటంవలన, వారి ప్రదర్శనల ప్రాశస్త్యం, నీతి నియమాలు ఎరిగి ఉండటం వలన ఇచటికి చేరుకున్నాడు అనేది చారిత్రక సత్యం.

ఇక కాలం విషయంలో విజయరాఘవరాయల కాలం క్రీ. శ. 1633 - 1677. ఈయన తండ్రి రఘునాధరాయల కాలం 1614. ఈయన కాలంలో క్షేత్రయ్య తంజావూరు దర్శించినట్లు చరిత్ర చెబుతోంది. సిద్ధేంద్రయోగి ఈయనకు సమకాలికుడు అని కూడ పరిశోధక పండితులు నిర్ణయించారు. విజయరాఘవ

నాయకుని అస్తవ్యస్త పరిపాలనా విధానాలకు అసంతృప్తి చెందిన ఈ యిరువురు గూడ తంజావూరునందు ఉండుటకు ఇచ్చగించి యుండరు. క్షేత్రయ్య జన్మస్థలమగు మొవ్వకు కూచిపూడి గ్రామము పరిసరమున నుండుటను బట్టియు, ఇచటి భాగవతుల విషయము క్షేత్రయ్యవలన వినియున్నైన సిద్ధేంద్రుడు కూచిపూడి వచ్చియుండును. ఈవిషయములనుబట్టి ఈయన కాలము 1600-1700 అనుట నిర్వివాదాంశము. మిగిలిన విషయములకు ఆధార ములు కన్పించుటలేదు.

భామాకలాపము - సిద్ధేంద్రయోగి : శ్రీ సిద్ధేంద్రయోగీంద్రుడు భామాకలాపాన్ని రచించాడని ఎంతోమంది పండితులు, పామరులు పేర్కొంటారు. కాని కలాప మంటే ఏమో ఇదమిద్ధంగా ఎవరూ నిర్ణయించి వివరింపరు. కొంతమంది 'భామ యొక్క జడ' అంటారు. కొందరు 'ప్రాసంగిక ఇతివృత్తము' అంటారు. దీనివిషయంలో ఇప్పటికీ అనుమానం నివారణ మవటం లేదు.

యథార్థానికి కూచిపూడివారు కేళికలు, కీర్తనలు ప్రదర్శించి నట్లు ఆధారాలు వెనుక పేర్కొనబడినాయి. భాగవతుల కథలు అనగా భగవంతుని సంబంధమైన కథలు ప్రదర్శించి భాగవతు లైనారనికూడా చర్చించుకున్నాం. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో సిద్ధేంద్రయోగి రచించిన 'భామాకలాప' ప్రతి ఉన్నది. దీనిలో ముందుగా విఘ్నేశ్వర స్తుతి, తరువాత సరస్వతీ స్తవం, వెన్నెలపదం పాడుతూ భామా ప్రవేశం, శ్రీకృష్ణు డెక్కడ ఉన్నాడని మందయానను ప్రశ్నించడం, ఆమె 'నీవెవర'వని ఎదురు ప్రశ్న వేయడం, అపుడు, "భామనే సత్యాభామనే..." అను దరువుతో తన పరిచయాన్ని చేయడం జరుగుతుంది. కాగా ఈనాటి భామాకలాపంలో ఎన్నో చేర్పులు, కూర్పులు జరిగాయి.

ఉదాహరణకు,

"భామనే సత్యా భామనే
భామరో! శృంగార జగదభిరామునే, ముఖవిజిత
హేమా! భామనే, ద్వారకాపురాధుని రామనే,
వయ్యారి, సత్యా,
మదన జనకుని వదలకను నా
యెదను వదముకు, సుగతిరో! మరు
కదన మురుడుగ సలిపి నె
మ్మది ముదము గదియగ నున్న సత్యాభామ!"

(శ్రీ సిద్ధేంద్రయోగి)

దీనిని పశ్చిమ గోదావరి జిల్లా, ఆకివీడు గ్రామనివాసి శ్రీ మంగు జగన్నాథ పండితుడు పల్లవి మాత్రం అలాగే ఉంచి చరణాలకు పూర్తిగా రూపాంతరాలు కల్పించారు.

"భామనే సత్యా భామనే
వయ్యారి సత్యా భామనే
భామనే పదియారువేల
కోమలు లందరిలోన
రామరో! గోపాలస్వామికి, ప్రేమదామమైన ముద్దుల
భామ!"

(శ్రీ మంగు జగన్నాథ పండితుడు)

ఇంతేగాక సిద్ధేంద్ర రచించిన పెన్నో దరువులను మార్చి తానే ఆ గ్రంథాన్ని రచించినట్లు,

"శ్రీమదుభయకవి రచిత అభినవ పారిజాత నవరసాలంకార శోభిత శ్రీమత్ భరద్వాజసగోత్ర తిమ్మయనామ సత్పుత్ర, బాధూలాన్వయ గోత్ర, శ్రీ మత్కందాళ వేంకటార్య కటాక్షాంచిత, శిష్యవర్గ, మంగు కులోద్భవ, శ్రీ జగన్నాథ నామధేయ, శ్రీమన్ మహాకవి సిద్ధేంద్రయోగి కరుణా కటాక్ష వీక్షితంబైన శ్రీ సత్యభామా విలాసం బను పారిజాత గ్రంథంబు..."

అని అంతమందుగల గద్యలో వివరించాడు. ఇంతేగాక భామ తెరలో ఉండి బయటకు రాక మునుపు జడను తెరపై వేసి సభలోని పండితులను సవాలుచేస్తూ శాస్త్రార్థాలు చర్చించే ఘట్టం శ్రీ వేంకటశాస్త్రి అను పండితుడు ; పద్యాలు, ద్విపదలు, దరువులు శ్రీ వీరేశలింగం అను కవి రచించినట్లు చెబుతారని శ్రీ బి. రజనీకాంత రావుగారు పేర్కొన్నారు. ఇలాగే ఎంతోమంది, ఎన్నోవిధాల భామాకలాపాలు రచించి, సిద్ధేంద్రయోగి విరచితాలుగా ముద్రించి ప్రచారం చేస్తున్నారు. పండితులు, విమర్శకులు వాటిని ఆమోదిస్తున్నారు. అందుచే ఒకే పేరుగల, ఒకే కవి కృతము లన బడే గ్రంథాలలో వైవిధ్య ముంటోంది. ఈనాడు కూచిపూడి భాగవతులు ప్రదర్శించే భామాకలాప మనబడేది ఎంతమాత్రం సిద్ధేంద్రయోగి విరచితముకాదు.

సిద్ధేంద్రయోగి 'పారిజాతాపహరణం' రచించాడని మరి కొందరు విమర్శకులు ప్రచారం చేశారు. అదే 'భామాకలాపమునే పారిజాత'మనికూడా అన్నారు. భామాకలాపం, పారిజాతాప హరణం ఒకటికాదని చెప్పుటకు, దాని అనంతర కథ అనుటకు భామాకలాపంలో :

"భామనే సత్యా భామనే
.....................
అట్టహాసముచేసి, సురల
నట్టి గెలుచుక, పారిజాతపు
చెట్టు దెచ్చి నాదు పెరటను
గట్టిగా నాటించుకొన్న భామనే"

అనే దరువునుబట్టి విదిత మవుతోంది.

క్రీ. శ. 1500 నాటికే కూచిపూడి బ్రాహ్మణ భాగవతులు ప్రసిద్ధినందినారనియు, వారి మేళ మొకటి సంచారములు చేయుచూ దూరదేశములందు గూడ ప్రదర్శనము లిచ్చుచున్నదనియు స్పష్టమగుచున్నది. ఇది విమర్శకుల కందరకు తెలియును, కాని

రాయలవారి వీరనరసింహరాయల ఎదుట కూచిపూడి భాగవతులానాడు ప్రదర్శించిన కేళిక లేదా కీర్తన యొక్క స్వరూపమును గూర్చి మాత్రము ఎవ్వరును బాగుగా ఆలోచించినట్లు కన్పట్టదు. కూచిపూడివారు సంబెట గురవరాజు దుశ్చర్యలనే నాటకముగా కల్పించి ఆ రాత్రి ప్రదర్శించినారని విమర్శకులు అభిప్రాయపడినారు. కాని ఆ యూహ సమంజసముగా కన్పట్టదు. ఇచ్చట కేళిక లేదా కీర్తన అనునది సుప్రసిద్ధమైన భామాకలాపమే. కూచిపూడి భాగవతు లానాడు రాయల సమక్షమున భామాకలాపమునే ప్రదర్శించినారు.

(శ్రీ సి. ఎస్. ఆర్. అప్పారావు, సిద్ధేంద్ర కృత భామా కలాప పీఠిక, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, పు. ii - iii - xv.)

పదిహేనవ శతాబ్దికి పూర్వం ఎక్కువ ప్రచారంలో ఉండినవైన వీరశైవసంప్రదాయాలవారు శివోపాసనకు నృత్త గీతాలను ముఖ్యోపకరణాలుగా ఉపయోగించుకునేవారు. మరి రసికులైన రాజులు, ప్రజలు యథాశక్తిగా, యథాప్రకారంగా ఆట పాటల్లో మునిగి తేలేవారు. కాని ఆ పాటలన్నీ కాలగర్భంలో కలసి మరుగైపోయినాయి.

( వాణి- శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ )

సిద్ధేంద్రయోగి కాలం 1600 - 1700 లు కాగా భామా కలాపం 1500 లలో ఎలా ఆవిర్భవిస్తుందో తోచకుండా ఉంది. కాగా కూచిపూడి భాగవతులను గురించి, వారి పూర్వచరిత్రను గూర్చి స్వయంగా భాగవతులు, మరికొంతమంది ఇతరులు చెప్పిన వాటిలో విమర్శకులు, పండితులు, పరిశోధకులు అనాలోచితంగా పత్రికలలో ప్రచురించి గ్రంథస్థములు చేయుటవలన పరస్పర విరోధ భావాలు ఏర్పడడం సంభవించింది. సాధారణంగా కొందరు 'మా తాతలు

నేతులు ప్రాగారు' అని గొప్పలు చెప్పుకోవడం ఇలాంటివే. ఒకే వ్యక్తిని గూర్చి, ఒకే పండితుడు లేక విమర్శకుడు భిన్న సమయాలలో విభిన్నంగా ప్రతిపాదించడానికి ఇదే కారణం.

గొల్లకలాపము: భామాకలాపాన్ని గురించి, దాని కర్తృత్వాన్ని గురించి ఎన్ని మతభేదా లున్నాయో, ఈ గొల్లకలాపాన్ని గురించి గూడ అన్ని అభిప్రాయ భేదాలు ఉన్నాయి. ఈ కలాపాలు అసంఖ్యాకంగా, ఎన్నో రూపాలలో లభ్య మవుతున్నాయి.

గొల్లకలాప మనగా ఒక గోపికకుగల విజ్ఞానమును ప్రదర్శించే నృత్యనాటకము. ఈ గోపికను ముక్తికాంతగను, నట్టువాంగం సెరపు బ్రాహ్మణుని శివునిగను భావిస్తారు. కలాప శబ్దానికి "వేదవాక్యము, బ్రహ్మవాక్యము, విజ్ఞానము" అని 'శబ్దార్థ కల్పతరువు' నందు అర్థములు పేర్కొనబడినాయి.

పాలు, పెరుగు అమ్ముతూ పల్లెలలోను, పట్టణ వీధులలోను సంచరిస్తూ ఉన్న ఒక గోపికకు, బ్రాహ్మణునకు జరిగిన వాగ్వివాదమే గొల్లకలాపము. ఈ సంవాద రూపకమున హైందవ నాగరికత, మతము, సంస్కృతి, ఆచార వ్యవహారములు, వర్ణవ్యవస్థను గూర్చిన అనేక విషయాలు చర్చకు వస్తాయి.

గొల్లకలాపము - పుట్టుపూర్వోత్తరాలు ఇవి: నూట ఏబది సంవత్సరాలక్రిందట కూచిపూడి భాగవతులు సిద్ధేంద్రయోగి రచించిన 'భామాకలాప'మను శృంగారప్రబంధమును ప్రదర్శిస్తున్నపుడు కృష్ణుడు, సత్యభామ, మాధవి, గోపికపాత్ర లుండేవి. ప్రదర్శనారంభమున గోపిక పాత్ర పాలు, పెరుగుల నమ్ముతూ రంగస్థలిని ప్రవేశించేది. అంతకుపూర్వమే విదూషకుడు రంగస్థల ప్రవేశమొనర్చి ఉండి ఉంటాడు. గోపిక పాత్ర తన నృత్య గానాలతో ప్రేక్షకజనరంజక మొనర్చిన తదుపరి ఆమెతో విదూషకుడు సంభాషణ ప్రారంభిస్తాడు. ఇంతలో కృష్ణపాత్ర ప్రవేశమొనరించి గోపికతో సరసం మొదలు పెడతాడు. గోపిక

కృష్ణునకు నమస్కరించి "దాసురాలితో సరసము వల"దని ప్రార్థిస్తుంది. విదూషకుడు వారిరువురి మధ్య రాయబారియై సంధాన ప్రయత్నములు చేస్తూ తన హాస్యధోరణిలో ప్రజలను వినోదపరుస్తూ ఉంటాడు. ఈ తీరుగా గోపికా కృష్ణుల మధ్య ఆత్మ, పరమాత్మలను గురించిన ఆధ్యాత్మికచర్చలు విదూషకుని హాస్య వ్యాఖ్యానాలతో కొంతసేపు గడచిన పిమ్మట సత్యభామ ప్రవేశిస్తుంది.

(దాక్షిణ్య నాట్యచరిత్ర శ్రీ నటరాజ రామకృష్ణ - పుట 138)

పైన శ్రీ నటరాజ రామకృష్ణగారు పేర్కొన్న గొల్ల కలాపానికి, కూచిపూడివారి గొల్లకలాప మనబడే దానికి చాలా విభేదముంది. దాని రచయిత ఎవరోగాని కూచిపూడి కలాపానికి మాత్రం శ్రీ భాగవతుల రామయ్యగారు. ఈయన బ్రహ్మజ్ఞాని, యోగాభ్యాసపరుడు. ఈయనను వైశ్వదేవం రామయ్య అని కూడా వ్యవహరించేవారు. కాలం 18-వ శతాబ్ది.

ఈ కలాపంలో "పిండోత్పత్తి, యజ్ఞపట్టు" అను రెండు విభాగా లున్నాయి. భామాకలాపంలో వలెనే దీనిలోకూడా ఒకే స్త్రీపాత్ర యుంటుంది. ఆమె భామ. ఈమెకు చెలికత్తెగా, హాస్యగానిగా, కథా సంవిధాతగా సమయానుకూలంగా ఉపయోగ పడుతూ ఒక పురుషపాత్ర ఉంటుంది. ఇతడు బ్రాహ్మణుడు. స్వాతిశయపరుడు. ఈ పాత్రను సాధారణ వ్యక్తి ధరించి రక్తి కట్టించడం సామాన్య విషయం కాదు. ఉద్దండ పండితుడు, వేద వేదాంగాలు ధర్మశాస్త్రాలు చదివి యుక్తిప్రయుక్తులు, స్పష్టమైన ఉచ్చారణ, సమయస్ఫూర్తి కలిగి యుండాలి. సంగీత సాహిత్యాలలో పరిపూర్ణ ప్రజ్ఞావంతుడై ఉండాలి. ఇన్ని గుణాలు కలవాడే బ్రాహ్మణ పాత్రకు అర్హుడై యుంటాడు.

ఈ ప్రదర్శనానికి యవనికలతోను, రంగాలంకరణతోను, నిమిత్తం లేదు. సమర్థుడైన మార్దంగికుడు, సభారంజకా లయిన వాద్యవిశేషాలు ఉంటే సరిపోతుంది. భామ రంగ ప్రవేశం

చేయడంతోనే వాద ప్రతివాదాలు ప్రారంభమవుతాయి.

బ్రాహ్మణుడు : "ఎవరమ్మా మీరు ?" అని ప్రశ్నిస్తాడు.

భామ : గొల్లవారమయా !

బ్రాహ్మ : ఆదివారము, సోమవారము మొదలైన వారము లుంటవిగాని గొల్లవారమేమిటమ్మా !

అని మేలమాడుతాడు. వాక్చాతుర్యం ప్రదర్శిత మవుతుంది. యుక్తిప్రయుక్తులు ప్రయోగింపబడుతాయి. జీవి పుట్టుకకు హేతుభూతమైన "పిండోత్పత్తి, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యాపారాలు, సాధనాచతుష్టయాలు, శమదమాదులు, సత్త్వరజస్తమోగుణాలు, పిండాభివృద్ధి" మొదలగు శాస్త్ర విషయాలు చర్చింపబడతాయి. వాటికి అనుగుణంగా ప్రమాణాలు చూపబడతాయి. వర్ణాశ్రమ ధర్మాలు, వ్యవస్థలు వర్ణింపబడతాయి. అపుడు "మేము బ్రాహ్మణులమే భామా" అని అహంకరిస్తాడు.

భామ : బ్రాహ్మణులైతే శరణు వేడెదను,
బ్రహ్మజ్ఞానము తెలుపుడయా !

అని వేడుకొంటుంది. 'యజ్ఞము' అను విషయాన్ని బ్రాహ్మణుడు ప్రతిపాదిస్తాడు. అగ్నిష్టోమాది కార్యకాలాపాలు విమర్శింపబడతాయి. సోమయాజి లక్షణాలు అభివర్ణించిన తరువాత, అన్నిటికంటె ముఖ్యము, పవిత్రము, అతిప్రధానమైన త్రైత్తిరీమోప నిషత్ప్రతిపాదిత మయిన "మానసయాగము" అను ప్రక్రియ భామచే వివరింపబడుతుంది. భౌతిక విషయాలు, శరీరంలోని షట్చక్రాలు వాటి దళాలు కూడా దాని కనుసంధానింపబడతాయి. బ్రాహ్మణుని అహంకారం ఈ ప్రసంగంతో పటాపంచలవుతుంది. భామా బ్రాహ్మణు లేకమవుతారు.

ఇంతటి మహత్తర విషయాలను రూపకంగా, కలాపంగా రూపొందించారు. శ్రీ భాగవతుల రామయ్య తాళపత్ర గ్రంథం నుండి విద్వాన్ చింతలపాటి లక్ష్మనరసింహశాస్త్రి ప్రతి లిఖించారు.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు పరిష్కరించారు. ఆలిండియా రేడియో, విజయవాడ కేంద్రంవారు రికార్డు చేశారు. 'కళాప్రపూర్ణ' శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు సూత్రధారులుగా, కుమారి శ్రీరంగం గోపాలరత్నం భామగా, కళాప్రపూర్ణ శ్రీ చింతా కృష్ణమూర్తిగారు పర్యవేక్షకులుగా ఇది ప్రయోగింపబడింది. ఇది ఎంతో రసవత్తరమైన ప్రయోగం.

శార్ఙ్గదేవుడు 'సంగీత రత్నాకరం' అను మహోత్కృష్టమైన గ్రంథాన్ని రచించాడు. అది కేవలం సంగీతానికి సంబంధించిన గ్రంథం మాత్రమే కాదు. ఒకవిధంగా నాట్యశాస్త్రం కూడ. ఇది భరతశాస్త్రం తరువాత వెలసినదని ప్రతీతి. దీనిలో "1. స్వరగతాధ్యాయం 2. రాగవివేకాధ్యాయం 3. ప్రకీర్ణాధ్యాయం 4. ప్రబంధాధ్యాయం 5. తాళాధ్యాయం 6. వాద్యాధ్యాయం 7. నర్తనాధ్యాయం" అని ఏడు అధ్యాయాలున్నాయి. చివరి అధ్యాయమైన నర్తనాధ్యాయంలో నాట్యశాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలు పేర్కొనబడినాయి. "పిండోత్పత్తి" ప్రకరణం దీనిలో అభివర్ణింపబడింది. కూచిపూడి పిండోత్పత్తి, యక్షపట్టునకు ఇది మాతృక అనడంలో సందేహంలేదు. ఈ విషయాన్ని శ్రీ నటరాజ రామకృష్ణ కూడ అంగీకరించారు.

ఆంధ్రదేశంలో గొల్లకలాపాలు చాలా ఉన్నాయి. కూచిపూడిలో శ్రీ భాగవతుల రామయ్యగారు రచించిన కలాపానికి వ్యాఖ్యలతో, తెలుగు పద్యాలతో గూడినవి రెండున్నాయి. ఇవిగాక యితరులు రచించినవి కూడా ఉన్నాయి. కొందరు కవయిత్రులు కూడ రచించారు. వారిలో శ్రీమతి తరిగొండ వేంకమాంబగారు ఒక కలాపాన్ని సృష్టించారు. ఈ కలాపంలో ప్రత్యేకించి యాదవులను గూర్చిన వర్ణన లున్నాయి.

తంజావూరు నేలిన తులజాజీ తరువాత అతని తమ్ముడు అమరసింహుడు అధిపతి యయ్యాడు. ఆయన మంత్రి శివరామయ

ప్రోత్సాహంతో మాతృభూతయ్య అను దక్షిణాది కవి ఒక పారిజాతాపహరణ యక్షగానం రచించాడు. దానిలో గొల్లకలాప ధోరణులు గోచరిస్తాయి. చల్లనమ్మ బోవు గొల్లపడుచు,
"ముక్కర శుక్రుడిచ్చె, నయ మొప్పగ కమ్మలు సూర్యుడిచ్చె, పెం పెక్కిన తారహారములు పేర్మిని చందురు డిచ్చె, నింద్రుడున్ మెక్కువలైన కంకణము లిచ్చెను, పాపటబొట్టు శంభుడున్ చక్కని సూర్య చంద్రులును శారద యిచ్చెను, నాదు చల్లకున్."

"శ్రీ రమ్యమైనట్టి చిక్కని చల్ల
సారస్యమైనట్టి చక్కని చల్ల
కూరిమ కొనరమ్మ కొమరైన చల్ల
భారతి గొన్నట్టి బాగైన చల్ల
శ్రీరమ గొన్నట్టి చెలువైన చల్ల
పార్వతి గొన్నట్టి పరువైన చల్ల
నవ్వుచు గొనరమ్మ నా చేతి చల్ల
నల్లావు పితికిన నయమైన చల్ల
తెల్లావు పితికిన తేటైన చల్లన...
........................."

అను వర్ణనలతో గూడిన పెన్నో ఉన్నాయి.

ఈ కలాపాలు ఉభయ గోదావరి జిల్లాలలో ఎక్కువగా ప్రదర్శింపబడేవి. శ్రీమతి చిత్తజల్లు వైదేహి, పెద వేంకటరత్నం, చిన వేంకటరత్నం, లక్ష్మీకాంతం, ఇందువదన మున్నగువారు ప్రసిద్ధిపొందిన నట్టువరాండ్రు. వీరికి సహాయకులుగా తణుకు, వెలగదుర్రు వాస్తవ్యులైన బ్రాహ్మణులు నట్టువాంగం నడిపేవారు. వీరు పండితులు. వీరిలో శ్రీ రావూరి కామయ్యగారు సుప్రసిద్ధులు. వీరి తరువాత సూరయ్యా, వేంకయ్యా, సత్యనారాయణగారలు ఆధిపత్యం వహించారు. శ్రీ కామయ్య హాస్యకళానిధి. ఈయన నైపుణ్యం మిగిలిన వారికి అబ్బలేదు.

శ్రీమతి చిత్తజల్లు వైదేహి పంచకావ్యాలు, నాటకాలంకార శాస్త్రాలు సంప్రదాయసిద్ధంగా శ్రీ పురాణపండ వేంకటశాస్త్రి గారి కడ అభ్యసించిన విదుషీమణి. "ఈమాత్రం సంస్కారమైనా లేకుండ భామాకలాప, గొల్లకలాప నాట్యప్రదర్శన లివ్వడం అవివేకం" అంటుంది ఆమె. ఈమెకు సంస్కృతభాషా పాటవంతోపాటు, మాతృభాషా పరిజ్ఞానం కూడ ఉన్నది. కనుక ఆమె ప్రదర్శనలు రసవంతంగా ఉండేవి. ప్రసిద్ధి నార్జించి సన్మానాలు పొందింది.

(శ్రీ) రామయ్య పరమపదించిన తరువాత శ్రీ చదలవాడ కుమారస్వామి సూత్రధారిత్వం నిర్వహించారు. వారి అనంతరం భీమవరం తాలూకా, ఉండి అగ్రహార వాస్తవ్యులు శ్రీ కొండూరి విశ్వనాథం ఆ బాధ్యత వహించారు.

కూచిపూడి అగ్రహారంలో శ్రీ వెంపటి వేంకటనారాయణ, శ్రీ భాగవతుల రామయ్య, శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి, శ్రీ భాగవతుల విస్సయ్య, శ్రీ తాడేపల్లి పేరయ్య, శ్రీ చింతా వేంకటరామయ్య మున్నగు వారలు భామాకలాప, గొల్లకలాప ప్రక్రియా ప్రయోగంలో సిద్ధహస్తులు.

ఆంధ్రదేశంలో 'భరతనాట్యము', 'గొల్లకలాపము', 'యక్షగానాల' పేరులు విన్నచో కూచిపూడి భాగవతులు మన స్మృతిపథంలో విహరించుచుందురు. వీరికీ నాట్య మేనాడు, ఎవరి వలన, ఏవిధంగా లభ్యమైనదో ఇతమిత్థంగా చారిత్ర్యకాధారాలతో నిర్ణయించడం వీలుకాని విషయం. అయినప్పటికి అనేక పండిత పరిశోధకుల పవిత్ర పరిశోధనా ఫలితంగా వీర లీకళలయందు 1916-'17 శతాబ్దముల నాటికే దేశమంతట ప్రసిద్ధి నందినట్లు తెలియవచ్చుచున్నది.

లలితకళలు నాటి జాతీయౌన్నత్యమును, సామాజిక ఆచార వ్యవహారములను ప్రతిబింబింప జేసెడి ఆదర్శములు. ఇంతియు

కాక ఇహాపర సాధకములై, సర్వార్థ సాధకములై, సకలజన మనోరంజకములై యలరారుచుండు ననుటకు మన కీనాటి కూచిపూడి భాగవతుల ప్రదర్శనలే ప్రబల నిదర్శనములు. కూచిపూడి భాగవతులు బ్రాహ్మణులు. నట విట గాయకాదు లపాంక్తేయు లనెడి యాచార మొకటి కలదు. కాని అయ్యది వీరికి బాధకము కాదు.

కూచిపూడి నాట్యోపాసకులు తాము నాట్యము చేయుటయే గాక దేవాలయ ప్రాంగణముల యందును, రాజాస్థానముల యందును నాట్యము లొనరించెడి నట్టువరాండ్రకు నాట్యము గరపెడి గురువులై భామాకలాప, గొల్లకలాపాదికములను ప్రదర్శించు సమయమందు నట్టువాంగము నెరపు వారలై, హాస్య పాత్రధారులై, సూత్రధారులై వ్యవహరించెడివారు.

భామాకలాపము సిద్ధేంద్రయోగి విరచితమై ప్రచారము లోనికి వచ్చినది. ఇక దీని బోలిన యొక వేదాంత ప్రబంధమును రచింప నెంచి శ్రీ సిద్ధేంద్రయోగి యనుగ్రహ విశేషమున పరంపరాగత భరతనాట్య, భామాకలాపాల యందును, యోగ శాస్త్రమున నందెవేసిన చేయి యగు శ్రీ భాగవతుల రామయ్య "యజ్ఞపట్టు, పిండోత్పత్తిక్రమము" యను విషయములతో 'గొల్లకలాప' మను పేర నొక రూపకమును రచించిరి. ఇందు జీవి యొక్క సృష్ట్యాది విషయములు విస్తరింపబడి, అభినయ యోగ్యములుగా రూపొందింపబడినవి. ఇది సుమారు 150 సంవత్సరములకు పూర్వపు విషయము. కూచిపూడి యగ్రహారమున రామయ్య నామధారులు పెక్కుమంది యుండుటచే వీరిని కక్కయ్యగారి రామయ్య, కవిత్వం రామయ్య ఇత్యాది పలు పేరులతో పిలచుచుండెడివారు.

శ్రీ రామయ్యగారిచే రచింపబడిన గొల్లకలాపమే నేటి ఆంధ్రదేశమున విశేషప్రచార మందున్నది. కూచిపూడి

భాగవతుల శిష్యప్రశిష్యులు దీనిని దేశమున నలుమూలల వ్యాపింప జేసి యశేష యశము నార్జించిరి. అయినను తమకు ప్రత్యేకాదర గౌరవములు లేవని వాపోవుచున్నారు. "మూలవిరాట్టులు మూలనే యుండగా, ఉత్సవ విగ్రహములకు ఊరేగింపులు మెండు" అను జన వాక్యము వీరిపట్ల అన్వర్థమై సభా సన్మానములు, గౌరవప్రతిష్ఠ అధికంగానే లభించుచున్నవి. అయినను సంతృప్తి లేదు.

నేటి యాంధ్రదేశమున సర్వతోముఖమైన నాట్యకళా వైశారద్యము గడించి జయపూరు, ఢిల్లీ ప్రాంతములందేగాక, సమయానుకూలముగ కర్నూలు, హైదరాబాదు మున్నగు ముఖ్య పట్టణములలో ప్రదర్శన లిచ్చి, రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్, ప్రధానమంత్రి జవహరులాల్ మున్నగు అగ్రనాయకులయు, శ్రీ అనంతశయనం అయ్యంగారివంటి ప్రముఖుల మన్ననలతో యావద్భారతమున పేరుగడించుకొన్న లలితకళా దేవతార్చనమునకే తమ జీవితముల నంకితము గావించుకొన్న కూచిపూడి భాగవతులు వదాన్యులు, ధన్యజీవులు. అట్టివారితో భాషించుట, వారు పుట్టిన, పెరిగిన కళాక్షేత్రమును దర్శించుట జన్మసార్థకము.

ఇటీవల కొందరు వంచకవరేణ్యులు తాము కూచిపూడిలో జన్మించినట్లును, భాగవతుల మనియును, కళాపోషకుల మనియును విశేష ప్రచారము లొనరించుకొని, తమ్ము వంచించుకొనుటయే కాక, దేశమును గూడ వంచించుచున్నారు. ఇది కూచిపూడి కళాక్షేత్రమునకు, కళారాధకులకు తీరని యవమానము. సహృదయత, ఆత్మాభిమానము కల యే తెలుగు బిడ్డయు నింతటి నీచకృత్యమునకు పాల్పడడు. అట్టివార లేనాటికైనను, తమ నిజ స్వరూపములతో వెలిగాక మానరు. అప్పుడైనను, తా మొనరించు యనౌచిత్యకార్యములకు సిగ్గిలక తప్పదు. అట్టివారి దుశ్చర్యలను అరికట్టుటకు కూచిపూడి భాగవతులు తగిన యత్నము జేయవలెను.

ప్రభుత్వము, ప్రజలుకూడ ఈ విషయమున శ్రద్ధ వహించవలెను.

కూచిపూడి కళాక్షేత్రము తగు పాలకవర్గముతో ఇటీవల రిజిష్టరు కాబడినది. అచిరకాలములోనే ఆ కళాక్షేత్రమునకు సంబంధించిన వ్యవహారములను చేపట్టి నాట్యకళాశాలయు, సంస్కృత పాఠశాలయు వెలయనున్నవి. నాట్యకళయు, సంస్కృత విద్యాభ్యాసము చేయగోరువారు అందు ప్రవేశింపవచ్చును. ఈ శుభకార్యము ఫలవంతమగుటకు కళాభిమానులు, విద్యాభిమానులు చేయూత నొసంగగలరని విశ్వసించుచున్నాను.

కూచిపూడి కళాక్షేత్రమునకు తగిన వసరులు కల్పించుటకు అఖిల భారత సంగీత నాటక అకాడమీ ఉపాధ్యక్షురాలు శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ వాగ్దాన మొసంగిరి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముకూడ నిందులకు తగిన విధముగ నుత్సాహ ప్రోత్సాహముల నీయగలదు.

కాన, ప్రతి యాంధ్రుడును తమ మాతృదేశమున కలంకారము, శోభావహము నైన ఈ కళాక్షేత్రమహిమ ఖండఖండాంతరములందుగూడ వ్యాపింపజేసి, దేశమాన్యత్వము నందుటకు సహాయ సహాకారము లీయవలసినదిగ ప్రార్థించుచున్నాను.

(శ్రీ చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి. 1958. నవంబరు 24. కృష్ణాపత్రిక)

పగటివేషాలు, వీధినాటకాలు, భామాకలాప, గొల్ల కలాపాలతోపాటు కూచిపూడి భాగవతులు, తమ సంప్రదాయంలో మరో ప్రక్రియా ప్రయోగాన్ని ప్రవేశపెట్టుకున్నారు. అదే యక్షగానము.

"తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేన, సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥" (భగవద్గీత)

"సంగీత సాహిత్య కళానభిజ్ఞ, స్సాక్షాత్పశుః
పుచ్ఛ విషాణ హీనః"

కూచిపూడి - గోల్కొండ నవాబులు: విజయనగర సామ్రాజ్య పతనానంతరం దక్షిణ భారతదేశంలో హిందూ రాజులు బలహీనులయ్యారు. మహమ్మదీయ సుల్తానుల పరిపాలన మేర్పడింది. పెద్దరాజ్యా లంతరించి చిన్నరాజ్యా లవతరించాయి.

క్రీ. శ. 1487 లో కులీ అను సరదారు బీదరు చేరుకొని బహమనీ సులతానుల కొలువులో కుదురుకొన్నాడు. ఈయన క్రీ. శ. 1496 లో ఆంధ్రప్రాంత పరిపాలకుడుగా నియమితు డయ్యాడు. క్రీ. శ. 1518 లో అహమ్మద్ షా అస్తమించాడు. ఆయనకు సామంతపాలకునిగా ఉండే కులీ సర్వతంత్రస్వతంత్రు డయ్యాడు. నాటినుండి కులీ కుతుబ్ షాగా మారిపోయాడు.

గోల్కొండ సులతానులలో కులీ కుతుబ్ షా మొదటివాడు. గోల్కొండ రాజధానిగా ఆంధ్రప్రాంతాన్ని, తెలంగాణా ప్రాంతాన్నికూడా అరువై సంవత్సరాలు అవ్యాహతంగా పరిపాలించాడు. ఈయన కాలంలో రాజ్యం విస్తరించింది. తూర్పు దిక్కున మచిలీపట్నం సరిహద్దుగా ఉండేది. మహమ్మద్ అబ్దుల్లా కుతుబ్ షా కులీ కుతుబ్ షా వంశంలో కడపటివాడు. ఈయన పాలనాదక్షుడు, రాజకీయచతురుడు కాదు. అందుచేత గోల్కొండ సామ్రాజ్యం తానీషాల వశమైంది.

తానీషాలలో మొదటివాడు అబుల్ హసన్. ఈయన మహా మనీషి. రసిక శిఖామణి, కళాహృదయుడు, అన్యమత సహిష్ణుత కలవాడు, మహోదారుడు. అక్కన్న, మాదన్నలు ఈయన అమాత్యవర్యులు. వీరు ఈయన ఆస్థానంలోని అనర్ఘమణులు. తానీషాగారి అపరాభిమానాలు చూరగొని, ఆంతరంగికులుగా ఉండేవారు.

భద్రాచల రామాలయం ఈయన యేలుబడిలో నూతన రూపాన్ని సంతరించుకొంది. శ్రీ కంచెర్ల గోపన్న (రామదాసు) భక్తి కారణంగా ఈ తానీషా శ్రీరామ లక్ష్మణులను ప్రత్యక్షంగా చూడడమేగాక భాషించిన ధన్యతముడు. ఆనాటినుండి శ్రీరామ చంద్రుడు ఆరాధ్యదైవమైనాడు. ప్రతిసంవత్సరం శ్రీరామనవమి నాటికి, శ్రీ సీతారామకళ్యాణమహోత్సవానికి ముత్యాల తలంబ్రాలు పంపి జన్మ సార్థకంచేసుకొన్న మహనీయ వ్యక్తి. ఈ ఆచారం ఈనాటికి అమలులో ఉంది. తానీషాలు అంతరించినా, నవాబులు గతించినా, దర్బారులు దూరమైనా శ్రీరామప్రభువునకు హైదరాబాదు నుండి ముత్యాల తలంబ్రాలు కల్యాణోత్సవ సమయానికి అందుతూనే ఉన్నాయి. ఇది విశేషం.

అబుల్ హసస్ తానీషా క్రీ. శ. 1672 నుండి 1687 వరకు రాజ్యపాలన కొనసాగించాడు. ఈయన కళాప్రియుడే కాదు, కళా పోషకుడు కూడా. మతవిచక్షణ లేకుండా ఎంతోమంది కళాకారులకు, కళావేత్తలకు ఆశ్రయమిచ్చి పోషించాడు. వారికి మడిమాన్యాలు, అగ్రహారాలు దానమిచ్చి ఆదరించాడు. నాట్యకళ అంటే అమితమైన ఆసక్తి. ఈయన ఔదార్యం, మతసహనం శ్లాఘనీయం. దాతృత్వం ప్రశంసనీయం.

తానీషా తనను సర్వతంత్రస్వతంత్ర పరిపాలకునిగా ప్రకటించుకొన్నా, పూర్వపు నవాబులు నిలిపిన ఆచార వ్యవహారాలకు, కట్టుబాట్లకు, పాలనాకార్యక్రమాలకు, సాంఘిక నియమ నిబంధనలకు భంగకరం కాకుండా ప్రవర్తించాడు, వారి అడుగుజాడలలో పాలానా యంత్రాంగాన్ని పదిలపరుస్తూ, లోటు పాటు లుంటే సవరించాడు. అభివృద్ధిచేశాడు. ప్రజలకు పరిపాలనం మారింది అను విషయం తెలియనివిధంగా ప్రవర్తించి ప్రజాభి మానాన్ని చూరగొన్నాడు.

ఆయన కళాప్రియత్వాన్ని తెలియపరచే ఒక విషయం ప్రచారంలో ఉంది : అబుల్‌హాసన్ తానీషా గారి దర్బారులో తారామతి అనే ప్రఖ్యాత నర్తకి ఆస్థాన నర్తకిగా ఉండేది. ఆమె ఇంటి నుండి రాజమహాలు వరకు గల అరమైలు దూరము త్రాళ్లవంతెన మీద (Rope way) నేలపై కాలు మోపకుండా వయ్యారంగా నాట్యమాడుకుంటూ అయిదు సంవత్సరాలు తానీషా వారి దర్బారుకు వచ్చి ప్రదర్శన మిచ్చేది.

(ఆంధ్రపత్రిక, 1964 సెప్టెంబరు 24_Reply)

తానీషాగారు ఎవరిని కనికరిస్తే, వారికి కనకాభిషేకాలు జరిగేవి. ఈయనకు మచిలీపట్టణం అను ఒకకోట ఉండేది. పరిసరాలలో కొన్ని గ్రామాలుకూడ ఈయన ఏలుబడిలో ఉండేవి. ఆ గ్రామాలకు సంబంధించిన ఆయ వ్యయాలు వగైరా వ్యవహారాలు చూడటానికి కొంతమంది ప్రతినిధులు, సిబ్బంది ఆ కోటలో ఉండేవారు. వీరి కార్యకలాపాలు పర్యవేక్షించడానికి ఈయన తరచుగా గోల్కొండ నుండి మచిలీపట్టణం రాకపోకలు సాగిస్తూ ఉండేవాడు. మంది మార్బలంతో ఈయన ప్రయాణం ఒక పెద్ద ఊరేగింపుగా వాహనాలతో సాగేది. పగలంతా ప్రయాణంచేసి మార్గ మధ్యంలో తమ అధీనంలో ఉన్న గ్రామాలలోనో, పట్టణాలలోనో రాత్రివేళ బసచేసేవారు. అవకాశాన్నిబట్టి, ఆ మకాములలో చిత్ర విచిత్రా లయిన ప్రదర్శనలు జరుగుతూ ఉండేవి.

ఒకమారు దైవికంగా కూచిపూడి అగ్రహారంలో మకాం వేయటం సంభవించింది. అచటి భాగవతుల అదృష్టం ఫలించింది. అంతకు కొద్దికాలం క్రిందటనే వీరు సిద్ధేంద్రుని హరికథ అను భామాకలాపాన్ని నేర్చుకున్నారు. తమ ప్రభువులు కళాప్రియులు, కళాపోషకులు అని ఎరిగిన భాగవతులు అమందానంద సంభరితు లయ్యారు. ప్రభువుల అనుగ్రహాన్ని సంపాదించడం కోసం అనేక విధాల సౌకర్యాలు కల్పించారు. ఆ రాత్రికి వారి వేడుక కొరకు భామాకలాప ప్రదర్శనం ఏర్పాటుచేసి దయతో దానిని తిలకించ

వలసినదిగా అభ్యర్థించారు. తానీషావారు భాగవతుల ప్రతిభావ్యుత్పన్నతల నెరిగినవాడవటంవల్ల, ఆనందంతో అంగీకరించారు.

నియమిత సమయానికి ఆరాత్రి "అంబాపరాకు" తో ప్రదర్శనం ప్రారంభమైంది. వినాయక స్తవం చేశారు. క్రమం ప్రకారం భామ రంగప్రవేశం చేసింది. కలాపం మహోదాత్తంగా నడిచింది. విప్రలంభ శృంగారాన్ని భాగవతులు ఎంతో మెలకువతో రక్తి కట్టించారు. ప్రతి అడుగు, ప్రతి ముద్ర, ప్రతి భావం అంగ విన్యాసాలు శాస్త్ర సమ్మతంగా ప్రదర్శింపబడినాయి. కళాతపస్వి తానీషా ఆ ప్రదర్శన చూచి రసప్లావితు డయాడు. తన యేలుబడిలో ఇంతటి ప్రజ్ఞావంతులైన నాట్య కళావేత్త లున్నందుకు గర్వించాడు. ఈనాడు తన కళాతృష్ణ తీరిందని భావించాడు. ఎంతవిలువైన బహుమానమైన, ఈ మధురానుభూతికి చిహ్నం కాజాలదని తలపోశాడు. శాశ్వతంగా తన ఔదార్యం భాగవతుల ప్రతిభకు గుర్తుగా ఉండే విధంగా ఆనాడు తాను మజిలీచేసిన కూచిపూడి అగ్రహారాన్ని వారికి దాన మిచ్చాడు. ఈవిధంగా, ఆరువందల యకరాల భూవిస్తీర్ణంగల అగ్రహారం భాగవతులకు, ఆచంద్ర తారార్కం, సర్వాధికారాలతో అనుభవించే విధంగా 'ఇనాము'గా వారి కళాకౌశల్యానికి, తానీషావారి కళాభిమానానికి ప్రతీకగా లభించింది.

ఈనాడు కూచిపూడి అగ్రహారంలో తొమ్మిది కుటుంబాల వారు మాత్ర మున్నారు. వీరందరు వంశపారంపర్యం అనుభవించే లాగున ఆ మరునాడే శ్రీ భాగవతుల నరసన్నపేర సనదు వ్రాయించి, తానీషా వారు మొహరు వేయించి బహూకరించారు. భాగవతుల గ్రాసవాసోదైన్యాలు దీనితో తీరినాయి.

కొంతకాలానికి ఈ భాగవతులతో మరి రెండు కుటుంబాల వారు వచ్చి చేరారు. ఇప్పుడు పాలు, పంపిణీల విషయంలో

అభిప్రాయ భేదాలు అంకురించాయి. అవి క్రమంగా బలపడి విభేదాలకు, కలతలకు దారితీశాయి. వీటిని తమలో తాము పరిష్కరించుకోలేక పోయారు. మచిలీపట్టణంలోని తానీషావారి ప్రతినిధులకు విన్నవించుకొన్నారు. గుడివాడ మునసబు కోర్టులో దావాలు కూడ దాఖలు చేసుకున్నారు.

కొంతకాలానికి ఉభయపక్షాలవారి అభ్యర్థనలకు మచిలీపట్టణంలోని ప్రతినిధులు శ్రీ కాంద్రేగుల జోగిపంతులు, శ్రీ మొసలికంటి కామోజీపంతులు గారలు అంగీకరించారు. వారు ఉభయుల వాద ప్రతివాదనలు విని ఈ వ్యవహారాన్ని పరిష్కరించ డానికి కొన్ని వాయిదాలు వేశారు. నిశితంగా పరిశీలించి, పరిశోధించి ఒక నిర్ణయానికి, ఒకనాడు ఉభయ పక్షాలకు చెప్పి ఒప్పించారు. ఇకముందు ఎన్నడు వీరుగాని, వీరి బాధ్యస్థులుగాని, వీరిలో వీరుగాని, వారిలో వారుగాని ఏ విధమునైన విభేదాలు రాకుండ ఉండేటందుకుగాను ఒకపత్రాన్ని వ్రాయించి యిచ్చారు. ఆ పత్రంలో వారి వారి వాటాలకు వచ్చిన భూమి పరిమాణాన్ని వివరించి ఆయా కుటుంబాలవారి చేతను, పెద్దమనుష్యుల చేతను చేవ్రాళ్లు వ్రాయించి, ఆ యిరువర్గాల వారికి ఇచ్చారు. ఆ పత్రానికి అసలుకు నకలు ఈక్రింది విధంగా ఉన్నది :

## శ్రీ వేంకటపతి

స్వస్తి. శ్రీ జయాభ్యుదయ శాలివాహనశక వషనంబ్బులు ౧౬౮౮ ౫ అగు నేటి వర్తమాన వ్యావహారిక చంద్రమాన స్వభాను నామ సంవత్సర శ్రావణ శు.౧౫ సోమవారం నాడు తు. కూచిపూడి సమతు, వల్లూ ప. మేడూరు సర్కారు ముస్తఫాన్నగరు తా. అగ్రహారం మహాజ్యనులు అంతా ఐకమత్యమై వ్రాసుకున్న ధర్మశాసన పట్టె.

స్న ౧౧౩౩ ఫసలీ పూర్వం మ. మజ్కూరు గ్రామం కొంత కాలం నాటినుంచ్చి, అగ్రహారం బిలుమక్తా శ్రోత్రియం నడుస్తూ ఉండి నేటి వర్కు అనుభవియ్యంగ్గా వుండ్డే గనుక, ఆ పూర్వపు రాజులు వ్రాయించ్చిన స్నదలు పాయగన్కు యిందు త॥ భుక్తదార్ల గుత్తకొళ్లు వ్రాయించ్చి యిచ్చిన స్నదులు బా యవ్వారి వృత్తులు అనుభవిస్తూ ఉండీ, మ్నలోమ్నము పొలాలు యక్కువ తక్కువ వున్నది అని తగులబడి వరహాలు వెంట్లు మీాద కావలెనని కొండ్దరు, కత్తుల మీాద కావలెనని కొండ్దరు యీా చొ॥న కలహించ్చి చర్చ పెట్టుకొని పొలాలు దున్నకుండ్డా తగాదాలు పెట్టుకొని నెలదినముల నుంచ్చి బందర్కు వచ్చి రాజశ్రీ మొసలికంటి కామోజీ పంత్తులు, కాంద్రేగుల జోగి పంత్తులు గారితో విన్నపం చేసుకొంట్మి. గనుక వారు చాలా పరిశీలన చేయించ్చి, త్మరు యీావత్తూ ఆకళింపు చేస్కుని, పదిమంది పెద్దలు పిన్నలు చెప్పినట్టు వినుకొమ్మనిరి. గన్కు వారు అందరు విచారించ్చి, మన అంద్దరి రజావంది చొ, యీా వ్రాయించ్చిన పద్ధతులు సమ్మతి పర్చించిరి. గన్కు యిందుల నిర్ణయం కత్తులు 338 - 10.

౦౻౦ శ్రీ రామేశ్వరదేవు ఖిరానాము
౨౻= భాగోతులవారు

| | |
|---|---|
| ౧౩౨ | పట్నాభిరాముడు |
| ౧।౨ | పాపయ్య, అచ్చన్న |
| ౧౩౨ | గోపాళం |
| ౦౪౦ | పెద యజ్ఞన |
| ౧।౨ | చిన యజ్ఞన |
| ౨౻౦ | కోదండ్డ రాముడు వగైరా |
| | ౦.౹౦ - ఖరీద్కు చేస్కున దొడ్డి |
| ౨౻౦ | ౨.౹౦ - కోదండరామ్ము, లింగన్న |
| | ౨౻౦ |

౭౻౦ - ౭౻ =

౧౻౦ - యేలేశ్వరపు పెద రామకృష్ణుడు

౧౻ ≡ 110- యేలేశ్వరపు చిన రామకృష్ణుడు

౧౪ - ౪౦ ఖాసాలు

౦౮౭ - హరి వేంకట్రాయులుది

౦౻౦ - మహంకాళి వారు

౦౪౦ - నారాయణ

౦౧౦ - వెంకట్రాముడు

౦౻౦

పోలేపెద్ది రామకృష్ణయ్య

౧౮ = ౻౦ - వల్లభజ్యోతిష్యుల వెంకట తా.

౦౪౦ ౮౦-

౧౬౪ - ౧౦

## తప్సీలు

౭౻౦ పసుమర్తి వారు

౫౪౦ ఖాసాలు

౧ వెంకట

౧ జగ్గ

౧ లక్ష్మన్న

౧ రోయులు

౧ సుబ్బన్న

౦౪౦ క్రిష్టమ్మ

౨ వేము వారి తా.

౦౻౦ తిమ్మన

౦౻౦ అయ్యన

౦౪౦ పెదలక్ష్మయ్య

౦౧౦ వానుకుర్తి తిమ్మన

౧౧౦ హరి వెంకన్నగారు

౧1=3 యేలేశ్వరపు చిన రామకృష్ణుడు

కుంటలు మిగిల్న భాగం

౦౻౦ జ్యోస్యుల పాపయ

౦౻౦ బొకాక నారాయణ

౦౻౦ దభాక వారు

౦౧౦ మల్లయ్య

౦౧౦ అచ్చన్న

౦౧౦ సుబ్బయ్య

౧౻౦ వెంప్పటి వారు

౧౮౭ నాగయ్య

౦౪ - వెంకట

౩౻౦ వేదాంతం రామేశా ౧౬ ౻౦
భాగవతుల వార్ల తా.
3 ఖాసాలు
౦౹౦ పెద్దిభొట్ల లింగన్న
౦౹౦ వేము శంకరయ్య

ఈ నిర్ణయ పర్చుకొని వ్రాస్కుంటిమి. గనుక గ్రామ తగులుబడి పూర్వం నుంచి వున మరూవ్ ప్రకారం బిలుమక్తాగా ౧౨ పన్నెండు పొలాలు కత్తులమీద మిగిలిన తగులుబడి శిస్తులు బాజా ఖర్చులు వగైరా అంత్తా పండ్డించిన వెంట్ల కుంట్టల మీద పెట్టుకోవలెనని కొందరం, సంఖం వెంట్ల మీద సఖం కత్తుల మీద పెట్కువలెనని కొందరం యీ చొ. కలహింస్తిమి, గన్క సదరహా పెద్ద మనుష్యులు తీర్చిన నిర్ణయం. అసలు పన్నెండు వరహాలు, బాజా ఖర్చు పన్నెండు వరహాలూ, నిల్వ ఇరువైనాల్గు వరహాలూ కుంట్ల కత్తులు 338 - 10 దేవుని యీనాము ౦౻౦ గ్కా బాకీ 3౨౹-౹౦ మీద పెట్కని తతింమ్మాగా మాన్కు తగులుబడి యేది ఎంత అయినా శిస్తు బాజారు ఖర్చు వగైరాలు సాలు తమాముతో ...... హాలుకు కత్తులు మీద పంప్పిణి సదరహూ ఇరువైనాల్గు వరహాలు గన్కు తతిమ్మా వరహాలు పంచి వెంట్లు మీద కుంట్టలు కొల్చుకుంటే ముప్పాతిక భూమి త్మకుంపు సఖం చొ. యీ చొ. అన్ని సమంగ్గా యెందుతో తగిలినా పెట్టుకోగలవారము. యిఖ నేటినుంచ్చి అంతా సమాఖ్యగా మన్కు తగులుబడి కాకుండ్డా నయం వచ్చే మట్కు యవ్వర్కి అండ్ని పొలం చాయగలవారం. దొరలవద్దగాని, జమీాందార్ల వద్దగాని అండ్డు వేర్పడి వారి ప్రతి దాతలు వ్రాస్కున్న రద్దావతి గనుక వీసం పొలం అయినా యవ్వరం వ్రాయించ్చుకోగలవారము కాము. వ్రాయించ్చుకొంటిమో అబద్ధం నడ్వగలది కాదు. యీ పద్ధతుల్కు పెద్దా పిన్నా గ్రామస్తులు అంత్తా యేకరాశ్యతగా, సమ్మతించి వ్రాస్కుంటిమి. గనుక యిండ్లు

యవ్వారం తీర్గబడ్డా వారి ప్రతిపత్తి అక్కరలేదు. గ్రామం అంత్యా బందీలు చేస్కుని పాలం ఎక్కువ అయితేనే వుంచుకోగలవారము. ఇది మా అందరి సమ్మతిని వ్రాస్కున్న కాగితం........చరితలె ...........ధర్మసాక్షిణ............దస్తూరి-యరుకలిజ్మల్కు కుజ్మాదారు నవుకరు. బందరు మచిలీపట్టణం...........ఖత్తులు నిర్ణయం చొ. పంచుకోగలవారము. ఆగష్టు 24-1763.

—"District Munisiff's Court of Gudivada—8 Sept. 1904. District Munisiff's Court of Gudivada- Original suit No 402 of 1903. Over leeced on the 8-9-1904. By Pasumarthi Seshaiah-"

—ఈ పై పత్రములోని ఖాళీలు ఉన్నచోటులలోని అక్షరములు తెలియలేదు. ఈ పత్రం దిగువ ఈక్రింది సంతకములు చేసి యున్నాయి:

"భాగోతుల గోపాళు వ్రాలు
,, అచ్చన్న వ్రాలు
,, యెజ్ఞన్న వ్రాలు
,, అనంత్తుడి వ్రాలు
యేలేశ్వరపు రామకృష్ణుని వ్రాలు
బొక్క లక్ష్మీనారాయణ వ్రాలు
పసుమర్తి వెంకు వ్రాలు
,, జగ్గు వ్రాలు
,, లక్ష్మంమ్మన్న వ్రాలు
,, సాంబన్న వ్రాలు
,, రాయప్ప వ్రాలు
,, క్రిష్టంమ్మ వ్రాలు
వేదాంతం భగవాన్లు వ్రాలు
,, కోదండయ్య వ్రాలు
,, పాపయ వ్రాలు

వేదాంతం పట్టాభిరాముడు వ్రాలు
,, పెద యజ్ఞన్న వ్రాలు
జోస్యుల సోమప్ప వ్రాలు
,, నారయ్య వ్రాలు
హేలేశ్వరపు పెదరామకృష్ణుడి వ్రాలు
వెంప్పటి నాగన్న వ్రాలు
వల్లభజోస్యుల వెంక్క వ్రాలు
మానేకిన్ని రామకృష్ణుడి వ్రాలు
బీరకాయల సరసన్న వ్రాలు
కాంద్రేగుల జోగిపంతులు వ్రాలు
మొసలికంటి కామోజీ వ్రాలు

అని ఉంది. దీనినిబట్టి ఆనాడు కూచిపూడి అగహారంలో ఉన్న కుటుంబాల విషయం వివరంగా విదితమవుతోంది.

**భాగవతులు - పదములు :** కూచిపూడి సంప్రదాయంలో పదాభినయానికి ప్రత్యేక ప్రాధాన్యత ఉంది. వాగ్గేయకారుల. గేయాలు వీరి నాట్యానికి పుష్టిని, తుష్టిని కలిగించాయి.

వాక్కులను గేయ రూపంలో రచించినవారు వాగ్గేయకారులు. పదముల కూర్పు,పొందిక బాగా తెలుసుకొని గేయరచన చేసినవారు ఉత్తమ వాగ్గేయకారులు. సంగీత సాహిత్యాలకు సమాన ప్రాతినిధ్యం గల గేయాలు చిరస్థాయిగా నిలుస్తాయి. అవి ప్రజాభిమానాన్ని చూరగొంటాయి. నృత్యగీతాలతో పాటు వాద్యవిశేషాలలో సునిశిత లయజ్ఞానం ఉండి రాగ, భావ, సాహిత్యాలను రసవంతంగా మేళవించే నేర్పుగల వాగ్గేయకారులు కీర్తి సామ్రాజ్య పట్టభద్రు లవుతారు.

సంగీతపద రచనలు పలువిధాలు. అయినా వాటిని స్థూలంగా మూడు విధాలుగా విభజింపవచ్చు. 1. భక్తిప్రధానాలు, 2. సంగీతప్రధానాలు, 3. శృంగారరసప్రధానాలు.

1. భక్తిప్రధానాలు : కీర్తన, సంకీర్తన, దివ్యనామం, చూర్ణిక, అష్టపది, తరంగం, గద్య మొదలైనవి.

2. సంగీతప్రధానాలు : గీతం, వర్ణం, కృతి, స్వరజతి మున్నగునవి.

3. శృంగారరసప్రధానాలు : పదము, జావళి మున్నగునవి.

ఈ మూడు విధాల ప్రక్రియలు అభినయ యోగ్యంగా ఉంటాయి. ఇవిగాక 'పుష్పబాణ విలాసం', 'శ్రీకృష్ణకర్ణామృతం' మున్నగు గ్రంథాలనుండి శ్లోకాలను ఎన్నుకొని వాటినికూడ భాగవతులు సందర్భానుసారంగా అభినయిస్తారు.

వాగ్గేయకారులలో శ్రీమాన్ కృష్ణమాచార్యులు, శ్రీమాన్ అన్నమాచార్యులు, శ్రీమాన్ తాళ్లపాక పెద తిరుమలాచార్యులు మున్నగువారు పదాలు, కీర్తనలు రచించారు. శ్రీ లీలాశుకులవారు 'శ్రీకృష్ణకర్ణామృతా'న్ని, శ్రీ శివనారాయణతీర్థులవారు 'శ్రీకృష్ణ లీలాతరంగిణి', శ్రీ క్షేత్రయ్య 'మువ్వగోపాల పదాలు', శ్రీ త్యాగరాజస్వామి 'కృతులు', శ్రీ జయదేవ మహాకవి 'అష్టపదులు.' ఈవిధంగా ఎందరెందరో మహానుభావులు ఎన్నోవిధాల రచనా ప్రక్రియలు వెలయించారు. వీరిలో ఏ ఒకరిని గురించయినా వివరంగా రచించుకుంటూపోతే ఒక మహాగ్రంథమవుతుంది. ఈ వాగ్గేయకారులను గురించి విశదంగా తెలుసుకొనదలచిన సహృదయులు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారిచే రచింపబడిన 'వాగ్గేయకారుల చరిత్రము' చూడవచ్చు. ప్రస్తుతం ఇక్కడ కొంతమంది సంగీతాచార్యులను గూర్చి, వారి రచనలను గూర్చి సంక్షిప్తంగా పరిచయం చేయ సాహసిస్తాను.

శ్రీ కృష్ణమాచార్యులు : పరిశోధకుల దృష్టికి తోచినంత వరకు ఈయన ప్రథమ వాగ్గేయకారుడు. విష్ణుభక్తుడు. ఈయన రచనలు గద్యాత్మకములు. "గద్యం కవీనాం నికషం వదన్తి"

అన్నట్లు సాహిత్యప్రక్రియ లన్నింటిలో రసవంతంగా భావ గాంభీర్యంతో మంజుపద భూయిష్ఠ గద్యరచన కష్టతర ప్రక్రియ.

శ్రీ ఆచార్యులవారు కాకతీయ ప్రభువులలో రెండవ ప్రతాప రుద్రుని కాలపునాటివాడని పరిశోధకుల అభిప్రాయం. ఈయన ఓరుగల్లు ప్రాంతంలో విష్ణు సంబంధమైన కీర్తనలు పాడుకొంటూ వైష్ణవమత ప్రచారం చేశాడు. తాను రచించిన పదరచనల నన్నిటిని సింహాచలక్షేత్రంలో వేంచేసియున్న శ్రీ లక్ష్మీవరాహ నరసింహస్వామివారికి అంకిత మిచ్చాడు. "వేదంబు తెనిగించి సంసార ఖేదంబు మాన్పిన కృష్ణమాచార్యుడు" అను ప్రసిద్ధి నార్జించాడు.

ఈయన "వృత్తగంధి, కాళగంధి, చూర్ణిక" అను మూడు విధములయిన రచనలు చేశాడు. ఇవి అసంఖ్యాకంగా ఉన్నాయి. కాని నేడు ఆ రచనలన్నీ లభ్యం కావడంలేదు. ఈయన రచనల చివర 'సింహాగిరి నరహరి' అను మకుటం ఉంటుంది. ఉదాహరణకు ఒక గద్య :

"దేవా! మీ, నామోచ్చారణంబు సేయక కోటి స్నానంబులు చేసినా, కుమారస్వామి కోరిక సిద్ధింపదాయె."

"దేవా! మీ నామోచ్చారణంబు చేసిన ప్రహ్లాద, నారద, విభీషణ, భృగు, గాంగేయ, అక్రూర, విదురాదు లగు పరమభాగవ తోత్తములు నారాయణ స్మరణము వలన కృతార్థులైరి. కావున యతి రామానుజుని పరందామారు. అనాథపతి అయిన సింహాగిరి నరహరి! నమో నమో దయానిధీ!"

ఈయన పదరచనలన్నీ ఈవిధంగా భక్తి బంధురములై ఉంటాయి. వీటికి రాగ, తాళాదులు నిర్దేశింపబడలేదు.

**అన్నమాచార్యులు :** వీరి గృహనామము తాళ్లపాకవారు. ఈయన క్రీ. శ. 1425- 1505 ప్రాంతములవాడని ప్రతీతి. లక్షణ

యుక్తంగా పదరచన గావించిన వారిలో ఈయన ఆద్యుడు. రచనలు యతి, ప్రాసలు కలిగి 'సమము, అర్థసమము, విషమము' అను త్రివిధాత్మకములై ఉంటాయి. ప్రతి పదానికి చివర, అన్ని పాదాలకు ఏకవాక్యత కల్పించే 'పల్లవి' అను తొలిపదం ఉంటుంది. 'ఆభోగం' అను పేరుతో తుది ముద్రాపదం ఉంటుంది. ఇక నడిమి పదాలు 'ఉద్గాహ, మేళాపక, ధ్రువ' అను ఆఖ్యలు కలిగి ఉంటాయి. ఈ గేయ రచనకు 'నిబంధన' మని అన్నమాచార్యులవారు వివరించారు.

వీరు రెండు పాదాల పదాన్ని 'పల్లవి' అన్నారు. తరువాత అవతరించిన పురందరదాసులవారు 'అనుపల్లవి' అనుదానిని ప్రవేశపెట్టి, పల్లవితో వేరుచేశారు. ఈ సంప్రదాయాన్ని అనంతర వాగ్గేయకారు లనుసరించారు.

అన్నమాచార్యులవారు ముప్పదిరెండువేల సంకీర్తనలు రచించారు. ప్రస్తుతం పన్నెండువేల కీర్తనలు మాత్రమే లభించాయి. ఈ కీర్తనల నన్నిటిని వీరి పెద్దకుమారుడు పెద తిరుమాలాచార్యులవారు రాగిరేకులపై చెక్కించి భద్రపరచాడు. వీరు తమ పితృపాదులను గూర్చి :

"శ్రీ వేంకటేశు నెదుట వెదపెట్టి
లోకములో వేదము లన్నియు
మంచి పదములు చేసి, పాడి
పావనము చేసెను........"

అని కీర్తించాడు. కనుకనే సాహితీలోకం అన్నమాచార్యుల వారిని 'పదకవితాపితామహ' అని స్తుతి చేసింది. కొందరు 'సంకీర్తనాచార్య', 'పంచాగమసార్వభౌమ' అని ప్రస్తుతించారు.

ఈయన జాజరులు, చందమామ పదాలు, తుమ్మెద పదాలు, గొబ్బి పదాలు, లాలి, జోల పదాలు మున్నగు ప్రక్రియ

లెన్నో రచించారు. ఇవి ప్రాచీన మధురకవితారసగుళికలు. ఈసంకీర్తనలుతిరుమల-తిరుపతి, మంగాపురములలోని అయ్యవారికి, అమ్మవారికిపూజాది సమయాలలో,ఉత్సవ సందర్భాలలో, పవళింపు సేవాది సమయాలలో నియమానుసారం గాయన గాయనీమణులు మధురంగా గానం చేస్తారు.

ఉదాహరణకు ఒక కీర్తన:

ఆహిరి

ఏమోయి నే నెఱగనా యెంత కంత సేసేవు
కామతంత్రముల కివి కందువలు గాక ।పల్లవి।
ఈకడఁ దిట్టితినంటా, నెగ్గులేల పట్టేవు
నాకు నీపై (గోపమా, నగితిఁ గాక
కైకొని జంకింతు నంటా, కమ్మటిని దూరేవు
చేకొన్న పగదానవా, చెలిమి గాక ॥ఏమో॥
పొలయలు కలకె, పొగిలేవు రానంటా
చలమా నీతో నాకు, చవులు గాక
పలుకనైతినంటా, పైపైఁ జింతించేవు
చలపట్టినదానవా, సరసము గాక ॥ఏమో॥
గుట్టుతోనే నుండగాను, కొసరేవు రానంటా
చిట్టకపు దాననా, సిగ్గులు గాక
గట్టిగా శ్రీ వేంకటేశ! కలసితివిటు నన్ను
ఱట్టుచేసేనా నిన్ను జట్టిగొనేఁగాక! ॥ఏమో॥

శ్రీ పెదతిరుమలాచార్యులు: వీరు అన్నమాచార్యుల వారి పుత్రులు. కాలము 1470-1553. శ్రీ వేంకటేశ్వరాంకితముగా కొన్ని గద్యలు రచించారు. వీటికి 'వేంకటేశ్వరగద్యలు' అని ప్రఖ్యాతి వచ్చింది. ఇవి రాగ, తాళ, లయాన్వితములై ఉంటాయి. వీటిని 'విన్నపాలు' అని కూడ అంటారు. ఇవి భక్తిభరితములై హృదయ స్పర్శములుగా ఉంటాయి. మచ్చుకు ఒక విన్నపం:

"పురుషోత్తమా! వేదంబులు రత్నాకరంబుల వంటివి, శమలో యర్థంబులు బయలుపడ నీయవు. పురాణంబులు గంటవేట గాంద్ర వంటివి. నానార్థంబులు చాటి చెప్పి, భ్రమియింపజేయును. కాని ఒకటి నిశ్చయంబు. తేట పరుపవు దానంబు లింద్రజాలంబుల వంటివి. ఒకటి పదియారై యనుభవింపజేయుం గాని ముక్తిం దెరువు సూపవు. ఇతర కర్మంబులు చేని పంటల వంటివి. జన్మ పరంపరలకు హేతువులై దేహముల మొలపించుంగాని వైరాగ్యంబు గూడను నీయవు. వీని చందంబు లిట్టివి. ఏమిటం దెగు సంశయంబు? నిక్షేపంబు వెట్టినవాడు చూపక, కానబడదు. నీవు సర్వజ్ఞుండవు. నాకు సముచితార్థంబు లిట్టివని తెలుపం గదవే శ్రీ వేంకటేశ్వరా!"

పద రచనల తరువాత చూర్ణికలు అవతరించాయి. ఇవి కూడ గద్యాత్మకములుగనే ఉంటాయి. ఆలయాలలో ప్రార్థనా సమయాన, నాట్యారంభంలో పుష్పాంజలి సమర్పించే సందర్భంలోను పఠింపబడతాయి.

ఉదాహరణకు: "స్వస్తిశ్రీ కల్పద్రుమ కామగవీ చింతా రత్న నిర్జర గజాది విస్తారకస్య। దేవాశన ప్రస్తారకస్య। వివిధ గ్రాహ ఘుమఘుమాయమాన, అభ్రంకష కల్లోల వేల్లితస్య। మంజుల మంజరీ కృత ఫేన నవ మంజరీ లాలితస్య। గంగాది మహాతరంగిణీ సంగమ సముద్భూత మంగళభృంగీశృంగారస్య। సకలగుణాధార పయః పారావారస్య। మధ్యప్రదేశే। హార నీహార పటీర కర్పూర ప్రభాధగద్ధగాయమాన, ధవళద్వీపే। సంతాన సంతతోద్యాన పరివృతే। సంతానామృత పరిపూరిత పరిఘావలయితే। హిరణ్య ప్రాకార ప్రకాశమానే। నవరత్న విచిత్రిత తోరణ ద్వార శోభిత వివిధ సౌధ విభ్రాజితే। వైజయన్తీ కాన్తిదన్తురిత నభోమండలే। దివ్యవిలాసినీ సహస్ర సంఖ్యా ర్ణ వధూ విరాజితే। రాశీకృతాఖండ సౌభాగ్య నిర్మితే। దివ్యనగరే। శ్రీమతి వైకుంఠే। విష్వక్సేనాది ప్రధాన

కింకర మందిర సందోహ విస్తృతే। దుర్నిరీక్ష్య జయ విజయాది ద్వారపాలక సంరక్షిత బహుళ జన పరివారస్య। బహిరంగణ చిత్రవిచిత్ర రత్న స్తంభ సహస్ర భాస్వత్తేజో విశేష విస్ఫురన్మహనీయ సభామండప మధ్యస్థ మహాసింహాసనాధిరూఢస్య। దివ్యస్త్రీ వజ్యమాన వింజామరస్య। బ్రహ్మేంద్రాది త్రయ త్రింశం కోటి దేవతా సంఘాత ఘూడ్యమాన సభాసన్నివేశస్య। పరితః ప్రవర్తిత దివ్యస్త్రీ నర్తనావలోకన సావధాన చతురస్య। కందర్ప కోటి సౌందర్య ధుర్యస్య। ఉత్ఫుల్ల పుండరీక విశాలలోచనస్య। బాహు విటపావిర్భూత శంఖచక్రగదాభయ భరితస్య। దేవ దేవస్య। శ్రియఃపతేః। పురుషోత్తమస్య। భగవతో ఆది నారాయణస్య।......"

ఈవిధమైన భక్తిప్రపూర్ణ రచనలు శివపరంగా కూడ ఉన్నాయి. ఆ యా కాలాలలో ప్రచారంలోఉన్న మతప్రాతిపదికగా ఈ రచనలు అవతరించాయి.

క్షేత్రయ్య: ఈయన లలితపదకర్త. తాళ్ళపాక పెద తిరుమలాచార్యులవారి అనంతరం పేర్కొన దగినవాడు. క్రీ. శ. 16-వ శతాబ్దమునాటివాడు. సిద్ధేంద్రయోగికి సమకాలికుడు. కూచిపూడికి రెండు మైళ్ళ దూరం దక్షిణంగా ఉన్న మొవ్వ ఈయన జన్మస్థానం. ఒకనాడు ఇది సుప్రసిద్ధ వైష్ణవక్షేత్రం. ఇచట వేణుగోపాలస్వామి వెలసి ఉన్నాడు. అన్నిజాతులవారు ఈ గ్రామంలో నివసిస్తున్నారు. ఒకప్పుడు మువ్వ గోపాలస్వామికి అంగరంగవైభోగాలు జరిగేవి. ఈయన కైంకర్యానికి దేవదాసీలు నియమితులై యుండెడివారు.

క్షేత్రయ్య తాను రచించిన పదాలను తన ఆరాధ్య దైవమైన గోపాలదేవునకు అంకితమిచ్చి ధన్యుడైనాడు. సంస్కృతాంధ్ర భాషలలోను, సంగీత, నాట్యాది కళలలోను పరిపూర్ణ పాండిత్యం కలవాడు. ఈయన తన విద్యాభ్యాస సమయంలో

" పురుషోత్తమా! వేదంబులు రత్నాకరంబుల వంటివి, తమలో యర్థంబులు బయలుపడ నీయవు. పురాణంబులు గంటవేట కాంద్ర వంటివి. నానార్థంబులు చాటి చెప్పి, భ్రమియింపజేయును. కాని ఒకటి నిశ్చయంబు. తేట పరుపవు దానంబు లింద్రజాలంబుల వంటివి. ఒకటి పదియారై యనుభవింపజేయుం గాని ముక్తిం దెరువు సూపవు. ఇతర కర్మంబులు చేని పంటల వంటివి. జన్మ పరంపరలకు హేతువులై దేహముల మొలపించుంగాని వైరాగ్యంబు బొడమ నీయవు. వీని చందంబు లిట్టివి. ఏమిటం దెగు సంశయంబు? నిక్షేపంబు వెట్టినవాడు చూపక, కానబడదు. నీవు సర్వజ్ఞుండవు. నాకు సముచితార్థంబు లిట్టివని తెలుపం గదవే శ్రీ వేంకటేశ్వరా!"

పద రచనల తరువాత చూర్ణికలు అవతరించాయి. ఇవి కూడ గద్యాత్మకములుగనే ఉంటాయి. ఆలయాలలో ప్రార్థనా సమయాన, నాట్యారంభంలో పుష్పాంజలి సమర్పించే సందర్భంలోను పఠింపబడతాయి.

ఉదాహరణకు: "స్వస్తిశ్రీ కల్పద్రుమ కామగవీ చింతా రత్న నిర్జర గజాది విస్తారకస్య। దేవాళన ప్రస్థారకస్య। వివిధగ్రాహ ఘుమఘుమాయమాన. అభ్రంకష కల్లోల వేల్లితస్య। మంజుల మంజరీ కృత ఫేన నవ మంజరీ లాలితస్య। గంగాది మహాతరంగిణీ సంగమ సముద్భూత మంగళభృంగీశృంగారస్య। సకలగుణాధార పయః పారావారస్య। మధ్రప్రదేశే। హార నీహార పటీర కర్పూర ప్రభాధగద్ధగాయమాన, ధవళద్వీపే। సంతాన సంతతోద్యాన పరివృతే। సంతానామృత పరిపూరిత పరిఖావలయితే। హిరణ్య ప్రాకారప్రకాశమానే। నవరత్న విచిత్రిత తోరణ ద్వార శోభిత వివిధ సౌధ విభ్రాజితే। వైజయన్తీ కాన్తిదన్తురిత నభోమండలే। దివ్యవిలాసినీ సహస్ర సంఖ్యా కీర్ణ వధూ విరాజితే। రాశీకృతాఖండ సౌభాగ్య నిర్మితే। దివ్యనగరే। శ్రీమతి వైకుంఠే। విష్వక్సేనాది ప్రధాన

ఒక దేవవేశ్యను ప్రేమించాడు. ఆమె ప్రబోధం వలన మువ్వ గోపాలుని మీద పదరచన సాగించాడని, అందువలన కలిగిన ఆధ్యాత్మిక అనుభూతితో ఆనందపారవశ్యం కలిగి వైరాగ్యపథాన్ని చేపట్టాడని పండితుల అభిప్రాయం. ఉత్తరభారతంలోని సూర దాసు, తులసీదాసుల వలెను, దక్షిణభారతంలో లీలాశుకునివలెను ఈయన భగ్నప్రేమికుడు.

పదరచన చేయు కాలంలో క్షేత్రయ్యకు కూచిపూడి భాగవతులతో సంబంధం ఉండేది. శివనారాయణతీర్థులు, సిద్ధేంద్ర యోగీంద్రులవారితోను అనుబంధ ముండేది. ఈ సంబంధానుబంధాలు క్షేత్రయ్యమీద, ఆయన వ్యక్తిత్వము మీద బాగా ప్రభావాన్ని చూపాయి.

వీరి గృహనామము మువ్వ, బాల్యంలో 'వరదయ్య' అని పిలువబడేవాడు. అనేక దివ్యక్షేత్రాలు సందర్శించడం వలన 'క్షేత్రయ్య', 'క్షేత్రజ్ఞుడు' అను నామాలు లభించాయి. ఆరువేల నియోగి శాఖకు చెందిన బ్రాహ్మణుడు. దేశాటనంచేస్తూ క్రమంగా తంజావూరు నగరం చేరుకున్నాడు. అపుడు రఘునాథరాయలు ఆ నగరాన్ని పాలిస్తున్నాడు. ఆయనను దర్శింపవచ్చిన క్షేత్రయ్యను జూచి "మిమ్ము ఎవరు ఆహ్వానింపగా ఇక్కడకు వచ్చారు!" అని ప్రశ్నించాడట. అపుడు ఆశువుగా:

"తముఁ దామె వత్తు రర్థులు
క్రమ మెరిగిన దాత కడకు, రమ్మన్నారా
కమలంబు లున్న చోటికి,
భ్రమరంబుల నచ్యుతేంద్ర! రఘునాథనృపా"

అని సమాధాన మిచ్చినాడట. ఈ సందర్భశుద్ధికి, వాక్చమత్కృతికి రాయలవారు సంతసించి విశేషంగా గౌరవించాడట.

క్షేత్రయ్య 18 క్షేత్రాలు దర్శించి అక్కడ వేంచేసి యున్న దేవులమీద పదాలతో ప్రస్తుతించాడు. ఈయన పదాలు చక్కని,

చిక్కని జాను తెనుగును వెలారుస్తూ ఉంటాయి. శృంగార రసభరితములై, శైలీ సౌకుమార్యంతో అన్వయ సౌలభ్యం, అర్థ గాంభీర్యం కలిగి భావపరిపుష్టితో భాసిస్తూ ఉంటాయి. ఈయన కాలం నాటికి పదకవిత పరమార్జితమైంది. అన్నమాచార్యుల వారి పదాలు వీరికి ఒజ్జబంతు లయినాయి. వీటిలో భక్తిపాలు హెచ్చుకాగా, క్షేత్రయ్య పదాలలో శృంగారం పాలు అధికం. సంగీతానికి ఎంత ప్రాధాన్య ముంటుందో అభినయానికీ అంతే ప్రాముఖ్య ముంటుంది. మధురభక్తితో పాటు విప్రలంభ, కరుణ రసాలు, ఆలంకారికశాస్త్రము ననుసరించి అష్టవిధ నాయికలు వర్ణింపబడినారు. ఈ పదాలు లాస్య సంప్రదాయానికి చెందినవి. ఈ పదాభినయం వలన కూచిపూడి భాగవతుల ప్రశస్తి మరింత వృద్ధిపొందింది.

ప్రస్తుతం ఈ గ్రామంలో "క్షేత్రయ్య కళాసమితి" అను సంస్థను క్షేత్రయ స్మారక చిహ్నంగా స్థాపించారు. ఇది రిజస్టరు చేయబడింది. దీని ఆధర్వంలో ఒక నృత్య సంగీత నాట్యశాల కూడ నడుపబడుతోంది. ప్రతి సంవత్సరం 'క్షేత్రయ్య వర్ధంతి' ఉత్సవాలు నిర్వహింపబడుతూ పదాభినయంలో పోటీలు ఏర్పాటుచేసి, విజేతలను సన్మానిస్తున్నారు.

**ఉదాహరణకు ఒక పదం :**

కాంభోజి

పల్ల॥ వదరక పో పోవే, వాడేల వచ్చేని - వద్దు రావద్దనవే

అ. ప. అది యొక్క యుగము వేరే జన్మ మిపుడు
అత డెవ్వరో నే నెవ్వరో - ఓ చెలియా...

చర॥ నిచ్చ నిచ్చలు నేడే వచ్చేని
రేపైన వచ్చి ననుచు మదిలో
నిచ్చగా బలు వేడి నిట్టూర్పుల చేత
ఇంతిరో పెదవు లెండి

హేమంచైన వెన్నెల చిచ్చుల రాత్రులు
ఎన్నాళ్ళనో గడపితి నిక నేటి మాటలే।
వలపువాడిదే కదా
వచ్చు ననుచు తెరువులు చూచి వేసారితి
నెల లెంచి యల సతి
నిలుపరాని ప్రేమ - నెమ్మది నడచుకొంటి
కలకంఠ పిక నాదములు మించు మధుమాస
ములు గడపితి వట్టి - ముచ్చట లిక నేలే
భామరో శకునము లడిగితి
మువ్వగో - పాలుడు వచ్చు ననుచు
కామించి నాథుని గలయు
చెలుల చూచి కరగి చింత నొందితి.

కొంతమంది ఈర్ష్యాళువు లయిన విజయరాఘవరాయని సభలోని పండితుల కింతవరకు చెప్పి మిగిలినది పూర్తిచేయమని కోరి ఆయన, రామేశ్వరయాత్రకు వెళ్లారట. ఆయన తిరిగివచ్చేవరకు వారు పూర్తిచేయలేక పోవడంతో క్షేత్రయ్య ఇలా పూరించాడు:

"రామరామ యీ మేనితో
వాని మోము జూడవలెనా
మొదటి పొందే చాలు, "వదరక."

**లీలాశుకుడు:** ఆంధ్రులు సంస్కృత భాషలో అపార పాండిత్యాన్ని గడించడమే కాక ఆ భాషలో మధురాతిమధుర గేయరచన, గ్రంథరచన సాగించి, వేదాలకు వ్యాఖ్యలు వెలయించి యావద్భారత ఖ్యాతి నందారు. అట్టివారిలో లీలాశుకుడు, పండిత జగన్నాథరాయలు, సాయణాచార్యులు మున్నగువారు వదాన్యులు.

లీలాశుకుడు 13-వ శతాబ్దికి చెందినవాడు. పూర్వాశ్రమంలో విషయలంపటుడై భోగవిలాసాలలో మునిగి తేలాడు. చింతామణి అను వేశ్యతో చాలాకాలం గడిపాడు. ఈయనను సోమగిరి యను

మహాత్ముడు చేరదీసి, భక్తిమార్గాన్ని ఉపదేశించి, విషయ వాసనల నుండి మరలించాడు. ఆయన ఉపదేశ ప్రభావంవల్ల జన్మాంతరం పొందినట్లై 'లీలాశుకుడు' అను నామాంతరాన్ని ధరించాడు. ఈయన కృష్ణానదీతీరంలోని వేదాద్రి నరసింహస్వామిని కొంతకాలం సేవించాడని ప్రతీతి. ఈక్రింది శ్లోకం ఈ విషయాన్ని వ్యక్తం చేస్తోంది :

" చింతామణి ర్జయతు, సోమగిరి ర్గురుర్మే।
శిక్షా గురుశ్చ భగవన్ శిఖి పింఛ మౌళిః।
యత్పాద కల్పతరు పల్లవ శేఖరేషు।
లీలా స్వయంవర రసం లభతేజయశ్రీః "

ఈ శ్లోకానికి అనేకమంది అనేక విధాల వ్యాఖ్యలు చేశారు. అవి ఎలా ఉన్నా శ్రీకృష్ణభగవానుని సేవించి, జన్మ చరితార్థం చేసికొన్నాడు.

అభినయంలోని అందాన్ని, భావమాధుర్యాన్ని, మనోధర్మాన్ని ప్రదర్శించడానికి కూచిపూడి భాగవతులు శ్లోకాభినయ సంప్రదాయాన్ని కూడా గ్రహించారు.

భగవంతుని లీలలను లీలాశుకుడు ఉదాత్తంగా వర్ణించాడు. వరాహావతార మెత్తినప్పుడు, సముద్రములన్నీ తన రోమ రంధ్రములలోకే చాలలేదట. అటువంటివాణ్ణి శ్రీకృష్ణావతారంలో యశోద, దోసెడు నీళ్లతో స్నానము చేయించి, కేలుదమ్మితో అడుగు దమ్మిని మోము దమ్మిమీద నిడి, మర్రియాకు దొప్పలో పరుండ బెట్టింది కదా ! ఈ భావం " అణోరణీయా న్మహతో మహీయాన్ " అను శ్రుతి వాక్యాన్ని తలపిస్తుంది.

సాధారణంగా పసిపిల్లలు నిదురలో కలవరిస్తారు. తల్లి లేక పెద్దలు పీడా పరిహారానికి ఆ సమయంలో 'థూ, థూ' అని అనటం సహజం. ఈ విషయాన్ని వీరు ఎంత చమత్కారంగా వర్ణించారో అంతకంటె రమ్యంగా భాగవతులు అభినయిస్తారు.

"రామో నామ బభూవ - హుం
తబలాసీ త్సీతి - హుం - తౌపితు।
ర్వాచా పంచవటీ తటీ విహార
తస్త స్యాప హృద్రావణః।
నిద్రార్థం జననీ కథా మితి హరేర్థూత్,
కారతః శృణ్వతః।
సౌమిత్రే! క్వధ్వనుర్ధను రితి
వ్యగ్రా గిరః పాన్తువః॥"

బాలకృష్ణుని తల్లి నిద్రబుచ్చడానికి చిచ్చికొడుతూ ఒక కథ చెబుతోంది. 'రాము డనే రాజున్నాడు' అనగానే బాలకృష్ణుడు 'హూం' అని ఊం కొట్టాడు 'ఆయన భార్య పేరు సీత.' 'హూం.' 'తండ్రి ఆజ్ఞ ననుసరించి అరణ్యానికి వెళ్లాడు,' 'హూం,' 'పంచవటీ ప్రాంతంలో విహరిస్తూ ఉండగా రావణుడు సీతను అపహరించాడు' అనే సరికి పూర్వస్మృతి కలిగి కథలో మునిగి యున్న బాలకృష్ణుడు, "లక్ష్మణా, లక్ష్మణా! ధనువెక్కడ?" అని కలవరించాడట. ఈ మాటలకు యశోద 'థూ, థూ' అన్నదట. అటువంటి కృష్ణుడు రక్షించుగాక! అని

ఒక సంభాషణ శ్లోకం :

"కస్త్వం బాల?
బలానుజః।
కిమి హతే?
మన్మందిరా శంకయా।
యుక్తం, తన్నవనీత పాత్ర వివరే
హస్తం కిమర్థం న్యసేః?
మాతః। కంచన వత్సకం మృగయితం।
మాగా విషాదం క్షణాత్,
ఇత్యేవం వర వల్లవీ ప్రతివచః కృష్ణస్య పుష్ణా తువః॥"

చూచారా "వెన్న కుండలో చేయి ఎందుకు పెట్టావురా" అంటే, "దూడ పోయింది. అది దీంట్లో ఉన్నదేమోనని వెతుకుతున్నా" నని సమాధానం చెప్పాడు. ఇలాంటి శ్లోకాలు అభినయిస్తుంటే ఎంతో ఆనందంగా ఉంటుంది.

శ్రీ శివనారాయణ తీర్థులు: ఈయన తన భక్తి ప్రపత్తులతో యావదాంధ్రదేశాన్ని పునీతంచేసిన భక్తుడు. క్రీ. శ. 1580 - 1680 మధ్యకాలమువాడు. నివాసము గుంటూరు జిల్లా కాజ అని అంటారు. ఇంటి పేరు తల్లావఝ్ఝులవారు. ఇప్పటికీ యీ గృహనామం కలవారు అక్కడ నివసిస్తున్నారు. వీరి వంశంలో చాలా మంది ఆశ్రమ స్వీకారం చేశారు. సుప్రసిద్ధ కవి శ్రీ శివశంకరస్వామి వీరి వంశంలోని వారే.

నారాయణతీర్థులు శ్రీకృష్ణభక్తులు. కృష్ణావతారం మొదలు రుక్మిణీకల్యాణం వరకు గల కథను గద్యపద్యాత్మకంగా, గేయాత్మకంగా, 'శ్రీకృష్ణలీలాతరంగిణి' అను పేరుతో గ్రథనం చేశారు. కృష్ణలీలలు కవితా ప్రవాహం కాగా, దానిలో తరంగాలు ఒక్కొక్క ఘట్టంగా అభినయింపబడినాయి. ఇది కృష్ణలీలాతరంగ సంభరితమై మధుర కవితా ప్రవాహంగా రూపొందింది.

తీర్థులవారు సంస్కృత పండితులు, కవులేగాక సంగీత, నాట్య శాస్త్రాలలో కూడ శేముషీధురంధరులు. వీరు దక్షిణ భారతదేశమంతటా ప్రసిద్ధి చెందారు. తరంగాలు రాని సంగీతాచార్యుడు గాని, అభినయించని నాట్యాచార్యుడు గాని ఉండడవటం అతిశయోక్తి కాదు.

'శ్రీకృష్ణకర్ణామృత' శ్లోకాలు అభినయించడానికి కూచిపూడి భాగవతులు ఎంత ప్రాముఖ్య మిస్తారో, 'కృష్ణలీలాతరంగిణి' లోని తరంగాల నభినయించడానికి కూడ అంతే ప్రాధాన్య మిస్తారు. వీరి కోసమే ఈ తరంగ రచన జరిగిందా అన్నట్లు భాసిస్తాయి. "బాలగోపాల" తరంగాన్ని అభినయిస్తూ, నీళ్లతో నింపిన

చెంబును నెత్తిమీద ధరించి, నీళ్లతో నిండిన పళ్లెం అంచుల మీద పాదాలు నిలిపి, చెంబులో నీరుగాని, పళ్లెంలో నీరుగాని బిందువు కూడ చిందీ పడకుండా; భావానికి, రాగానికి, తాళానికి భంగం కలుగకుండా గంటల తరబడి అభినయం చేస్తూ ఉంటే చూచి ఆనందింపవలసిందే గాని వర్ణింపనలవి కాదు. ఇది భాగవతుల నాట్యానికి పరాకాష్ఠ. తీర్థులవారిపట్ల వారి గౌరవానికి ప్రతీక.

కొందరు విమర్శక పండితులు తీర్థులవారిది గోదావరీ ప్రాంతంలోని కూచిమించి అగ్రహారమని, గోదావరీ సాగర సంగమమందున్న అంతర్వేది యందలి శ్రీ లక్ష్మీనరసింహస్వామిని ఆరాధించారని అంటూంటారు. ఇంక కొందరు కూచిపూడి అగ్రహారానికి పశ్చిమంగా ఒకటిన్నర మైలు దూరంలో ఉన్న నారాయణపుర అగ్రహార మంటారు. ఇలా ఎవరికి తోచిన రీతిని వారు వాదుకొంటున్నారు. ఎక్కడివారైనా, ఏమైనా లక్ష్మీ నరసింహస్వామి ఆరాధకు డనడంలో ఏకాభిప్రాయులు. వీరు ముక్త్యాల, చల్లపల్లి సంస్థానాలు దర్శించినట్లు ఆధారా లున్నాయి. వీరి రచనలలో జన్మస్థానాదికం వివరింపబడియుండలేదు.

శ్రీ తీర్థులవారు శ్రీ శివరామానందతీర్థులవారి శిష్యులు. సన్యసించి శివనారాయణతీర్థులైనారు. తీర్థయాత్రలు చేసుకొంటూ, దేశదేశాలు సందర్శించుకుంటూ తంజావూరు జిల్లాలోని 'వరహూరు', ఇప్పటి 'వరయూరు' చేరుకొన్నారు. తరంగ రచన ఇక్కడే సాగించారని అంటారు. ఈ ప్రాంతంలోనే ఈయన సిద్ధి పొందారట.

శ్రీ నారాయణతీర్థులవారు 'శ్రీ కృష్ణలీలాతరంగిణి' మాత్రమే గాక, మరికొన్ని గ్రంథాలుకూడ రచించారు. 'హరిభక్తి సుధో దయం' అను గ్రంథాన్ని, బ్రహ్మసూత్రాలకు, యోగసూత్రాలకు సంస్కృతభాషలో 'వృత్తులు' రచించారు. ఇవి మద్రాసు ప్రాచ్య

లిఖిత పుస్తకభాండాగారంలో భద్రపరచబడి ఉన్నాయి. తెలుగు భాషలో 'పారిజాతాపహరణం' అను యక్షగానాన్ని లిఖించారు. దీని మూలప్రతి 'భారతి' కార్యాలయంలో ఉన్నదట. ఇందులో వీరి గురుపాదులను గూర్చి :

" భవభయ తిమిర దివాకర
శివరామానంద తీర్థ శిష్యోత్తముడౌ,
శివనారాయణతీర్థులు
సవరణతోఁ బారిజాత చరిత రచించెన్ "

అని ప్రశంసించాడు. తెలుగు కవితా శిల్పానికి వెలుగులు జిలుగులు వెలయించి, సంస్కృత సరస్వతికి యతిప్రాసల అలంకారాలు కై సేసి, రమ్యత చేకూర్చిన మధుమాసమాకంద వనాంతరపుంస్కోకిల శ్రీ శివనారాయాణతీర్థులు.

పారిజాతాపహరణంలోని భామ విరహ ఘట్టంలోని దరువును చూడండి :

" ఎంత దుడుకువాడు గోపాలుడమ్మ
దాని వలపులకె వశమాయెనమ్మ,
తలచుకొంటే నే తాళలేనమ్మా
నారాయణతీర్థనామధేయుడమ్మా ?
హరి, హరి, హరి ఆనంద గోపకుమారుడు
అలిగితే నన్నాదరించు వారెవరు
ఎన్నరాని గుణరత్నాకరుడని
విన్నవింతురే వేదాంతములో
చిన్నవాడు ధీర నారాయణతీర్థ
చిత్తవృత్తి రంగనటన వినోది ॥"

జయదేవ మహాకవి : ఈయన ఓఢ్రుడైనా, వంగదేశంలో జన్మించినా, సంస్కృతభాషలో వాగ్గేయకారుడై భారత దేశమంతటా ప్రసిద్ధి వహించాడు. క్రీ. శ. 1116-'60 ప్రాంతంలో

గౌడదేశాన్ని లక్షణసేనుడు అను ప్రభువు పాలించాడు. జయదేవ కవి ఆయన ఆస్థాన పండితుడు. ఈయన రచించిన తొలిప్రబంధం 'గీతగోవిందం.' ఈ గ్రంథావతారికలో తనతల్లి రమాదేవి అని, తండ్రి భోజదేవు డని పేర్కొన్నాడు. బాల్యంలో జయదేవుడు సకలవిద్యలు అభ్యసించాడు. మహాకవిగా ప్రఖ్యాతి నార్జించాడు. సరస్వతీకటాక్షం ఉన్న వారికి లక్ష్మీకటాక్షం దుర్లభం. నిత్యకృత్యం కూడా సరిగా గడువని నిరుపేద కుటుంబంలో జయదేవుడు జన్మించాడు. యుక్తవయస్సు రావడంతోనే ఈయనకు దేవశర్మ అను గృహస్థు తనకుమార్తె పద్మావతి నిచ్చి పరిణయం చేశాడు. దైవప్రేరణవల్ల వీరు దంపతులు కాగలిగారని భావించాలి. పద్మావతి నాట్యశాస్త్రప్రవీణ. జయదేవుడు కవి, పండితుడేగాక సంగీతకళాకోవిదుడు, మధురగాయకుడు. ఈయన గాన మాలపిస్తూ ఉంటే, పద్మావతి తదనుకూలంగా సుకుమారంగా అభినయించేది. ఈ విషయాన్ని జయదేవుడు "వాగ్దేవతాచరితచిత్రితచిత్తసద్మా । పద్మావతీచరణచారణ చక్రవర్తిః" అని తన అష్టపదులలో తననుగూర్చి అభివర్ణించుకొన్నాడు. ఈయన రచించిన గీతగోవిందానికి 'అష్టపదు' లని మరోపేరు. ఇది అలంకారశాస్త్రవేత్తలకు ప్రమాణ గ్రంథం. నాట్యశాస్త్రవేత్తలకు ఆరాధ్య గ్రంథం. ఇందులో 12 సర్గ లున్నాయి. 24 అష్టపదులు, 800 శ్లోకాలు ఉన్నాయి. ఈ గ్రంథావిర్భావంనాటికి శార్ఙ్గదేవుని 'సంగీతరత్నాకరం' ఆవిర్భవించలేదు.

జయదేవ మహాకవి ఆత్మాభిమానం, ఆత్మగౌరవం గల మనీషి. తన కవితా మాధుర్యాన్ని గూర్చి తానే పరిశోధించి ప్రస్తుతించుకోగల స్వాతిశయపరుడు. ఇంతటి ఆత్మవిశ్వాసం సాధారణ రచయితలలో ఉండదు. చూడండి, "సందర్భశుద్ధిః గిరాంజానీతే జయదేవపవ" అన్నాడు. శబ్దప్రయోగ విషయంలోను, సందర్భశుద్ధి విషయంలోను జయదేవుడే సమర్థుడట. ఇది ఆయన అనటమే కాదు, ప్రత్యక్షర సత్యము. మరియొక సందర్భంలో,

"సాధ్వీ మాధ్వీక చింతా నభవతి
భవతః శర్కరే! కర్కశాసి!
ద్రాక్షే! ద్రక్ష్యంతికే త్వా మమృత
మృతమసి. క్షీరనీరం రసస్తే!
మా కందక్రంద కాంతాధర
ధరన తులాంగచ్ఛ యచ్ఛన్తి భావం!
యావచ్ఛృంగారసారం శుభ మివ
జయదేవ దేవస్య వైదగ్ధ్యవాచః"

అని ఎంత ధైర్యంతో అభివర్ణించుకున్నాడో చూడండి. కనుకనే అజరామరుడైనాడు.

"చందన చర్చిత నీలకళేబర
పీతవసన వనమాలీ।
కేళిచలన్మణి, కుండలమండిత
గండయుగస్మితశాలీ!
హరిరిహముగ్ధ వధూనికరే
విలాసిని విలసతి కేళిపరే॥"

అను అష్టపదిని "వదసి యది కించిదపి దంతరుచి కౌముదీ!" అనుదాన్ని కూచిపూడి భాగవతులు నర్తిస్తూ ఉంటే సాక్షాత్తు ఆ పద్మావతీ జయదేవులే భూమిపై తిరిగి అవతరించారా లేక రాధాకృష్ణులు విలాసంగా ఇచట నర్తిస్తున్నారా! అని పిస్తుంది. ఇవి జయదేవ మహాకవి హృదయ మధుర స్రోతస్సు నుండి వెలువడిన రసనిర్ఝరులు. నిత్యనూతన భావవిభా సంశోభితాలు.

ఇవిగాక ఈ భాగవతులు అభినయించే వాగ్గేయకారుల కూచిపూడివారు కూడా ఉన్నారు. వారిలో శ్రీ వేదాంతం?? శ్రీ హేళేశ్వరపు రామ కృష్ణయ్య ముఖ్యుడు. "ఈయన శ్రీ చింతా వెంకట రామయ్యా గారి ప్రథమ శిష్యుడు. ఇంతేకాదు బహుముఖ్యుడు కూడా.

శ్రీ సిద్ధేంద్రుని యనుగ్రహం పొందిన కూచిపూడి భాగవతులలో పూర్వీకుడు. భారత దేశంలోని పలుతావులందు తమ నాట్యము ప్రదర్శించి తాము పొందిన సన్మానాలకు శుభసూచకముగా, స్మృతి చిహ్నముగా క్షేత్రయ్యవలె, ఆ యా ప్రదేశాల దేవాలయ దేవతా నామములను కీర్తనలుగాను, విజయచిహ్నములుగాను ఆ యా ప్రాంతపు రాజుల కీర్తిని 'శబ్దములు' అను పేర సాహిత్యజతులు మిళితముగా రచించి, వాటిని తమ నాట్యమందొక భాగముగా నిమిడ్చి, చరిత్రను స్థిరపరచుకొని ముందుకు సాగిన తీరు హర్షింప దగినది.

శ్రీ యేలేశ్వరపు రామకృష్ణయ్యగారి భాగవత కీర్తనలు తిలకించినచో వారి గురువులగు శ్రీ చింతా వేంకట రామయ్య గారితో కలసి ఏ ఏ పుణ్యక్షేత్రములందు ప్రదర్శనముల నిచ్చినది విపులముగా తెలియగలదు. మరియు శివపరముగాను, విష్ణుపరము గాను రచించిన వీరి కీర్తనలు ఆ యా దేవతానామమందుగల బీజాక్షర సంపుటి తీరుకు, నాటి శ్రీ కూచిపూడివారి మంత్రశాస్త్ర పటిమకు చిహ్నము.

"తత్త్వము" లను పేర వీరు జ్ఞానకాండను తెలిపిన తీరు గొల్లకలాపమునందున్న గోపికా విప్ర సంవాదమునందుగల సారాంశమును బోలి యుండును. వీనియందుగల కవి ప్రతిభా విశేషము గమనింపదగినది.

క్రీ. శ. 1849-వ సంవత్సరమున జన్మించిన శ్రీ రామకృష్ణ మహాకవి తల్లి రామలక్షమ్మ. తండ్రి వెంకట సుబ్బయ్య. సగుణో పాసన గురువు శ్రీ పిల్లలమర్రి సుబ్బారాయుడుగారు. కారణ గురువు శ్రీ పెన్నా శేషబ్రహ్మంగారలు. కనుగొల్లు, నల్గొండజిల్లా. ఈయన నాట్యగురువు శ్రీ చింతా వేంకటరామయ్యగారు. వీరు ముగ్గురును బాల్యస్నేహితులు. బ్రహ్మవేత్తలు. ఇట్టి గురుత్రయానుగ్రహమున

రచన సల్పిన శ్రీ రామకృష్ణయ్య క్రీ. శ. 1909 లో పరమ పదించారు.

ఆది - నాటరాగం

గణపతి

పల్లవి : నమో నమో గణనాయక
నమో నమో గణనాయక ॥

అనుపల్లవి : ఉమా తనయ భవకుమారాగ్రజా ॥ నమో ॥

చర ॥ సాంబతనయ సకలార్థసిద్ధిప్రద
వినాయక హే విఘ్ననాశ శుభకర ॥ నమో ॥
వేదవేద్య సకలాగమ పూజిత
ఆదిదేవ సకలాధారస్థిత ॥ నమో ॥
వర కుచేలపురవాస రామకృష్ణ
ధరణీసురపాలక, వినాయక ॥ నమో ॥

ధన్యాసి - కీర్తన - ఆది

పల్లవి : భక్తితో సమానమైన భాగ్య మున్నదే
శ్రీ గురుభక్తితో సమానమైన భాగ్య మున్నదే ।

అ. ప. యుక్తియుక్తమైన వేదసూక్తులకును
మూల మగుచు రక్తిగ గురుభక్తజనుల
ముక్తినొందజేయు నహాహా! ఘన ॥ భక్తి ॥
జగమనెడూ భ్రమత జిక్కి అగడు జెంది
యున్నవారి దిగులు బాపజేయు, పరమ
నిగమ సారమయిన శ్రీ గురుపద ॥ భక్తి ॥
ఎరుగజేసి ఎరుక మరపు నొరయకుండా
పరము నొసగు గురుని పాద ॥ భక్తి ॥
ధరణిలో కనుగొంటి

వర వైకుంఠపురము నంది పొందు ॥ భక్తి ॥
జాలి మెంతో చాల గల్గి
యేలేశ్వరపు రామకృష్ణ
పాలిక చనుదెంచు, మోహ
జాలములను ద్రుంచు గురుపద ॥ భక్తి ॥

ఇలాంటి కీర్తనలు ఎన్నో ఉన్నాయి. ఇవిగాక కూచిపూడి భాగవతులు ప్రదర్శించే 'పుష్పబాణ విలాసం'లోని శ్లోకాలు, ఇతర శ్లోకాలు కూడా ఉన్నాయి.

"యుక్తం కిం తవ శర్వరీశముఖ!
మద్వేణీ సమాకర్షణం।
బాలే! త్వత్కుచమండలం మమ కథం
గృహ్ణాతి చేతో జవాత్ ।
వత్యస్తం కరుతే - త్వయా జహి
జహి స్వామిన్! వచ స్సాధు తే
ఆగోయః కురుతే స ఏవ భవతాం
దండస్య యోగ్యః ఖలు ॥

ఈ శ్లోకంలోని వ్యంగార్థాన్ని గ్రహించారు కదా!

"కావా కాంతా! కలభగమనా!
దక్షిణా దక్షకన్యా ।
రంభోరూ, మాం రమయ రమణీ!
సాపరాధం ప్రపనం ।
నేఽయం గౌరీ కథ మిహ భవేత్
ప్రేయసీ మీననేత్రీ।
గంగానన్యా దపిచ త్రిజగ
న్మోహినీ స్యాదనన్యా"

మరియొక రసగుళిక:

"శృంగారం క్షితి నందినీ విహరణే
వీరం ధనుర్భంజనే।
కారుణ్యం బలి భోజనేऽద్భుత రసం
సింధౌ గిరి స్థాపనే।
హాస్యం శూర్పణఖా ముఖే భయ వహీ
భీభత్స మన్యాముఖే।
రౌద్రం రావణ మర్దనే మునిజనే
శాంతం వపుః పాతునః

చివరగా ఇంకొక శృంగారరస ఖండం:

"మాతః కేళిగృహం నయామి శయితుం
కస్మాచ్చ చంద్రాననే।
జామాతా తవ నిర్దయః భుజ లతా
పాశేన మాం బాధతే।
వక్షోజ గ్రహణం కరోతి సతతం
ఓష్ఠం దశత్యాదరాత్
నీవీ బంధన మోచనం చ కురుతే
నిద్రాం న లేభే నిశి॥"

ఇత్యాదులన్నీ ప్రేక్షకజన సంస్కారానుగుణ్యంగా అభినయింపబడుతూ ఉండేవి.

"చతుర్విధాః ప్రవృత్తిశ్చ ప్రోక్తా నాట్య ప్రయోక్తృభిః।
అవంతీ దాక్షిణాత్యాచ పాంచాలీ చోఢ్ర మాగధీ॥"

—నాట్యశాస్త్రము

### శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రము, కూచిపూడి :

"ఇత్యేవ మృషిభిర్గీత స్సామవేద సముద్భవః ।
సప్తరూపమతో జాతః గీతజాతం పురాకిల."
(భరతార్ణవము)

క్రీ. శ. 1949 లో శ్రీ చింతా వేంకటరామయ్యగారు పరమపదించారు. కూచిపూడి నాట్య సంప్రదాయంలో అర్ధ శతాబ్దంపాటు అనన్య శేముషీవిభవాన్ని వినియోగించి భామా కలాప, గొల్లకలాప, యక్షగానాది సంప్రదాయాలను అభివృద్ధికి తెచ్చి ప్రముఖ నాట్యాచార్యునిగా, ప్రసిద్ధ నాట్య ప్రయోక్తగా కీర్తి గడించిన సఫల నాట్యకళా తపస్వి కూచిపూడి నాట్యకళారాధకులకు, ఆంధ్ర కళాభిమానులకు దూరమైనాడు.

ప్రముఖ నాట్యాచార్యులు చలనచిత్రరంగ ప్రవేశం చేశారు. యువతరంలో నాట్యకళా ప్రచారం చేసి, అధ్యాపనం చేయగల సమర్థ నాట్యాచార్యులు కూచిపూడిలో కరువయ్యారు. అందువలన మదరాసునందలి 'అడయారు నాట్యకళాక్షేత్రం' వలె కూచిపూడి అగ్రహారంలో కూడ కళాక్షేత్రాన్ని స్థాపించాలని వివిధ సంప్రదాయాల నాట్యాచార్యులను, నాట్యవిద్యార్థులను ఆహ్వానించాలని, ఆకర్షించాలని, సాహిత్యపరిజ్ఞానాభివృద్ధికి ప్రాచ్య భాషాకళాశాల నెలకొల్పాలని, ప్రాచీన ప్రాభవాన్ని పునఃప్రతిష్ఠించి గౌరవాన్ని పొందాలని నవయువకులలో ఉద్వేగం, ఉత్తేజం పుట్టుకొచ్చింది.

అనుదినం క్షీణగతికి వస్తూ, ప్రాజ్ఞుల విమర్శలకు గురి అవుతూ, రూపాంతరాలు చెందుతూ ప్రాచీనతను కోల్పోతున్న కూచిపూడి నాట్యకళాసరస్వతీ దైన్యాన్ని వారు గ్రహించారు. హృదయాలు ద్రవించినాయి. అభ్యుదయకాముకులు అన్ని కాలాల్లోను ఆవిర్భవిస్తారు. కాలం కలసివచ్చి, వారి యత్నాలు సఫలమైతే వారిని

ప్రతిభావంతులుగా లోకం గుర్తించుతుంది. ప్రజలు కీర్తిస్తారు. పరిస్థితి ఇందుకు వ్యతిరేకమైతే నామరూపాలులేకుండా వీరు కాలగర్భంలో కలసి పోతారు. అదృష్టవంతులైన అసమర్థులు అందలాలలో ఊరేగింప బడతారు.

ప్రప్రథమంగా 1947 లో శ్రీ భాగవతుల రామకోటయ్య సిద్ధేంద్ర నాట్యమండలిని మహదాశయంతో స్థాపించాడు. శ్రీ అయ్యంకి తాండవకృష్ణ, యమ్. ఏ., ప్రసిద్ధ నాట్యాచార్యులు. వీరు ఈ నాట్యమండలి పర్యవేక్షకులుగా ఉండేవారు. శ్రీ రామకోటయ్య ప్రధాన నాట్యాచార్యులు. శ్రీ వేదాంతం సాంబయ్య సంగీత దర్శకులుగా వ్యవహరించేవారు. శ్రీకృష్ణజయంతితో పాటు శ్రీ సిద్ధేంద్రజయంతిని కూడా కలిపి, మహావైభవంగా ఉత్సవాన్ని నిర్వహించేవారు. కవులు, పండితులు, నాట్యాచార్యులు, నటకావతంసులు, ప్రముఖులు, ఇంకా పలువిధాల పెద్దలు ప్రత్యేకంగా ఆహ్వానింపబడి ముచ్చటగా మూడుదినాలు ఈ ఉత్సవాలు జరిగేవి. ఉపన్యాసాలు, నాట్య, నాటక, కలాప ప్రదర్శనలు జరిగేవి. ఆ మరునాడు ఆ ప్రదర్శనల సమీక్ష జరిపించి ఉత్తమ ప్రదర్శకులను నిర్ణయించేవారు. తుదిదినమున వీరికి సన్మానం జరిగేది. ఈ ఉత్సవాలు, నాట్యమండలి వార్షికోత్సవాలు కూడ సమ్మానయమవుతూ ఉండేవి. ఈ నాట్యమండలిలో కూచిపూడి సంప్రదాయ నాట్యం, భామాకలాప, గొల్లకలాప, యక్షగానాదులు నేర్పబడుతూ ఉండేవి. ఈవిధంగా నాట్యమండలి ముద్దుగా మూడు వార్షికోత్సవాలు జరుపుకొంది. ఇంతలో శ్రీ చింతా వేంకటరామయ్య గారి ప్రథమ వర్థంతి ఉత్సవాలు వచ్చినాయి. ఆయన మరణించినప్పుడు రాలేని, రాజాలని అన్ని ప్రాంతాలలోని కళాకారులు ఆహ్వానింపబడినారు. కవులు, కళాభిమానులు, కళావేత్తలు, రాజకీయప్రముఖులు ఆ మహోత్సవంలో పాల్గొన్నారు. కూచిపూడికి సంబంధించిన నాట్యాచార్యులు పలుప్రాంతాలనుండి

అభిమానంతో విచ్చేశారు. కలాపాలు, యక్షగానాలు ప్రదర్శించి, వారిపట్లగల అభిమానాన్ని చాటారు. శ్రీ వేంకటరామయ్యగారిని మనసార సంస్మరించారు. అది మరపురాని మహోజ్జ్వల ఘట్టం.

నాట్యాచార్యుల ప్రదర్శనలు ప్రేక్షకజనుల నలరించాయి. కవి, పండిత, గాయక, రాజకీయ నాయకులు గంభీరోపన్యాసాలు చేశారు. ఈ సంప్రదాయపు నాట్యకళ మరుగున పడకుండా పునరుద్ధరించవలసిన ఆవశ్యకతను, బాధ్యతను గురించి హెచ్చరించారు. నాట్యకళా క్షేత్రాన్ని స్థాపించాలని అర్థించారు. అలా జరుగనినాడు కూచిపూడి సంప్రదాయ నాట్యకళ పేరు ప్రఖ్యాతులు అడుగంటిపోతాయని ఆవేశపూరితంగా అభిభాషించారు. అభ్యర్థించారు, ప్రబోధించారు.

ఈ హెచ్చరికలు, ప్రబోధాలు భాగవతుల హృదయాలను కదలించాయి. యథార్థాన్ని గుర్తింప చేశాయి. ఉత్సాహ ప్రోత్సాహాలు ఇనుమడించాయి. శ్రీ వెంపటి రాధాకృష్ణ ప్రణాళికా రచనా కార్యక్రమాన్ని చేపట్టారు. 'శ్రీ లలిత కళాక్షేత్రం' అని నామకరణం చేయబడింది. శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామ ప్రసాద్ బహద్దరు, జమీందారు, ఎం. ఎల్. ఏ., చల్లపల్లి రాజాగారు అధ్యక్షులుగా ; రైతుపెద్ద, ప్రముఖ రాజకీయ నాయకులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, ప్రసిద్ధ యక్షగాన నాయక పాత్రధారి శ్రీ వేదాంతం రామకృష్ణయ్యగారు ఉపాధ్యక్షులుగా; శ్రీ భాగవతుల హనుమంతరావుగారు, హోమియోపతి డాక్టరు కార్యదర్శిగా ; శ్రీ చింతా కృష్ణమూర్తి, శ్రీ మహంకాళి సత్యనారాయణ మున్నగువారలు కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా; తదితర కళాకారులు సాధారణ సభ్యులుగా ఏర్పడి ఈ సంస్థ రిజిస్టరు చేయబడింది.

శ్రీ చల్లపల్లి రాజాగారు శాసనసభా సభ్యులు కావడంవలన అనేక కార్యక్రమాలలో పాల్గొనవలసి యుండేది. కూచిపూడి భాగవతులమీద అభిమానంతో అధ్యక్షునిగా అంగీకరించారు.

కాని ఈ లలితకళాక్షేత్రంకు సంబంధించిన ప్రథమ సమావేశానికే హాజరుకాలేక పోయారు. దీనికి పురిటిలోనే సంధికొట్టినట్లయింది. ఒక సమావేశంకూడా కాకుండానే అంతరించి పోయింది. కూచిపూడి భాగవతుల ప్రతిష్ఠకు ఇది భంగకరంగా పరిణమించింది. శ్రీ చింతా కృష్ణమూర్తిగారికి తలవంపు లయింది. ఆయన తన పితృపాదుల పేరుమీద 'శ్రీ వేంకటరామ నాట్యమండలి' అనే పేరుతో తన మేళములోనివారు మండలి సభ్యులుగా, తాను అధ్యక్షులుగా వెంటనే రిజిష్టరు చేయించారు. ఈ సంస్థ మూడు పూలు, ఆరు కాయలుగా వృద్ధినందింది. భారతదేశమంతటా ప్రదర్శనలిచ్చింది. రాజకీయ ప్రముఖుల, కళాకోవిదుల హృదయాల నాకర్షించింది. నటశేఖరులు శ్రీ బందా కనకలింగేశ్వరరావు వీరికి అడుగడుగునా తమ సహాయ సంపత్తి నందిస్తూ అన్నివిధాల అభివృద్ధికి తీసుకొని వచ్చారు. 1947 లో సిద్ధేంద్రనాట్యమండలిని స్థాపించిన శ్రీ భాగవతుల రామకోటయ్య హైదరాబాదునగరం చేరుకొని అక్కడ కూచిపూడి నృత్యనిలయాన్ని స్థాపించి ఆయన అభిరుచులకు అనుకూలంగా నాట్యతరగతులు నిర్వహిస్తూ కళాసేవ చేస్తున్నారు.

శ్రీ వేంకటరామ నాట్యమండలి బలపడింది. పేరు ప్రతిష్ఠలు సమకూర్చుకొంది. శ్రీ చింతా కృష్ణమూర్తిగారు ఈ సంస్థను కట్టుదిట్టంగా, క్రమశిక్షణతో నిర్వహిస్తున్నారు. ఆయన సూత్రధారిత్వం వహించి తమ తండ్రిలేని లోటు తీరుస్తున్నారు. క్రమంగా ఘంటశాల గ్రామ నివాసి, రైతు పెద్ద శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య గారి శుభాశీస్సులతో, ఇతర కళాకారుల, రాజకీయ ప్రముఖుల ఉత్సాహ ప్రోత్సాహములతో, శ్రీమత్తిరుమల తిరుపతి వేంకటేశ్వర స్వామివారి అనుగ్రహ ఆర్థిక సహాయములతో, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వముల ఆర్థిక వనరులతో ఈనాటి "శ్రీ సిద్ధేంద్రకళా క్షేత్రం" అవతరించింది. ఈ కళాక్షేత్ర స్థాపనకు జరిగిన కృషిని

వరిస్తూ, కళాక్షేత్ర అధ్యక్షులు, మాజీ శాసనమండలి అధ్యక్షులు రాష్ట్ర రాజకీయనాయకులు శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు తమ జీవననౌక' అను ఆత్మకథలో, ఆంధ్రజ్యోతి దినపత్రికలో ధారావాహికంగా ప్రచురితమైన వ్యాససంపుటి 66-వ భాగం, 1970 అక్టోబరు 5-వ తేదీ సంచికలో ప్రకటితమైంది. ఈనాడు ఆ వ్యాససంపుటి గ్రంథరూపం దాల్చింది. దానిలోని వ్యాసాన్ని పాఠకుల సౌకర్యార్థం, యథాతథంగా ప్రకటిస్తున్నాను.

"సంగీతానికి విజయనగరం, సాహిత్యానికి రాజమహేంద్రవరము ప్రఖ్యాతి వహించినట్లే నాట్యకళకు కూచిపూడి ప్రసిద్ధిగాంచింది నాట్య, నృత్యాల పేర్లు చెవిని బడగానే కూచిపూడి స్మృతికి వస్తుంది. అది ఒక కళాక్షేత్రం, ఒక పుణ్యస్థలం. ఒక చారిత్రక ప్రదేశం. కూచిపూడివారి కులపతి సిద్ధేంద్రయోగి సిద్ధి పొందిన పుణ్యక్షేత్రం.

కూచిపూడి ఆంధ్రావనికేకాక యావద్భారతదేశానికి తలమానికమనడం అతిశయోక్తి కాదు.

ఆంధ్రసంస్కృతికిగల విశిష్టసంపత్తిలో కూచిపూడి భరతనాట్యం అగ్రగణ్యం. భారతదేశ నాట్యచరిత్రలో దాని స్థానం మహోన్నతమైనదనడంలో సందేహంలేదు.

వారు నాల్గువందల సంవత్సరాలనుండి ఈ నృత్యవిద్యనవలంబించి, దక్షిణదేశమంతటా జైత్రయాత్ర చేశారు. వారు గజ్జెకట్టని గ్రామం లేదు. పొందని ప్రశంస లేదు.

ఆంధ్రులకు మహోన్నతమైన జాతీయనృత్యం గలదని సగర్వంగా చెప్పుకోనడానికి, ఆ నటరాజారాధకులే కారకులు. వారీవిధంగా ఆంధ్రుల యశస్సును కాపాడుకుంటూవచ్చిన కళాజీవులు.

వీరు భగవత్సంబంధమైన కథలు పాడి, ఆడి ఆనందించడంచేత భాగవతులైనారు. కూచిపూడివారు కావడంచేత 'కూచిపూడి భాగవతు'లని పిలువబడుతున్నారు.

ఆదిలో సిద్ధేంద్రయోగిచే శిక్షణ పొందినవారు భాగవతులైనారు. ఈ గృహనామం కలవారు నేడెక్కడ ఉన్నా వారు కూచిపూడివారే.

ద్వివేదులు, త్రివేదులు, చతుర్వేదులు అన్నట్టే భాగవతుల అన్నదికూడ పౌరుషనామమే. కూచిపూడిలో కురువృద్ధులైనవారు నలుగురు నాలుగు విద్యలలో ప్రఖ్యాతులు అయినారు.

చింతా వేంకటరామయ్యగారు ( 1860-1947 ) నలుబది సంవత్సరాలు ఆడి, పాడి అనేకులకు విద్య చెప్పి 'యక్షగానా'లలో అతిశయ యశస్సు సంపాదించిన నాటకపితామహులు.

వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు 'భరతనాట్యాచార్యులు'గా బహుఖ్యాతి గాంచి పెక్కు సన్మానాలుపొందిన పుణ్య పురుషులు.

వెంపటి వేంకటనారాయణగారు 'భామాకలాపం'లో బాగు బాగు అనిపించుకొన్న మహాభాగులు.

పసుమర్తి శేషయ్యగారు 'పగటి వేషాల'లో ప్రఖ్యాత పురుషులు.

వీరి అనంతరం చింతా వేంకటరామయ్యగారి కుమారుడు కృష్ణమూర్తిగారు 'శ్రీ వేంకటరామనాట్యమండలి' స్థాపించి దాదాపు ముప్పది సంవత్సరాలు కృషిచేసి, తండ్రివలె యశస్సు అందుకున్నారు. అఖిల భారత సంగీత నాటక అకాడమీవారి అవార్డును, అందులోను అయిదువేల రూపాయలను వీరికి బహూకరించి, కూచిపూడి భరతనాట్య శిష్టతకు నివాళు లర్పించారు.

వేదాంతం సత్యనారాయణశర్మ 'భామాకలాపం'లో భామ, 'ఉషాపరిణయం'లో ఉషపాత్ర ధరించి, యశస్సు గాంచుతున్నారు. స్త్రీ పాత్రలో సంగీత, నాటక అకాడమీవారి అవార్డును, ఫెలోషిప్పును పొందిన విషయం సర్వజన విదితం. శ్రీయుతులు వేదాంతం రాఘవయ్య, వెంపటి పెద సత్యం, చిన సత్యం, పసుమర్తి

కృష్ణమూర్తి. (నేడు వీరు పద్మశ్రీలు) మరింకెందరో కులపతులు గాను, సినిమా నాట్యాచార్యులుగాను ఉండి కూచిపూడి భరత నాట్య ప్రసిద్ధి నలుదిశల ప్రసరింపజేయుట ఆనందించతగినది.

కూచిపూడివారి 'ప్రహ్లాద' నాటకమును, ప్రప్రథమంగా నా పదియవయేట మా ఘంటశాలలో చూచి ఆనందించాను. అది నాటికీ, నేటికీ నా హృదయసీమలో చెరగని ముద్ర అయింది.

నేను 1927 లో బందరు తాలూకా బోర్డు అధ్యక్షుడుగా వున్నప్పుడు చింతా వేంకటరామయ్యగారు వృద్ధాప్యంలో వుండి కూడ, ఒక చిన్న పాకలో శిష్యులకు ఈ నాట్యవిద్య నేర్పడం కనులారా గాంచి ఆనందించాను. ఈ రెండు దృశ్యాలు నా మనో వీధిలో నిలిచి వున్నవి.

1951 లో బెజవాడ గోపాలరెడ్డిగారు ఆర్థికశాఖా మాత్యులుగా వుండగా, సంజీవరెడ్డిగారు పి. సి. సి. అధ్యక్షులైన మరుసటి రోజే, గోపాలరెడ్డిగారు దివితాలూకాలో నాతో కలసి పర్యటించి మా ప్రాంతంలోని పుణ్యక్షేత్రాలు చూడాలని అభిప్రాయపడ్డారు.

కూచిపూడిలో సిద్ధేంద్రయోగి స్థాపించిన కూచిపూడి కళాక్షేత్రాన్ని, క్షేత్రయ్య భజించి తరించిన మువ్వగోపాల స్వామిని, శ్రీకాకుళంలో ఆంధ్ర సమ్రాట్. ఆంధ్రనాయకుని ఆంధ్ర విష్ణువుగా పూజలు పొందుతున్న శ్రీ కాకుళేశ్వరస్వామిని దర్శించాము.

కూచిపూడిలో బ్రాహ్మణ విద్యార్థి ఉపనయనం రోజున కాళ్లకు గజ్జెలు కట్టి, లక్ష్యలక్షణబద్ధంగా, ఉపదేశికులైన ఆచార్యుల కనుసన్నలతో, సంగీత సాహిత్య విద్వాంసుల ఆశీర్వచ నాలతో శ్రీ రామలింగేశ్వరస్వామివారి ఆలయంలో స్వామివారిని విద్యాభిక్ష అర్థించి, భరతనాట్య అభ్యాసానికి జీవితం అంకితం చేయడం జరుగుతున్నది. ఇట్టి ఆచారం, ఆంధ్రదేశంలో ఒక్క-

భాగవతుల కూచిపూడిలోనే కలదు. అయితే అది నేడు కొన ఊపిరితో వున్నది. ఈ ప్రాచీనకళను నిలబెట్టడానికి, పునరుద్ధరించడానికి కూచిపూడిలో సకలసౌకర్యాలతో ఆంధ్రదేశానికి యాత్రాస్థానం కాదగిన ఒక కళాకేంద్రాన్ని నిర్మాణం చేయడం అత్యవసరమని, కూచిపూడిలో జరిగిన బహిరంగ సభలో గోపాలరెడ్డిగారిని తగిన శ్రద్ధ వహించవలసినదిగా నేను విజ్ఞప్తి చేశాను. గోపాలరెడ్డిగారికి రాజకీయాలలో ఎంత అభిరుచో సాహిత్యమందు, కళలయందు అంత అభిమానము గలదు.

నా విజ్ఞప్తికి సమాధానంగా గోపాలరెడ్డిగారు మాట్లాడుతూ ఆ ప్రదేశం అఖిల భారత యాత్రా స్థలంగా ఉండేటట్టు, భరత నాట్యానికి సంబంధించిన ఒక విద్యాలయం ఏర్పాటు అయ్యేటట్టు చూడగలమని చెబుతూ, ప్రభుత్వం కొంత సహాయం చేసినా, ప్రజలు కూడా అందుకు పూనుకోవాలని ఉద్బోధించారు. గోపాలరెడ్డిగారు తమ వాగ్దానం చెల్లించడానికి సంసిద్ధంగా ఉన్నప్పటికీ, ఆ గ్రామస్థులు కార్యనిర్వహణలో అంత ముందంజ వేయలేదు.

తరువాత కొంతకాలానికి చంద్రమౌళిగారు దేవాదాయ శాఖామాత్యులుగా వచ్చినప్పుడు, ఆయన కూచిపూడి ప్రాంతాలను చూచినప్పుడు, ఆనాటి అభిప్రాయాలను నేను తిరిగి చెప్పడం జరిగింది. తరువాత నా అధ్యక్షతక్రింద కూచిపూడి కళాక్షేత్ర పాలకవర్గాన్ని ఏర్పాటు చేసికొనడం జరిగింది. దానికి కార్యదర్శిగా బందా కనకలింగేశ్వరరావుగారు నియమింపబడ్డారు.

బందా కనకలింగేశ్వరరావు: ఆంధ్రప్రదేశ్‌లో నాటకరంగంలో ప్రథమశ్రేణి నటుడు. 40 సంవత్సరాలు ఆయన కళారాధన ఆంధ్రుల ప్రశంసల నందుకొంది. శ్రీకృష్ణ, సారంగధర, కాళిదాస పాత్రలకు ఆయన ప్రతిష్ఠ నార్జించుకున్నారు. నటనలో కేంద్ర సంగీత, నాటక అకాడమీ బహుమతి నందుకొన్న ప్రతిభాశాలి ఆయన.

స్వర్గీయ డి. వి. సుబ్బారావుగారి వలె తమ జన్మస్థలం ఏలూరులో స్వంత నాటక సమాజమును స్థాపించి, ఆంధ్ర దేశము నంతటను పర్యటించి, మేటి నటుడుగా ప్రతిష్ఠ నార్జించుకున్నారు. కేంద్ర నాటక అకాడమీ సభ్యుడు. కేంద్ర నృత్య నాటక సలహా సంఘ సభ్యుడు. 1956 నుంచి విజయవాడ, ఆకాశవాణిలో ఉద్యోగిగా వున్నారు. కూచిపూడి నాట్యోద్ధరణ తన ప్రథమ కర్తవ్యంగా భావించి కళాక్షేత్రమునకు కార్యదర్శిగా అంగీకరించుట ఆనందదాయకము. కూచిపూడి నాట్య నాటకసమాజమును దక్షిణాదికే కాక, ఉత్తరాది రాష్ట్రములకు, ముఖ్యంగా ఢిల్లీకి తీసుకొనివెళ్లి, నాటకప్రదర్శన లిప్పించి, కూచిపూడి భరతనాట్యమునకు, నాటకకళకు అఖిల భారత ప్రతిష్ఠ నార్జించి పెట్టిన గౌరవము శ్రీ కనకలింగేశ్వరరావుగారికి ఇచ్చుట న్యాయము. కేంద్ర నాటక అకాడమీ గ్రాంటులను తెచ్చి కళాక్షేత్ర భవనములను నిర్మాణము చేయించుటయేగాక, కేంద్ర అకాడమీ సభ్యులను ప్రతి సంవత్సరము కూచిపూడి, మొవ్వ ఆహ్వానించి, సిద్ధేంద్రయోగి, క్షేత్రయ్య జయంతి ఉత్సవాలను జయప్రదంగా జరిపి కళారాధకులను ప్రోత్సహించేవారు. ఇది మిక్కిలి ప్రశంసనీయం.

ఆనాటి సమావేశంలో చేసిన వాగ్దానం ప్రకారం శ్రీ చంద్ర మౌళిగారు తిరుపతి దేవస్థానం నుంచి యాభై వేల రూపాయలు విరాళం ఇవ్వడంవల్లనూ, కనకలింగేశ్వరరావుగారి కృషిఫలితంగా లభించిన కేంద్ర సంగీత అకాడమీ సహాయంవల్లనూ నాలుగు యకరాల భూమిని కొని, రెండు భవనాలు నిర్మించి, అఖిల భారత స్థాయిలో సిద్ధేంద్ర కళాక్షేత్రాన్ని, ఓరియంటల్ సంస్కృత ఉన్నత పాఠశాలను ఏర్పాటుచేయడం జరిగింది. విద్యార్థుల వసతిగృహాలు, ప్రదర్శనలకు నాట్యశాలలు శిల్పసంశోభితంగా నిర్మింపబడినవి. ఈ నిర్మాణాలకు కేంద్రప్రభుత్వం, కేంద్ర సంగీత నాటక అకాడమీ వారు కూడ తగిన రీతిని సహాయపడుతున్నారు. గ్రామస్థులు, స్థానిక

శ్రీ వేంకటరామ నాట్యమండలివారు తాము చెల్లించవలసిన మొత్తాన్ని సేకరించి సమకూర్చారు.

దీనికి విజయవాడలో ఒకశాఖ కూడ ఏర్పడింది. అది దినదినాభివృద్ధి అవుతూ వుంది. నేను కౌన్సిల్ ఛైర్మన్ అయిన తరువాత, అధ్యక్షపదవికి రాజీనామా చేశాను. తరువాత శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు అధ్యక్షులయినారు. కనకలింగేశ్వరరావు గారు కార్యదర్శిగానే ఉన్నారు. ఈయన ఇటీవలనే కాలధర్మం చెందారు.

## ఢిల్లీలో జరిగిన అన్యాయాన్ని సరిదిద్దాలి అని అభ్యర్థన

కూచిపూడి నాట్యం శాస్త్రబద్ధంకాదని కేంద్ర నాట్య సదస్సు ఢిల్లీలోచేసిన నిర్ణయం ఆంధ్రదేశంమీద పిడుగుపాటుగా భావించ తగినది.

దేశంలో ఏ ప్రాంతమునకు ఆ ప్రాంతీయ భాష గలదు. ఈ భాషలు మాట్లాడునపుడు ఒకటి మధురముగా నుండును. మరొకటి వీరరస మట్టిపడునట్లుండును. వేరొకటి లలితముగ జోలపాట పాడినట్లుండును. ఇట్లు ప్రతిభాషకును ఒక ప్రత్యేకత గలదు. ఈ భాష లన్నియూ పుష్టిగ పెంపొందవలసినదే!

భాషలవలెనే ఆంధ్రదేశమున కూచిపూడి నాట్యం, మలబారున కథాకలి, ఉత్తరాదిన మణిపూర్ నృత్యములు ప్రసిద్ధములు. తంజావూరు నాట్యము కూచిపూడి నాట్యమున ఒక భాగముగ ఇంత వరకు పరిగణింపబడుచున్నది. కూచిపూడి నాట్యశాస్త్ర రచయిత తపస్సంపన్నుడగు సిద్ధేంద్రయోగి. ఆయనే ప్రథమ నాట్య బృందమునకు ఆదిగురువు.

నాట్యశాస్త్ర అధ్యయనం, అభ్యాసం మతవిధిగా భావించి నిత్యానుష్ఠానమును, శిష్ట సంప్రదాయముగ నిర్వహించుచున్న గ్రామము భారతదేశమున కూచిపూడి ఒక్కటియే అనుట సత్యము. ఈ గ్రామము 'భాగవతుల కూచిపూడి' అని ప్రసిద్ధినొందినది. ప్రతి

బ్రాహ్మణుడు ఉపనయనము రోజున కాళ్ళకు గజ్జెలు కట్టి లక్ష్య లక్షణ బద్ధముగ ఉపదేశకుడగు ఆచార్యుని కనుసన్నలలో, సాహిత్య సంగీత విద్వాంసుల ఆశీర్వచనములతో శ్రీ రామలింగేశ్వరస్వామి వారి ఆలయమున స్వామివారిని విద్యాభిక్ష సర్థించి, ఈ భరత నాట్య అభ్యాసమునకు జీవితము నంతయు సంకితము జేయుట జరుగుచున్నది. ఇట్టి ఆచార మెచ్చటనైన గలదా? ఆంధ్ర దేశమున ఒక్క భాగవతుల కూచిపూడియందే ఈ ఆచారము గలదు.

కూచిపూడి భరతనాట్య శాస్త్రవేత్తలను, ఈ గ్రామమునకు రెండుమైళ్ళ దూరమున గల మొవ్వ గ్రామస్థుడు, మువ్వ గోపాలుని భక్తుడు, మువ్వ గోపాలపదకర్త క్షేత్రయ్యను తంజావూరు ప్రభువులు ఆదరించి ప్రోత్సహించినట్లు పెద్దలవల్ల వింటాము. తంజావూరు ప్రభుత్వ ఆదరణలో అభివృద్ధి చెందిన కూచిపూడి భరతనాట్యమే, తమిళనాడులో తంజావూరు భరతనాట్యముగ ప్రసిద్ధి నందినది. ఈ కళాస్రవంతి రెండు పాయలై కూచిపూడి, తంజావూరు పాయలుగ ప్రసిద్ధి నందినది. రెంటికి మూలము, జన్మ స్థానము ఒకటే.

స్వరాజ్యము, స్వరాష్ట్రము వచ్చినవి. లలితకళల అభివృద్ధికై రాష్ట్ర, కేంద్ర సాహిత్య సంగీత నాట్యకళా పరిషత్తులు ఈ ప్రాచీన కళలను, కళోపాసకులను ఉద్ధరించగలవని గంపెడాశతో నుంటిమి. ఇట్టి స్థితిలో కేంద్ర పరిషత్తులలోని పెద్దలు ఢిల్లీలోని ఒక ప్రదర్శనమును తిలకించి, 'కూచిపూడి నాట్యము శాస్త్రీయము కాదు' అని నిర్ణయించుట, అంత పత్రికలలో గగ్గోలు! అనాదిసిద్ధమైన ఈ భరతనాట్యమును శాస్త్రీయమైనది కాదని నిర్ణయించుటకు తగిన శాస్త్రవేత్తలు ఈ అఖిల భారత సంగీత నాటక అకాడమీ యందు గలరా? అయినచో ఢిల్లీ ప్రదర్శనలలో పాల్గొనిన శాస్త్రబద్ధముగ నేర్వని వారని వారుభావించిన యెడల, ఆంధ్ర దేశంలో ఆంధ్ర సంగీత నాటక అకాడమీ సలహా సంప్రదింపులతో ఈ నాట్య

శాస్త్రమున పరిశ్రమ చేయుచున్న పెద్దలను సమావేశ పరచి, తమకు గల సందేహములను వెలిబుచ్చి, వారి నుండి సమాధాన ములను విని, లోపములే వున్న యెడల వాటిని తీర్చిదిద్ది, వేలెత్తి జూపుటకు వీలులేని సంధాన కళాక్షేత్రమునకు మెరుగులు దిద్దుట కేంద్ర పరిషత్తు వారి విధి, ధర్మము అయి వున్నది. తామే సర్వజ్ఞుల మనుకొని, ఒక కలము పోటుతో తరతరాలనుండి వచ్చుచున్న కళారాధనను, అశాస్త్రీయమని తీర్పునిచ్చిన ఈ పెద్దల ధోరణికి ఎంతయు విచారించుచున్నాను.

పెద్దలు పెద్ద తప్పులను చేయుదురు. చిన్నలు చిన్న తప్పులను చేయుదురు. అయితే 'పెద్దలు తమ తప్పులను దిద్దుకొని తమ పెద్ద రికమును నిలబెట్టుకొందు'రను లోకోక్తిగలదు. కాన ఇప్పటికీ మించి పోయినది లేదు. ఆంధ్రప్రదేశ్ కళాక్షేత్రమునకు కళారాధకులకు, తద్వారా ప్రజానీకమునకు కలిగిన అన్యాయమును సరిదిద్దుటకు గాను ఢిల్లీ అకాడమీవారిని, కూచిపూడి సంప్రదాయసిద్ధమైన నాట్యశాస్త్రములో పరిశ్రమ చేయుచున్న పెద్దలను హైదరా బాదులో సమావేశపరచి ప్రదర్శనలు, చర్చలు సాగించి ఆంధ్ర కళాలక్ష్మి భవిష్యత్తుకు రూపులు దిద్దవలసినదిగా రాష్ట్ర అకాడమీ పెద్దలను ముఖ్యముగా అధ్యక్షులగు కళారాధకులు ఆర్. బి. రామకృష్ణరాజుగారిని ప్రార్థించుచున్నాను. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును ఇందులకు తగిన చర్య తీసుకొనవలసినదిగా అభ్యర్థిస్తున్నాను.''

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య 'నా జీవననౌక' పుట 315-320

ఆనాటి నుండి ఈనాటి వరకు కూచిపూడివారి ప్రదర్శనము లలో ఎన్నో మార్పులు వచ్చినవి. శ్రీ నార్ల వేంకటేశ్వరరావు గారు కారణాంతరాల వలన కళాక్షేత్ర అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చిరి. శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు కౌన్సిల్ ఛైర్మన్ పదవీ బాధ్యతల నుండి విడుదల అయిరి. కనుక తిరిగి వారినే

అధ్యక్షులుగ ఎన్నుకొనిరి. శ్రీ బండా కనకలింగేశ్వరరావు వంటి కార్యదక్షులు పరమపదించడం కూచిపూడి నాట్య కళాక్షేత్రాభి వృద్ధికి గొడ్డలిపెట్టు అయినది. వారి స్థానే గుడివాడ వాస్తవ్యులు శ్రీ గడ్డమణుగు సీతారామాంజనేయులు, బి. ఏ., బి. యల్., పదవీ బాధ్యతలు స్వీకరించారు.

కూచిపూడి నాట్యకళా క్షేత్రానికి అనుబంధంగా ఉన్న నృత్యకళాశాలకు ప్రిన్సిపాలుగా వ్యవహరిస్తున్న శ్రీ చింతా కృష్ణ మూర్తిగారు పరలోకగతులైరి. వారికి బదులు శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ నియమితులయ్యారు వీరు ఇటీవలనే తమ పదవికి రాజీనామా ఇచ్చుటవలన శ్రీ పసుమర్తి వేణుగోపాలకృష్ణ శర్మ నియమింపబడినారు.

శ్రీ సిద్ధేంద్ర నాట్యకళా క్షేత్రానికి ఢిల్లీ, ఏలూరు, గుడివాడ, విజయవాడ, హైదరాబాదు మున్నగు ప్రధాన నగరాలలో అనుబంధ నృత్య కళాశాలలు, శాఖలు స్థాపింపబడినాయి. ఏలూరు కళాశాలకు శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మ, గుడివాడ శాఖకు కుమారి మద్దూరి అన్నపూర్ణ, విజయవాడలో శ్రీ వేదాంతం సీతారామ శాస్త్రి, హైదరాబాదులో శ్రీ భాగవతుల రామకోటయ్య, ఢిల్లీలో శ్రీ పసుమర్తి సీతారామశాస్త్రి గారలు నాట్యాచార్యులుగా వ్యవహరిస్తున్నారు.

ఏలూరు కళాక్షేత్రంనుండి కుమారి లత, జ్యోత్స్న అను విద్యార్థినులను వెంటబెట్టుకొని, వాయులీన విద్వాంసులు శ్రీ భీమేశ్వరరావు, మార్దంగికులు శ్రీ త్యాగరాజుగారలు సహకరించి వెంటరాగ శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మ అల్జీరియా, ట్యూనీషియా, మొనాస్తీరు మున్నగు విదేశాలకు పర్యటించి, పలు ప్రదర్శన లిచ్చి వచ్చారు. ఈ పర్యటనవలన కూచిపూడి నాట్యకళామతల్లి పాద మంజులశింజనీరవాలు ఖండ ఖండాంతరాలలో మధుర విజయ రావాలు ఆలపించాయి.

భూ పా ళ ం

పల్ల : అప్పుడు చూచేదివో - అధికుల నధముల
తప్పక యెచ్చరి యిదే - తలచవో మనసా ॥ అప్పు ॥

కొండలవంటి పనులు - కోరి ముంచుకొంటే, నూర
కుండి కై కొనని వాడే - యోగీంద్రుడు,
నిండిన కోపములకు నెపములు గలిగితే
దండితో గలగని యాతడే ధీరుడు ॥ అప్పు ॥

సూదులవంటి మాటలు - సారిది జెవి సోకితే
వాదులు వెట్టుకొనని వాడే దేవుడు,
పాదుకొన్న సంసార బంధనము నోరూరించితే
అడిగొని మత్తుడు గా నట్టివాడే పుణ్యుడు ॥ అప్పు ॥

గాలాలవంటి యాసలు కడుదగిలిసితే,
తాలిమి తో గదలనా, తడే ఘనుడు.
మేలిమి శ్రీ వేంకటేశుమీద భారము వేసుక,
వీలక తనలో విట్టి, వీగు వాడే నిత్యుండు ॥ అప్పు ॥

(శ్రీ అన్నమాచార్య — 6-117)

"అనాది సంప్రదాయం యద్గాంధర్వైస్సంప్రయుజ్యతే ।
నియతం శ్రేయసో హేతుస్తద్గాంధర్వం జగుర్బుధాః ।"

(నాట్యశాస్త్రము)

రాష్ట్ర సంగీత నాటక అకాడమీ : సుమారు నాలుగు దశాబ్దాల క్రిందట మన కళలు చాలా దారుణస్థితిలో ఉండేవి. ఆనాటి సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితుల ప్రభావం వలన ఈ స్థితి యేర్పడింది. ఎందరో ఉత్తమ కళాకారులు, కళావేత్తలు, నృత్య కళారాధకులు ఈ రంగంనుండి విరమించారు. దేవదాసీచట్టము వచ్చిన తరువాత, కొన్ని తరములనుండి, నృత్యకళారాధన చేస్తూ ఉండిన ఎన్నో పండిత కుటుంబాలు, నర్తనవిద్యాధ్యాపనాలు, ప్రదర్శనలు విరమించుకున్నారు. ఆ వంశాలకు చెందినవారు కొందరు

వృద్ధులు మాత్రం ఇంకా ఈ సంప్రదాయం వదల లేకపోయారు. వారుకూడా అంతరించేవరకు ఉపేక్షించి ఉంటే పూర్తిగా అంతరించి ఉండేవి. ఇప్పటికే ఎన్నో ప్రాచీన కళారీతులు మరుగునపడి, అర్వాచీన కళలతో సాంకర్యం పొందాయి. ఈ విషాద పరిస్థితివల్ల ఆంధ్రదేశంలో శాస్త్రీయ నృత్యకళ ఉందా అను స్థితి యేర్పడింది. ఇంతో అంతో అది బ్రతికిఉంటే దక్షిణదేశంలో ఉంది అనే భావం ప్రజల హృదయాంతరాళాలలో గాఢంగా హత్తుకుపోయింది. సమర్థులైన నాట్యాచార్యులు చలనచిత్రరంగ ప్రవేశము చేయడమే ఇందుకు కారణం, సరియైన పోషణ, ఆదరణ లేక పోవడంవలన వారు కూడ అలా చేయవలసి వచ్చింది. అందుచే 'కూచిపూడి భాగవత కళ శాస్త్రీయము కాదు' అనే వాదును కొందరు కళావేత్తలు ప్రవచించారు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటకఅకాడమీ కొంతమంది ప్రముఖుల సూచనలు, అభ్యర్థనముల ననుసరించి, ఆ అకాడమీ అవతరించడంతోనే కూచిపూడి భాగవత కళ శాస్త్రీయతను గూర్చి తేల్చివేయాలని భావించింది. కూచిపూడి నాట్యసదస్సు నేర్పాటు చేసి, పలుప్రాంతాలనుండి కళాకారులను, పండితులను,విమర్శకులను, పరిశోధకులను ఆహ్వానించి రప్పించి, ఆ కళయొక్క శాస్త్రీయతను గూర్చి చర్చలు, ఉపన్యాసాలు జరిపించి, ప్రదర్శనలు ఇప్పించి, శాస్త్రీయతను నిరూపించుకోవలసిందిగా కూచిపూడి వారిని కోరాలని భావించింది. ఇది శుభావహం.

భారత ప్రభుత్వం సంగీత నాటక నృత్యకళలను ప్రోత్సహింప దలచి 1952 మే 31 న, జాతీయ పరిషత్తును ఏర్పాటు చేసింది. ఈ పరిషత్తు సర్వసభ్యసమావేశం 1953 జనవరిలో జరిగింది. ఈ సమావేశంలో రాష్ట్రప్రభుత్వాలు కూడ ఇట్టి సంస్థలను స్థాపించాలని తీర్మానించారు. తత్ఫలితంగా ఆంధ్రరాష్ట్ర అవతరణానంతరం 1957 నవంబరు 18-వ తేదీన రాష్ట్ర సంగీత నాటక అకాడమీ, అవతరించింది. 1957 డిసెంబరు 23-వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ నీలం

సంజీవరెడ్డిగారు 75 మంది సాధారణ సభ్యులు, 14 మంది కార్యనిర్వాహకవర్గసభ్యులతో శ్రీ ఆర్. బి. రామకృష్ణంరాజుగారు అధ్యక్షులుగా, ప్రారంభోత్సవం చేశారు. ఆ సభకు మద్రాసు రాష్ట్ర తాత్కాలిక గవర్నరు శ్రీ పి. వి. రాజమన్నారుగారు అధ్యక్షత వహించారు. విద్యాశాఖామాత్యులు శ్రీ బులుసు పట్టాభి రామారావుగారు సదస్యులకు స్వాగతం పలికారు. మహాకవి దేవుల పల్లి కృష్ణశాస్త్రిగారు స్వాగతగీత మాలపించారు.

ఈ అకాడమీ నియమించిన నలుగురు పరిశీలకులు ప్రతి ప్రాంతం పర్యటించి సంగీత, నాటక, నృత్య విషయాలలో కృషి చేస్తున్న సంస్థలు, కళాకారులు, వారి బృందాలను గూర్చిన సమాచారం సేకరించారు. వారు 'ఆంధ్రప్రదేశములో సంగీత నృత్య నాటక కళలు' అను పేరుతో అకాడమీ పక్షాన ఒక గ్రంథాన్ని ప్రకటించారు.

1958లో భారతీయ నాట్యకళనుగూర్చి ఢిల్లీలో ఒక గోష్ఠి కార్యక్రమం ఏర్పాటు చేయబడింది. ఆ గోష్ఠి సమావేశంలో కూచిపూడి నాట్యం విషయం విస్మరింపబడింది. ఆంధ్ర నృత్య రంగంలో ఈ విషయమై తీవ్ర అసంతృప్తి కలిగింది. కూచిపూడి నాట్యం జానపదనాట్యమని వారు భావించారు. అందువల్ల కూచిపూడి నృత్యం శాస్త్రీయమైనదని నిరూపించడానికి ఆంధ్ర నృత్య కళావేత్తలు నడుం బిగించారు. నృత్యకళలో నిపుణులైన అనేకమంది పెద్దలుకూడ ఆ సదస్సుకు ఆహ్వానింపబడినారు. ఆచార్య విస్సా అప్పారావు, శ్రీ పుచ్చా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, డా. మారేమండ రామారావు, శ్రీ సి. వి. వి. ఆర్. ప్రసాద్, శ్రీ అయ్యంకి తాండవకృష్ణ, శ్రీ లంక సూర్యనారాయణశాస్త్రి, శ్రీ బందా కనకలింగేశ్వరరావు, శ్రీ నటరాజ రామకృష్ణగారలు కూచిపూడి నాట్యము, అన్నివిధముల భరతముని ప్రోక్తమైన నాట్యశాస్త్రానుగుణంగా ఉన్నదని సోదాహరణంగా వ్యాసాలు

సమర్పించారు. భారతీయ నృత్యకళవలెనే కూచిపూడి నృత్యకళ కూడ సశాస్త్రీయము అని నిర్ణయించారు.

ఈ అఖిల భారత నృత్యోత్సవాల సదస్సులు వెలువరించిన అభిప్రాయాలకు అనుగుణంగా కూచిపూడి నాట్యశిక్షణకు కూచిపూడి గ్రామంలో ఒక కేంద్రం స్థాపించడానికి పథకం రూపొందించబడింది. కేంద్ర సంగీత నాటక అకాడమీ సహాయంతో దానిని అమలు పరచడానికి నిర్ణయించారు. ఆ విధంగా 1960 డిసెంబరులో కూచిపూడిలో శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం నిర్వహిస్తున్న నాట్య కళాశాలను అకాడమీ ప్రారంభించింది.

1964 మార్చి 14 నుండి 17 వరకు అకాడమీ ఆధ్వర్యంలో హైదరాబాదు రవీంద్రభారతిలో ఈ అఖిల భారత నృత్యోత్సవ సదస్సులు నిర్వహింపబడినాయి. భారతదేశం అంతటినుండి వివిధ నాట్యకళాకోవిదులు, పండితులు, విమర్శకులు ఆ సదస్సులో పాల్గొన్నారు. కూచిపూడి, ఒడిస్సీ, మణిపూరు, కథక్, భరత నాట్యాల ప్రదర్శనలు, వాటి శాస్త్రీయతా విషయం గురించి ఉపన్యాసాలు చారిత్ర్యకాధారాలతో చదువబడి నిరూపింపబడినాయి. కూచిపూడి నాట్యాన్ని గురించి కూడ చర్చింప బడింది. ఈ నాట్యోత్సవాల సదస్సుకు శ్రీ వేదాంతం రాఘవయ్యగారు అధ్యక్షత వహించారు. వీరిని అకాడమీ 'భరతనాట్యకళాప్రపూర్ణ' బిరుదుతో సత్కరించింది. కూచిపూడి నృత్యకళ సశాస్త్రీయమని నిరూపింపబడిన తరువాత అందుకు ఆమోదించి తీర్మానింప బడింది.

నృత్యసదస్సులో శ్రీ బందా కనకలింగేశ్వరరావు, శ్రీ నటరాజ రామకృష్ణగారలు చేసిన ప్రసంగాలు ప్రశంసాపాత్రమైనవి. శ్రీ నటరాజ రామకృష్ణగారు, 'ఆంధ్రదేశంలోని దేవదాసీ నృత్య సంప్రదాయం' అను విషయాన్ని సమగ్రపరిశీలనాదృష్టితో ఉపన్యసించారు.

కూచిపూడి నాట్య విశిష్టత, దాని ప్రాశస్త్యం, శాస్త్రీయత, సమగ్రత అను విషయాలను చర్చించి, విమర్శించి, ప్రదర్శనలు చేయించి శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు ఎంతగానో పరిశ్రమించారు. వీరి ఉపన్యాసంలో ఎన్నో చారిత్ర్యకాంశాలు వివరింపబడినాయి. వెనుక నేను వివరించిన విషయాలకు కొన్ని విరుద్ధంగా కనిపించినా, అప్పటికాలానికి అవి శిరోధార్యములే అయినాయి. పాఠకులకు విశదం కావడంకోసం వారి పూర్తి ఉపన్యాసాన్ని ఈ క్రింద పొందుపరుస్తున్నాను :

" శాస్త్రీయనాట్య మననేమి ? ప్రాచీన ప్రామాణిక గ్రంథముల ననుసరించి భరతుని నాట్యశాస్త్ర మత్యంత ప్రాచీనమైనది. నందికేశ్వరుని 'అభినయదర్పణము', 'హస్తలక్షణదీపిక,' 'కోహలభరతము', 'దత్తిలము', 'సంగీతరత్నాకరము'-ఇవి అర్వాచీనములు. భరతుని నాట్యశాస్త్రోదాహృతములైన శిష్టసంప్రదాయములనే అతని తరువాత రచయిత లంగీకరించిరి. కూచిపూడి నాట్య, నాటక విధానము భరతముని ప్రోక్తమైన శాస్త్రీయ పద్ధతియే. పూర్వ 'రంగపూజ', 'ఇంద్రధ్వజావిష్కరణ', సూత్రధారుని 'నాందీస్తుతి'. అతను చేతబట్టు 'వస్త్రాంగము'-ఇవి కూచిపూడి నాట్యశాస్త్రములో ముఖ్యాంశములు. నాట్యశాస్త్ర ప్రథమ, ద్వితీయ ప్రకరణములలో ఈ వివరణ పేర్కొనబడినది. నేను ఎరిగినంత వరకు ఈ లక్షణములు మరి ఏ ఇతర సంప్రదాయక నాట్యమునకు లేవు. అందువలన కూచిపూడి నాట్యవిధానము తప్పక శాస్త్రీయ నాట్యమని అంగీకరించవలసి యున్నది.

" కూచిపూడి ఆంధ్రదేశాంతర్గతమగు కృష్ణా మండలమున నొక కుగ్రామము. ఇచ్చట జనసంఖ్య 1,500 లు మాత్రమే. కుటీర నివాసులు. విజయవాడ నుండి 38 మైళ్ళ దూరము. పూర్వము కృష్ణానదీ తీరస్థమై యుండెనట. కొన్ని శతాబ్దముల క్రిత మా నదీప్రవాహము మార్పుచెందుట వలన మూడు మైళ్ళు వెనుకకు

ఆ గ్రామము తరలి పోయినది. కూచిపూడి యని పేరు వచ్చుటకు కూడ అర్థవంతమైన విషయము కుచేల అను వానిచే గ్రామము నెలకొన్నదనుట అసంగతము. 'కుశీలవపురి' అనునదే కూచిపూడి యను నామమునకు మూలము కావచ్చును. కుశీలవు లనువారు నాటకప్రదర్శన లిచ్చుచూ పర్యటించువారని 'శబ్దరత్నాకరము'న నిర్వచింపబడినది. 'కుశీలవ' యను సంస్కృత పదమునకు 'కుచీల' యనునది భ్రష్టరూపము. ఇప్పటికినీ తెలుగు దేశమున నటకులకు 'కూచిగాండ్లు' యను పర్యాయ పదము వ్యాప్తియందున్నది.

"కూచిపూడి ప్రాంతము చారిత్రక ప్రశస్తి చెందినది కూడ. కూచిపూడికి సమీప మందున్న శ్రీకాకుళము క్రీ. పూ. రెండవ శతాబ్దిలో పరిపాలించిన శాతవాహన చక్రవర్తికి రాజధానియై యుండెను. బౌద్ధమత పవిత్ర క్షేత్రమైన ఘంటశాల, కూచిపూడికి అనతిదూరమందు కలదు. సుప్రసిద్ధ రచయిత క్షేత్రయ్య జన్మస్థానము మొవ్వ గ్రామ మిచటికెంతో సమీపము నందు కలదు. కూచిపూడి పరిసరములు 20 శతాబ్దుల నుండి చారిత్రక ప్రాముఖ్యమునేగాక, వైజ్ఞానికముగా కూడ ప్రముఖస్థాన మాక్రమించినది. కూచిపూడి నాట్యరీతులు వెలయక పూర్వము దేవదాసీ నాట్యకళను ప్రోత్సహించి దేవదాసీలకు ఈనాము లొసగి పోషించిరి. దేవాలయములలో ఆరాధన వేళలందు వీరు దైవసన్నిధిని నాట్యము చేయుచుండిరి. శ్రీకాకుళ నగరములో మున్నూరు కుటుంబము లుండినట్లు చారిత్ర కాధారములు కలవు. కాకతి గణపతిదేవుని గజబలాధ్యక్షుడు, జాయపు డిచటివాడే. 'మార్గ' 'దేశి' పద్ధతులను గురించి 'నృత్యరత్నావళి' యను పేరుగల సంస్కృత గ్రంథములో రచించెను. చేబ్రోలు గ్రామమందున్న 300 దేవదాసీల కుటుంబములకు మోదుకూరు యను గ్రామమును దత్తమొనరించెను. ఈవిషయముల ననుసరించి నాట్యకళ ఈ ప్రాంతమున బహుళ వ్యాప్తి చెందెను

అని స్పష్టమగుచున్నది. క్రమేణ ఈ దేవదాసీలు దుర్వృత్తికిలోనై విధ్యుక్తధర్మములనే విస్మరించిరి. అందువలన కళను పునరుద్ధరించ వలసిన యావశ్యకము కలిగెను. సిద్ధేంద్రుడు ఈ యుత్తమ కార్యమునకు పూనుకొనెను. సిద్ధేంద్రయోగి ఎవరు? ఈ ఘన కార్యమునకు తోడ్పడిన పరిస్థితులెవ్వి?

కాకతీయ సామ్రాజ్యపతనానంతరము ఈ ప్రాంతమునుగూడ కళింగరాజులు పరిపాలించిరి. 1263-1277 సంవత్సరములలో ఒకటవ భానుదేవుడు రాజ్యమును పరిపాలించిరి. అతని మరణానంతరము అతని కుమారుడు బాలుడై నందువలన, మంత్రియగు నరహరితీర్థులు పరిపాలనా భారము వహించెను. ఈయన మధ్వమత స్థాపకుడగు ఆనందతీర్థులవారి శిష్యుడు. కళింగరాజ్యమున, ఆనాటికే జయదేవ రచిత 'గీతగోవిందము' ప్రజాదరణపొంది యుండెను. బాలరాజు స్థానమున రాజ్యపాలనము చేయుచుండిన నరహరితీర్థులు శ్రీకాకుళము సందర్శించినపుడు 'గీతగోవిందము' ప్రతినిగొని వచ్చెను. పదునొకండు సంవత్సరము లాయన శ్రీకాకుళమున నివసించి, కృష్ణభక్తిని వ్యాపింప జేసెను. కళింగమునుండి నటకులను శ్రీకాకుళమునకు రావించి, స్థానిక కళాకారులకు అందు ప్రవేశము కల్పించెను. నరహరితీర్థులవారి ప్రాంతమును వదలి ఉడిపికి తరలిపోయి, ఆనందతీర్థులవారి నిర్యాణానంతరము తామే మఠాధి పత్యమును స్వీకరించిరి. ఈకాలమున రాధాకృష్ణుల ఆదర్శప్రేమను వస్తువుగా స్వీకరింపబడి సంస్కృత భాషయందు గీతములు రచింప బడెను. వానినే స్థానిక కళాకారులు నాట్యమునందు పాడుచుండిరి. ఈ నటకులందరు బ్రాహ్మణులు. బ్రాహ్మణ అధ్యాపకులే వీరికి విద్యాగరపు చుండిరి. నరహరితీర్థులవారి శిష్యుడు గోపాలసరస్వతి. ఈయన శ్రీకాకుళమున నివసించుచూ, 128 నృత్యగేయములను మహాభాగవతము రూపమున రచించెను. 'శ్రీకృష్ణ జలక్రీడ' యను పేరిట నృత్యనాటికను రచించెను. 'శ్రీకృష్ణకర్ణామృతము' ను

రచించిన లీలాశుకులు కూడ శ్రీకాకుళ నివాసి. ఆదిలో వీరు శైవులు. నరహరితీర్థులవారి సాహచర్యమున శ్రీకృష్ణభక్తిని అలవరుచుకొనిరి. ఈవిధముగ 14-వ శతాబ్దిలో శ్రీకృష్ణభక్తి ఈ ప్రాంతములో విరివిగా వ్యాప్తిచెందెను. జానపదగేయములు, నాట్యరీతులు శ్రీకృష్ణప్రభువునకు అంకిత మయ్యెను. రాజ నర్తకురాండ్రు, దేవదాసీలు ప్రజాదరణ పొందిరి. కాలక్రమమున భగవద్భక్తి సడలిపోయి, దైవమునకు అంకితమైన నిర్మల నాట్యకళ పతనమై పోయినది. వారి వారి పోషకులను తృప్తి పరచుటకు ఆటపాటలను దుర్వినియోగ పరుపసాగిరి. కాని, వీరి గురువులు మాత్రము నైతిక పతనములకు లోనుగాక, కళాప్రాభవమును పోషించు చుండిరి.

"దక్షిణ దేశమున కూచిపూడి నాట్య సంప్రదాయము అనతి కాలముననే బహుళప్రచారమై బహుజనరంజకమయ్యెను. క్రీ. శ. 1507 ప్రాంతంలో విజయనగరాధిపుడు వీరనరసింహరాయలవారీ బృందమును తమ యాస్థానమున కాహ్వానించెను. వీరు పయనమై దినాంతమున నొక యూరిలో విశ్రమించుచూ నడక సాగించిరి. కడప మండలములోని 'సిద్ధవట' మను గ్రామమున నొక రేయి విశ్రమించిరి. స్థానికప్రభువైన సంబెట గురవరాయలు కటిక దుర్మార్గుడు, క్రూరుడు. సుంకములనడిగినపుడు ప్రజలీయనిచో అతి దారుణమైన శిక్షలు విధించెడివాడు. గృహిణులను సైతము వీధిలో నిలిపి అవమానించెడివాడు. కూచిపూడి భాగవతులీ యకార్యమును, దారుణహింసాకాండను జూచి సహించలేక విజయనగరము చేరి చక్రవర్తి సమక్షమున సంబెట గురవరాజు దుండగములను వర్ణించుచూ నొక యంతర్నాటకమును ప్రదర్శించగా, ఆ ప్రభువు గురవరాజు దుశ్చర్యలను విచారించి, వానిని పట్టి తెప్పించి చిత్రవధ గావించునట్లు శాసించెను. భాగవతులుచిత సత్కారముల నందుకొనిరి.

"విజయనగర సామ్రాజ్య పతనానంతరము అక్కడ రాజాస్థానములో వర్ధిల్లుచుండిన కవులు, గాయకులు, నటకులు ఇత్యాది కళాకారులు అందరును తంజావూరు రాజాస్థానమున కరుగగా, అచ్చటి ప్రభువులు వీరికి ఆశ్రయమిచ్చి సన్మానించిరి. క్రీ. శ. 16-వ శతాబ్దిలో తంజావూరు రాజగు అచ్యుతరాయుని ఆశ్రయాభిమానములు లభించెను. రాజదర్బారులో వీరొక ప్రదర్శన మిచ్చిరి. ప్రభువు సంతసించి వీరికి తన పేరు మీాద 'అచ్యుతపుర'మను అగ్రహారమును దానముగానిచ్చెను. నేడీ గ్రామమే. 'మేలత్తూరు' అను పేర బరగుచున్నది. ప్రతి సంవత్సరమును భాగవత మేళము లిచట జరుగుచున్నవి. అందు తెలుగు యక్షగానములు ప్రదర్శించుచుందురు. వీరిలో ప్రముఖుడు బాలూ భాగవతార్, కొందరు కళాకారులు స్వగ్రామమగు కూచిపూడి వీడి పోజాలక అచటనే నిలిచిరి. అయితే వారికి రాజాదరణ లేదు. కృషిజీవనులు మాత్రమే, సర్కారు మండలములు గోల్కొండ నవాబుల వశముకాగా, కూచిపూడి కూడ నవాబు పరిపాలనలో చేరెను. నవాబులలో ఆఖరి వాడగు అబుల్ హసన్ తానీషా క్రీ శ. 1678 సంవత్సరములో తన సేనాధిపతి యగు పింగళి మాదన్న తోడురాగా, మచిలీపట్టణమును సందర్శింపనేగుచూ, మార్గమధ్యమున కూచిపూడి గ్రామములో నొకరేయి విశ్రమించెను. ఆ సమయమున రాజగోపాల దేవాలయములో కొందరు బాలురు 'భామాకలాప'మును ప్రదర్శించుచుండిరి. నవాబు వారి గాన మాధుర్యమునకు తన్మయుడై తన సమ్ముఖమునకు పిలిపించి, వారిచే భామాకలాపము తిరిగి ప్రదర్శింపజేసి, మహదానందభరితుడై సేనాపతి సూచనపై కూచిపూడి గ్రామమును అగ్రహారముగా కళాకారులకు దాన మొసంగి, ఫర్మానా జారీ చేయించెను. కూచిపూడి కళాకారు లెంతయును సంతసించిరి. కాని అచిరకాలముననే భాగముల పంపిణీని గురించి యంతఃకలహములు పొడమెను. తుదకు వివిధకుటుంబముల వారికి భాగ నిర్ధారణ చేయుచు 1763-వ సంవత్సరములో నైజాము

నవాబుల ప్రతినిధులగు మొసలికంటి కామోజీ పంతులు, కాండ్రేగుల జోగిపంతులు గారలచే పారీఖత్తు, దస్తావేజు వ్రాయించబడెను. ఈ పత్రము ననుసరించి వేదాంతం, వెంపటి, హరి, భాగవతుల, పసుమర్తి, జోస్యుల, మహంకాళి, ఏలేశ్వరపు వారి కుటుంబముల వారికి భాగములు నిర్ణయింపబడెను. ఈ దస్తావేజుల నకళ్లు నా యొద్ద నున్నవి. ఆ యా కుటుంబములవారు ఈనాటికిని, ఈనాము భూముల ననుభవించుచు కళాభివృద్ధికి అంకితమై జీవించుచున్నారు.

"సిద్ధేంద్రుడు రెండు నృత్యనాటికలను రచించి యున్నాడు. అవి 'పారిజాతము', 'గొల్లకలాపము.' గొల్లకలాపమే తరువాత కాలములో 'భామాకలాపము' గా వెలయుచున్నది. గొల్లకలాపమొక వేదాంత సంబంధమైన సంభాషణాత్మక గేయ కావ్యము. ఈ సంభాషణ ఒక గొల్లపడుచు, ఒక బ్రాహ్మణుడు—వీరిరువుర మధ్య జరిగినది. మానవు లందరు సమానమని ; కేవలం దైవభక్తియే ముక్తిమార్గమని ; యజ్ఞములు, తపములు నిష్ప్రయోజనములని గొల్లపడుచు వాదన. కాలక్రమమున 'ప్రహ్లాద', 'రుక్మాంగద', 'హరిశ్చంద్ర', గయా నాటకములు, 'రామనాటక' మిత్యాది కథా వస్తువులను నృత్యనాటకములనుగా రూపొందించినారు.

"ప్రతి కళాకారుడును దేహపరిశ్రమ విధిగా చేయవలయును అను నియమము కలదు. వారి సర్వాంగములును నటనకు, విన్యాసమునకు అనువగునట్లు మలచుటయే ఇందుకు హేతువు. దండెములు, బస్కీలు, ఒంటికాలి దండెములు, అడపుసాము, చేకంమండె కొప్పు, కట్టెరవటు, జారు అడపు, నిలువుమొగ్గ, అలు, ప్రత్యాలి. ఇత్యాది సాముగరిడీలు చేయుటలో నేర్పరి కావలెను. సంయుక్త, అసంయుక్త హస్తములు, 108 కర్ణములు, మండలములు నాట్య శాస్త్రములో నిర్దేశింపబడిన విధముగా హస్తము, శిరము, కన్నులు, కనుబొమ్మలు, వీటి విన్యాసములుకూడ విధిగా నేర్వవలసి యుండెను. నృత్యముతో పాటు శాస్త్రీయ సంగీతములోకూడ వీరు నిష్ణాతులు

కావలెను. అలంకార శాస్త్రమునకూడ వీరి పాత్యభాగము నాయికా నాయక భావములు క్షుణ్ణముగా అభ్యసింతురు. రస ప్రకరణము, చతుర్విధాభినయ నటనారీతులు, ఆంగిక, వాచిక, సాత్త్విక, ఆహార్యములనునేర్తురు. గాత్రసంగీతము, అందలి భావములను వ్యక్తీకరించు హస్తముద్రల అంతర్గత భావములను కనులతోడను, లయ బద్ధమైన పాదచలనములవలనను వ్యక్తీకరించు నైపుణ్యమును కలిగి యుండిరి. పాత్యక్రమము ననుసరించి కూచిపూడి నాట్యవిద్య నేర్పబడును. పది సంవత్సరములు నిరంతర కృషి చేసిననేగాని ఈ విద్యయందు కౌశల మలవడదు. వేషమునకు తగిన వస్త్రాద్యలంకరణములు కూడ విద్యార్థి స్వయముగ తయారు చేసుకొనవలెను. నటుడలంకరించుకొనిన యాభరణములన్నియు పునుగు, బాడిదకర్రతో చేసినవి. రంగు రంగు గాజుముక్కలు ఆభరణములలో పొదిగెదరు. లక్కతో రంగులు తయారు చేయుదురు. స్త్రీ వేషధారణకు 32 విధముల ఆభరణములు పేర్కొనబడినవి. పురుష వేషమునకు 10 విధములైనవి కలవు. ఖడ్గము, మహాభుజాచ్ఛాదనము, రాజదండములతో సహా సత్యభామధరించు నగలలో ప్రముఖమైనది 'జడబిళ్లలు. వీనికిప్రత్యేకమైన విలువ కలదట. శ్రీ మహావిష్ణువు మోహినీ రూపమును ధరించి, దేవదానవులకు అమృతమును పంచి ఇచ్చునపుడు అలంకరించుకొనెనట. విష్ణునకీ జడతో పని తీరిపోగా కృష్ణావతార మెత్తినపుడు సత్యభామకు కానుకగా నిచ్చెనట. ఈ జడబిళ్ళలు ఒకదానికొకటి తోగరు దారముతో సంధింపబడి పైనుండి క్రిందకు జడను కప్పివేయు చుండును.

విశ్వరూప చిహ్నము : "సత్యభామ కబరీబంధమునకు వామపార్శ్వమున సూర్యబింబమువంటి 'కుప్పె' యను అలంకరణము వేరొకటి కలదు. అర్ధచంద్రాకృతిగల 'చంద్రవంక' యను మరి యొకటి కుడిపైపున నుండును. ఈ చంద్రవంక నుదురుపై పడునట్లు ముత్యాలు కూర్చిన దండ యొకటి జడను, కపోలమును

కలుపుతూ, శిరోమధ్యమున పాపిట మీదుగానుండి, చిన్నచిలుక బొమ్మ చంద్రవంకమీద నొప్పుచుండును. జడమీద వరుస క్రమమున పైనుండి క్రిందకు దివ్యజ్ఞానమును సూచించు పాము పడగ; ఇరువదియేడు నక్షత్రములను సూచించు నిరువది యేడు బిళ్ళలు; చివరి భాగమున త్రిభువనములను, నవగ్రహములను సూచించినట్లు కొయ్యముక్కలతో గుత్తులుగా మలచిన బంగారు రంగుపై పూతకల అలంకరణమును ధరించెదరు. ఇది విశ్వరూప చిహ్నము. ఈ జడను నర్తకులు చాల అభిమానించెదరు. భామాకలాపమును ప్రదర్శించునప్పుడు సత్యభామ తెరమరుగుననే యుండి, ఈ జడను మాత్రము అందరకు కనుపించునట్లు తెరమీద వేయును. భామ వేషధారితో సరిసమానముగా నటించ గలిగినవా రెవ్వరైనా, సభాసదులలో నెవ్వరు చూపవచ్చునని, సవాలు విసరుట కట్లు చేయుదురట. ప్రేక్షకులనుండి సమాధానము లేకపోయిన సాటిలేని మేటినటుడని బిరుదు నొందినట్లు భావింప బడునట.

**కూచిపూడి నాట్యవిశేషములు :** ఒక నృత్య నాటికనే కూచిపూడి నాట్యకళయని పేర్కొందురు. భరతనాట్యశాస్త్రము ననుసరించి రూపొందింపబడిన ఈ నృత్యనాటిక క్షీరసాగరమథనము, లక్ష్మీస్వయంవరము, త్రిపురదహనము లను పోలినది. నృత్త నృత్య నాట్యములను త్రివిధలక్షణ సమ్మేళనమే నృత్యనాటిక. నృత్త భాగమున తీర్మానములు, జతులు, నృత్యమున శబ్దములు, ఇందు జొప్పింపబడి ఆహ్లాదకర మగుచున్నవి. శాస్త్రీయమును స్వయం పూర్ణమును నగు నృత్యనాటిక, కూచిపూడి రీతియం దుద్భవించి నది. నాట్యధర్మి, లోకధర్మి వీటి సమ్మేళనము శ్రోతలను తన్మయుల జేయుచున్నది.

కూచిపూడి నాట్యరీతి యందు నటకుడే స్వయముగ గాన మాలపింప వలయును. ప్రసంగము చేయవలసిన పట్టులందు తాను

మాత్రమే చేయవలెను. ఏకకాలమందే నృత్యాభినయముకూడ చేయవలయును. తాండవ లాస్యనృత్యములును కలవు. పురుష వేషధారులు తాండవమును, స్త్రీ వేషధారిణులు లాస్యమును ప్రదర్శింతురు. నిష్కలంకమగు శాస్త్రీయ సంగీతమునే వీ రంగీకరింతురు. వేషధారణ పరికరములు ప్రత్యేకతను సూచించు సాంప్రదాయకములైనవి.

నటకుడు నాట్యశాస్త్రమును, సంస్కృత భాషను విధిగా నేర్చి ప్రవీణుడై యుండవలయును. శాస్త్రీయ సంగీతమునందు నిపుణులు కావలెను. కేవలము గ్రంథ పరిచయమేకాక, శాస్త్రీయ నృత్య రీతులనభ్యసించి యుండవలెను. తరతరములుగ కూచిపూడి కళాకారులు యావజ్జీవము నీ కళకే అంకిత మొనర్చి వ్యాప్తిచేయుచున్నారు. విశుద్ధనారీత్వము కలుషితమైపోవునని సంఘము భ్రష్టమగునని యీ ప్రదర్శనములలో పాల్గొనకుండు నట్లు స్త్రీలపై నిషేధము కలదు.

ప్రదర్శనములకు ఇదమిత్థమను నాట్యరంగస్థలముండదు. ఏ దేవాలయ ప్రాంగణమునందో ఉన్నతమగు వేదిక నేర్పరతురు. యవనికల యవసరములేదు. వేదికపై ఇరువురు మనుజులు తెర గుడ్డను అటు నిటు పట్టుకొని నిలుతురు. మరుగున నున్న నటకులు రంగస్థలమున ప్రవేశింపగనే తెరను తీసివేయుదురు. పాత్రధారి ప్రేక్షకులకు తన్నుతా నెరుకపరచుకొనును. దీనినే 'ప్రావేశిక దరువు' అందురు. 'నీవెవరు ?- ఏలవచ్చితివి ?' అని సూత్రధారుడు ప్రశ్నించి కథను సంక్షిప్తముగా తెలుపును. సర్వసాధారణముగ వీరు ప్రదర్శించే కథలు భాగవతమునుండి సంగ్రహించినవే. అందువలన వీరికి 'భాగవతులు' అను బిరుద మేర్పడినది. జనుల కెల్లరకు వీరి ప్రదర్శనములు ఆనందాయకములైనవి.

కూచిపూడి నృత్యనాటక మొక మధురరసఖండము. నృత్యము, పాత్రపోషణవలన ప్రేక్షకులు ముగ్ధులయ్యెదరు. నిరంతరము ఆమోద

దాయకములై వెలయుచున్న వీ నృత్యనాటికలు. కొన్ని ప్రదర్శన ములు మూడు రాత్రులు వరుసగా జరుగుచున్నవి. కథ ఎల్లప్పుడును పౌరాణికమే.

కూచిపూడి కళావతంసులు కొందరు ఈమధ్య తమ ప్రదర్శన లలో అనేక రీతులను కూడ చేర్చిరి. వీనికే 'శబ్దము' లని పేరు. పౌరాణికమగు నేదేని యొక ఆఖ్యాయికను ఆధారముగ తీసికొని వినోదదాయకము, లలితము నగు గేయములను కల్పించి, నాటక మధ్యమున ప్రదర్శించుచుందురు. దశావతారశబ్దమును పెదపులివర్రు నివాసి సిద్ధాబత్తుని రంగదాసు రచించెను. పాఠ్యభాగమునందు జతులు చొప్పింపబడినవి. 'ప్రహ్లాద శబ్దం' మేలత్తూరు వేంకట రామయ్య రచన. శ్రీరామపట్టాభిషేకము, తులజాజీ శబ్దము, వీనిని, 18-వ శతాబ్దమున తంజాపురము నేలిన తుక్కోజీ మహారాజు ప్రశంసగా చెప్పుదురు. ఇటులనే 'శివాజీ శబ్దము', 'తద్ధి శబ్దము' కాళహస్తి రాజుల ప్రశంసా కావ్యము. ఇటువంటి శబ్దముల రీతులు ఇరువదింటిని కూచిపూడివారు ప్రయోగింతురు. నాటకమధ్యమున ప్రేక్షకులు విసిగినట్టు తోచిన ఈ జతులు వినోదార్థము ప్రదర్శింతురు.

పైన పేర్కొనబడిన నృత్యనాటకములు, శబ్దములు కాక, కూచిపూడి కళాకారులు జయదేవుని 'గీతగోవిందము', నారాయణ తీర్థులవారి 'తరంగములు', క్షేత్రయ్య పదములు లయ, తాళబద్ధముగా నృత్యగానములు చేయుట కూడ నభ్యసించియున్నారు. లీలాశుకుని 'శ్రీకృష్ణకర్ణామృత' శ్లోకములను అభినయింతురు. నాట్యభంగిములు, విస్మయ జనకమగు నైపుణ్యమును, సహజత్వమునుకూడ చూపెదరు. బాలగోపాల తరంగగానము చేయుచు నభినయించుచు గోపికవేష ధారి, తలపై జలపూర్ణ కుంభమును ఇడుకొని నటించును. ప్రేక్షకుల వినోదార్థము ఇంకొక విద్యనుకూడ వీ రభ్యసించి సిద్ధహస్తులైరి. హాస్యోక్తులతో, చిత్రవిచిత్ర వేషములతో కవ్వించి, నవ్వించి

గ్రామములలో పర్యటించుచుందురు. వీరినే 'పగటివేషధారులు,' అని పిలచెదరు.

ప్రదర్శనారంభమున నాలుగు వేదములనుండి కొన్ని భాగములను వర్ణింతురు. నాట్యశాస్త్రము 'పంచమవేద'మని కదా ప్రసిద్ధి. దీనిని బ్రహ్మదేవుడు సృష్టించెనని ప్రతీతి. ఋగ్వేదమునుండి 'పాఠ్యభాగమును,' యజుర్వేదమునుండి 'అభినయమును,' సామ వేదమునుండి సంగీతమును, అధర్వమునుండిరసమును సమ్మిశ్రితముగ నొనర్చినట్లు విశ్వసింపబడుచున్నది. అందువల్లనే నాలుగు వేదముల నుండి కొన్నిభాగములను వర్ణించుటయును జరుగుచున్నది. తదుపరి రంగస్థలము పవిత్రోదకముతో శుద్ధిచేయబడును. దీనినే 'పుణ్యాహ వచన' మందురు. అనంతరము రంగాలంకరణము ముగ్గులతో, రంగులతో పిమ్మట ధూపము, రంగాధిదేవతను నూట ఎనిమిది దీపములతో ఆరాధింతురు. ప్రేక్షకుల ఆశీర్వచనముల నర్థించుచు పూవులను వెదజల్లెదరు.

అనంతరము ఇంద్రధ్వజ ప్రతిష్ఠ. నాట్యశాస్త్రమునందు ఈ ప్రక్రియకు సంబంధించిన ఐతిహ్యమొకటి కలదు. అమృతమథన సమయము వస్తువుగా నాటకమును రచింపుమని దేవేంద్రుడు భరతముని నర్థించెనట. ఇదియే తొలుత నుద్భవించిన నృత్య నాటిక కావచ్చును. అసురులు తమకు కలిగిన అవమానమునకు కోపోద్రిక్తులై తమ పైశాచిక శక్తులను ప్రయోగించి, దేవతలను హింసింప సాగిరి. భరతు డేమియు చేయజాలక పోయెను. రాక్షసుల మద మణచుటకై ఇంద్రుడు తన ధ్వజముచే వారిని సంహరించెను. ఆ కారణముననే ఇంద్ర ధ్వజమునకు 'జర్జర' మను నామాంతరము. దానిని ఇంద్రుడు భరతునకొసగి, ప్రదర్శనారంభమున రంగస్థలమున నిలుపుమని ఆనతి నిచ్చెనట. అసురల కయ్యది ప్రాణాంతకమైనది. పిమ్మట నిరాటంకముగ ప్రదర్శనము జరుగునట్లు వినాయకస్వామి రంగస్థలమునకు వచ్చి, ఆశీర్వదించి పోవును. సూత్రధారుడు మరి

ఇరువురతో కలసి గురు ప్రార్థనాదికములను బృందగానము చేయగా, నాందీ స్తోత్రముతో ప్రదర్శనము ఆరంభ మగును.

సూత్రధారుడు తన ఒంకికర్రతో రంగస్థలమున నిలచును. బ్రహ్మదేవు డీ కర్రను భరతునకు బహూకరించెనట. 'కుటిలకమణి' దీని పేరు. గురుస్తోత్రమైన పిదప, ప్రేక్షకుల నుద్దేశించి ఇతడు స్వాగతవచనములు పలుకును. ప్రదర్శింపనున్న నాటక కథను చూపరుల కెరుక చేయును అప్పుడు నాటకారంభము. సూత్ర ధారుడే విదూషకుడుకూడ అతడు హాస్యరసమును చిప్పిల చేయుచు మాట్లాడు నేర్పరి కావలయును. హావ, భావ ప్రకటనలోను వచోచమత్కారము నందును ఆరితేరినవాడు విదూషకుడు.

కూచిపూడి కళాకారులలో కొందరు ప్రముఖులను పేర్కొని వారి కళాసేవను సంస్మరించుట సముచితము. గత శతాబ్దమున ప్రఖ్యాతపురుషులు, 1. వేదాంతం సాంబయ్య, 2. హరి వేంకటా చలపతి, 3. భాగవతుల రామయ్య, ( ఈయన గొల్లకలాపమును స్వకపోలకల్పితములగు బాణీలను ప్రవేశపెట్టిన వ్యక్తి), 4. భాగ వతుల దశరథరామయ్య, 5. భాగవతుల రామదాసు, 6. నాగ లింగయ్య, 7. సుబ్రహ్మణం, 8. భాగవతుల విస్సయ్య, 9. బొక్కా పార్వతీశం ఇత్యాదులు. ఈ శతాబ్ది ప్రారంభ కాలములో వెంపటి వేంకట నారాయణ ప్రసిద్ధ పురుషుడని అతని మేధాశక్తిని పెద్దలు నేటికిని ప్రశంసించుచున్నారు. వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి, పలువురు శిష్యులు ఈయన కడ నాట్యశిక్షణ పొంది యున్నారు. ఆయన వలన శిక్షణపొందిన వారిలో కుమారి యామినీ కృష్ణమూర్తి, ప్రఖ్యాత ఔత్తరాహిక నటకులు ఉదయ్ శంకర్, రాగిణీదేవి, శాస్త్రిగారు తమ డెబ్బదియవయేట ప్రదర్శించిన అపూర్వ నాట్య విన్యాసమును చూచి విభ్రాంత సమ్మోహితులైరి. శ్రీ చింతా వేంకటరామయ్య (వేంకటరామ నాట్యమండలి సంస్థాపకులు) ఆదర్శగురువర్యులు, సూత్రధారులును. వీరి ప్రదర్శన

లెన్నో నేను చూచినాను. దాదాపు అరువదిమంది శిష్యులను ఈ నాట్యకళయందు ప్రవీణులనుగా చేసినారు. అట్టివారిలో వేదాంతం రాఘవయ్య, వెంపటి సత్యం, పసుమర్తి కృష్ణమూర్తి, భాగవతుల రామకోటయ్య, పసుమర్తి వేణుగోపాలకృష్ణశర్మ ప్రత్యేక ప్రశంస నీయులు. వేంకటరామ నాట్యమండలి సంస్థాపకులు చింతా వేంకట రామయ్యగారి కుమారుడు కృష్ణమూర్తి ప్రస్తుతము నాట్యమండలి అధినేత. పలు వ్యయప్రయాసల కోర్చి ఈకళకు దోహదము చేయు అతని కృషి ప్రశంసనీయము. స్త్రీ వేషధారణకు రాష్ట్రపతి పతక మును బహూకృతి నందిన సత్యనారాయణ కీయన గురువు.

పై విషయములను సమీక్ష చేయగా, కూచిపూడి నాట్యకళ నిస్సందేహముగా శాస్త్రీయమని అంగీకరింపక తప్పదు. భరతనాట్య చోదితమగు నాట్యరీతి యనియు సిద్ధాంతీకరింప వచ్చును. పరం పరాగతమగు విధానమని పేర్కొనుట సత్యదూరము. కూచిపూడి నృత్యనాటికల ప్రత్యక్షముగ చూడనివా రెవ్వరో ఇట్లనవచ్చును. ఢిల్లీనగరమున శాస్త్రీయములని ఆమోదింపబడిన నాట్యరీతుల నెరిగిన వారిని రావించి, నిష్పాక్షికులగు నిపుణుల సమ్ముఖమున ప్రదర్శింప జేసిననే కూచిపూడికళ శాస్త్రీయ మగునా కాదా అను సంశయము విచ్ఛిన్నము కాగలదు. నిర్దుష్ట శాస్త్రీయ ప్రమాణములకు ఏ మాత్రము ఈ నాట్యము తీసిపోదు అని నా నమ్మకము.

కొలదికాలమునుండి కూచిపూడి నాట్యకళయందు ప్రజలకు విపరీతమైన అభిలాష యేర్పడినది. దేశమున నెచ్చట చూచినను, నాట్యకళా ప్రదర్శనము జరిగినను కూచిపూడి నాట్యము కార్యక్రమ మందు జోడింపబడుచున్నది. కాని కృత్రిమ, సంకర నాట్యము కూడ కూచిపూడి యను పేరట చెలామణి యగుచున్నది. ఈ సాంకర్యములను నివారింపు తలంపుతో స్వచ్ఛమగు కళను వ్యాప్తి చేయనెంచి ఆ గ్రామమున ప్రముఖులైన కళాకారుల

ఆధ్వర్యమున నాట్యకళాశాల యొకటి స్థాపితమై యున్నది. ఈ సంస్థకు అనుబంధముగా విద్యార్థులకు హాస్టలు కలదు. ప్రదర్శనశాల నిర్మాణములో నున్నది. యావద్భారత దేశము నుండి ఈ కళ యందు శిక్షణ పొందదలచిన యువకులను ఆహ్వానించు చున్నాడను. కేంద్ర సంగీత అకాడమీవారు, ఆంధ్రప్రదేశ్ అకాడమీవారు ఈ సంస్థకు ద్రవ్యసహాయము చేయుచున్నారు. ఇతోధికముగా ఆర్థికబలము చేకూర్చవలసి యున్నది.''

(శ్రీ బందా కనకలింగేశ్వరరావు 1964)

కూచిపూడి కళకు గుర్తింపు, బలము, బహుళవ్యాప్తి శ్రీ బందా కనకలింగేశ్వరరావు మూలముననే చేకూరిన దనుట నిస్సంశయము. ప్రదర్శనము లిచ్చుటయేగాని ప్రధాన వ్యక్తులతో భాషింపగల నేర్పు, కార్యములను సాధించుకొనగల ఓర్పు, దక్షత లేని భాగవతులు ఈనాడు కళాక్షేత్రమును స్థాపించుకొనుటయే గాక ఖండ ఖండాంతరములందు పైతము ఖ్యాతి గడించుచుండుటకు శ్రీ బందావారు ఒకొప్పుడు నాటిన బీజము సక్రమ దోహనక్రియ లకు సకాలమున అంకురించి, పల్లవించి, మహావృక్షమై, విశ్వవ్యాప్తమైన దనుటలో అతిశయోక్తి కాదు. ఇంతటి మహత్తర కార్యము కూచిపూడి భాగవతుల వలన అయ్యేడిది కాదు.

శ్రీ బందా కనకలింగేశ్వరరావు 1907 లో జన్మించాడు. చదువు బి. ఏ., బి. ఎల్. కొన్నాళ్లు న్యాయవాదవృత్తి. అయిదు చలన చిత్రాలలో నటించిన నటుడు. 1939 లో మొదటిసారి college dramatics స్థాపించారు. గతముప్పయి సంవత్సరాల నుంచి ప్రభాత్ థియేటర్ అను పేర జీవిక నాటక సమాజం దిగ్విజయంగా నడుపుతున్నారు. నటనా కౌశల్యానికి అనేక స్వర్ణపతకాలు, బహుమతులుపొందారు. నాటకకళలో గౌరవపట్టం ఆంధ్రవిశ్వవిద్యాలయం వీరికి బహూకరించింది. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఫెలోషిప్ పొందారు. యూరప్, సోవియట్ రష్యా పర్యటించి నాటక

కళపై ఉపన్యసించారు. కొంతకాలం భారతీయ నాట్య సంఘం ప్రాంతీయ కార్యదర్శి. అనేకసంస్థలతో వీరికి సంబంధం ఉంది. ప్రస్తుతం విజయవాడ రేడియో కేంద్రంలో నాటక శాఖ ప్రొడ్యూసరుగా పనిచేస్తున్నారు. 1963-1964 లో ఉత్తమ నటనకు రాష్ట్రపతి బహుమతి పొందారు. కృష్ణ, సారంగధర, రామ, బిల్వమంగళ, కాళిదాస వీరి అభిమానపాత్రలు. సంగీత నాటక అకాడమీ కార్యవర్గసభ్యులు.

నటరాజ రామకృష్ణ : ఆంధ్ర దేశంలో ప్రసిద్ధికెక్కిన నాట్య కళాకారులలో శ్రీ నటరాజ రామకృష్ణ ప్రముఖులు. రసాయాభినయంలో వీరు అందెవేసిన చేయి. భరతనాట్యం, కూచిపూడి, దేవదాసీ నృత్యాలలో వీరికి అభినయం మెండు.

నృత్యం చేయడం, నేర్పడమే కాక నృత్యకళను గూర్చి వీరు అనేక గ్రంథాలు వ్రాశారు. పరిశోధించారు. వాటిలో 'నృత్యాంజలి,' 'నృత్యరేఖ', 'నర్తనమురళి', 'నాట్యమురళి', 'నర్తనబాల', 'నర్తన సీమ'. ఆంగ్లంలో Dancing Bells కేంద్రప్రభుత్వ బహుమతిపొందింది. దక్షిణదేశంలో నృత్యరీతులు చరిత్రగా రచించారు. ఇది తెలుగు భాషా సమితి బహుమతి నందుకొంది. ప్రస్తుతం హైదరాబాదు నగరంలో నృత్యనికేతన్ నిర్వహిస్తున్నారు. అకాడమీ ఆధ్వర్యంలో ఈమధ్య వీరు ప్రదర్శించిన "కుమారసంభవం" అను సంస్కృత నృత్యనాటకం ఉజ్జయినిలో జరిగిన కాళిదాస సాహిత్య సమారోహ పోటీలలో ప్రథమ బహుమతి గడించింది. "గౌరవడాక్టరేట్" బిరుదం కూడ పొందారు.

"గాయామి నృత్యామ్యథవాదయామి।
భద్రోస్మి నృత్యే, కుశలోస్మిగీతే।
త్వాముత్తరాయై ప్రదిశస్వమాం।
స్వయంభవామి దేవ్యా, నరదేవ! నర్త!"

(శ్రీమద్భారతము - విరాట పర్వము)

"సురుచిర తారకా కుసుమ
శోభి, నభోంగణ భూమిఁ గాలమన్
గరువపు సూత్రధారి జత
నంబున దిక్పతికోటి ముంగటున్
సరసముగా నటింపగ ని
శాసతి కత్తిన క్రొత్తతోపుఁ బెం
దెరయన నొప్పె సాంధ్య నవ
దీధితి పశ్చిమ దిక్తటుంబునన్."

(నృసింహ పురాణము - ఎఱ్ఱన)

కూచిపూడి నాట్యము శాస్త్రీయము : "భాగవత కథలను, భగవంతుని సంబంధమైన గాథలను ప్రదర్శించుటవలన భాగవతులైరి. అంతియేకాని నృత్య, నాట్యాది విషయములలో కూచిపూడి నాట్యకళ విభేదింపదు" అని శ్రీ నటరాజ రామకృష్ణ ప్రవచించారు. "ప్రస్తుతకాలములో కొందరు కళావేత్తలలో భరతనాట్యము, నట్టువమేళ విద్య తమిళదేశపు విద్యయని ; కూచిపూడి భాగవతము ఆంధ్రదేశపు విద్యయని ఒక వాదం ఉన్నది. ఈ వాదము సరియైనది కాదు. ఆంధ్రదేశమున ఒకచివరి భాగముననున్న శ్రీకూర్మము మొదలుకొని తమిళదేశమునందలి శ్రీరంగము వరకును, కర్ణాట దేశమునందు దేవదాసీలు ప్రదర్శించే భరతవిద్య అంతా ఒకటే. కాని, ఆ యా ప్రాంతీయ ప్రజలకు ఈ కళాపోషకుల అభిరుచుల ననుసరించి ప్రదర్శన రీతులయందు కొంత మార్పు కనిపించుచున్నది. మరియు ఆంధ్ర, తమిళ దేశముల యందలి భాగవతకళ కూడ ఒకే సంప్రదాయానికి చెందినదే అగును" అని నిర్వచించారు.

నేటికాలములో అనేక రాజకీయ కారణములవల్ల దక్షిణ దేశం వివిధ భాషా రాష్ట్రాలుగా విడిపోయినందున కళల గూర్చి ఈ అభిప్రాయభేదాలు కళావేత్తలలో కలిగినను 4 లేక 5 శతాబ్దుల

క్రిందటినుండి దక్షిణదేశపు నృత్యకళ అంతా ఒకేరీతి రూపొందింప బడింది.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, రవీంద్ర భారతి సంయుక్త ఆధ్వర్యంలో 1964-వ సంవత్సరం, మార్చి 14-వ తేదీన జరిగిన అఖిల భారత నృత్యోత్సవాలలో, దేశం మొత్తంమీది ఆరు శాస్త్రీయ నృత్యరీతులు ప్రముఖ కళాకారుల, నర్తమణులచే ప్రదర్శింపబడినాయి. ఆ యా నృత్యరీతుల శాస్త్రీయ విషయాలు, చారిత్రక ఆధారాలు పరిశోధక పండితులు ఈ సదస్సులో చదివారు. ఈలాటి నృత్యప్రదర్శనలు, సమ్మేళనాలు భారత దేశంలో జరగడం ఇదే మొదలు. ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఆధ్వర్యంలో జరగడాన్ని అందరూ ప్రశంసించారు.

ఈ నృత్యోత్సవాల ప్రారంభంలో ఉత్సవాల సమావేశ కర్త, అకాడమీ అధ్యక్షులు శ్రీ పసల సూర్యచంద్రరావు సభ్యులకు స్వాగతం చెబుతూ:

"ఆంగికం భువనం యస్య
వాచికం సర్వవాఙ్మయం।
ఆహార్యం చంద్రతారాది
తం నమ స్సాత్వికం శివం।"

"మా ఆహ్వానమును అందుకొని ఇచ్చట సమావిష్టులైన సహృదయులందరకు నమ స్సుమనస్సులు!

"మా ఆహ్వానమును ఆదరముతో మన్నించి వివిధరాష్ట్ర ముల నుండి హైదరాబాదు విచ్చేసిన కళాకారులకు, పండితులకు, నాట్యాచార్యులకు సుస్వాగతం!!

"ప్రాచీన భారతీయ లలితకళలను పునరుద్ధరించి, ఆ యా కళాకారులకు నూతనోత్తేజము నొసంగి, తద్ద్వారా జాతీయైక్యమును సాధింపవలెనన్న మహదాశయంతో స్వతంత్ర భారతావనిలో

ఆ యా అకాడమీలు 'సంగీత, నాటక, నృత్య, చలన చిత్రములు' అను నాలుగు కళలకు ప్రాతినిధ్యం వహిస్తున్నవి.

"లలితకళ లన్నింటిలో ఆపాతమధురమైందిగా ప్రసిద్ధి పొందినది సంగీతము. అటుతరువాత ప్రముఖంగా పేర్కొనబడ వలసినది నృత్యం. అంగవిక్షేప, సంగీత, సాహిత్యాల అపురూప సమ్మేళనమే ఈ నృత్యకళ. ఆబాలగోపాలమును ఆకర్షించి, ఉత్తేజ పరచి మధురానుభూతులను కలిగించి, హృదయాలను ఆనంద ప్లావితము చేయగలిగిన దీ నృత్యకళ.

"ఇట్టి నృత్యకళ ప్రాశస్త్యాన్ని గుర్తించి తదభివృద్ధికి యథా శక్తిగా తోడ్పడుచున్న ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ 1959 లో ప్రప్రథమంగా కూచిపూడి నృత్యసదస్సును నిర్వహించి నది. ఆ సదస్సులో కూచిపూడి నృత్యరీతి అత్యంతము ప్రాచీనమైన దనియు, అది శాస్త్రీయమైన నృత్యరీతి అనియు నిరూపింపబడినది,

"ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, హైదరాబాదులోని నేషనల్ థియేటర్ అయిన రవీంద్ర భారతి యొక్క మేనేజింగు కమిటి కలసి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సహాయ సహాకారములతో అఖిల భారత నృత్యోత్సవ సదస్సులు నిర్వహించుచున్నది.

"ఈ ఉత్సవములో అఖిల భారత స్థాయిలో సుప్రసిద్ధములైన శాస్త్రీయ నృత్యరీతులను మాత్రమే ప్రదర్శింపజేయుటకు పూను కొన్నాము. తదనుగుణముగా మా ఆహ్వానమును పురస్కరించుకొని కూచిపూడి, భరతనాట్యము, ఒడిస్సీ, మణిపురి, కథక్, కథాకళి నృత్యబృందములు మాత్రమే ఈ ఉత్సవంలో పాల్గొనుచున్నవి. వీరెల్లరకును మేము కృతజ్ఞులము.

"ఇప్పు డీ ఉత్సవ నిర్వహణ క్రమములో రెండు ప్రధాన భాగము లున్నవి. ఒకటి సదస్సు, రెండవది ఉత్సవము. సదస్సు ఉదయం గం. 9-00 ల నుండి, మధ్యాహ్నం గం. 12-00 ల వరకు

జరుగును. ఉత్సవము సాయంత్రం గం. 6-00 ల నుండి రాత్రి గం. 11-00 ల వరకు జరుగును. ఉదయకాలమున జరిగెడి సదస్సులో ఒక్కొక్క నృత్య రీతినిగూర్చి ఒక్కొక్క ప్రముఖవ్యక్తి ఉపన్య సించుటయు, ఆ నృత్యరీతికి సంబంధించిన బృందములోనివారు ఉదాహరణపూర్వక విన్యాసములు చేయుటయు జరుగును. ఈ సదస్సులో చర్చకు ఎన్నుకొన్న విషయము : 'అఖిల భారత శాస్త్రీయ నృత్యరీతులు, పరిణామ వికాసములు, ఐక్యసామ్య సంబంధములు'.

"కేన్ద్రి సంగీత నాటక అకాడమీ ఆధ్వర్యములో అఖిల భారతీయ నృత్యోత్సవములు ఢిల్లీలో ఇతఃపూర్వము నిర్వహింప బడినవి. కాని, రాష్ట్రస్థాయిలో ఈ ఉత్సవములు నిర్వహింపబడుటకు బహుశః ఇదే ప్రారంభ మనుకొందును. ఇట్టి ఉత్సవములు రాష్ట్ర స్థాయిలోకూడ నిర్వహింపబడుచున్నచో ఒక రాష్ట్రవాసులు వివిధ రాష్ట్రముల సంప్రదాయములను ప్రత్యక్షముగా చూచుటకు గాను, ఆహూతులై వివిధ రాష్ట్రములనుండి వచ్చిన కళాకారులకు తమ సంప్రదాయమును ప్రదర్శించుటకును చక్కని అవకాశము కలుగును. ఇట్టి సత్సంకల్పముతో మే మీ ఉత్సవములను తల పెట్టినాము. ఇందులకు కేంద్ర సంగీత నాటక అకాడమీ ఆమోదము, ఆర్థిక సహాయముకూడ లభించుట మాకు చాల సంతోషదాయక మైనది.

"ఈ అవకాశమును పురస్కరించుకొని మా నృత్యకళను గూర్చి రెండు మాటలు సవినయంగా వివరింతును. పరమేశ్వర సృష్టియగు నృత్యకళ బ్రహ్మానంద సంధానమువలన తండుమహర్షి శిక్షణలో భరతమునికి లభ్యమైనది. ఆయన దాన్ని తన నాట్య శాస్త్రంలో నిక్షిప్తము చేసినాడు. గాత్ర విక్షేపమాత్రకళ అయిన ఈ నృత్తము ఈలోకములో శుభసమయాలలో ప్రయుక్తమగుచు, అర్వాచీన కాలములో కోహలాదులు దోహదకారులు కాగా

సంగీత సాహిత్యాదులను జోడించుకొని, నృత్యకళగా ఆవిర్భవించి నది. ఈనృత్యకళ పరాకాష్ఠ నొందిన స్వరూపమే పదాభినయము.

"నృత్యకళ నందికేశ్వరుని చేతులలో సర్వాలంకారశోభిత మైనదన్న విషయము నృత్యవిదు లందరకు తెలిసిన సత్యమే. నందికేశ్వరుని 'అభినయ దర్పణము' నేటికిని భారతీయ నృత్యకళకు ఆధార గ్రంథముగా మన్నింప బడుచున్నది. ఈ నందికేశ్వరుడు ఆంధ్రుడని పలువురు విమర్శకుల అభిప్రాయము. అంతేకాదు, ఆంధ్రుల నృత్యకళ చాలప్రాచీనమైనదని చెప్పుటకు 'గాథాస ప్తశతి' నాట్యశాస్త్రమువంటి బహు ప్రాచీనగ్రంథములు, అనేక శిల్పములు ఆధారముగా ఉన్నవి. నృత్యకళకు పరాకాష్ఠ రూపమైన పదాభినయముకూడ సిద్ధేంద్రయోగి, క్షేత్రయ్యల మధురభావనా సృష్టిఫలముగా, తెలుగుదేశములోనే సుప్రతిష్ఠితమైనదని చెప్పుటకు గర్వపడుచున్నాను. ఇచ్చటి నాట్యాచార్యులు సంప్రదాయవిదులేగాక పండితులు, శాస్త్రవేత్తలు కూడ నగుట మీరు గమనింపగలరు. ఇచ్చటి న ర్తకీమణులు నృత్యకళలోనేగాక సంగీత సాహిత్యములలో పారము ముట్టిన విదుషీమణులన్న సత్యము మీకు ఆశ్చర్యమును గలిగించును.

"ఇప్పటికిని మేము మా సంప్రదాయమును నిల్పుకొను చున్నాము. ఇటీవలనే మా కూచిపూడి న ర్తకుడు శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ భారత ప్రభుత్వముచేత సన్మానింపబడినారు. 1961 సంవత్సరములో ఉజ్జయినిలో జరిగిన 'కాళిదాస నాట్య సమారోహ్' లో తెలుగు నాట్యబృందము, విజయనగరం శ్రీ సంపత్కుమార్ దర్శకత్వములో "అభిజ్ఞాన శాకుంతలము" నృత్య నాటకముగా ప్రదర్శించి, ప్రథమ బహుమతిగా కనకకలశము ను గెల్చుకున్నది. ఈవిషయములో కూడ సంప్రదాయమును కాపాడుకొను ప్రక్రియలో గతసంవత్సరము మరల మేము పంపిన

నాట్యబృందము శ్రీ నటరాజ రామకృష్ణ దర్శకత్వంలో 'కుమార సంభవ' గాథను నృత్యనాటకముగా ప్రదర్శించి, ప్రథమ బహుమానమును పొందినదన్న విషయము మీ కందరకు తెలిసినదే!

"ఉత్తరోత్తరా కూడ ఈ సంప్రదాయాన్ని కాపాడుకోవాలనే మా ఉత్కంఠ. ఈఉత్సవములకు అధ్యక్షత వహించుచున్న 'నాట్యాచార్య' శ్రీ వేదాంతం రాఘవయ్యగారు కూచిపూడి నృత్యకళా పారంగితులు. శ్రీ రాఘవయ్యగారు నృత్యకళాకారు లందరకు గౌరవనీయులు. నృత్యకళలో ఆరితేరిన వ్యక్తి. సినిమా దర్శకుడుగా కూడ ప్రసిద్ధిపొందుటకు భారతదేశములోనే గాక బహుశః ప్రపంచములోనే శ్రీ రాఘవయ్యగారు ప్రథమోదాహరణము అనుకొందును. శ్రీ రాఘవయ్యగారు మేము కోరినంతనే ఈ ఉత్సవములకు అధ్యక్షత వహించుటకు అంగీకరించుట మా అదృష్టముగా భావించుచున్నాము. వారికి మా కృతజ్ఞతలు.

"ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు, వంశపారంపర్యంగా లలితకళా పోషకులు నైన మా విజయనగరం మహారాజావారు శ్రీ పి. వి. జి. రాజుగారు ఈ ఉత్సవములను ప్రారంభించుటకు దయతో అంగీకరించినారు. వారికి మేము సర్వదా కృతజ్ఞులము.

"వివిధరాష్ట్రములనుండి మా అతిథులుగా విచ్చేసిన కళాకారులకు, పండితులకు ఒక విన్నపము. మీరందరును ఎన్నియో ప్రయాసలకు లోనయి కూడ, నృత్యకళపై యున్న శ్రద్ధాసక్తుల తోను, మాపై గల అభిమానముతోను హైదరాబాదు విచ్చేసినారు. ఇచ్చట మీ వసతికి సకల సౌకర్యములు సమకూర్చుటకు మేము యథాశక్తిగా ప్రయత్నించినాము. అయినప్పటికీ ఏవేని లోపములు దొరలినచో సహృదయముతో మన్నింపగలరనియు, కార్యక్రమము లన్నింటిలోను నాల్గు రోజులును ఉత్సాహముగా పాల్గొనగలరనియు, మధురమైన స్మృతులను మీ వెంట రాష్ట్రములకు కొనిపోగలరనియు విశ్వసించుచున్నాను.

" హైదరాబాదు పట్టణములోను, పరిసర ప్రాంతములలోను మీరు చూడవలసిన విశేషము లెన్నియో కలవు. అవి కూడ సందర్శించగలరని ఆశించుచున్నాను. సహృదయులైన ఆహ్వానితులకు, ప్రేక్షకులకు నాదొక విన్నపము. మనోహరమైన రవీంద్ర భారతి థియేటరులో నాల్గు రోజులపాటు వీనులకు, మనస్సులకు, మేధస్సులకు తృప్తి నొసంగెడి ఈ సాంస్కృతిక విందులో పాల్గొని, మరల నిట్టి ఉత్సవ మింకొకటి జరుగు వరకు ఈ మధుర స్మృతులను నిల్పుకొనగలరని విశ్వసించుచున్నాను.

" ఈ ఉత్సవమును, సదస్సును ఏర్పాటుచేయుటలో అనేకులు మిత్రులు, అధికారులు, అనధికారులు వేయివిధముల సహాయము చేసినారు. వారందరకు సమిష్టిగా కృతజ్ఞతలు తెలుపుకొనుచు సహృదయులైన మీ అందరకును మరల స్వాగతము పలుకుచున్నాను. కూచిపూడి నాట్యంలో ప్రవీణులు, ప్రఖ్యాత సినీ దర్శకులు శ్రీ వేదాంతం రాఘవయ్యగారు సభలకు అధ్యక్షత వహించడం శోభాయమానంగా, సముచితంగా ఉంది. ఆయన మహోదాత్తంగా సభలను నిర్వహించారు. " తమ అధ్యక్షోపన్యాసంలో:

" మాననీయులు శ్రీ విజయనగరం మహారాజావారికి, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు శ్రీ పసల సూర్యచంద్రరావుగారికి, వివిధ రాష్ట్రములనుండి విచ్చేసిన సదస్సు మహనీయులకు, మహిళామణులకు, మిత్రు లందరకు నా ప్రణామములు. సంగీత సాహిత్య నాట్యవేత్తలు, అభిమానులు అగు మీ అందరిని ఒక్కచోట చూడగల్గుటచేత నేను ధన్యుడనైనానని తలంచుచున్నాను.

" అఖిల భారత స్థాయిలో జరుగుచున్న ఈ నృత్యోత్సవాలకు సంబంధించిన సదస్సులకు నన్ను అధ్యక్షునిగా ఎన్నుకొన్నందుకు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారికి, రవీంద్ర భారతి మేనేజింగ్ కమిటీ వారికి నా కృతజ్ఞతలు. నృత్యకళలో నాకంటె

పెద్దలైనవా రెందరో ఉన్నారు. అయినప్పటికీ ఈ మహాసదస్సుకు నన్ను అధ్యక్షునిగా చేయుట మీ సౌహార్దమును, మీకు నాయందు గల అభిమానమును తెల్పును గాని అధిక్యమునకు తార్కాణము కాజాలదు. అసలు ఈ గౌరవము వ్యక్తిగా నాకు చేయబడినదనుట కంటె నాకు గల విద్య, ఆంధ్రులకు గర్వకారణము అయిన కూచిపూడి నృత్యకళకు చేయబడిన గౌరవముగా పేర్కొనుట ఎక్కువ సమంజసము కాగలదు.

"రాష్ట్ర స్థాయిలో అఖిల భారతీయ నృత్యోత్సవ సదస్సులను ఏర్పాటు చేయుటకు ప్రప్రథమముగా పూనుకొన్న ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారి నిర్మాణాత్మక కృషికి కళాకారు లందరి పక్షమున ముమ్ముందుగా అభివందనలు తెల్పుకొను చున్నాను. సంగీత, నృత్య,నాట్యముల కార్యక్రమముల కనుగుణ ముగా సమస్త సౌకర్యములతో కూడిన రవీంద్ర భారతి థియేటరును నిర్మించిన ఆంధ్రప్రభుత్వమును, ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ తలపెట్టిన సర్వకార్యక్రమములకును చేయూత నొసంగు చున్న రవీంద్ర భారతి మేనేజిమెంటు వారిని కూడ నేను హృదయ పూర్వకముగా అభినందించుచున్నాను.

"ఆదిదంపతు లయిన పార్వతీ పరమేశ్వరుల అనుగ్రహము వలన నృత్త, నృత్య, లాస్య, తాండవ భేదములతో మహర్షులకు లభ్యమైనవని మన విశ్వాసము. అట్లు లభ్యములైన లక్ష్యములకు భరతముని తన నాట్యశాస్త్రములో లక్షణములను కల్పించినాడు. భరతముని నాట్యశాస్త్రము భారతీయ సంగీత, నృత్య, నాట్య, సాహిత్యకళ లన్నిటికి మూలగ్రంథము. అయినప్పటికిని అది ప్రధానముగా నాటక రచనా ప్రదర్శనములకు సంబంధించిన శాస్త్ర మగుటచేత, తరువాత కాలములో నృత్యకళకు, ప్రత్యేకముగ శాస్త్రగ్రంథములు బయలుదేరినవి. వీటిలో ఆంధ్రులని తలపబడెడి నందికేశ్వరునిచేత రచింపబడిన 'అభినయదర్పణము' ప్రధాన

మైనది. కాలపరిణామము ననుసరించి సంప్రదాయములలో వచ్చిన మార్పులవలన నాట్యశాస్త్రమునకును, అభినయదర్పణాదులకును లక్ష్య, లక్షణ సమన్వయములో కొంత భేదము కన్పట్టుచున్నది. అయినను మూలగ్రంథమైన నాట్యశాస్త్రముయొక్క విశిష్టత, ప్రామాణ్యము నేటికిని అప్రతిమానము.

"ప్రాంతీయ ఆచార, వ్యవహార సంప్రదాయములలో కాల పరిణామ ప్రభావము కారణముగా వచ్చిన మార్పులవలన ఏకమైన భారతీయ నృత్యకళ, అర్వాచీన కాలములో శాఖోపశాఖలుగా విలసిల్లినది. ఇందు శాస్త్రానుగుణములైన నృత్యరీతులు శాస్త్రీయ నృత్యములు, లేదా మార్గభేదములు అనబడును. ఇంక కేవలము ఆ యా ప్రాంతములకు సంబంధించినవియును, శాస్త్రదృష్టి అంతగా లేనివియును, బొత్తిగా లేనివియును జానపద నృత్యములు లేదా దేశి విభేదములు అనబడును. భారతీయ శాస్త్రీయ నృత్యములలో ఆంధ్రదేశమునందలి కూచిపూడి నృత్యము, తమిళదేశమునందలి భరతనాట్యము, కేరళదేశమందలి కథాకళి నృత్యము, ఉత్తర హిందూస్థానమందలి కథక్, మణిపురి నృత్యములు, ఒరిస్సాలోని ఒడిస్సీ ముఖ్యముగా పేర్కొనదగినవి. ఈ ఉత్సవ సదస్సులలో ఈ ఆరు నృత్యముల రీతులు మాత్రమే ప్రదర్శింపబడును. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు త్వరలో జానపద నృత్యోత్సవ సదస్సులనుకూడ నిర్వహింపగలరని ఆశించుచున్నాను.

"పై నృత్యరీతులలో ఒకటి ఎక్కువ, ఇంకొకటి తక్కువ అనెడి భావనకు తావులేదు. నిజమునకు ఒక్కొక్కదానిలో ఒక్కొక్క విశిష్టతను మనము గమనించగలము. నర్తకియొక్క అంతఃప్రాణ లక్షణములు పదింటిలో 'పడి', 'నిలకడ' అనునవి ప్రధానములు. కూచిపూడి నృత్య, భరతనాట్యములలో ఈ 'పడి, నిలకడ'లు సమ ప్రాధాన్యమును కలిగియుండుట కాంచవచ్చును. కథక్ నృత్యములో

'వడికి' ప్రాధాన్యము హెచ్చు. మణిపురి నృత్యము 'లాస్య' పద్ధతికి చెందినది. కథాకళి నృత్యములో 'ముద్రలు' ప్రాధాన్యము వహించును. కూచిపూడి నృత్య, భరతనాట్యములలో 'అభినయము' నకు ప్రాధాన్యము. కథక్ నృత్యములో 'నృత్యము'నకు ప్రాధాన్యము.

"ఇట్లు వివిధ నృత్యరీతులు ఒక్కొక్క అంశమునందు విశిష్టములై ఆనందదాయకము లగుచున్నవి. కావున ఒక నృత్య రీతి మరియొక నృత్యరీతికి వ్యతిరేకమనిగాని, ఒక సంప్రదాయము వారు, ఇంకొక సంప్రదాయము వారికి వ్యతిరేకమనిగాని తలంచుటకు అవకాశములేదు. ఈ సత్యమును పురస్కరించుకొని 1958-వ సంవత్సరము మార్చి నెలలో ఢిల్లీలో నిర్వహింపబడిన 'అఖిల భారత నృత్య సదస్సు'లో నాటి కేంద్ర సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు డా. పి. వి. రాజమన్నారుగారు తమ ప్రారంభోపన్యాసములో చేసిన హెచ్చరికను మీకు జ్ఞాపకము చేయుట అప్రస్తుతము కాదను కొందును. 'ఒక రీతి నృత్యమును ఆరాధించుచున్నవారు, తక్కిన రీతులకు సంబంధించిన వారి యెడల అసమాన భావముతో నుండుట నేను గమనించుచున్నాను. ఇది అత్యంత విచారకరము. ఈ అసమానముతో పాటు పరస్పర ద్వేషము, జుగుప్స తలయెత్తును. తాము నేర్చిన నృత్యరీతి లేదా సంప్రదాయము మాత్రమే శాస్త్ర సమ్మతము అనియు, తక్కిన రీతులు లేదా సంప్రదాయము లన్నియు నశాస్త్రీయములనియు ననెడి అపోహయే ఈ అసమానమునకు, ద్వేషమునకు కారణమనుకొందును. ఉత్తరభారతములోని హిందూస్తానీ సంగీతములోని వివిధ ఘరానాల మధ్యగల విభేదములు వైరుధ్యములనియే చెప్పవచ్చును. మీలో కొందరి కైనను బాగుగా తెలిసియుండ వచ్చును. భారతీయ సంస్కృతిని నిజముగా ప్రేమించెడివా రందరును వ్యక్తుల యెడగాని, భాషల యెడగాని, ప్రాంతముల యెడగాని, పక్షపాతము లేకుండా, సలక్షణములైన సంప్రదాయము లన్నింటి యెడలను గౌరవమును,

ఆదరమును పెంపొందించుకొనుట నేర్చుకొనవలయునని నేను హృదయపూర్వకముగ అర్థించుచున్నాను. మతము విషయములో సహనమునకు భారతదేశము పేరు పొందినది. తాను ఏ మతమునకు చెందినప్పటికిని, నిజమైన భారతీయు డెవ్వడును ఇతర మతములను ద్వేషింపడు. తృణీకరింపడు. కళారంగములో, ముఖ్యముగా సంగీత, నృత్య విషయములలో ఇటువంటి సద్భావమే వ్యాప్తినొంద వలయునని మాత్రమే నా ప్రార్థన.

"సువిశాలమైన భారతదేశములోగల విభిన్న రీతులను, సంప్రదాయములను ఒకే స్థలములో, ఒకే సమయమున ప్రదర్శింప బడుటకు ఏర్పాటుచేయబడిన ఇట్టి నృత్యోత్సవ సదస్సులు డా. రాజమన్నారుగారు ఆశించిన సద్భావమును పెంపొందించుటకు ఎంతగానో తోడ్పడగలవు. కావున ఇట్టి అఖిల భారతీయ సదస్సులు కేంద్రస్థాయిలోనేగాక, రాష్ట్రస్థాయిలోకూడ ఆ యా రాష్ట్రము లందు క్రమపద్ధతిని తరచుగా నిర్వహింపబడినచో వివిధ కళాకారుల మధ్య సద్భావము మరింతగా పెంపొందింప జేయుటకు దోహదము కాగలదని సవినయముగా మనవిజేయుచున్నాను. అప్పుడే కేంద్రములో, వివిధ రాష్ట్రములలో ఏర్పడిన అకాడమీల కృషి ద్వారా జాతీయైక్యమును సాధింపవలెనన్న మహదాశయముకూడ నెరవేరగలదు.

"ఇట్టి విశాలదృష్టితో పరిశీలించినచో ఈ నృత్యసదస్సులో చర్చనీయాంశముగా ఎన్నుకొన్న 'అఖిల భారత శాస్త్రీయ నృత్య రీతులు' అనెడి విషయమునకు నేటి పరిస్థితులలో ఎంతయో విలువ కలదు. వివిధ రాష్ట్రములనుండి విచ్చేసిన సహృదయులగు కళాకారు లందరును, విభిన్న నృత్యరీతులలోగల ఏకసూత్రతను తమ ఉపన్యాసములద్వారా, ఉదాహరణపూర్వక విన్యాసములద్వారా, ప్రదర్శనములద్వారా సుప్రతిష్ఠము చేయగలరని విశ్వసించు చున్నాను.

"నృత్యకళా సాధనము యోగతుల్యమైనది. నిశ్చలమగు మనస్సుతో బ్రహ్మానుసంధానమునకు ప్రయత్నించుచున్న యోగి, లక్ష్యశుద్ధిగల నర్తకితో నుపమింపబడుట మీరు గమనించియే యుందురు.

"పుంఖానుపుంఖ విషయే క్షణతత్పరోఽపి।
బ్రహ్మావలోకన ధియం నజహాతి యోగీ।
సంగీత తాళ లయ వాద్య వశం గతాపి।
మౌళిస్థ కుంభ పరిరక్షణ ధీర్నటీవ."

"ఆదిలో నృత్యకళ కేవలము భగవదారాధనకు ఉద్దిష్టమైనది. నృత్యకళద్వారా పరమేశ్వరుని సేవించి, తరించినవా రెందరో ఉన్నారు. కాని కాలప్రభావమునకులోనై, ఈ నృత్యకళ అర్వాచీన కాలములో పతన స్థితికి దిగజారినది. అట్టి స్థితిలో క్రీ. శ. 14, 15-వ శతాబ్ద ప్రాంతమున కూచిపూడి నర్తకులు (అందరును పురుషులే) ఈ నృత్యకళను చేపట్టి మరల ఉచ్చస్థితికి తీసుకొని వచ్చినారు. క్రీ. శ. 16, 17, 18-వ శతాబ్దులలో నేటి కథాకళి, కథక్, ఒడస్సీ, మణిపురి, భరతనాట్య రీతులు రూపులు దిద్దుకొన్నవి. ఈ నృత్యరీతు లన్నియు మరల బ్రిటిష్‌వారి పరిపాలనా కాలములో ఆదరణ, పోషణలేని కారణముగా క్షీణదశకు వచ్చినవి. భారతదేశము స్వతంత్రమైన పిమ్మట మరల ఆ యా నృత్యరీతు లన్నియును పూర్వ వికాసము నందుట మనకందరకు సంతోష కారణము. కాని, నృత్యకళ యోగతుల్యమనియు, మానవునిలోని దివ్యత్వమును వికసింపజేయుట దాని ప్రధాన లక్ష్యమనియు కళాకారులు స్మృతియం దుంచుకొనుచున్నట్లు అంతగా కనబ్పట్టుటలేదు. తత్ఫలితముగా నృత్యకళ కేవలము ఐహికమైన వినోదప్రాయముగా మారిపోయినది. అంతియే కాదు. శాస్త్రమునకును, గురుశిక్షణము నకును కూడ ఎట్టి విలువయును లేకుండ పోయినది. శాస్త్రవిదులైన నాట్యాచార్యులు, గురుకుల క్లిష్టులైన నర్తకీనర్తకులు క్రమక్రమము

తక్కువై పోవుచున్నారు. ఇట్టి స్థితి ఇంక కొనసాగనీయ రాదు.

"నాట్యాచార్యుని గుణములను, లక్షణములను పూర్వ మహర్షులు నిర్ధరించి యున్నారు. నేటికిని అవి తిరుగులేనివి. శాస్త్రము నందును, సంప్రదాయమునందును సుశిక్షితుడు, స్వతంత్రభావనా శక్తి గలవాడు, శిక్షణాదక్షుడు, వాత్సల్యపూర్ణుడు అయినవాడే 'నాట్యాచార్య' శబ్దమునకు అర్హుడు. గురుకుల క్లిష్టులై లక్ష్యసిద్ధి, లక్ష్యశుద్ధితో నృత్యకళను అభ్యసించినవారే నర్తకీ నర్తకులు కాగలరు. అభ్యాస మాత్రముతో సరిపోదు; నిరంతర సాధనము కూడ అత్యావశ్యకము. సంగీతమువలెనే నృత్యము కూడ గురుకులపద్ధతిని నేర్చినప్పుడే సంపూర్ణము కాగలదని నా స్వానుభవము. అట్టి సత్సంప్రదాయము సుప్రతిష్ఠితమగుటకు ఇచ్చుటకు విచ్చేసిన సహృదయులగు కళాకారు లందరును మనఃపూర్వకముగ ప్రయత్నించి, నృత్యకళను మహోన్నత స్థితికి గొనిపోగలరని విశ్వసించుచున్నాను.

"ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీని గూర్చి ఒకటి రెండు మాటలు. ఈ అకాడమీ పక్షమున 'నాట్యకళ' అనెడిద్వైమాస పత్రిక అకాడమీ అధ్యక్షులు శ్రీ పసల సూర్యచంద్రరావుగారి సంపాదకత్వమున ఆంధ్ర ఆంగ్ల భాషలలో వెలువడుచున్నదని తెలుసుకొనుటకు చాల సంతోషపడుచున్నాను. ప్రాచీనశాస్త్ర గ్రంథములలోని విశేషములను, పూర్వవిద్వాంసులలో పేరెన్నిక గన్నవారి చరిత్రలను, వివిధ సంప్రదాయ విశేషములను, నూతన పరిశోధనా ఫలితములను నిర్మాణాత్మకముగ లోకమున కందించుటలో ఈ నాట్యకళ ఎనలేని సేవ చేయగలదని నేను నమ్ముచున్నాను. అంతియకాదు. తంజావూరు సరస్వతీ మహాలు గ్రంథాలయములో నృత్యకళకు సంబంధించిన శాస్త్రగ్రంథము లెన్నియో గలవు. వాటిని పరిశీలింపజేసి ఉపయోగకరము లైన

శాస్త్ర గ్రంథములను వివరణాత్మకముగ ప్రకటించినచో నృత్యకళకు మహోపకారము కాగలదు. ఇందులకు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ పూనుకొనగలదనియు, ఈ కృషికి కేంద్ర సంగీత నాటక అకాడమీ, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములు ప్రత్యేకముగ ఆర్థిక సహాయము చేయగలవనియు విశ్వసించుచున్నాను.

"రసజ్ఞులు, సహృదయులగు సదస్యు లింతదనుక ఓపికతో నా మాటల నాలకించినందులకు కృతజ్ఞుడను."

(—వేదాంతం రాఘవయ్య. అ. భా. నృ. సదస్సుల అధ్యక్షుడు)

సభలను ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు శ్రీ పి. వి. జి. రాజు ప్రారంభించారు. అఖండ జ్యోతి వెలిగించారు. మంగళతూర్య రావాలు చెలరేగాయి. ప్రారంభోత్సవ సమయంలో శ్రీ పి. వి. జి. రాజు, అకాడమీ ఇటువంటి నూతన కార్యక్రమం చేపట్టడంలో చైతన్యం కళారంగంలో వెల్లివిరిసిందని, ఇది ఆంధ్రదేశానికి ప్రత్యేకశోభ చేకూర్చగలదని అన్నారు. కళాకారులు తమ సర్వస్వం కళకు ధారపోసినప్పుడే ఉత్తమకళ రాణించగలదని, శాస్త్రీయ నృత్యరీతులు కళంకాలు లేకుండా ఉత్తమ ప్రదర్శన లివ్వవలసిన అగత్యం కళాకారుల బాధ్యత యని అన్నారు.

నృత్యోత్సవాల సదస్సుల సమావేశకర్తగ శ్రీ పోతుకూచి సాంబశివరావు, సహాయ సమావేశకర్తగ శ్రీ ఎ. ఆర్. కృష్ణ వ్యవహరించారు. ఆంధ్రదేశ నాట్యశిఖామణులచే అభినయ ప్రదర్శనలు ఇవ్వబడినాయి. శ్రీయుతులు హరి పున్నయ్య, వేదాంతం రామకృష్ణయ్య, బొందల కోటిజగన్నాథం, చిత్తజల్లు పెద వేంకటరత్నం, అన్నాబత్తుల బులివేంకటరత్నం, పందిరి వేంకట రత్నం, లక్ష్మీనరుస (కళావర్ రింగ్) లు ఈ ప్రదర్శనలలో పాల్గొన్నారు.

కూచిపూడి భాగవతం: కూచిపూడి భాగవత సంప్ర దాయం యోగి సిద్ధేంద్రులవారిచే మూడు వందల సంవత్సరాల క్రిందట

స్థాపింపబడిన నృత్యరీతిగా చెప్పవచ్చును. సిద్ధేంద్రులవారు గొప్ప కృష్ణభక్తులు. ఆయన కృష్ణజీవితంలోని మధురాతిమధురమైన ఒక ఘట్టాన్ని సత్యభామా కృష్ణుల ప్రణయము, కలహము, వియోగము, విరహముల వర్ణనలకు అనువైన రీతిని మలచి, భామా కలాపం రూపంలో వైష్ణవమత ప్రచారంతో కృష్ణగాథను ప్రబోధం చేశారు. కూచిపూడి బ్రాహ్మణ పండితులు ఆ విద్యను చేపట్టి నేటికి ఆ కళద్వారా ఆంధ్రలో సంస్కృతీ వికాసము కలుగజేయుచున్నారు.

కూచిపూడిబృందంవారి 'ఉషాపరిణయం', 'భామా కలాపం' ప్రదర్శనలతో 14-వ తేదీ అఖిల భారత నాట్యోత్సవం ప్రారంభమైంది. ఇందులో శ్రీ వేంకటరామ నాట్యమండలి, కూచిపూడివారు పాల్గొన్నారు. ఈ నాట్య బృందానికి గురువు, సూత్రధారులు శ్రీ చింతా కృష్ణమూర్తిగారు.

అఖిల భారత నాట్యోత్సవ తీర్మానం: అఖిల భారత నృత్యోత్సవములు హైదరాబాదులో జరిగిన సందర్భంలో సమావేశమైన నృత్యకళాకారులు, విమర్శకులు అందరూ కలసి కూచిపూడి నృత్య రూపకాన్ని శాస్త్రీయమైనదిగా, ఇంతవరకు శాస్త్రీయ నృత్యములుగ గుర్తించబడిన వాటిలో దీనినిగూడ చేర్చ వలసినదిగా న్యూఢిల్లీలోని కేంద్ర సంగీత నాటక అకాడమీవారికి సిఫార్సు చేస్తూ ఉద్ఘాటించారు.

సంతకములు :

ఇ. కృష్ణయ్యర్

దమయంతీ జోషీ

నయినా ఝువేరీ

కూచిపూడి నాట్యం శాస్త్రబద్ధమే: ఇటీవల నగరంలో జరిగిన నాట్యసదస్సులో ఒక చెప్పుకోదగ్గ విషయం జరిగింది. సదస్సు చివరి రోజున శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు ఒక ముఖ్య తీర్మానం ప్రవేశపెట్టారు. దాని సారాంశం:

"ఈ సదస్సుకు విచ్చేసిన నాట్యాచార్యులు, కళాకారులు, కళాభిమానులు కూచిపూడి నాట్యం శాస్త్రబద్ధమైనదేనని అంగీకరించవలసినదిగా, కేంద్ర సంగీత నాటక అకాడమీని కోరుతూ తీర్మానించడమైనది."

అధ్యక్షులు శ్రీ వేదాంతం రాఘవయ్యగారు తీర్మానాన్ని సభలో ప్రవేశపెట్టారు. కూచిపూడి నాట్యం శాస్త్ర సమ్మతమైనదే నని తాము గట్టిగా ఋజువు చేయగలమనీ, దానికి ఇతర పండితుల అభిప్రాయాలుకూడా దోహదంగా ఉండగలవనీ గట్టిగా చెప్పారు. శాస్త్రబద్ధముకాదనే వారికి జవాబుచెప్పే బాధ్యత తాము వహిస్తామని కూడా చెప్పారు.

శ్రీ కృష్ణయ్యగారి ప్రసంగం :

తర్వాత ఈ తీర్మానంమీాద ........మద్రాసు 'స్టే' లు సంగీత నాటక సంఘ కార్యదర్శి శ్రీ కృష్ణయ్యగారు ప్రసంగిస్తూ :

"కూచిపూడి నాట్యం శాస్త్రబద్ధంకాదంటున్నారనే మాట విన్నప్పుడు నేనెంతో బాధపడ్డాను. కేంద్ర నాటక అకాడమీ కూచిపూడి నృత్యాన్ని శాస్త్రీయ నృత్యంగా అంగీకరించలేదని విన్నప్పుడు మరింత బాధగా ఉంది. ఇది నృత్యశాస్త్రానికే అపవాదు. కూచిపూడి జానపద సంప్రదాయాలనుంచి వచ్చిందనుకోవడం పొరపాటు. భరతనాట్యం నుంచే వచ్చింది. సిద్ధేంద్రయోగి దీనిని వెలువరించాడు. ఇది జానపద సంప్రదాయ మనుకోవడానికి కారణ మేమిటి? భాగవత నాట్యాలు ఎక్కువగా పల్లెలలో పోషింపబడుతూ వచ్చాయి. వాటి పోషణభారం కూడ జానపదులే వహించారు. అందువల్ల జానపద వాతావరణం కొంత దీనికి చుట్టుకొని ఉండవచ్చు. అంతేగాని భాగవతనాట్యాలు జానపద వాఙ్మయానికి చెందినవి మాత్రంకాదు.

"పోతే కూచిపూడి, భరతనాట్యాలకు భేదముంది సంప్రదాయాల ప్రకారం. కాని, శాస్త్రం ఒక్కటే. ఒకదానికి ఒకటి

సహాకారంగా ఉన్నాయి. అన్యోన్యతకూడ పెంపొందిందని చెప్ప డానికి అవకాశాలు ఉన్నాయి. ఈ రెండూ శాస్త్ర సమ్మతమైన రీతులే. ...... ఈ సదస్సులో నృత్యంచేసిన శ్రీమతి బాలసరస్వతి కొంత కాలం కూచిపూడి పండితులైన స్వర్గీయ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారి వద్ద విద్యాభ్యాసం చేసింది. అలాగే దక్షిణాదివారు చాలామంది కూచిపూడి పద్ధతిలో అభ్యాసం చేశారు.

కూచిపూడి నాట్యం జానపదానికి చెందిందికాదు అని చెప్ప డానికి మరొక కారణముంది. శాస్త్రీయ సంగీతంలో అడుగడుగునా మొండాతనం కనిపిస్తుంది. ఇది జానపదంలో మృగ్యం. కూచిపూడి నాట్యంలో భావ గాంభీర్యం, నృత్య వైలక్ష్యం, అభినయ ప్రాశస్త్యం గోచరిస్తాయి. దీనినిబట్టి కూచిపూడి శాస్త్రీయమైనదే నని అంగీకరించక తప్పదు. తరువాత తీర్మానం హర్షధ్వానాలమధ్య ఏకగ్రీవంగా సభలో ఆమోదింపబడింది.

శ్రీ రాఘవయ్య ప్రసంగం: "కూచిపూడి సంప్ర దాయాన్ని ప్రచారంలోకి తీసుకువచ్చే అవకాశాలు ఇప్పుడెక్కువగా జరుగుతున్నాయి" అని అంటూ శ్రీ వేదాంతం రాఘవయ్య, "పూర్వం మా భాగవతులు గిరి గీచుకొని గ్రామాలు, పట్టణాలలో మాత్రమే ప్రదర్శనాలిస్తూ ఉండేవారు. పెద్దపెద్ద నగరాలలో వారెక్కువగా ప్రదర్శనాలివ్వలేదు. అందువల్ల కూచిపూడి గ్రామ వాసులకు చెందిన కళగా భావించబడి ఉండవచ్చు. ప్రస్తుతం బందావారు తమ నాయకత్వం క్రింద కూచిపూడికి తగిన వ్యాప్తిని లభింప చేశారు. ఢిల్లీ వరకు వెళ్లి కీర్తి సంపాదించుకున్నారు. ఉష పాత్రధారిగా వేదాంతం సత్యనారాయణ 'ఇండియా ప్రెసిడెంటు అవార్డు' పొందాడు. కూచిపూడిలో నృత్యకళాశాల ఏర్పాటుచేయ బడింది. ఉచిత భోజన వసతులు ఏర్పడినాయి. ఇతర ప్రాంతాల విద్యార్థులు కూడా స్థానాన్ని సంపాదించారు. ఈవిధంగా కూచిపూడి

సంప్రదాయానికి విశేషప్రచారం జరిగింది. అంతేకాదు, ప్రాబల్యం కూడ సిద్ధిస్తోంది. కూచిపూడి సంప్రదాయం 14-వ శతాబ్ది ప్రారంభంలోనే తలఎత్తింది. కథాకళి, కథక్, ఒడిస్సీ, మణిపురి మొదలైనవి 16-వ శతాబ్దం నుంచి 18-వ శతాబ్దాలలో రూపొందాయి. ఇట్టి ప్రాచీన సంప్రదాయాన్ని శాస్త్రబద్ధం కాదనడం అనుచితం."

శ్రీ బందావారి సమర్థన : "భరతుని నాట్యశాస్త్రాన్ని అనుసరించిన ఏ నృత్యమైనా శాస్త్రబద్ధమే. కూచిపూడి నాట్యం భరతశాస్త్రానికి చెందినది. పూర్వ రంగపూజ, ఇంద్రపతాకా రోహణం, సూత్రధారి వల్లించే నాందిస్తుతి, ధరించే కుటిలక, వంకరకర్ర—ఇవన్నీ కూచిపూడి నృత్యంలో కనిపిస్తాయి. ఇవి నాట్యశాస్త్రంలోని మొదటి రెండు అధ్యాయాలలో పేర్కొనబడినాయి. నాకు తెలిసినంతవరకు ఇవి ఏ ఇతర సంప్రదాయాలలోను కనిపించవు. కనుక కూచిపూడి నాట్యం శాస్త్రీయమైనదనడం నిర్వివాదం.

"తగినప్రచారం ద్వారా ప్రాశస్త్యంపొంది ఈ సంప్రదాయం భారతదేశంలో వ్యాప్తిచెందగలదు. కేంద్ర ప్రభుత్వానికి చెందిన ఫిలిం డివిజన్ కూచిపూడి నృత్యానికి సంబంధించిన డాక్యుమెంటరీ తయారు చేసింది. దీనిలో శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ భామాకలాపం ప్రదర్శించారు. విశాఖపట్టణానికి చెందిన కుమారి జయశ్రీ దేవదాసీ సంప్రదాయాలు ప్రదర్శించింది. ఇవిగాక కూచిపూడికి సంబంధించిన కొన్ని ప్రత్యేక నృత్యవిశేషాలు కూడ ఫిలిం తీశారు. దీనిని రంగుల చిత్రంగా రూపొందించారు.

కూచిపూడి -భరతనాట్యం - ఒడిస్సీనాట్యం : "కూచిపూడి నృత్యం, భరతనాట్యం, ఒడిస్సీ నృత్యాల్లోని నృత్యరీతుల మధ్య హస్త, పాదవిక్షేపాల్లోను, ముద్రల విషయంలోను వ్యత్యాసాలున్నా మౌలికంగా ఒకే విధమైన నృత్య విభాగాలతోను, లేదా అడవుల తోను రూపొందింపబడినాయని, సాత్వికాభినయం ఈ మూడు నృత్య

రీతులలోను ప్రధాన స్థానం వహిస్తుందని, నందికేశ్వరుని 'అభినయ దర్పణం' ఆధారంగా నేత్రాలు, ముఖం మొదలైన అంగ విన్యాసాల ద్వారా భావ ప్రదర్శన జరుగుతోందని; శిరోభేదం, భ్రూభేదం, దృష్టిభేదం, గ్రీవభేదం—ఇవన్నీ ఈ త్రివిధ నృత్యరీతులలో సమానంగా ఉంటాయని నిరూపింపబడింది.

సాధారణాంశాలు : "నర్తకులు, నర్తకీమణులు, నాట్యాచార్యులు వారే భారతీయ నృత్యరీతికి చెందిన వారైనప్పటికీ, ప్రాంతీయ వ్యత్యాసాలు మున్నగు వాటికి ప్రాముఖ్యం కల్పించకుండా మొత్తం దేశమంతటిలోని నాట్య సంస్కృతిలో నిక్షిప్తమైన ఐక్యతను పూర్తిగా అవగాహన చేసుకోవలసినదిగా కోరుతున్నాం. భారతీయ నృత్య ప్రమాణాన్ని అభివృద్ధికి తెచ్చే విధంగా వివిధ నృత్యరీతుల్లో సాత్వమైన, సమర్థవంతమైన, క్రమాత్మకమైన శిక్షణకు అనువైన చర్యలు తీసుకోవాలి. విస్తృతమైన నృత్యకళారీతులను దృశ్యాలను పునరుద్ధరించే లక్ష్యంతో వివిధనృత్యరీతుల్లో పరిశోధనలకు ప్రయత్నించాలి.

"దేశంలో అనేక ప్రాంతాలలో లభిస్తున్న భిన్నశిల్పాల విశిష్టతలను అధ్యయనం చేయడం అవసరమని ఈ నాట్యగోష్ఠిలో నొక్కి వక్కాణింపబడింది. ఆ అధ్యయన ఫలితాలను నృత్యకళా ప్రమాణాల అభివృద్ధికి వినియోగించాలని కూడా సూచింపబడింది. అన్ని విశ్వవిద్యాలయాల్లోనూ, విభిన్ననృత్యరీతుల్లో శిక్షణా వకాశాలు కల్పించాలని ఈ నాట్యగోష్ఠి సిఫారసు చేసింది. ఈనాడున్న నిపుణులైన నాట్యాచార్యుల నృత్యశైలులను ఫిలిం, రికార్డింగులద్వారా భద్రపరచాలి. వివిధ ప్రాంతీయభాషల్లో నృత్య విద్వాంసులు, కళాకారులు రచించగల పాఠ్యగ్రంథాలను అధికారపూర్వకమైన నృత్య సాహిత్యాన్ని ప్రచురించాలి. ఆ యా రీతుల స్ఫూర్తి సంప్రదాయాలకు భిన్నంకాని వినూతన విధానాలను సృష్టించి నృత్యకళలో సృజనాత్మక కృషిని ప్రోత్సహించాలి అని కూడ ఈ గోష్ఠి భావిస్తున్నది."

గోష్ఠి నివేదికా సంఘము,
వేదాంతం రాఘవయ్య
ఇ. కృష్ణయ్యర్
నయనా ఝవేరీ
పాతూరి శ్రీరామశాస్త్రి
శవంతి రాజేశ్వరరావు
నటరాజ రామకృష్ణ
(నాట్యకళ, విశేష సంచిక ఆధారంగా)

నృత్యోత్సవాలలో పాల్గొన్న కూచిపూడి ప్రముఖులలో శ్రీ వేదాంతం రాఘవయ్యగారు అధ్యక్ష స్థానాన్ని అలంకరించారు. వీరు 1919 లో జూన్ 8-వ తేదీన కృష్ణాజిల్లా, మువ్వ తాలూకా, కూచిపూడి గ్రామంలో జన్మించారు. తల్లి శ్రీమతి అన్నపూర్ణమ్మ, తండ్రి శ్రీరామయ్యగారలు. కూచిపూడి నాట్యాచార్యత్రయంగా ప్రఖ్యాతి గాంచిన వారిలో శ్రీ చింతా వేంకటరామయ్య, శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారల కడ నాట్యవిద్యాభ్యాసం చేశారు.

యక్షగానాలలో లవ, కుశ, లోహిత, ప్రహ్లాద మున్నగు పాత్రలు ధరిస్తూ తమ ఏడవ యేటనే నాట్యరంగ ప్రవేశం చేశారు. తొమ్మిది, పది సంవత్సరాలు వచ్చే సరికి ఉషాకన్యగా, భామగా ప్రఖ్యాతి నార్జించారు. 28-వ సంవత్సరం వచ్చువరకు నాట్యమేళాలలో స్త్రీ పాత్ర ధరించి దేశవ్యాప్తంగా ప్రదర్శన లిచ్చారు. శ్రీకృష్ణపాత్రను కూడా రసవంతంగా పోషించేవారు. 1928 నుండి 1944 వరకు ఏ ఊరు చూచినా, ఎవరి నోటను విన్నా శ్రీ రాఘవయ్య గారి పాత్రపోషణ, అభినయ వైశిష్ట్యాన్ని గురించిన ప్రశంసా వాక్యాలు నిరంతరం విన్పించేవి. ఒకవిధంగా కూచిపూడి నాట్య చరిత్రలో ఇది 'రాఘవయ్య యుగం' అని చెప్పవచ్చు. వీరి శిష్యులు పలువురు నాట్యాచార్యులుగా సుప్రసిద్ధులైనారు.

1944 లో శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారు వీరి నాట్య ప్రతిభకు ఆకర్షితులై తమ 'రైతుబిడ్డ' సినిమాలో దశావతారాల ప్రదర్శన మిప్పించి చలనచిత్రరంగ ప్రవేశానికి నాంది పలికారు. దాదాపు 150 తెలుగు, తమిళ చిత్రాలకు పైగా నృత్య దర్శకత్వం నిర్వహించారు. 1950 నుండి చిత్ర దర్శకత్వం స్వీకరించారు. 'లైలామజ్నూ', 'రాజనందిని', 'సువర్ణసుందరి', 'దేవదాసు' వంటి ఉత్తమ చిత్రాలకు ధర్శకత్వంవహించి ఉత్తమ దర్శకులుగా అఖండ ఖ్యాతి నార్జించారు. ఈయన కళాతపస్వి. మధుర హృదయుడు. రసపిపాసి.వీరి ఆకస్మిక మరణం కళాజగత్తుకు తీరని నష్టం

శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ : ఈయన సత్యభామ, ఉషాకన్య మున్నగు స్త్రీ పాత్రలు అభినయించడంలో దిట్ట. ఇరువది యేడు సంవత్సరాల పిన్న వయస్సులోనే ఈయన స్త్రీ పాత్ర ధారణలో ప్రసిద్ధి నార్జించాడు. 1961 లో కేంద్ర సంగీత నాటక అకాడమీ వారి ద్వారా రాష్ట్రపతి పతకాన్ని గ్రహించారు. రాష్ట్రపతి సమక్షంలో 'కృష్ణశబ్దం', 'దశావతారా'లలో కొన్ని అంశాలు ప్రదర్శించారు.

కూచిపూడి భాగవతులలో ప్రస్తుతం స్త్రీ పాత్రధారణ చేస్తున్నవారు వీరొక్కరు మాత్రమే.

శ్రీ హరి పున్నయ్య : వీరు సుప్రసిద్ధ తామస ప్రధానపాత్ర ధారిగా ప్రసిద్ధిపొందిన శ్రీ హరి వేంకటాచలపతిగారి ఏకైక పుత్రుడు. యక్షగాన సంప్రదాయంలో తండ్రిగారి అనంతరం వారి పాత్రలు ధరించేవారు.

శ్రీ వేదాంతం రామకృష్ణయ్య : సాత్త్విక పాత్రలు రసవంతంగా అభినయించి తమ నామధేయం సార్థకం చేసుకున్నారు. యక్షగాన సంప్రదాయంలో నటశేఖరులుగా రాణించారు. వీరి కళాసేవను గుర్తించి అకాడమీవారు వృద్ధాప్యపు కళాకార ఉపకార వేతనం రు 25 లు యిచ్చింది.

1964 మార్చి 17-వ తేదీన జరిగిన సన్మానసభకు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు అధ్యక్షత వహించారు. సమావేశకర్తను అభినందించారు. ఆంధ్రదేశ నృత్యకళాకారులకు ఒక్కొక్కరికి రు. 116 లు ఒక పండితశాలువ బహూకరించారు. శ్రీ పసల సూర్యచంద్రరావుగారి కృతజ్ఞతాభివందనములతో ఉత్సవాలు జయప్రదంగా ముగిశాయి.

1966 మే లో విజయనగరం శ్రీ గీతా నృత్యకళా మందిర్, మన్సాన్ రిక్రియేషన్ క్లబ్ సహకారంతో రాష్ట్ర అకాడమీ నృత్యోత్సవాలు నిర్వహించింది. ఈ ఉత్సవాలకు ప్రముఖ యక్షగాన సూత్రధారులు, కూచిపూడి వేంకట్రామ నాట్యమండలి వ్యవస్థాపకులు శ్రీ చింతా కృష్ణమూర్తిగారు అధ్యక్షత వహించారు. అకాడమీ వీరిని 'భరతకళాప్రపూర్ణ' బిరుదంతో సన్మానించింది.

1967 జూన్‌లో శ్రీ విజయదుర్గ సంగీత విద్వత్సభ శ్రీ కనకదుర్గా నృత్యకళాకేంద్రం సహకారంతో నృత్యోత్సవాలను ఆంధ్ర ప్రదేశ్ నృత్యకళా పరిషత్, రాష్ట్ర అకాడమీ ఆధ్వర్యములో ఉత్సవాలు నిర్వహించింది. ఈ ఉత్సవాలకు నటరాజ రామకృష్ణ అధ్యక్షత వహించారు. వీరిని అకాడమీ 'భరతకళాప్రపూర్ణ' బిరుదుతో సత్కరించింది.

సిద్ధాంత గ్రంథప్రచురణను ప్రోత్సహించడానికిగాను అకాడమీవారు డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావుగారి 'నాట్యశాస్త్రము' నకు, మహామహోపాధ్యాయ శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారి 'నాట్యవేదము' నకు, శ్రీ రోహిణిగారి 'నాటకశిల్పము' నకు, 'ప్రసన్నరాఘవ' నాట్యప్రబంధమునకు ఆర్థిక సహాయమొనర్చినది.

ఉదయశంకర్ అను ప్రసిద్ధ నాట్యాచార్యుడు ఐరోపా ఖండమంతా పర్యటించి ప్రదర్శించాడు. అమెరికాలో త

1964 మార్చి 17-వ తేదీన జరిగిన సన్మానసభకు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు అధ్యక్షత వహించారు. సమావేశకర్తను అభినందించారు. ఆంధ్రదేశ నృత్యకళాకారులకు ఒక్కొక్కరికి రు. 116 లు ఒక పండితశాలువ బహూకరించారు. శ్రీ పసల సూర్యచంద్రరావుగారి కృతజ్ఞతాభివందనములతో ఉత్సవాలు జయప్రదంగా ముగిశాయి.

1966 మే లో విజయనగరం శ్రీ గీతా నృత్యకళా మందిర్, మన్సాన్ రిక్రియేషన్ క్లబ్ సహకారంతో రాష్ట్ర అకాడమీ నృత్యోత్సవాలు నిర్వహించింది. ఈ ఉత్సవాలకు ప్రముఖ యక్షగాన సూత్రధారులు, కూచిపూడి వేంకట్రామ నాట్యమండలి వ్యవస్థాపకులు శ్రీ చింతా కృష్ణమూర్తిగారు అధ్యక్షత వహించారు. అకాడమీ వీరిని 'భరతకళాప్రపూర్ణ' బిరుదంతో సన్మానించింది.

1967 జూన్‌లో శ్రీ విజయదుర్గ సంగీత విద్వత్సభ శ్రీ కనకదుర్గా నృత్యకళాకేంద్రం సహకారంతో నృత్యోత్సవాలను ఆంధ్ర ప్రదేశ్ నృత్యకళా పరిషత్, రాష్ట్ర అకాడమీ ఆధ్వర్యములో ఉత్సవాలు నిర్వహించింది. ఈ ఉత్సవాలకు నటరాజ రామకృష్ణ అధ్యక్షత వహించారు. వీరిని అకాడమీ 'భరతకళా ప్రపూర్ణ' బిరుదుతో సత్కరించింది.

సిద్ధాంత గ్రంథప్రచురణను ప్రోత్సహించడానికిగాను అకాడమీవారు డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావుగారి 'నాట్యశాస్త్రము' నకు, మహామహోపాధ్యాయ శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారి 'నాట్యవేదము' నకు, శ్రీ రోహిణిగారి 'నాటకశిల్పము' నకు, 'ప్రసన్నరాఘవ' నాట్యప్రబంధమునకు ఆర్థిక సహాయమొనర్చినది.

ఉదయశంకర్ అను ప్రసిద్ధ నాట్యాచార్యుడు ఐరోపా ఖండమంతా పర్యటించి ప్రదర్శించాడు. అమెరికాలో తన

ప్రదర్శన లిచ్చాడు. ఆనాడు భారతీయ నాట్య ప్రాభవం, అందం, లావణ్యం లోకమంతటా మారుమ్రోగింది. 1933లో ఈయన తన బృందంతో ప్రప్రథమంగా మన దేశంలో మద్రాసులో ప్రదర్శన మిచ్చాడు. కొందరు విమర్శకులు ఇది 'భరతనాట్యంకా' దన్నారు. అందుకు ఉదయశంకర్, "నేడు మనం ప్రాచీనాన్ని అనుసరించిన లాభంలేదు. ఆధునిక యుగానికి సరిపోయేలాగా మన ప్రాచీనకళను మనం దిద్దుకోవాలి" అన్నారు. ఉదయశంకర్ భారతదేశాన్ని మేల్కొలిపారు. మన నాట్యం కూడ లెక్కపెట్టదగ్గ దేనని, దాంట్లో ఎన్నో కళావిలువ లున్నాయని మనవారు గ్రహించారు. నాటినుండి మన భరతనాట్యం రంగస్థలాన్ని అలంకరించింది.

1929లో రాగిణి అను ప్రఖ్యాత నర్తకి కూచిపూడివెళ్లి, అచటి నాట్యరీతిని చూచి, 'ఈ నాట్యముకూడ గొప్పదే' అని ప్రశంసించింది.

భారతదేశంలోని 'అభినయదర్పణం' వ్రాత ప్రతులన్నీ తెలుగులో ఉండటం, జాయప సేనాని 'నృత్యరత్నావళి' అను గ్రంథాన్ని రచించడం, క్రీ. శ. 1505 - 1509 కాలం వాడగు శ్రీకృష్ణదేవరాయల సవతి అన్నగారు వీరనరసింహరాయలు కూచిపూడి బ్రాహ్మణ భాగవతుల నాదరించడం, మాచుపల్లి కైఫియత్తు, మెకంజీ సేకరణలు, L. R. 56 - P. P. 65 మున్నగు ఆధారాలను పర్యాలోచనం చేసుకుంటే కూచిపూడి నాట్యకళ, భాగవతరీతి మహోదాత్తమైనదే కాక మహామహిమాన్వితమైన దని అవగత మవుతుంది.

ప్రాచీన కూచిపూడి రీతియగు భాగవతమును గురించి 'భరతనాట్యకళాప్రపూర్ణ' శ్రీ చింతా కృష్ణమూర్తిగారి అభిప్రాయం చూడండి :

భాగవతము : "'భాగవత' మనగా భగవత్సంబంధమైన దృశ్య ప్రబంధం. ఇది ఒక ఆరాధన. భావ, రాగ, తాళ

లయాన్వితమైన ఒక రసఖండం. ఇది కూచిపూడి వారిచే ప్రత్యేకంగా, ప్రసిద్ధంగా ప్రదర్శిత మవుతున్న మధుర ప్రబంధం. దీనిలో 'సత్యా-కృష్ణ'ల శృంగార మభివర్ణితం. కాబట్టి ఇది శృంగారరసాత్మక మైన కళాఖండం. కాని ఇందులో అంతరార్థం వేరు. సత్యభామ స్త్రీయూ కాదు, కృష్ణుడు శృంగార నాయకుడూ కాదు. వీరిరువురు జీవేశ్వరులు. ఏనాడు జీవుడు " సర్వకామాన్పరిత్యజ్య, మా మేకం శరణం వ్రజ " అన్నరీతిగా మానసిక వాంఛలను, దైహికాభిమానమును, అహంకారమును వర్జించునో, ఆనాడు పరమాత్మను జేరు ననుట ఇందు ప్రతిబింబితము.

"దీనిని కేవలం దృశ్యప్రబంధ మనుటయు తగదు. ఇందు భావ, రాగ, తాళములు పరాకాష్ఠ నందుకొన్నవి. సత్య విరహాదికము లందు రసోదంచితమైన సాహిత్యం నిక్షిప్తమైంది. ఇది కూచిపూడి వారికి 15-వ శతాబ్దిలో శ్రీ సిద్ధేంద్రయోగి ప్రసాదించిన వరము, ఈ సిద్ధేంద్రుడు డీనాడు ఎల్లరెరిగిన యాత్మచరితము గలవాడు. ఈత డాతుర సన్న్యాసముగ్రహించి జీవితమును భగవదర్పిత మొనరించిన ధన్యజీవి. యౌవనమునం దాతుర సన్న్యాసము స్వీకరించుట వలన తనలో ననుభవమునకు రాక మిగిలిపోయిన శృంగారమును, యోగ సాధనచే కదురుకొనిన భగవద్భక్తిని అంతర్ముఖం చేసి, సత్యా-కృష్ణుల ప్రణయ రూపమున వెలువరించి, తాను తరించి, ఇతరులను తరింపజేయు సంకల్పముతోనే 'హరికథ' అను నామముతో భామా కలాపమను మహాప్రబంధమును సృష్టించినాడు. దానిని ప్రదర్శన యోగ్య మొనర్చి, కూచిపూడివారిచే ప్రదర్శింపజేసి. చూచి ఆనందించినా డా మహాయోగి.

"ఈ భాగవత ప్రయోగం "నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధాప్యేకం సమారాధకం" అన్న కాళిదాసోక్తి కనుకూలముగ నవరసభావ సమ్మిశ్రితమైనది. కారణ మేమన ఇందు ప్రధాన రసము శృంగారము. దాని కంగములుగ హాస్యాది రసములు గలవు.

ఇందు హాస్యగాని ప్రవేశముతోనే అతని వక్రదండమును చూచిన చాలును, నవ్వువచ్చును. ఈ వక్రదండము భరత సుతులకు ఇంద్రుని ధ్వజోత్సవమునందు బ్రహ్మచే నీయబడినది అని ఈనాటికిని కూచిపూడివారిచే ప్రదర్శితమగుచున్నది.

ఈ ప్రాచీన ప్రబంధము లన్నింటికిని 'నృత్యము, నృత్తము, నాట్యము, లాస్యము, నర్తనము' అనునవి పూసలో దారంబు మాడ్కి ప్రాణాధారమైనవి. ఈ నృత్యాదికములు కృత, త్రేతాయుగముల సంధి సమయంలో దేశము కట్టుబాటులు లేక, ప్రజావాహినిలో అనిశ్చితమైన ప్రవర్తన ప్రబలిన సమయమున లోకమునంత నా దారిలో నుంచుటకు దేవేంద్రాది దేవప్రార్థితుడై బ్రహ్మ "జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్, సామభ్యోగీత మేవచ. యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణాదపి." చతుర్వేదాల నుండి ఆ యా అంగములను గ్రహించి, నృత్యాదికములను సృష్టించి భరతముని కొసగెను అది క్రమశః పరిణతి నంది, దేశకాలాద్యనవచ్ఛిన్నమై నేటికిని క్రొత్త క్రొత్త మెరుగులు, వెలుగులు దిద్దుకొనుచు ప్రధాన సూత్రములతో భేదమేమియు లేక విరాజిల్లు చున్నది.

కూచిపూడివారికిముందీ నాట్యము దేవదాసీలచే ప్రదర్శింప బడుచుండెడిది. కాలక్రమమున వారి ప్రయోగ ప్రదర్శనములు వదలి వేసిరి. ఆ కారణమున శ్రీ సిద్ధేంద్రులు భగవదారాధనైక దృష్టితో నీ కళను కూచిపూడివారికి ప్రసాదించిరి. వీరి కళా రాధనమున కొన్ని రాజకీయ విషయములను కూడ పరిష్కరించినట్లు చరిత్ర పరిశోధకులు చెప్పుచున్నారు. విజయనగరపు కైఫియత్తులో వీరనరసింహరాయలు ఎదుట వీరు సమ్మెట గురవరాజు దుష్ట వర్తనలను ప్రదర్శించి ప్రజాపీడను తొలగించినట్లున్నది. దీనివలన 'ఏకక్రియా ద్వ్యర్థి కరీ బభూవ' అనునట్లు ఒకటి, కూచిపూడివారి

కళా ప్రావీణ్యత ప్రదర్శితమగుట, రెండవది, వారి దేశసేవానిరతి స్పష్టమగుట.

కూచిపూడివారికి భాగవతప్రయోగ సంపాదిత ప్రావీణ్య ప్రాధాన్యతలే కాక, వీరు యక్షగాన ప్రయోగమునందు కూడ సిద్ధహస్తులు అనునది నిర్వివాదాంశము. అంతియేగాక వీరి కళ దైశికవ్యాప్త మనుటకు అబుల్ హాసన్ కుతుబుషా వీరి ప్రదర్శనమును దర్శించి వీరి కగ్రహారము నొసంగినా డనునది మచ్చుతునక. వీరినుండి చీలిన యొక శాఖయే తంజావూరు నందలి మేలట్టూరు నందు స్థిరనివాస మేర్పరుచుకొన్నట్లు పరిశోధకులు తెలుపుచున్నారు.

కూచిపూడిలో కళా ప్రదర్శనమునకు పేరొందిన విఖ్యాత పురుషుడు కీ. శే. వెంపటి వేంకట నారాయణగారు కలాప ప్రయోగమునకు, యక్షగాన ప్రదర్శనములకు సిద్ధహస్తులైనవారు, సువర్ణఘంటాకంకణాదికములు బహూకరణ లంది దక్షిణాదిని కూడ తమకాలమున నుద్రూతలూపిన మా పితృపాదులు కీ. శే. పూజ్యశ్రీ చింతా వేంకటరామయ్యగారు. వీరి " శ్లిష్టాక్రియాకస్య చిదాత్మా సంస్థా సంక్రాంతి రవ్యస్య విశేష యుక్తా " అను దానికి యుదాహరణ భూతులు అయ్యును రెండవదియే వీరి యందు విశేషముగ గోచరించుచున్నది. పదాభినయాదికములందు దేశఖ్యాతిని గడించినవారు కీ. శే. వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు.

ఇట్లు సిద్ధయోగిద త్తమై నాడు, నేడు దేశఖ్యాతి నార్జించి ఆంధ్రతా స్ఫోరకమైన దేశమునందు, ఆంధ్రమునకు కూచిపూడికిని ప్రత్యేక స్థానాదికమై, గర్వకారణమై ప్రాచీన, సంప్రదాయము చెడకుండ నూత్న విన్నాణములతో కలకాలము విరాజిల్లు ఆంధ్రుల ఏకైక కళ భాగవతము.

— (శ్రీ చింతా కృష్ణమూర్తి-నాట్యకళ 1964)

" ఏవం సంకల్ప్య భగవాన్ సర్వవేదా ననుస్మరన్ ।
నాట్యవేదం తతశ్చక్రే చతుర్వేదాంగ సంభవం ॥ "
" భకారో భావవాచిస్యా ద్రకారో రాగవాచికః ।
తకారో తాలవాచిస్యా త్త్రయం భరతం విదుః ॥"

కూచిపూడి నృత్యశైలి విశిష్టత : భారతీయ నృత్యాల్లో ముఖ్యమైనదిగా ఎంచబడుతున్న భరతనాట్యం, కథాకళి, కథక్, మణిపురి, ఒడిస్సీ, కూచిపూడి మొదలైన వాటిలో దక్షిణ భారత దేశంలో అందునా, ఆంధ్ర ప్రదేశ్‌లో కూచిపూడి నాట్యానికి, భరతనాట్యానికి మంచి ఆదర్శం వుంది. భరతముని వ్రాసిన నాట్య శాస్త్రంలోని పదమూడవ అధ్యాయాన్నిబట్టి క్రీస్తుశకారంభం నాటికే దక్షిణ మధ్య భారతదేశంలో మంచి నాట్య వ్యవస్థ ఏర్పడినట్లు తెలుస్తోంది.

నందికేశ్వరుడు వ్రాసిన 'అభినయదర్పణం' మరో ముఖ్య గ్రంథం. కూచిపూడి, భరతనాట్యాలకు రెండింటికి ఇది ప్రామాణిక గ్రంథం. బహుశః ఈ గ్రంథం క్రీ. శ. మూడవ శతాబ్దం తరువాత వ్రాసి ఉంటారని అంటారు. దేశంలో లభించిన వ్రాత ప్రతులన్నీ తెలుగు లిపిలో ఉన్నాయి. ఇందువల్ల అభినయ దర్పణం తెలుగుల నేలపైనే రూపకల్పన చేయబడి వుంటుందనే వాదన బలంగా వుంది.

అనుమానరహితంగా తెలుగువారు వ్రాసిన నాట్య గ్రంథంగా చెప్పదగినది 'నృత్తరత్నావళి.' దీన్ని జాయప సేనాపతి వ్రాసినాడు. జాయప సేనాని తాతగారైన నారాయణ నాయకుడు కృష్ణానది సముద్రంలో కలిసే చోట వున్న దీవిలో బలమైన కోటను నిర్మించి పాలిస్తుండేవాడు. క్రీ. శ. 1203 లో కాకతి గణపతిదేవుడు ఈ దీవిపై దండెత్తి నారాయణ నాయకుని జయించాడు. ఓడిపోయిన రాజుతో సంధి చేసుకొని, అతని కుమార్తె లిద్దరినీ వివాహం చేసుకున్నాడు. అప్పటికి జాయప

సేనాని చాలా చిన్నవాడు. కాని చాలా చురుకైనవాడవటంవల్ల గణపతిదేవుడు ప్రత్యేక శ్రద్ధ వహించి బావమరదికి మంచి గురువులను ఏర్పాటు చేశాడు. జాయప యుద్ధరాజకీయ విద్యలతోపాటు సంగీత, సాహిత్య, నృత్యకళలను అవగతంచేసుకొని సంస్కృతంలో మంచి పాండిత్యాన్ని సంపాదించాడు. ఆ తర్వాత గణపతిదేవుడు యోగ్యుడైన బావమరదిని తామ్రపురి (చేబ్రోలు) కి రాజుగా నియమించాడు ఇంతే కాకుండా గజసైన్యాధిపతిగా నియమించాడు.

జాయప్ప తన ముందున్న నాట్యగ్రంథాలను పూర్తిగా అధ్యయనం చేసి, ఆనాటి నృత్యశైలిని పరిశీలించి, దేశి మార్గ రీతుల గమనించి 'నృత్తరత్నావళి' ని క్రీ. శ. 1253-'54 లో రచించాడు. అప్పటికి ఆయన వయస్సు అరువై సంవత్సరాలు.

నృత్తరత్నావళి వల్ల కాకతీయులనాటి నృత్య విశేషాలు విపులంగా తెలుస్తున్నాయి. వ్యక్తిగా లేక సమష్టిగా చేసే నృత్య రీతులు చక్కగా వివరింపబడ్డాయి. వివిధ సందర్భాలను పురస్కరించుకొని రాజదర్బారుల్లోనూ, దేవాలయాల్లోనూ, పండుగలప్పుడున్నూ ప్రదర్శించే నృత్యాలు విపులీకరించబడ్డాయి. ముఖ్యంగా దైవపరమైన సామూహిక నృత్యం 'పేరణి తాండవం' ఆనాడు ప్రత్యేకతను సంతరించుకుంది. కాకతీయుల దేవాలయ శిల్ప భంగిమలలోనూ, నృత్తరత్నావళిలోనూ, కావ్యవర్ణనలలోనూ మిగిలిపోయి, ప్రదర్శించేవారు లేక కనుమరుగైన పేరణి తాండవాన్ని శ్రీ నటరాజ రామకృష్ణ మరల బ్రతికించి తెలుగువారి కందిచ్చారు. ఇందుకు వారి నెంతో అభినందించాలి. తెలుగు ప్రజలు నాట్యకళను మరచిపోనంతకాలం, నటరాజ రామకృష్ణగారినికూడ మరచిపోలేరు. ఇది ఈయన ప్రతిభకు తార్కాణంగా నిలచి వుంటుంది.

ఈ తాండవం ఆరోగ్యవంతులైన యువకులు మాత్రమే చేయగలరు. సమిష్టిగా, వీలయంగా వుండే ఈ నృత్యం చూడ ముచ్చటగా వుంటుంది. కాకతీయ సామ్రాజ్య పతనానంతర

చిన్న చిన్న రాజాస్థానాలలోను, దేవాలయాలను అంటిపెట్టుకొని తెలుగువారి నాట్యకళ వృాగిసలాడుతూ బ్రతికింది. ఆ తర్వాత విజయనగర సామ్రాజ్యంలో, చివరకు నాయకరాజుల పాలనలో మూడు పూలు ఆరు కాయలుగా పెంపొందింది.

ఆంధ్రదేశపు నృత్యకళ మొదటినుండి రెండు ప్రధాన భాగాలుగా వుండేది. ఇందులో మొదటిది, 'నట్టువమేళ' సంప్రదాయం. ఈ సంప్రదాయం క్రింద దేవదాసీ సంప్రదాయం, రాజనర్తకీ సంప్రదాయాలు వస్తాయి. దేవదాసీ సంప్రదాయం ప్రకారం దేవదాసీలు దేవాలయాలలో ఆరాధనా సమయాలలో పూజా నృత్యాలు చేసేవారు. ఈ నృత్యాలను ఒక్క దేవదాసీలు మాత్రమే చేయాలి. బయటివారికి ఈ నృత్యాలు చేసేందుకు అర్హతలేదు. దేవుని కల్యాణ సమయంలోనూ, ఉత్సవ విగ్రహాల వద్దనూ, మంటపాలలోనూ ప్రదర్శింపబడేవి. 'కేళీ నృత్యాలు.' వీటిని దేవదాసీలు చేసినా వేశ్యలు కూడా చేస్తూ వుండేవారు, ఈ రెండు పద్ధతులు దాదాపు నేడు అంతరించి పోయాయి. ఆ నృత్యరీతులు కొద్దిమంది వృద్ధకళాకారులకు మాత్రమే తెలుసు. వారి తదనంతరం అవి మిగలకపోవచ్చు

నట్టువమేళ సంప్రదాయంలో రెండవభాగం రాజనర్తకీ సంప్రదాయం. రాజులు, రాజాధిరాజులు తమ కొలువులలో ఒక ప్రధాన నర్తకిని నియమించేవారు. రాజనర్తకికి అధిక ప్రాధాన్యం, గౌరవ కల్పించేవారు. మహామంత్రిసైతం రాజు ముందు తాంబూలం సేవించరాదు. కాని, రాజనర్తకి ఆ పని చేయవచ్చు. దీన్నిబట్టి వారి పరిస్థితి అంచనా వేయవచ్చు.

సహజంగా రాజనర్తకి మంచి కళాకారిణి అయి వుంటుంది. మార్గ, దేశి సంప్రదాయాలను పూర్తిగా ఆకళింపుచేసుకొని, తమ పోషకులకు వినోదం కలిగించడానికి మాత్రమే నృత్యం చేసేవారు, ఇందువల్ల ఎన్నో క్రొత్త రీతులు వారు తమ నాట్యంలో చూపించి

తమ ప్రత్యేకత, నూతనత్వ నిలుపుకునేవారు. ముఖ్యంగా రాజరికాన్ని, తమ నాట్య విన్యాసాలతో మురిపించి, మరపించటమే వీరి ప్రధాన ధ్యేయం. సామాన్య జనంతో వీరికి ఏమాత్రం సంబంధం వుండేదికాదు.

రాజులతో పాటు రాణివాసాలు, రాజన ర్తకీ ఆచారాలు కాలప్రవాహంలో కొట్టుకుపోయాయి. నేడు తెలుగుదేశంలో ఆ సంప్రదాయపు శైలి ఎలా ఉండేదో చెప్పేందుకు ఒక్కరు కూడా లేరు అనుకుంటాను.

ప్రధాన భాగాల్లో మిగిలిన రెండో భాగం 'నాటకమేళా' సంప్రదాయం. ఆంధ్రప్రదేశంలో ఈ సంప్రదాయాన్ని పెంచిన వారు కూచిపూడివారు. రామాయణ, భాగవత, పురాణ గ్రంథాలలోని చక్కని కథలను, చక్కని సన్నివేశాలను ఎంపిక చేసికొని, నృత్యాలు మధ్యమధ్య కూర్చుకొని కనులపండువుగా ప్రదర్శించేవారు. తమదైన ప్రత్యేక శైలిని క్రమేణా పెంపొందించి నేడు మనం పిలిచే యక్షగానాల రూపంలో మన కందించారు. భగవంతునికి సంబంధించిన గాథలనే ప్రదర్శించడంవల్ల కూచిపూడి వారిని 'భాగవతులు' అని ప్రజలు పిలిచేవారు. చివరి కీ పేరే నిలిచిపోయింది. కూచిపూడి భాగవతులు కలాపాల ప్రదర్శన లతో విసిగినవారికి కొత్తపోకడలు వినిపించేందుకు యక్షగాన సంప్రదాయాన్ని పెంపొందించారని చెబుతారు.

కూచిపూడి నృత్యశైలిని తీర్చిదిద్దిన మహామనీషి. శ్రీ సిద్ధేంద్రయోగి. ఒకవిధంగా ఈ సంప్రదాయానికి మూలపురుషు డుగా వీరిని చెప్పక తప్పదు. కొంతకాలం కర్ణాటక రాజ్యంలో వుండి, అక్కడి నృత్యశైలిని అర్థంచేసికొని, ఆ తర్వాత కూచిపూడి వచ్చి శేష జీవితం యిక్కడే గడిపినట్లు చెపుతారు. ఈ ప్రాంతం లోని సంప్రదాయాన్ని, తాను అవగతం చేసుకొన్న బయటి

తీరుల్ని మేళవించి, నాట్యశాస్త్ర పరిధిని దాటకుండా, తనదైన ప్రత్యేకశైలిని వీరు రూపొందించారు.

సిద్ధేంద్రస్వామి విజయనగర పాలకుడైన శ్రీకృష్ణదేవరాయలకు సమకాలికుడని చెబుతారు. రాయలు ఉత్తర దిగ్విజయ యాత్రకు బయలుదేరి విజయవాడలో, కృష్ణానదీ పరిసరాలలో తన సైన్యాలు కేంద్రీకరించాడు. నేటి దివి తాలూకాలోని శ్రీకాకుళం వెళ్లి అక్కడ వున్న ఆంధ్ర మధుసూదనుని సేవించి వచ్చారని, ఆముక్తమాల్యదా కావ్యానికి స్పందన అక్కడే రగిలిందని శ్రీకృష్ణదేవరాయలు వ్రాసిన ఈ కావ్యంలోని ప్రారంభ పద్యాలు చెబుతాయి. అప్పుడే సిద్ధేంద్రయోగి రాయల్ని కలిసినట్లు, రాచకార్యాలతో, యుద్ధతంత్రాలతో తలమునకలుగా నున్న రాయలు 'విజయనగరం వచ్చి కలుసుకోవలసిన' దిగా సిద్ధేంద్రుని కోరినట్లు చెబుతారు. కాని ఏకారణం వలననో వారి కలయిక కుదరలేదు. రాయలు శ్రీకాకుళం వచ్చింది 1510-1515 ప్రాంతం. కాబట్టి సిద్ధేంద్రస్వామి అప్పటివాడే కావటంవల్ల నేటి కూచిపూడి నృత్యం పరిపూర్ణత సంతరించుకున్నది పదహారవ శతాబ్దారంభ కాలంలోనని చెప్పవచ్చు.

అప్పటివరకు నాట్య ప్రదర్శనలలో స్త్రీలు కూడా పాల్గొనేవారు. దీనివల్ల కొన్ని సమస్యలు ఉత్పన్నమైనట్లు తోస్తుంది. నాట్యకారులంటే తేలికభావం ప్రబల్లో కలిగి నాట్యానికే అప్రతిష్ఠ కల్గింది. ఈ శాస్త్రానికి గౌరవ ప్రతిపత్తి కల్గించి, పునరుజ్జీవనం చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. ఇది గమనించిన సిద్ధేంద్రయోగి మగవాళ్లకు మాత్రమే ఈ శాస్త్రాన్ని అభ్యసింపజేసి, ఆడవాళ్లు పాల్గొనరాదని శాసించారు. ఇందువల్ల సిద్ధేంద్రుని అనుయాయులు స్త్రీ వేషం కూడ పురుషునితోనే వేయించేవారు. దీనివలన కొంతమేలు జరిగినా, ఈ కళ పొందవలసినంత ప్రాచుర్యాన్ని పొందలేక పోయింది.

ఆ తర్వాత కాలంలో నారాయణతీర్థుల 'కృష్ణలీలాతరంగాలు' చోటుచేసుకొన్నాయి. తలపై నీటిచెంబు వుంచుకొని, కాళ్ల క్రింద ఇత్తడి పళ్లెంలో జనరంజకంగా తరంగాన్ని అభినయించేవారు. ఇందుకు ఏకాగ్రత కావాలి. కాని, ఈ విన్యాసంలో అభినయం కన్న, సర్కసువిద్య ఎక్కువగా వుంటుందనుకుంటాను. సర్కసుకు, నాట్యానికి సంబంధంలేదు. బాలగోపాల తరంగం ఈ విన్యాసాన్ని తీసివేస్తే మిగతా అభినయరీతులు ముచ్చటగానే వుంటాయి. నారాయణతీర్థులు కూచిపూడి ప్రాంతపువాడని, సిద్ధేంద్రుని సమకాలికుడని అంటారు.

ముస్లింపాలకుల క్రిందకు కూచిపూడి వచ్చినపుడు ఈ కళకు గ్రహణం పట్టిందని కూచిపూడివారు భయపడ్డారు. కాని, ధైర్యంగా నవాబు నాశ్రయించి, తమ కళను వారికి చూపించి, మెప్పించి కూచిపూడిని అగ్రహారంగా పొందగలిగారు. ఇందువల్లనే అనుకుంటాను, వారి శబ్దాల్లో 'సలాం', ధిస్సలాం' అనే పదాలు కూచిపూడి నృత్యగీతాల్లో చోటుచేసుకొన్నాయి. అభినయ రీతుల్లో కూడా ముగింపు సమాయాల్లో సలాం చేసే రీతిలో కొన్ని విన్యాసాలు అక్కడక్కడా కన్పిస్తాయి, ఇది నా వూహ మాత్రమే. నిపుణులు పరిశోధించి తెల్పవలసిన విషయం.

కూచిపూడి భాగవతులు ఈ కళను ఆధారం చేసుకొని దుర్మార్గులైన రాజులను తొలగించిన తీరు మరచి పోలేనిది. కృష్ణదేవరాయల సవతి తమ్ముడైన వీరనరసింహరాయలు కాలంలో ........................సంబెట గురువరాజును బంధించి తల తీయించాడు.

ఇలాగే గోదావరీ మండలములోని వేములవాడ భీమకవి కాలంలో కళింగగంగు తిరిగి సింహాసనాన్ని సంపాదించుకోవడం కూచిపూడి భాగవతుల వల్లనే జరిగిందని చెబుతారు.

ప్రజాసేవకు అంకితం కాకపోయినా, ఈ కళను తప్పనిసరి అయినప్పుడు కూచిపూడివారు ప్రజాక్షేమం కొరకు వాడి మార్గ దర్శకులయ్యారు.

సిద్ధేంద్రయోగి తరువాత మరో మహాపురుషుడు క్షేత్రయ్య. వాగ్గేయకారకుడు, పదకర్త అయిన క్షేత్రయ్య ( 1600-1680 ) తంజావూరు పరిపాలకుడైన రఘునాధరాయని కుమారుడు విజయ రాఘవనాయకుని ఆస్థానాన్ని సందర్శించి అతనిపై పదకవిత్వం చెప్పినాడు. క్షేత్రయ్య పదాలు నృత్యాభినయానికి చాలా అనుకూలంగా వుంటాయి. జావళీలవలె పచ్చి శృంగారం గాక ఉచిత శృంగారం కలిగి 'పల్లవి, అనుపల్లవి, చరణం' అనే మూడు భాగాలుగా వుంటాయి. కూచిపూడివారు నెమ్మదిగా పాడుతూ, అందంగా అభినయించి ఈ శబ్ద సౌందర్యాన్ని అంగవిన్యాసంద్వారా చేతులతో ముద్రలు చూపిస్తూ, ముఖంలో భావాన్ని వొలికిస్తూ రస వత్తరంగా అభినయిస్తారు. మొవ్వలోని మువ్వ గోపాలస్వామిని ఆలంబనం చేసికొని చెప్పడంవల్ల ఇవి 'మువ్వ గోపాల పదాలు'గా స్థిరపడ్డాయి.

తంజావూరును పాలించిన మహారాష్ట్ర పాలకుడు శరభోజీ కాలంలో (1786 - 1821) నేటి భరతనాట్య రీతులు ప్రారంభ మయ్యాయి అని చెబుతారు. కూచిపూడి సంప్రదాయానికి 'అభినయదర్పణ' మే ఆధారం.

ఇది భరతశాస్త్ర రీతులతో మలచబడ్డది. అయినా కూచిపూడి, భరతనాట్య రీతులలో తేడా వుంది. ఇవి రెండూ అక్కా చెల్లెల లాంటివి.

కాని తరాలుగా సాధన చేసి, పెంపొందించిన కూచిపూడి సంప్రదాయాన్ని ఆవలకు నెట్టి, దక్షిణదేశపు నృత్యం అంటే ఒక్క భరతనాట్యం మాత్రమేననే వాదన ఒకదశలో ముందుకు వచ్చింది.

దాన్ని గమనించి శ్రీ అచ్యుంకి తాండవకృష్ణ, శ్రీ చింతా కృష్ణ మూర్తి, శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ వెంపటి పెదసత్యం కూచిపూడి శైలిని గూర్చి వ్యాసాలు వ్రాసి, ప్రదర్శన లిచ్చి ఢిల్లీ లోను, ఉత్తరభారత ప్రధాన పట్టణాలలోను నృత్యాభిమానులు, ప్రముఖుల ముందు ఆడి చూపించి, తిరిగి గుర్తింపు తేగలిగారు. హైదరాబాదులో సంగీతనాటక అకాడమీలో సెమినారు జరిపారు. ఎంతో శ్రమపడ్డ తరువాతనే నాటి స్థానాన్ని తిరిగి చేరుకోవడం జరిగింది.

శ్రీ వెంపటి చినసత్యంగారు కొంతవరకు ఈ కళకు ఆధునికతను జేర్చి జనరంజకంగా మలుస్తున్నారు. శ్రీ వెంపటి చిన సత్యంగారు, చింతావారు, వేదాంతంవారు, 'పద్మశ్రీ' వేదాంతం సత్యనారాయణశర్మగారు, శ్రీ ప్రహ్లాదశర్మగారు, శ్రీ కోరాడ నరసింహా రావుగారు, ఇంకా ఎందరో కళాకారులు అనవరతం కృషిచేసి ఈ కళను జీవత్కళగా మలచి మనకు అందించారు, అందిస్తున్నారు.

'భామాకలాపం', 'గొల్లకలాపం', 'కృష్ణశబ్దం', 'శివ తాండవం', 'దశావతారాలు', 'మండూకశబ్దం' ఇత్యాది మనకు సంక్రమించిన వారసత్వపు నృత్యాలు, తెలుగు ప్రజలకు భాగవతు లందించిన ముత్యాల సరులు, నాట్యరత్నాల హారాలు. ఇందువల్ల తెలుగుప్రజలు కూచిపూడి భాగవతులను మరచిపోలేరు.

ఈనాడు స్త్రీ పురుష భేదం లేకుండా చాలామంది ఈ నాట్య కళను అభ్యసిస్తున్నారు. ఒక్క విజయవాడలోనే సుమారు నాలుగు వందలమంది పిల్లలు సాధన చేస్తున్నారు.

కాని రాజాశ్రయాలను, దేవాలయ ప్రాంగణాలను వదలినా వీరు ప్రదర్శించే కళారూపాల్లో పూర్వవాసనలు స్పష్టంగా కని పిస్తున్నాయి. క్రొత్త పోకడలు కావాలి. ఇతివృత్తం, సాహిత్యం మారి ప్రజాశ్రేయస్సు ధ్యేయంగా రూపొందాలి. నూతనత్వం ఈ కళలో తొణికిసలాడి బహుజనరంజకం కావాలి.

(శ్రీ పోలవరపు కోటేశ్వరరావు-ప్రజాశక్తి 21-2-82)

"త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావాను కీర్తనం।
ధర్మోఽధర్మ ప్రవృత్తానాం కామః కామోపజీవనం।"

"ముని చూడామణి యెల్ల సత్కళలకున్
మూర్ధాభిషిక్తుండు, గా
పునఁ జారీ కరణాంగ హారముల
తావుల్ మెచ్చి కీర్తించుచున్
శనివారోత్సవ వేళఁ గ్గొనియె
నాస్థానంబునన్ రాజనం
దనయున్ దానును దేశి మార్గమున
గంధర్వాప్సరో నృత్తముల్ ।"

(శ్రీనాథుడు - కాశీఖండము)

కూచిపూడి - భాగవతులు: ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో యక్షగాన మొక విలక్షణమైన సాహిత్య ప్రక్రియ. ఈ యక్షగానము పదకవితాజాతికి చెందినది. క్రీ. శ. 5, 6 శతాబ్దులలో ఆవిర్భవించిన పదకవితలలో ఈ యక్షగానము లేదు. 11,12 శతాబ్దుల నడుమ కాలమున ఈ ప్రక్రియ అవతరించినది. ఈ కాలమున పదకవితలు మౌఖకరూపమున బహుళ ప్రచారమున నుండెడివి. శివకవులు జక్కులపాటలుగ పేర్కొనబడిన ప్రక్రియయే 'యక్షగానము' అని పరిశోధకుల అభిప్రాయము. ఆనాడు వీటికి ఈనాటి రూపముండెడిది కాదు. క్రమ వికాసమునొంది అవి ఈనాటి రూపము నందినవి. వాటిని 'భాగవతులు' అని ప్రచారము నందిన కూచిపూడి బ్రాహ్మణులు ప్రదర్శింప నారంభించిరి.

కూచిపూడి దివి తాలూకాలోగల చిన్న అగ్రహారం. ఇక్కడ నివసించువారందరు బ్రాహ్మణులు. అందుచే 'అగ్రహార'మనబడినది. ఈ గ్రామమునకు పరిసరమయిన 'గడ్డిపాడు' అను గ్రామముంది. ఆ గ్రామవాసులు పగటివేషములు ధరించి, ప్రజల నానంద పఱచుచూ, దేశాటనము చేయుచుండెడివారు. అందుమూలమున

వారికి ధనార్జన ముండెడిది. వారినుండి, ఈ వృత్తిని జీవనోపాధి నిమిత్తం కూచిపూడివారు. స్వీకరించారు. కూచిపూడివారిలో వేషములు వేయుట కిచ్ఛగింపని కొందరు విడి యాచకమునకు వెడలుచుందురు. అట్టివారు సంగీతమునందు ప్రావీణ్యా మున్నచో శ్రావ్యముగ పాడియు, అది చేతకానివారు హాస్య ప్రసంగములు చేసియు శ్రోతల నానందపరచి ద్రవ్యసంపాదన మొనర్చుచుందురు. ఈ వృత్తిని వీరు 'సంచారము' అని చెప్పుచుందురు.

కూచిపూడి భాగవతుల హాస్య ప్రసంగములలో 'సోమయాజులు', 'సోమిదేవమ్మ' మున్నగునవి ప్రధానములు. పగటివేషములు వేయువారు 'బుడబుక్కల', 'బాలెంత వేషములు' మున్నగు వాటిలో ప్రసిద్ధులు.

ఈ పగటివేషాలవారికి, విడి యాచకాలవారికి ఒకప్పుడు తెలంగాణాప్రాంతం కార్యక్షేత్రంగా ఉండేది. ఇప్పుడు వీరు సర్వత్ర సంచరిస్తున్నారు. కొంతమంది గాయకసార్వభౌములు నవాబుల పరిపాలనా కాలంలో జాగీరుదారుల, ఉన్నతాధికారుల ప్రాపకం సంపాదించి వారి మెప్పులు పొంది మాన్యాలు సంపాదించుకొన్నారు.

శ్రీ సిద్ధేంద్రయోగిని గురించిన కథలు, వెనుకటి ప్రకరణాలలో చదివారుకదా! వాటికి ఏకసూత్రత లేదు. కొందరకు కూచిపూడి భాగవతులవా రిచ్చిన కథలు ఆధారంకాగా, మరికొంత మంది ఊహాగానంతో విశదీకరించారు. వాటిలోని ఉచితానుచితాలు పాఠకులు నిర్ణయించుకోవాలి.

ఈనాటి యక్షగానాలు ఒకప్పుడు ఏకపాత్రములై, ద్విపాత్రములై హరికథలుగా, కలాపాలుగా ప్రచారం పొంది, ఈనాడు యక్షగానా లయినాయి. వీటిని గురించికూడా పలువురి అభిప్రాయాలు విశదీకరింపబడినాయి.

**నాట్యమేళాలు :** ఈ మేళాలలోని పాత్రధారు లందరకు అన్నిప్రదర్శనాల వాచికాభినయాలు కంఠగతాలై వుంటాయి.

వీరికి ప్రాక్టీసుగుతో నిమిత్తం ఉండదు. వారి దుస్తులు మున్నగు ఆహార్యమంతా ఒక పెద్ద తోలుపెట్టెలో వుండేది. దానిని 'గణేయం' లేక 'భోనము' అనేవారు. వీరి ఆహార్యం స్వయంగా తయారుచేసుకొంటారు. ప్రదర్శనలమూలంగా వీరికి వచ్చే ఆదాయాన్ని సూత్రధారుని మొదలు భోనంపెట్టె మోయువాని వరకు, వారి వారి యోగ్యతానుసారంగా, పాళ్లప్రకారం పంచుకునేవారు. అందరి యొక్క రాకపోకల ఖర్చులు మేళమే భరించేది. ఈవిధమైన ఆచారం ఇటీవలివరకు కొనసాగింది. ప్రస్తుతం ఈ మేళాలూ లేవు, ఈ పాలు పంపిణీలూ లేవు. నటకులు కిరాయి నటకులయ్యారు. ఏకచ్ఛత్రాధిపత్యం అమలులోకి వచ్చింది. నటకులలో అనుబంధసంబంధాలకువ్యాఘాతం ఏర్పడింది. మమకార, మమత్వాలు నశించాయి. ఇది ఎంతయు శోచనీయమైన విషయం. యక్షగానాలు మొదలు నాట్యాలవరకు, రూపాంతరాలు సంతరించు కొన్నాయి. కలాపాలకు రూపురేఖలు మారిపోయినాయి. ప్రాచీనతనే కాక శాస్త్రప్రమాణాలను కూడ కోల్పోయినాయి. నాటకాలు నాటికలను అనుకరిస్తున్నాయి చలనచిత్రాలలోని పాత్రల ప్రభావం వీరి పాత్రధారణ మీద పూర్తిగా ప్రతి ఫలిస్తోంది. ఆంగిక, వాచికాభినయాలు, ఆహార్యాలు కూడ ఎవరికి యిచ్చవచ్చినట్లు వారు సమకూర్చుకుంటున్నారు, ధరిస్తున్నారు. మూడు రాత్రులు ప్రదర్శించిన ప్రహ్లాద యక్ష గానం మూడు గంటలలో ముగుస్తోంది. ప్రాచీన నాట్యా చార్యుల శక్తి సామర్థ్యాలు ఈనాటివారిలో కొరవడటమే ఇందుకు కారణం. ప్రజాదరణ, ప్రభుత్వ గౌరవం లేనప్పుడు కట్టు బాటులుగా ప్రదర్శించిన ప్రదర్శనలు ఈనాడు ప్రభుత్వాదరణ, ప్రజా గౌరవం లభించుతూ ఉండగా ఆ విధానానికి లోపం ఏర్పడింది. అందుచేతనే భామాకలాపం ఒక గంట కాలంలో ముగుస్తోంది. భావితరాలవారికి నటకులను, నర్తకులను, నాట్యాచార్యులను అందించే నాట్యాచార్యులు ప్రస్తుతం కూచిపూడిలోనే లేరనుట

అతిశయోక్తికాదు. ప్రతిభా వ్యుత్పత్తులు కొరవడిన వారిప్రదర్శనలు చూచి కొందరు విమర్శక, పరిశోధక పండితులు 'కూచిపూడి నాట్యం శాస్త్రీయమైందికాదు' అన్నారు. అప్పుడు ప్రముఖులంతా జేరి 'తమ నాట్య సంప్రదాయం సశాస్త్రీయమైనది' అని ఋజువు చేసుకొనేసరికి తలప్రాణం తోకకు వచ్చింది. ఇదంతా అభివృద్ధిగా భావిస్తే వారు భావించవచ్చుగాని, సహృదయులకు మాత్రం అలా అనిపించదు.

ఈ నాట్యసంప్రదాయం అద్యతనకాలంలో అభివృద్ధికి రావలె నంటే ఒక్క వెంపటి చినసత్యం వలననే రాగలదు. ఈయన ప్రతిభావంతుల కోవకు చెందినవాడు. శాస్త్ర పరిజ్ఞానం, ప్రయోగ నైపుణ్యం గలవాడు. ప్రాచీన, అర్వాచీన సంప్రదాయాలు వివిధ నాట్యరీతులను, శాస్త్రీయ పద్ధతిలో అధ్యయనం చేసినవాడు. శ్రీ వెంపటి పెదసత్యనారాయణగారికి శిష్యుడు. మద్రాసు నగరంలో 'కూచిపూడి నాట్యఅకాడమీ' అను ఒక శాస్త్రీయ నాట్యకళా శాలను స్థాపించారు. దీనిలో కేవలం కూచిపూడి సంప్రదాయ నాట్యాచార్యులను తయారు చేయటం మీద దృష్టి కేంద్రీకరించాడు. విదేశీయులు కూడ ఈ నాట్య కళాశాలలో శిక్షణ పొందుచుండటం గమనార్హం. ప్రస్తుతము శ్రీ సత్యం తిరుపతి దేవస్థానంవారి ఆస్థాన నాట్యాచార్యులుగా నియమింపబడటం ఆయన ప్రతిభా విశేషానికి ప్రబల నిదర్శనం. వీరు విదేశాలలో సైతం పర్యటనచేసిన ప్రఖ్యాత తెలుగు నాట్యాచార్యులు. శ్రీ యస్. వి. భుజంగరాయశర్మగారు రచించిన 'పద్మావతీ శ్రీనివాస కల్యాణాన్ని' కుమారి శోభానాయుడు అండ్ పార్టీ, హైదరాబాదు వారిచే ప్రదర్శింపచేయుచూ, తాము నట్టువాంగాన్ని పడపటం చూచి తీరవలసినదేగాని వర్ణించుటకు అలవికాదు. ఈయన కూచిపూడి నాట్యకళకు ప్రతిష్ఠామూర్తి. ఆధునిక కూచిపూడి నాట్యకళాకారులకు ఆదర్శమూర్తి. సంప్రదాయ నాట్యకళకు

ప్రామాణిక ప్రతినిధి అని ప్రజలచే ప్రశంస లందుకొనుచున్న నిరాడంబర నాట్యకళాచార్యులు.

"సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప ప్రవర్తకమ్।
నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరోమ్యహం."

(నాట్యశాస్త్రము)

## కూచిపూడి భాగవతులు - నాడు, నేడు

"దేవానా మిద మామనన్తి
మునయః కాన్తం క్రతుంచాక్షుషం।
రుద్రేణేద ముమాకర వ్యతికరే
స్వాంగే విభక్తం ద్విధా!
త్రైగుణ్యోద్భవ మత్రలోక చరితం
నానారసం దృశ్యతే।
నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధా
ప్యేకం సమారాధనమ్।

(మాళవికాగ్నిమిత్రమ్ - కాళిదాసు)

చాళుక్యరాజు — రాజరాజు ధర్మాసనం స్థాపించాడు. మనుమసిద్ధి మహీపాలుని కొలువులో ఆంధ్ర సరస్వతి విజయగీత మాలపించింది. రెడ్డిరాజుల ప్రాపు నంది సరసాలంకార సంశోభి అయింది. కనకాభిషేకా లందుకొంది. విజయనగర సామ్రాజ్య వీధులలో విజయనృత్యా లభినయించింది. రాయలవారి విజయ శోభను భువనవిజయం అతిశయింప జేసింది. విశేష గౌరవాదరా లందుకొంది. నవాబులు, తానీషాలు అభిమానించారు. అందలాలెక్కించారు. అగ్రహారాలు, మడిమాన్యాలు సమర్పించి సింహాసనాల నిచ్చారు.

ఆనాటి సామ్రాజ్యాలు, సంస్థానాలు అంతరించాయి. కళా సరస్వతికి నెలకొల్పబడిన పూల మందిరాలు మాసిపోయినాయి. అగ్రహారాలు అమరించుకొన్న ఆంధ్రనాట్య కళాధిదేవత ఆశ్రయాన్ని కోల్పోయింది. సంస్థానాలు ఆంగ్లేయుల అధీనమైనాయి. 1802 లో శాశ్వతశిస్తు నిర్ణయించారు. విజయనగరం, బొబ్బిలి, పిఠాపురం, నూజివీడు, ముక్త్యాల, మునగాల, అమరావతి, చల్లపల్లి మొదలైన సంస్థానాధీశులకు విశేషాధికారాలు, పాలనా స్వాతంత్ర్యాలు ప్రసాదించారు.

ఈ సంస్థానాలలో ఆంధ్రుల లలితకళా సరస్వతి క్రొత్త విన్యాసాన్ని సంతరించుకొంది. సంస్థానాధిపతులు కవిపండితులను సంగీత నాట్యకళాకోవిదులను పోషించారు, గౌరవించారు. "విద్యానేవ, విజానాతి, విద్వజ్జన పరిశ్రమమ్" అన్నట్లు వీరు పండితులు. కనుకనే వారిని సమాదరించారు. విద్వద్గోష్ఠులు, కవి పండిత సంగీత గోష్ఠులు కళాప్రదర్శనలు జరిపించారు.

విదేశీయుల పరిపాలనా ప్రభావం వలన, క్రమక్రమంగా వారి నాగరికతపట్ల అభిరుచి, వ్యామోహం అధికమైంది. దానిని అనుకరించడం నాగరికతా చిహ్నమైంది. ఈ ప్రభావం హైందవ సంగీత, సాహిత్య, లలితకళలపైకూడ ప్రసరించింది. సంప్రదాయత కొరవడింది. ఎవరికివారు ఆడింది ఆట, పాడింది పాట, వ్రాసినది కవితగా రూపొందింది. ప్రచారంలోకి వచ్చింది. కాలాంతరంలో ఆశ్రయాన్ని కోల్పోయింది. "నిరాశ్రయా న శోభన్తే పండితా, వనితా, లతాః" అన్నది సత్యమైంది. పండితులకు, గాయకులకు కళాకారులకు గౌరవం దూరమైంది. రసికత లోపించింది. ఈ స్థితిలో వారు "అరసికాయ కవిత్వ నివేదనం శిరసి మాలిఖ, మాలిఖ, మాలిఖ" అని పోయారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది. సర్వతంత్ర స్వతంత్రత సమకూరింది. పరపరిపాలనా శృంఖలాలు సడలి

పోయాయి. ప్రజాస్వామ్య పద్ధతిలో మన పరిపాలనా విధానం ప్రగతి పథంలో నడువసాగింది. నాట్య పరిషత్తులు, సాహిత్య పరిషత్తులు నెలకొన్నాయి. మన ప్రాచీన నాగరికతను, సంస్కృతీ సభ్యతలను, కళలను మనమే పోషించుకోనవలసిన బాధ్యత, కర్తవ్యం యేర్పడింది. ఇందుకు ప్రతి హిందువు నడుంకట్టి చిత్తశుద్ధితో యత్నించాలి.

1948 లో జమీందారీ విధానం రద్దయింది. సంస్థానాల విలీకరణచట్టం అమలులోకి వచ్చింది. సంస్థానాలు, తదధిపతులు కాలగర్భంలో కలసిపోయారు. జమీందారీ యుగం అంతరించింది. ప్రజాపాలనా యుగం అవతరించింది. కవి పండితులు మూగవా రయ్యారు. నాట్యాది కళాధిదేవత కాళ్ళకు సంకెళ్ళు పడ్డాయి. గాయకసార్వభౌముల గొంతులు బొంగురు పోయాయి. ఒకనాటి కళావైభవం, కళాపోషణ కథ గాథగా మారిపోయింది.

నాలుగైదు శతాబ్దాలకాలం దేశం నలుమూలలా పేరు, ప్రఖ్యాతులు గడించి, రాజాస్థానాల మొదలు ప్రజావేదికల వరకు ప్రాముఖ్యాన్ని సంపాదించుకొన్న కూచిపూడి భాగవతులు దిక్కు-తోచనివా రయ్యారు.

పగటివేషాలు ధరించారు. సాంఘిక దురాచారాలు నిర్మూలించారు. వీధినాటకా లాడారు. భాగవతం ప్రదర్శించారు. నీతిప్రబోధాన్ని, భక్తిప్రచారాన్ని చేశారు. రాజుల, నవాబుల మన్ననలకు పాత్రు లయ్యారు. కలాపా లాడారు. మధురభక్తిని, వేదాంతాన్ని ప్రబోధించారు. అగ్రహారాలు, మడిమాన్యాలు గడించారు. ఇదంతా ఒకనాడు జరిగింది.

ఆంధ్రలో రంగస్థలాలపట్ల, నాటకాలపట్ల అభిమానం పెరిగింది, "రాజువెడలె సభకూ" అని అభినయించే కూచిపూడి యక్షగానాల దరువులు మోటయినాయి. కర్ణాటక సంగీతబాణి వెగటుగా తోచింది. జలేబిచుట్టల సంగీతంపట్ల మోజు ప్రబలింది.

భాగవతులు కూడ ప్రజాభిరుచిని, కాలప్రభావాన్ని గమనించారు. తమ సంప్రదాయాన్ని ఆ మార్గానికి మరలించారు. "పాండవోద్యోగ విజయాలు", "శ్రీకృష్ణరాయబారం" వంటి రంగస్థల నాటకాల ప్రదర్శన లారంభించారు. నాట్య నాటక సమాజాలు, మండలులు స్థాపించుకున్నారు. అయితే ఈ మార్పును ప్రజలు గౌరవింపలేక పోయారు. ఇది తమ సంప్రదాయానికి తగినది కాదని భాగవతులు కూడ గ్రహించారు. ఇంతలో చలనచిత్రరంగ సంరంభం పెచ్చు పెరిగింది. సుప్రసిద్ధ నాట్యాచార్యులు ఆ రంగాన్ని ఆకర్షించారు. అర్హులు, సమర్థులు అయినవారు రంగప్రవేశం చేశారు. మిగిలి పోయిన సాధారణ నాట్యాచార్యులు ప్రముఖ నాట్యాచార్యులుగా పరిగణింపబడ్డారు. వీరు ప్రధాన నగరాలకు కూడ ఎగబ్రాకారు. వినూతన నాట్య సంప్రదాయాన్ని అభినయింప మొదలుపెట్టారు. "ఇదేనా కూచిపూడి భరతనాట్యం? ఇది జానపద కళకు అశాస్త్రీయ మైంది" అని ప్రజలు విస్తుపోయి నిరాదరించారు. అప్పుడు శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ వెంపటి సత్యనారాయణవంటి సుప్రసిద్ధ నాట్యశాస్త్రవేత్తలు రంగప్రవేశం చేశారు. సదస్సులు, సెమి నారులు జరిపించారు. తమ నాట్యం సశాస్త్రీయమని, సలక్షణమని లక్ష్యలక్షణసమన్వితంగా ప్రదర్శించి వచ్చిన అపవాదును తొలగించుకున్నారు.

స్త్రీ పాత్రధారి అయిన పురుషుని వేషం ఎల్లకాలం ఒకే విధంగా రాణింపదు. అతని వయస్సుతోపాటు అవయవ సౌష్ఠవంలో మార్పువచ్చి సౌకుమార్యాన్ని కోల్పోతుంది. ఇది సహజంగా పాత్రధారుల కందరకు ఉండే సమస్యే. కనుక కను, ముక్కుతీరు, సుకుమార సుందర కుమారులను స్త్రీ పాత్రధారణకోసం బాల్యం లోనే ఎంపికచేసి, అతనికి తగిన శిక్షణ ఇవ్వాలి. అలా జరిగితే కూచిపూడి భామ నిత్య నూతన యౌవనవతియై శాశ్వతంగా విరాజిల్లుతూ ఉంటుంది. ప్రస్తుతం ఈ పాత్ర ధరించేవారు తమ

ప్రాభవం తగ్గిపోతుందని అసూయా ద్వేషాలకులోనై ఈ కార్యం జరుపకపోతే కూచిపూడి నృత్యకళకు తీరని ద్రోహం చేసినవా రవుతారు. అలా భామావేషాలు అవతరించితే ఎంతోమంది రాఘవయ్యలు, సత్యనారాయణలు ఆవిర్భవిస్తారు. కూచిపూడి నాట్యకళ భరతఖండంలోనేగాక, ఖండ ఖండాంతరాలలో విశ్వనర్తనం చేస్తుంది. ఇందుకు ప్రజాభిమానం, ప్రభుత్వాదరణ, అకాడమీల సహాయం లభించాలి. కాని ఈనాటి స్థితి:

తెలుగు సంస్కృతికి, కళలకు, భాషాభివృద్ధికి గత పాతి కేళ్లలో జరిగిన కృషిని రజతోత్సవాల సందర్భంగా ఒకసారి మననం చేసుకొంటే జరిగిన కృషి అతిస్వల్పంగా కనిపించక తప్పదు.

సంగీత, సాహిత్య, నాట్య, నాటక రంగాలలో ఏ రంగానికి సంబంధించి అయినా తమిళనాడులో తీసుకుంటున్నటువంటి శ్రద్ధ, మన రాష్ట్రంలో తీసుకోవడంలేదు. ఒకే రాష్ట్రంగా ఏర్పడి నప్పటికీ ప్రాంతాలవారీగా కేటాయింపులు, సంస్థల స్థాపన జరుగు తున్న రీతిలో ప్రభుత్వపాలన కొనసాగడంవల్ల మాకు ప్రాంతా లున్నాయనే భావన, ఇన్నేళ్లయినా సమసిపోలేదు. ఫలితంగా తెలుగువాడు తెలుగువాడినని చెప్పుకోవడానికి జంకే దుస్థితి ఇంకా అలాగే ఉంది.

ప్రపంచ తెలుగు మహాసభల తర్వాత అడుగంటిపోతున్న తెలుగు సంస్కృతి, ప్రాభవం తిరిగి వెలుగును చూడగలదని అంకు రించిన ఆశలు అడియాసలుగానే మిగిలాయి. వేర్పాటు తుఫాను గాలిలో ఊగిసలాడిన తెలుగుజాతిని పీడని బంధంలో పెనవేసిన ఆ సభలు 1975 ఏప్రిల్‌లో జరిగాయి.

కలతలు కరిగి, మమతలు పెరిగి భవిష్యత్తు బంగారుబాట కావాలని కోరుకొంటూ, జాతి యావత్తూ నిండు మనస్సుతో తెలుగుతల్లికి ఆ సందర్భంలో నివాళు లిచ్చింది. అయితే ఉత్సా హం, చైతన్యం, మూన్నాళ్ల ముచ్చటే అయింది. అప్పుడు

తీసుకొన్న నిర్ణయాలు చాలా భాగం కాగితాలమీదే ఉండి పోయాయి.

మహాసభల నిర్ణయం ప్రకారం తెలుగుజాతి ప్రాభవాన్ని అద్దంపట్టేలా 'తరతరాల తెలుగుజాతి' అన్న పేరిట భాగ్యనగరం నడిబొడ్డున ఏర్పాటుచేయాలని తలపెట్టిన మ్యూజియం, సగం గోడలవరకు నిర్మాణమై ఆగిపోయింది. ఇప్పుడు అక్కడ నిలువెత్తు తుప్పలు మొలిచాయి. కొన్నాళ్లు పోతే అదే ఒక మ్యూజియం అవుతుందేమో! మహాసభల నిర్ణయంప్రకారం ఎంతో ఉత్సాహంతో జరుపుకోవలసిన రెండవ ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణ వివాదగ్రస్తమైంది.

తెలుగు సంస్కృతిని పెంపొందించి, దేశవిదేశాలలోని తెలుగువారిని సన్నిహితం చేసేందుకు ఏర్పాటు చేసిన అంతర్జాతీయ తెలుగు సంస్థ నామమాత్రంగా వుండిపోయింది. ప్రభుత్వం ఇస్తున్న మూడు లక్షల గ్రాంటులో నిర్వహణ ఖర్చుపోగా, సంస్థ అంతంత మాత్రమే కార్యకలాపాలు నిర్వహించగలుగుతోంది.

"మా తెలుగుతల్లికి, మల్లెపూదండ - మా కన్నతల్లికి మంగళారతులు" అంటూ శ్రీ శంకరంబాడి సుందరాచారి రచించిన గీతానికి ప్రపంచ మహాసభల సమయంలో విశేషమైన గుర్తిపు వచ్చింది అప్పటి ప్రభుత్వం ఇచ్చిన ఉత్తరువుప్రకారం అధికార, అనధికార కార్యక్రమాలలో 'వందేమాతరం' గీతం తర్వాత, ఈ గీతాన్ని తప్పనిసరిగా ఆలపించేవారు. ఇప్పుడు ఈ గీతాలాపనం మరచే పోయారు, తెలుగువాడుకాని శ్రీ కాశీపాండ్యన్ మహబూబు నగర్ జిల్లా కలెక్టరుగా వుంటూ చొరవతో 'మా తెలుగుతల్లి' గీతానికి రూపకల్పన చేయించి తెలుగుతల్లి విగ్రహాన్ని ప్రతిష్ఠింప చేశారు. ఆ తరువాత జిల్లాకొకటి అటువంటి విగ్రహాన్ని స్థాపిస్తామని చెప్పిన మాట అలాగే వుండిపోయింది.

ఉజ్జ్వలమైన సాహిత్య, సంగీత, నాట్య, నాటక రంగాలను మరింత ఉచ్చస్థితికి తీసుకు వెళ్ళవలసిన అకాడమీలు కూడ నిధుల కొరత వల్ల ఆశించిన స్థాయిలో కార్యక్రమాలను కొనసాగించడం లేదు. స్టాకులో లేకుండాపోయిన 'బ్రౌన్ నిఘంటువు' వంటి నిఘంటువులు, శాస్త్రీయగ్రంథాలు, తనకున్న మూడు లక్షల బడ్జెట్‌తో సాహిత్య అకాడమీ ముద్రింపలేకపోతున్నది. సంగీత నాటక అకాడమీ నాలుగు లక్షలు గ్రాంటు పొందుతూండగా, నిర్వహణ ఖర్చుల క్రింద లక్షాయాభై వేలు ఖర్చవుతున్నాయి. గొల్లకలాపాలు, వీధిభాగవతం, తప్పెట్లగుల్లలు, కూచిపూడి చరిత్ర వంటి పెక్కు జానపదకళలు, ఆ సంబంధమైన గ్రంథాలు నశించి పోతున్నా 'నిధుల కొరత' అంటూ అకాడమీ ఏమీ చేయలేక పోతున్నది. సంగీత, సాహిత్య, నాట్య, నాటక రంగాలలో శిక్షణ యిచ్చే సంస్థ స్థాపనకు అకాడమీ పంపిన పథకాన్ని ప్రభుత్వం ఆమోదించలేదు.

రాష్ట్రంలో ఇరువై మూడు జిల్లాలుండగా జిల్లాకొక సంగీత కళాశాలయినాలేదు. హైదరాబాదు, సికింద్రాబాదు, విజయవాడ, విజయనగరం, తిరుపతిలలో మాత్రం గాక మరోనాలుగు జిల్లాలలో పాఠశాల లున్నాయి. గుర్తింపు కరవై పోతున్నందు వల్ల రాష్ట్రానికి చెందిన విశిష్టకళాకారులు ఎందరో దేశంలోని ఇతర రాష్ట్రాలకు, ఇతరదేశాలకు వలసపోతున్నారు "సంగీత నృత్య కళాకారులకు తమిళనాడు ప్రభుత్వం ఇచ్చినంత గౌరవాన్ని రాష్ట్రప్రభుత్వం ఇవ్వడంలేదు" అని రాష్ట్రానికి చెందిన ప్రముఖ కర్ణాటక సంగీత విద్వాంసుడు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ విమర్శించడం గమనార్హం.

శాస్త్రీయ, జానపద, నృత్య, సంగీత, నాటక కళలకు రాష్ట్రం తరుగని పెన్నిధి అయినప్పటి, వాటికోసం చేయవలసిన కృషి చేయలేకపోవడానికి తమ అశక్తతను ప్రకటిస్తూ రాష్ట్ర

సంగీత నాటక అకాడమీ కార్యదర్శి (శ్రీ) కె. వి. సుబ్బారావు విచారించారు. అకాడమీ కార్యకలాపాలను విస్తృతం చేస్తూ వృద్ధిపరచడానికి కనీసం ఇరువై లక్షల గ్రాంటయినా వుండాలనీ, మరుగుపడి వున్న ఆలయ నృత్యాలు పునరుద్ధరించబడి 'పేరణి, శివతాండవం'లాటి నృత్యాలను వెలుగులోకి తీసుకురావలసివుందనీ ఆయన అన్నారు. కనీసం రజతోత్సవాల సందర్భంగా నయినా నూతనప్రభుత్వం నడుం బిగించి తెలుగు ప్రజలలో సంస్కృతి పట్లవున్న నిర్లక్ష్య వైఖరిని పోగొట్టేందుకు కృషి చేయాలని సంస్కృతి అభిమానులు ఆశిస్తున్నారు.

( న్యూస్ టుడే, ఈనాడు 1980 నవంబరు 6 )

ప్రజాప్రభుత్వం ప్రాంతీయ కళలపట్ల ఆదరణ చూపిస్తోంది. సమర్థులయిన నాట్యాచార్యులు, సూత్రధారులు, పాత్రధారులు వెలుగులోకి వచ్చారు. భారతదేశమంతా పర్యటించిన కూచిపూడి భాగవతులకు తగిన సమాదర గౌరవాలు లభిస్తున్నాయి.

చిరస్థాయిగా వారి కళ ప్రవర్ధమానం అవుతూ వుండాలని ఆశిస్తున్నారు. నాట్యకళాక్షేత్రాన్ని నిర్మించుకొన్నారు. బ్రహ్మ దీవెన, కనకలింగేశ్వరుని సహాయం, తిరుపతి వేంకటేశ్వరుని అనుగ్రహం లభించాయి. ఆంధ్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం గౌరవించాయి. కూచిపూడి నాట్యాచార్యులు కళాప్రపూర్ణ లయ్యారు. పద్మశ్రీలు వరించాయి. ఫెలోషిప్పులు లభించాయి. తామ్రపత్రాలు స్వీకరించారు. ఎవరికీ లభించని సమాదర గౌరవాలు అందుకొంటున్నారు. ప్రజలు, ప్రభుత్వం కూచిపూడి కళను గుర్తించాయి. తగిన రీతిని సహాయ సంపత్తు లందిస్తున్నారు. అభివృద్ధి పరచడానికి కంకణం కట్టుకున్నారు. ఆకాశవాణి, దూరదర్శిని మొదలు సామాన్య పౌరుని వరకు వీరి కళపట్ల శ్రద్ధాసక్తులు ఇనుమడించాయి. విదేశాలలోకూడ విజయపతాక నెగురవేశారు. ఇదంతా సవ్యంగానే ఉంది. కాని, ఈనాడు

కూచిపూడి వాస్తవ్యులలో ఇరువై సంవత్సరాల వయస్సులోపుగల వారిలో ఈ నృత్యకళపట్ల అభిమానం, ఆసక్తి నశించింది. ఉద్యోగాల కాశించి ఉన్నతవిద్యాభ్యాసాలు కొందరు చేస్తూవుంటే, మరికొందరు మరో వృత్తి నాశ్రయించారు. ప్రాచీన కాలంనాటి గురువులు, గురుకులాలు, సంప్రదాయవేత్తలు ఈనాడు తెరమరుగైనారు. అయినా కళాక్షేత్రాలు, కళాశాలలు అవతరించాయి. విద్యార్థి వేతనాలు, వసతి సౌకర్యాలు అందుతున్నాయి. నాట్య అకాడమీ భాగవతులను సత్కరిస్తోంది. నవనాగరిక భాగవత యువతను ఇవేవీ ఆకర్షించడంలేదు. ఇది కాలవిపరిణామం.

మానవుని విజ్ఞానం పెరిగింది. అణుమార్గంలో ఋజుగతి మొదలయింది. సంఘర్షణ అధికమైంది. శాంతి నశించింది. శాంతి నెలకొన్నప్పుడే లలితకళలు రాణిస్తాయి. అశాంతిలో వాటికి స్థానం లేదు. వీటికి స్థానం బలపడినప్పుడే దేశం బలపడుతుంది. అంతవరకు ప్రాచీన ప్రాభవ సంస్మరణమే మానవునకు సంతృప్తి, కర్తవ్యం.

ఈనాడు కూచిపూడి నాట్య సరస్వతి తన దీనదృక్కులతో, పునరుద్ధరణ కాంక్షతో శ్రీ వెంపటి చినసత్యం, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిలవైపు విలోకిస్తోంది. వారి ఆదరాభిమానాలను అర్థిస్తోంది. దీనిని గమనించి ఆంధ్రప్రభుత్వం వారికి తగినవిధంగా ఉత్సాహప్రోత్సాహాలు అందించి, సమర్థులయిన నాట్యాచార్యులను తయారు చేయించి, ఈనాటి నాట్యాచార్యులలో వైవిధ్యాన్ని తొలగించి, కూచిపూడి సంప్రదాయ నాట్యకళ ఒకేవిధంగా, ఏ ప్రాంతమందున్నా ఒకే ప్రమాణంతో రాణింప చేయాలని అర్థిస్తున్నాను, అభ్యర్థిస్తున్నాను. అలా కాకపోతే ఈ సంప్రదాయ నాట్యకళ 'తోలుబొమ్మలకళ'లాగా అంతరించే ప్రమాదం అతి సమీపంలో ఉన్నదని అనిపిస్తోంది.

పాళగం నాట

పల్లవి : "ఎక్కడ నున్నా నీకు నేమాయను
పక్కన నవే భావించుకోవయ్యా ॥ ఎక్క

అతివ లుండినచోట, అదె నీకు రేపల్లె
అతిశయపు వలపు యమునానది
రతులఁ గౌగిళ్లే రాసక్రీడలు నీకు
తతి వచ్చి నిందు నవి తలచుకోవయ్యా ॥ ఎక్క

కొమ్మల పోక ముడులు, కొలని దరి కోకలు
కుమ్మరించు మోవి తేనె గొల్లదొమటి
వమ్మివారితో నవ్వులు పాలు, పెరుగు-వుట్లు
తమ్మిచూపులే రేతిరి తలచుకోవయ్యా ॥ ఎక్క

చలుల జవ్వనమెల్లా చేరువ బృందావనము.
కులుకు జన్నులు పెక్కు గోవర్ధనాలు
కలసితి మాచెలిని గక్కన శ్రీ వేంకటేశ
తలపున నిక నిన్నిఁ దలచుకోవయ్యా ॥ ఎక్క

" అర్థోప జీవినా మర్థో ధృతి రుద్విగ్న చేతసాం
నానాభావోప సంపన్నం నానా వస్థాం_న్తర రాత్మకం ।
లోకవృత్తాను కరణం నాట్యంమే తన శ్రియాకృతమ్ ।
(నాట్య శాస్త్రము)

## కూచిపూడిలో జాతీయ స్థాయి నృత్యోత్సవాలు

ఇక్కడకు 40 మైళ్ళ దూరములోని కూచిపూడి శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రంలో జాతీయ స్థాయి నృత్యోత్సవాలు 9, 10, 11 తేదీలలో జరుగనున్నాయి.

ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య 9-వ తేదీ సాయంత్రం 5-30 గంటలకు ఉత్సవాలను ప్రారంభిస్తారు. ప్రారంభ సూచికంగా ఉదయం 8 గంటలకు శ్రీకాకుళం ఆంధ్రవిష్ణువు ఆలయం నుంచి మువ్వ

వేణుగోపాలస్వామి, కూచిపూడి శ్రీ రామలింగేశ్వరస్వామి ఆలయాల మీదుగా శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం వరకు ఊరేగింపు జరుగుతుంది. సాయంత్రం ప్రారంభోత్సవ సభానంతరం 6-30 గంటలకు శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ 'భామా కలాపం', 8-00 గంటలకు కుమారి సబిత, 9-00 గంటలకు కుమారి మంజుభార్గవి 'నృత్యప్రదర్శనలు' జరుగుతాయి.

10-వ తేదీ ఉదయం 9-30 గంటలకు క్షేత్రయ్య పదాభినయంపై సదస్సు జరుగుతుంది. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, డా. నటరాజ రామకృష్ణ, శ్రీమతి దుగ్గిరాల జగదాంబ, శ్రీమతి కళానిధి నారాయణన్, శ్రీ అయ్యంకి తాండవకృష్ణ ప్రభృతులు పాల్గొంటారు. సాయంత్రం 5-30 గంటలకు బహిరంగ సభా సమావేశము. శ్రీ పెండేకంటి వేంకట సుబ్బయ్య ముఖ్య అతిథిగా పాల్గొంటారు. సాయంత్రం 6-30 గంటలకు పేరిణి ఇంటర్నేషనల్ (హైదరాబాదు) వారిచే, 'పేరిణి శివతాండవం', 7-30 గంటలకు శ్రీ కోరాడ నరసింహారావు బృందం 'భక్తప్రహ్లాద' యక్షగానం, 8-30 గంటలకు కుమారి జయచిత్ర, కుమారి చంద్రకళ 'నృత్య ప్రదర్శనలు' జరుగుతాయి.

11-వ తేదీ ఉదయం 8-30 గంటలకు కూచిపూడి నృత్య సంప్రదాయంపై సదస్సు జరుగుతుంది. సర్వశ్రీ పి. పార్థసారథి, వేదాంతం జగన్నాథశర్మ, పసుమర్తి కృష్ణమూర్తి, పి. వి. జి. కృష్ణశర్మ, డా. చింతా రామనాథం, డా. వెంపటి చినసత్యం ప్రభృతులు పాల్గొంటారు. సాయంత్రం 5-30 గంటలకు బహిరంగ సమావేశం, 6-30 గంటలకు డా. వెంపటి చినసత్యం దర్శకత్వంలో కుమారి శోభానాయుడు బృందంచే 'పద్మావతీ శ్రీనివాస కల్యాణం' నృత్యనాటకం ప్రదర్శించబడుతుంది.

దేశ విదేశాల్లో విశేష ప్రాశస్త్యం పొంది కూచిపూడి నృత్య ప్రభావాన్ని పునరుద్ధరించు సత్సంకల్పంతో రాష్ట్రప్రభుత్వం సాంస్కృతిక వ్యవహారాలశాఖ ఆధ్వర్యాన ఈ ఉత్సవాలు నిర్వహించబడుతున్నాయి. ఆ శాఖ మంత్రి శ్రీ భాట్టం శ్రీరామ మూర్తి, డైరక్టరు శ్రీ జె. వి. సోమయాజులు, రాష్ట్రస్థాయి సిద్ధేంద్ర జయంత్యుత్సవ సంఘం నిర్వాహకులు శ్రీ ఎ. వి. యస్. రెడ్డిలతో పాటు ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య స్వయంగా చొరవ తీసి కొవటంతో ఉత్సవాలు పెద్దఎత్తున జరపటానికి సన్నాహాలు జరిగాయి.

కూచిపూడి నృత్యకళా ప్రదాత శ్రీ సిద్ధేంద్రయోగీశ్వరుని పేరిట కళాక్షేత్రం నిర్మాణం కావాలని సంకల్పించి సర్వశ్రీ బందా కనకలింగేశ్వరరావు, గొట్టిపాటి బ్రహ్మయ్య, నాయని వేంకట రత్నం, చింతా కృష్ణమూర్తి, వేదాంతం రాఘవయ్య, వెంపటి పెద సత్యం, చిన సత్యం, ప్రభృతులతో 1961లోనే ఒక కమిటీ ఏర్పడి అయిదు ఎకరాల స్థలం సేకరించి ప్రధాన భవనాన్ని, శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారి ద్రవ్య సహాయంతో ఒక ఆడిటోరియమును ఏర్పాటు చేయగలిగారు.

ఆ తరువాత ప్రభుత్వం కళాక్షేత్రం నిర్వహణ బాధ్యత స్వీకరించింది. మరో పదిన్నర ఎకరాల స్థలాన్ని సేకరించారు.

లలితకళల విశ్వవిద్యాలయం, అధునాతనమైన ఆడిటోరియం, పోస్టుగ్రాడ్యుయేట్‌స్థాయి శిక్షణ సంస్థ, విద్యార్థులకు వసతిగృహాలు, అతిథులకు విశ్రాంతి మందిరములు ఏర్పాటు చేయాలని ప్రభుత్వం సంకల్పిస్తోంది.

(ఆంధ్రపత్రిక - దినపత్రిక - 1982, జనవరి 8)

ప్రతి గుడిలో అందెల రవళులు : "రాష్ట్రంలోని ప్రతి దేవాలయంలో ఉత్సవాలు జరిగే సమయాలలో నృత్యప్రదర్శనలు విధిగా జరగాలని రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి

శ్రీ భాట్టం శ్రీరామమూర్తి" అన్నారు. ఆయననే డిక్కడ కూచిపూడి నృత్య ప్రదర్శనల కార్యక్రమాలను ప్రారంభించారు. ఈ నృత్య ప్రదర్శనల నిర్వహణకు ప్రత్యేకంగా సేకరించిన 10 ఎకరాల స్థలంలో శోభాయమానంగా అమర్చిన వేదికమీద కార్యక్రమాలు ప్రారంభం అయ్యాయి. "దేవాలయాలకు వస్తున్న ఆదాయాలలో కొంత భాగాన్ని నృత్య కార్యక్రమాల అభివృద్ధికి వినియోగించాలని మంత్రి శ్రీ భాట్టం అన్నారు. నృత్యం, సంగీతం, నాటక రంగాలకు చెందిన ఏ కళాకారుడు కన్నీరు పెట్టరాదనీ, ప్రజలు ఇందుకు సహకరించాలనీ, అవసరమైతే ప్రభుత్వం ఇందు నిమిత్తం ఒక కార్యక్రమం చేపట్టక తప్పదనీ ఆయన అన్నారు. ఆంధ్రులకు ఘనమైన స్థానం తెచ్చిపెట్టిన కూచిపూడి నృత్యం మరుగున పడిందనీ, ఇకముందు అలా జరగరాదనీ ఆయన స్పష్టం చేశారు. ఈ వారసత్వ సంపదను సుసంపన్నం చేసుకోవాలనీ, అందుకు అంతా నడుం కట్టాలని మంత్రి పిలుపు నిచ్చారు. కూచిపూడి నృత్యంలో ప్రవేశం ఉన్న ప్రతి వ్యక్తి ప్రతి సంవత్సరం ఈ కార్యక్రమంలో పాల్గొనాలని ఆయన కోరారు. వచ్చే ఏడాది నృత్యోత్సవాల కార్యక్రమాల నిర్వహణకు అయిదు లక్షల రూపాయలను మంజూరు చేశామని ఆయన తెలిపారు. మరో అయిదు లక్షల రూపాయలను సేకరించవలసినదిగా జిల్లా పరిషత్ అధ్యక్షుడు శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావు గారిని కోరారు.

"ఈ ఏడాది ఉత్సవాల నిర్వహణకు నాలుగు లక్షల రూపాయలు కేటాయించామనీ, ఈ ప్రాంతాన్ని శాంతినికేతనంగా రూపొందించడానికి కృషి చేస్తామనీ ఆయన అన్నారు. ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన రోడ్ల, భవనాల మంత్రి శ్రీ దివి కొండయ్యచౌదరి మాట్లాడుతూ కూచిపూడికి వివిధప్రాంతాల నుంచి వచ్చే రోడ్లను తారురోడ్లగా మార్చుతామని, ఇక్కడ అతిథి గృహాన్ని నిర్మిస్తామని చెప్పారు. ఈ కళకు పూర్వపు

ప్రాధాన్యాన్ని కలుగజేయడానికి ప్రభుత్వం కృషి చేస్తుందని ఆయన అన్నారు. కూచిపూడి నృత్యాన్ని ఇంటింటా అభ్యసించాలని ఆయన సూచించారు. ఇక్కడ ఒక విశ్వవిద్యాలయం ఏర్పాటు చేసి, విదేశీయులను ఆకర్షించి, వారు నాట్యకళా విశిష్టతను తెలుసుకొని ప్రచారం చేసేలా చేయా" లని ఆయన వివరించారు.

సాంస్కృతిక వ్యవహారాలశాఖ డైరెక్టరు శ్రీ జె. వి. సోమయాజులు మాట్లాడుతూ "తిరువయ్యారులో త్యాగయ్య కీర్తనలు ఆలపించితే జన్మ ధన్యం అయినట్లు భావిస్తున్న విధంగా కూచిపూడి నృత్యంఅధ్యయనం జరగా"లనిఅన్నారు. కూచిపూడిలో విశ్వవిద్యాలయం ఏర్పాటుకావా"లని ఆయన ఆకాంక్షించారు. జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీ పిన్నమనేని కోటేశ్వరరావుగారు మాట్లాడుతూ "ఇప్పటికి 2.80 లక్షల రూపాయలు ఖర్చుచేశా" మన్నారు. కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ ఏ. వి. యస్. రెడ్డిగారు స్వాగతం పలుకుతూ"" "కుల, మత, ప్రాంతీయ తత్వాలకు అతీతంగా ఉండేది కళ అని అన్నారు. కళాక్షేత్రం అభివృద్ధికి స్థలం కేటాయించిన రైతులకు ప్రత్యామ్నాయం చూపించగల"మని ఆయన అన్నారు. కళాక్షేత్రం కార్యదర్శి జి. ఎస్. ఆర్. ఆంజనేయులుగారు "కూచిపూడి కళ పునరుజ్జీవనానికి ప్రభుత్వం దోహదం చేయా"లని అన్నారు. కళాక్షేత్రం ప్రిన్సిపాల్ పి. వి. జి కృష్ణమూర్తి స్వాగత గీతం వల్లించారు. నృత్య ఉత్సవాలు నిర్వాహణసంఘు కార్యదర్శి శ్రీ తుర్లపాటి కుటుంబరావుగారు వందన సమర్పణ చేశారు.

ఆ తర్వాత శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ బృందము 'భామాకలాపం' ప్రదర్శన, మంజుభార్గవి, సబితల 'నృత్య ప్రదర్శనలు' జరిగాయి.

జాతీయ స్థాయి కూచిపూడి నృత్యోత్సవాలు నేటి ఉదయం 8 గంటలకు ప్రారంభమైనాయి. కూచిపూడి నృత్యకళా నిర్మాత సిద్ధేంద్రయోగి చిత్రపటంతో శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణువు ఆలయం

నుంచి ఊరేగింపు ప్రారంభమైంది. ఆంధ్రమహావిష్ణువు ఆలయంలో సాంస్కృతిక వ్యవహారాల శాఖమంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి జ్యోతి వెలిగించడంతో ఉత్సవాలు ప్రారంభమైనాయి. ఊరేగింపు శ్రీకాకుళంనుంచి బయలుదేరి మొవ్వ శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం మీదుగా, కూచిపూడి శ్రీరామలింగేశ్వరస్వామివారి ఆలయం మీదుగా సిద్ధేంద్ర కళాక్షేత్రం చేరింది.

(9-1-1982 కార్యక్రమము)

(ఈనాడు 10-1-1982 ఆదివారం సంచికనుండి)

"కూచిపూడిలో ఏర్పాటు చేయ సంకల్పించిన విశ్వ విద్యాలయం కేవలం సిద్ధేంద్ర ప్రోక్తమయిన కూచిపూడి నృత్య శైలీ పరిశోధనకేగాక, ఈ శైలికి మూలమైన మధురభక్తిని ఆలంబనం చేసుకొన్న వాగ్గేయ ప్రవర్తకు లయిన క్షేత్రయ్య, అన్నమయ్య, త్యాగయ్యల రచనలు కూడ పాఠ్యాంశంగా, ప్రాచుర్యాంశంగా గైకొనగల ప్రణాళికతో గూడిన సమగ్ర నృత్య పరిశోధక కర్తవ్యంపై ఆధారపడి ఆ విశ్వవిద్యాలయం నడువగలగా లని, అప్పు డది సర్వాంగ సుసంపన్నం కాగల"దని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయోపాధ్యాయులు, విద్యావేత్తలు అయిన శ్రీ ఎం. వి. రామశర్మగారు సూచించారు.

అఖిల భారత స్థాయిలో కూచిపూడి నృత్యోత్సవాల నేటి రెండవ దిన సభకు శ్రీ రామశర్మగారు అగ్రాసనాధిపత్యం వహించారు. కార్యక్రమాన్ని విజయవంతంగా నడిపించారు.

ముఖ్య అతిథిగా విచ్చేసిన కేంద్ర దేశీయాంగశాఖ ఉపమంత్రి శ్రీ పెండేకంటి వేంకట సుబ్బయ్యగారు "కూచిపూడి నృత్యం—మూర్తిత్రయం" అనే పేర నృత్యకళా అకాడమీవారు ప్రచురించిన సావనీరును ఆవిష్కరించారు. కూచిపూడి శైలిని ఆరిపోకుండా కాపాడుకుంటూ కాలపురుషుని ఝంఝూంమారుతాహతి నుండి కాపాడిన శ్రీయుతులు చింతా వెంకట రామయ్య, వేదాంతం

లక్ష్మీనారాయణశాస్త్రి, లయబ్రహ్మ వెంపటి వెంకట నారాయణ శాస్త్రిగారల జీవిత విశేషాలను ఇందులో సచిత్రకంగా వివరించారు. ఈ ముగ్గురు ప్రస్తుతం దివంగతజీవులు. గ్రంథకర్త డా. చింతా రామనాథం. ఎం. ఎ., పిహెచ్. డి. గారు. చిత్రరచన : శ్రీ భాగవతుల రామకృష్ణశర్మగారు.

వాగ్గేయకారక చతుష్టయం : సభాధ్యక్షులు మొవ్వగ్రామ కాపురస్థులు, శ్రీ క్షేత్రయ్యవారి వంశంలో జన్మించారు. క్షేత్రయ్య జీవితచరిత్రను గూర్చి, వారి పదకవితా విధానం గురించి మహోత్కృష్టమైన గ్రంథాన్ని రచించారు. వారు మొవ్వ గ్రామంలో శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయ ప్రాంగణంలో జరిగిన బహిరంగ సభకు అధ్యక్షత వహించడం సముచితంగా ఉంది.

ముఖ్య అతిథిగా తిరుపతి శ్రీ వేంకటేశ్వర కళాపీఠం డైరక్టరు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు విచ్చేశారు. ఆస్థాన నాట్యాచార్య డా. నటరాజ రామకృష్ణగారు, మద్రాసు శ్రీమతి కళానిధి నారాయణన్, శ్రీమతి జగదాంబ గారలు అభినయ పూర్వక ప్రసంగాలు చేశారు. సమావేశకర్తగా శ్రీ అయ్యంకి తాండవకృష్ణ, ఎం. ఎ. గారు వ్యవహరించారు.

సభాధ్యక్షులు శ్రీ రామశర్మగారు ముక్తసరిగా మాట్లాడారు. అయినప్పటికి విద్వద్విదుషీత్వం ఆ కొంతకాలంలోనే వెల్లి విరిసింది.

"ఏర్పడనున్న విశ్వవిద్యాలయం ఒక విశాల విశిష్ట లక్ష్య పూర్వకమైనదై వుండాలని శ్రీ రామశర్మ అన్నారు. అది కేవలం సిద్ధేంద్ర రచనలనేకాక, ఇట్టివారే అయిన క్షేత్రయ్య, అన్నమయ్య, త్యాగయ్యల రచనలపైకూడా పరిశోధన ప్రాచుర్య విషయాలను తన కర్తవ్యంగా స్వీకరించాలన్నారు. భక్తిమార్గ ప్రవర్తకులైన వీరు సామాన్య ప్రజలకు అర్థమయ్యే సరళశైలిని ఆలంబనం చేసుకుని చక్కని తెలుగుభాషలో వాగ్గేయ రచనలు కావించారనీ,

అవన్నీ మధురభక్తి మూలకంగా వున్నాయనీ అన్నారు. కనుక ఈ విశ్వవిద్యాలయం మొవ్వను, ఘంటశాలను కూడా అభివృద్ధి పరిచే కృషిని స్వీకరించా" లన్నారు.

మధురతత్త్వం అనింద్యం : మధురభక్తిని వివరిస్తూ భగవంతుని నాయకుడుగానూ, తనను నాయికగానూ ఎంచుకుని ఈ భక్తులు సులభ రీతిలో ఆత్మానంద మనే గమ్యాన్ని చేరు కుంటారని అన్నారు. త్యాగయ్యాది ప్రభుభక్తి అన్నారు. ప్రతివ్యక్తి ఒకానొక వయస్సులో భగవంతుడని పిలవనీయండి, విశ్వాతీతమని పిలువనీయండి, అటువంటి ఒక శక్తి శరణాగతిని పొందక తప్పదని తమ అభిప్రాయ మన్నారు. దానినే కొందరు ప్రభుభక్తిగానూ, కొందరు సుహృద్భక్తిగానూ, మరికొందరు మాతృ భక్తిగానూ ఇంకకొందరు మధుర భక్తిగానూ ( క్షేత్రయ్య, అన్నమయ్య, సిద్ధేంద్రుడు, రాధ, మీరాబాయి మున్నగువారు ) స్వీకరించా రన్నారు. ఈ మార్గంలో శీఘ్రకాలంలో తన్మయస్థితి లేక యోగ సిద్ధి లభ్యం కానుండిన కారణంగా అట్టిదానిని వాగ్గేయకారులు తా మాచరించి ప్రజలకూ ఉపదేశించా రన్నారు. ఆ ఆనంద భావమును " ఇన్స్పిరేషన్ పొయిట్రీ " గా కవులు నిర్వచించా రన్నారు. మధురభక్తిని " బ్రైడల్ మిస్టిసిజమ్ "గా విద్వద్వేత్తలు గుర్తించారన్నారు. ఒకానొక వయస్సులో "నేనెవరు? నే నేమి చేయ వలసివున్నది "! అనే జిజ్ఞాసా దృష్టిని పొంది తీరక తప్పదన్నారు. ఆ గవేషణమే మధురభక్తి స్రవంతియై, మోహన గానంగా పరిణ మించిం దన్నారు. ఈ పూర్వ పరిజ్ఞానం గనుక వుంటే ఈ వాగ్గేయ కారులు భగవంతుని నాయకుడని మురిసి శృంగారోన్మత్తు లెందుకై నారో మనకు సుబోధకం కాగల దన్నారు.

క్షేత్రయ్య, సిద్ధేంద్రులు సమకాలికులు అవునో కాదో చెప్పలే మన్నారు. కాని క్షేత్రయ్యపై సిద్ధేంద్రుని ప్రభావం బాగా ప్రసరించినదని మాత్రం గ్రహించవచ్చు నన్నారు. తన

అభిప్రాయంలో సిద్ధేంద్రులు 16, 17 శతాబ్దులమధ్యప్రాంతం వాడై యుండవచ్చుననీ, ఈ యుభయులు దాదాపుగ సమకాలికులే కావచ్చుననీ అన్నారు.

ఈ దృష్టితో వీక్షించినప్పుడుగాని మనకు "కాటుక కంటి నీరు చనుకట్టు పయిం బడ నేల ఏడ్చెదో కైటభారి రాణి" అన్న పోతనామాత్యుని హృదయగత భావం తటిల్లతలా మెరియ గల దన్నారు. ఈ వాగ్గేయకారుల శృంగార శబ్ద ప్రయోగాల ప్రయోజనము, పరమార్థము ఎంతటి స్వచ్ఛమైనవో, ఎంతటి భౌతిక మోహ దూరమైనవో, ఎంత అనింద్యమో వేద్యం కాగల దన్నారు.

అంతకుముందు కళాక్షేత్ర నిర్వాహకమండలి తరపున శ్రీ పెండేకంటి వేంకట సుబ్బయ్యగారికి, శ్రీ భాట్టం శ్రీరామమూర్తి గారికి సంస్కృత భాషలో విజ్ఞాపన పత్రాలు అందజేశారు.

ఇంకా ఉత్సవ సంఘ కోశాధికారి శ్రీ డా. ఎం. కుటుంబరావు, శ్రీ సి. ఆర్. ఆచార్య (అహమ్మదాబాదులో నృత్యకళోపాధ్యాయులు) ప్రసంగించారు.

కూచిపూడి సర్పంచి శ్రీ వై. కె. టి. ప్రసాదరావుగారు కృతజ్ఞతావందన సమర్పణ చేశారు. శ్రీ తుర్లపాటి కుటుంబరావు గారు వ్యాఖ్యాతగా వ్యవహరించారు.

నృత్య వైవిధ్యం : కళాక్షేత్ర విద్యార్థుల 'రంగపూజతో' ఉత్సవం ప్రారంభమైనది. నృత్యకళా అకాడమీ అధ్యక్షులు శ్రీ నటరాజ రామకృష్ణ బృందంవారి 'పేరణి' (ప్రేరణి) నృత్యం జరిగింది. విశ్వవ్యాప్తమైన, అఘోరమైన శివభక్తిని ప్రేరణ ద్వారా నర్తకుడు తనయందు ఆవహింపజేసుకొని, శివత్వసిద్ధిలో పరాకాష్ఠ నందడము ఈ నృత్యలక్షణము.

తరువాత శ్రీ కోరాడ నరసింహారావు బృందంవారి 'మోహినీ భస్మాసుర' నృత్యప్రదర్శనం. ఇందులో భస్మాసురుడుగా,

శ్రీ నరసింహారావు, మోహినిగా శ్రీమతి నాగమణి బుద్ధదేవ్, నారదుడుగా శ్రీ కిలారు సత్యంగార్లు నటించారు. మోహినిగా శ్రీమతి నాగమణి సమ్మోహనంగా నర్తించింది. వరంకోరునప్పటి రుద్రనర్తనకు శ్రీ నరసింహారావు నటన అనుపమానం. మార భంజకుని భక్తుడుగా ఆయన రసరంజకంగా స్తోత్రగానం చేశారు.

భామాభినయం : కుమారికలు జయచిత్ర, చంద్రకళలు ఈ రెండవరోజున నృత్యపూజ కర్పించిన పుష్పనృత్యములు శోభాయమానములు.

కుమారి జయచిత్ర ఆహార్యం మిరిమిట్లు గొలిపింది. జలతారు కోకలో అప్సరభామినిలా వెలిగిపోయింది. ఆమె సాత్రాజితిగదా! తండ్రి అనంతరం సంపదను అరణంగా ఇచ్చినాడు. అయినప్పుడు సత్య అంతవిద్యుత్తేజోవంతమైన ఆహార్యం ధరించటం సంభావ్యమే. నిశ్శంకా పాత్రమే.

ఆమె భామాకలాప శైలి కించి ద్విలక్షణం. పరిభ్రమణాధికంగా ఆమె నృత్యం చూపరులకు సంతోషం కలిగించింది. " రవ్వసేయుట మేలా! రాజగోపాలా !......నావంటి బాలపై చలము సాధించుట తమకు ధర్మముకాదు " అని ఆమె ప్రియకాంతుని మాటిమాటికి చేతులెత్తి చేసిన దండ ప్రణామములు, భృకుటి నాన్చిన కరాంజలీ యుత నమస్సులు సౌందర్య సంశోభితమై ఒప్పినాయి. ' వివశత్వంబులతో కపోలతటిపై విన్యస్త హస్తాబ్జలై,......... ఏడ్చిరి సుజాతంబైన గీతంబులన్ " అన్న పోతనామాత్యునికి ప్రియమైన వర్ణనను సిద్ధింపి జేసిం దామె. ఆమె వర్షాకాల మేఘ తటిల్లతయై రంగ వేదికను అలంకరించింది.

కుమారి చంద్రకళ పతాకప్రాయ నృత్యం చేసింది. ఆమె కూడా నృత్యచంద్రునికి ఒక కళయే. " నవరస శ్లోకం " తొలుత అభినయించింది. అన్ని రసాలను కన్నుల పండువుగా అభినయించింది.

ముఖ్యంగా "పాంచాలీ శపథం" లో దుశ్శాసనుడు నిండు కొలువులో కొప్పుపట్టి ఈడ్చి తనకు ఆ దురాత్ముడు కావించిన అవమాన భారము వ్యక్తీకరించి ఖిన్నురాలయింది. వివస్త్రను చేయజూచిన ఆ దుర్మార్గుని రక్తంచేత తన శిరోజ సంస్కారం చేసి గాని కొప్పును ముడువనన్న భీష్మ ప్రతిజ్ఞను ధరించిన ఆ రౌద్ర మూర్తిని సర్వధాభయద. అంతకుముందు అమృతం వర్షించిన కన్నులేనా ఇప్పుడునిప్పులు చెరగుతున్న దనిపించింది. ఇందు కా అభినేత్రి ప్రశంసాపాత్ర.

సుమారు 16 వేల మంది ప్రజలు ఈ ఉత్సవాలను చూచి ఆనందించారు. ఉత్సవ సంఘంవారి అంచనాలు తలక్రిందులైనాయి. ఏర్పాట్లు చాలలేదు.

ఉదయం పూట మొవ్వ వేణుగోపాలస్వామి ఆలయ ప్రాంగణంలో శ్రీ యుతులు రజనీకాంతరావు, నటరాజ రామకృష్ణ, జగదాంబ, తాండవకృష్ణగారల విద్వద్గోష్ఠి జరిగింది.

నూతన విశ్వవిద్యాలయానికి కృష్ణా జిల్లా రైస్ మిల్లర్సు అసోసియేషన్ వారు రు 50 వేలు విరాళం ప్రకటించారు. అసోసియేషన్ కార్యదర్శి శ్రీ గున్నయ్యశెట్టిగారిని మంత్రులు అభినందించారు.

శ్రీ జె. వి. సోమయాజులగారి వందనసమర్పణలో నేటి కార్యక్రమం సమాప్తం.

(ప్రజాశక్తి - దినపత్రిక. 1982 జనవరి. 12.)

ఈవిధంగా కూచిపూడి నాట్య సరస్వతి ఇదివర కెన్నడూ కనీ, వినీ ఎరుగని రీతిగా జాతీయనాయకులచేత, ప్రజలచేత, వివిధ కళాకారులచేత సమారాధింపబడింది. ఈనాడు వేదికలపై ప్రముఖులు ప్రసంగించిన ప్రసంగాలు కార్యరూపమును ధరించిన నాడు కూచిపూడి యథార్థంగా ఆంధ్రావనిలో శాంతినికేతనంగా రూపొంది భారతదేశ లలితా కళాక్షేత్రంగా భాసిస్తుంది.

ప్రస్తుతం పెల్లుబుకిన ఉత్సాహ ఉద్వేగాలను చెదరనీయకుండా యథాతథంగా ఉండునట్లు చేయవలసిన బాధ్యత, కర్తవ్యం వర్ధమాన కూచిపూడి నాట్యాచార్యులకు ఎంతైనా కలదు. అందుకు వారు అహర్నిశలు ఏమరక కృషిచేయాలని అభ్యర్థిస్తున్నాను.



# భాగవతుల వారు - శాఖ 1

- రామలింగం
  - రామయ్య
    - రామలింగ శాస్త్రి
      - సత్యసుందర రామయ్య
        - గోపాలకృష్ణమూర్తి
          - సీతారామస్వామి
      - సీతారామస్వామి
        - లక్ష్మీనరసింహం
      - సత్యసుందర రామ శాస్త్రి
        - సీతారామస్వామి
        - రామలింగ శాస్త్రి
          - బుజ్జిబాబు
      - వేంకటాచలపతి శాస్త్రి
        - వేంకట సీతారమణ

## భాగవతులు - కుటుంబాలు

క్రీ. శ. 1677 నాటికి కూచిపూడి అగ్రహారంలో 1. భాగవతుల, 2. చింతా, 3. వేదాంతం, 4. హరి, 5. మహంకాళి, 6. పసుమర్తి, 7. వెంపటి, 8. బొక్కా, 9. దర్భా, 10. ఏలేశ్వరపు, 11. జోస్యుల, 12 తాడేపల్లి, 13. పెద్దిభొట్ల, 14. వేము, 15. యేలుకుర్తి, 16. చల్లా, 17. కనుపూరు, 18. పోలేపెద్ది, 19. వల్లభజోస్యుల అను పందొమ్మిది ఇంటిపేర్ల కుటుంబాలవారుండేవారు, వీరిలో పెద్దిభొట్ల, యేలుకుర్తి, కనుపూరి, పోలేపెద్ది, వల్లభజోస్యుల వారి కుటుంబాల వారు ఈనాడు లేరు. చల్లావారు, బొక్కావారు మాత్రం అన్యవృత్తుల నాశ్రయించి అన్యస్థలాలకు వెళ్ళిపోయారు. మిగిలినవారు మాత్రం ప్రస్తుతం కూచిపూడిలోనే ఉన్నారు. వీరుగాక పిల్లలమర్రివారు కూడా ఒకప్పు డుండేవారు.

భాగవతులవారు - శాఖలు : కూచిపూడి అగ్రహారంలో భాగవతులవారిది అతిప్రాచీనమైన కుటుంబం. బహుశః ఇదే ఆదికుటుంబం కావచ్చు. సిద్ధేంద్రయోగి ప్రథమ శిష్యులు కూడ వీరే కావచ్చు. వీరు కొల్లూరు, అనంతవరం ప్రాంతాల నుండి వచ్చారు. అప్పుడు వీరి గృహనామం సుబాణం. వారు కూచిపూడిలో స్థిరపడి భాగవత సంప్రదాయ కళలో ప్రసిద్ధులగుట వలన భాగవతులవా రయ్యారు. ఈనాడు కూచిపూడి అగ్రహారంలోని ఏ యింటి పేరిటివా రయినా 'భాగవతులు' అని వ్యవహరించడం ఆచారమయింది.

భాగవతుల వారిలో నేనెరిగినంతవరకు — రామలింగం - లక్ష్మీనారాయణ - యజ్ఞయ్య - చలపయ్య, రామయ్య, కోటయ్య,

వేంకట సుబ్బయ్య అనువారల కుటుంబాలే ఈనాటి కూచిపూడిలో వృద్ధిపొందుతున్నాయి.

1. శ్రీ రామలింగం: శ్రీ రామలింగంగారికి ఏకపుత్ర విశేషం. పుత్రముఖం దర్శించి సన్యసించారు. ఆయన కుమారుని నామధేయం రామయ్య. ఈయన మూడు వివాహాలు చేసుకున్నారు. మొదటి భార్య సంతానం లేకుండానే పరమపదించింది. తిరిగి రెండవమారు పరిణయం చేసుకొన్నారు. 'ప్రజార్థై గృహమేధినాం' అను ఆర్యోక్తి వీరి ధ్యేయం. ఈ భార్యవలన వీరికి ఇరువురు పుత్రికలు జన్మించారు. మొదటి కుమార్తె శాంతమ్మ. రెండవ ఆమె ఘంటమ్మ. వీరి జననానంతరం ఈమె పుత్రసంతానం లేకుండానే మరణించింది. "అపుత్రస్య గతిర్నాస్తి" అనేభావంతో శ్రీ రామయ్యగారు తృతీయ వివాహం చేసుకున్నారు. ఈమె సోమయాజులవారి ఆడబడుచు. కూచిపూడికి పరిసరంలో ఉన్న చోరగుడి ఈమె జన్మస్థలం.

శ్రీ రామయ్య: శ్రీ రామయ్యగారు నాట్యకళాపారంగుతులే కాదు, సరసకవులు. పండితులే కాదు సూత్రధారులు. మధుర మార్దంగికులే కాదు, యోగాభ్యాసచణులు. 18 - వ శతాబ్ది పూర్వార్థం వీరి కాలం. పచ్చని మేనిచాయ. పలుచని శరీరం. బ్రహ్మతేజస్సు ముఖాన వుట్టిపడేది. జంత్రగాత్రాలలోనే గాక వేదాంతశాస్త్రంలో అపార పాండిత్యంగలవారు. బహుముఖ ప్రజ్ఞాధురంధరులు. నిత్యకర్మానుష్ఠానపరులు.

కృష్ణా జిల్లాలో ప్రసిద్ధ బౌద్ధక్షేత్రంగా ప్రసిద్ధిపొందిన ఘంటశాల గ్రామంలో శ్రీ రామయ్యగారు చాలా కాలం నివసించారు. కుమారి నరహరి, కుమారి వేంకటరత్నం మొదలగు దేవదాసీలకు నాట్యం నేర్పుతూవుండే వారు. అనుదినం బ్రహ్మముహూర్తాన లేచి, నిత్యకర్మానుష్ఠానాలు, యోగాభ్యాసాది సాధనలు ముగించుకొని శిష్యురాండ్రకు శిక్షణ గరపడానికి గరిడీ చోటుకు వెళ్లేవారు. అక్కడి

నుండి మధ్యాహ్న సమయానికి ఇంటికి వచ్చి మాధ్యాహ్నిక కార్యక్రమాలు ముగించుకొనటంతో పాటుగా బ్రహ్మయజ్ఞం, పితృయజ్ఞం, తర్పణం, దేవతార్చన, వైశ్వదేవాదికాలు నిర్వర్తించి కాని భుజించేవారు కారు. వీరి ప్రతిమాటలో, చేతలో పారమార్థిక చింతన తొణికిసలాడుతూ వుండేది. ప్రతి వ్యక్తి వీరిని అధికంగా ఆదరించేవారు.

వీరిని, వైశ్వదేవం చేశారు కాబట్టి 'వైశ్వదేవం రామయ్యగా'రనీ, చాలామందికి వీరి తండ్రి కక్కయ్య, పినతండ్రి కావడంవల్ల 'కక్కయ్యగారి రామయ్య' అని ఆదరించేవారు. ఆనాడు ఆ గ్రామంలో అనేకమంది రామయ్యలు భాగవతుల వారిలో వున్నందున ఇలా ఆహ్వానించేవారు.

శ్రీ రామయ్యగారు బాల్యంలోనే తమ ఇరువురు కుమార్తెలకు వివాహాలు జరిపించారు. కాని దురదృష్టము వలన ఇరువురు వితంతువు లయ్యారు. వారి బ్రతుకు లీవిధంగా బండలయినందుకు ఎంతగానో వ్యథపడుతూ వుండేవారు. కొంతకాలానికి బ్రహ్మజ్ఞాన పరిపూర్ణులై, అంతర్ముఖులై "గొల్లకలాపం" అను పేరుతో 'యజ్ఞపట్టు', 'పిండోత్పత్తి ప్రకరణము' అను రెండు విషయాలను ఏకగ్రంథంగా కూచిపూడి కలాప సంప్రదాయంలో రచించారు. ఈ అగ్రహార కళాచరిత్రలో శ్రీ సిద్ధేంద్రయోగి విరచిత భామాకలాపం మొదటిదికాగా, ఇది ద్వితీయ మనడంలో సందియం లేదు. భామాకలాపానికి వలెనే దీనికి కూడా ఈనాడు అనేక వికృతరూపా లావిర్భవించాయి.

గొల్లకలాపం: గొల్లకలాపంలోని ప్రధానపాత్ర 'భామ.' ఈమె అసాధారణ శేముషీధురీణ. వేదవేదాంగాలు, ధర్మశాస్త్రాలు ఈమెకు కరతలామలకాలు. ప్రారంభంలోనే పాలు పెరుగు అమ్ముకుంటూ రంగప్రవేశం చేస్తుంది. అక్కడ అహంకార పరిపూర్ణుడైన భూసురుడు తారసిల్లుతాడు. వీర

లిరువురకు పలుకరింపులలోనే ఎత్తిపొడుపులు, స్వాతిశయాలు వెల్లడవుతాయి. క్రమంగా శాస్త్రచర్చల్లోకి దిగుతారు. పూర్వపక్షాలు, సిద్ధాంతాలు చేసుకోవడంలో వేదవేదాంగ విషయాలు ఎన్నో మహత్తర ప్రమాణాలు చూపుతూ తమ తమ సంస్కార విశేషాలు, పాండితీ పటిమలు ప్రకటిస్తారు.

ఈ వాదనలో 'పిండోత్పత్తి' మొదలు 'జీవ అవసానదశ' వరకు అభివర్ణింపబడుతుంది. వర్ణాశ్రమధర్మాలు చర్చింపబడుతాయి. యజ్ఞయాగాది క్రతువులు, వాటి పరమార్థాలు విమర్శింపబడతాయి. ఈ భూదేవుడు సామాన్యుడుకాడు, భామ సాధారణురాలుకాదు. ఒకరికి ఒకరు యుక్తి ప్రయుక్తులలో, వాదనా పటిమలో, జ్ఞాననైపుణ్యంలో తగ్గడంలేదు. చివరకు యజ్ఞయాగాది క్రతువులలో పశు విశసనానికి బదులు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాదుల వ్యాపారాది రూపమైన పశువులను బలిచేయడం పరమార్థమని, దానిని మానసయాగమని వినూతన ప్రక్రియను ఇది యోగశాస్త్రములందు పేర్కొనబడినదని ప్రతిపాదిస్తారు. ఇరువురు ఏకాభిప్రాయులవుతారు. ఈ కలాపంలో రామయ్యగారి ప్రతిభా వ్యుత్పత్తులు, ఆధ్యాత్మిక పరిజ్ఞానం చక్కగా ప్రస్ఫుటమవుతాయి.

శ్రీరామయ్యగారు-యోగాభ్యాసం : శ్రీ రామయ్యగారు అప్పుడప్పుడు భామాకలాప మేళాలను వెంట నిడుకొని సంచారం వెళ్లేవారు. వీరితో వెళ్లడం భాగవతులకు మహదానందం. వీరు సకల ప్రవీణులు. ఒక పాత్రధారి లోటు ఏర్పడితే ఆ లోటు వీరు భర్తీ చేసేవారు. వీరికి తెలియని విషయంగాని, రాని విద్యగాని లేదు. గాత్రం సుకుమారంగా, మృదుమధురంగా వుండేది. యోగాభ్యాస పరిత ప్తమైన దేహయష్టి నాట్య ప్రయోగాని కనువుగా నుండేది. వీరి ప్రజ్ఞను ప్రతిబింబింపచేసే వింతకథ లెన్నోవున్నాయి.

ఒకమారు శ్రీ రామయ్యగారు భాగవతమేళం వెంట పశ్చిమ గోదావరి జిల్లా. చింతలపూడి తాలూకాకు వెళ్లారు. ఆ ప్రాంతంలో

ఒక గ్రామంలో ఒక ప్రదర్శనకు నిర్ణయం జరిగింది. ఒక సంపన్న బ్రాహ్మణ గృహస్థుని ఇంట విడిది చేశారు.

ఆ రాత్రి నియమిత సమయానికి భామాకలాప ప్రదర్శనం ప్రారంభమైంది. శ్రీ రామయ్యగారి సూత్రధారిత్వంలో ప్రదర్శనం రక్తి కట్టింది. ప్రదర్శనానంతరం ఎవరి ఇండ్లకు వారు చేరుకున్నారు. భాగవతులు విడిదికి వచ్చారు.

అది తెల్లవారిజామువేళ బ్రాహ్మ ముహూర్తము. ఎడతెగని భ్రమరనాదం వినిపిస్తోంది. అది ప్రణవ నాదాన్ని అనుకరిస్తోంది. ఈ విచిత్రనాదం, ఇంకా నిదుర చెందని గృహమేధికి ఆశ్చర్యంగొల్పింది. వెంటనే లేచి ఆ శబ్దం వస్తున్న వైపుకు నడిచాడు. మెల్లగా నూతి సమీపానికి చేరుకున్నాడు. అక్కడి దృశ్యాన్ని చూచి సంభ్రమాశ్చర్యాల్లో మునిగి పోయాడు. శ్రీ రామయ్యగారు నేల నంటకుండా, రెండు గజాల ఎత్తున, నిరాధారంగా పద్మాసనాసీనులై యున్నారు. ఆయన నుండి ప్రణవనాదం ఎడతెగకుండా విన్పింప సాగింది.

అనంతరం ఆ గృహస్థు వారి విషయమంతా తెలుసుకొని ఉచితరీతిని గౌరవించి తమ భక్తి ప్రపత్తులను వెలిబుచ్చారు. శ్రీ రామయ్యగారి యోగమహిమకు ఇది ఒక ఉదాహరణ.

యోగవిద్యా ప్రవీణులైన శ్రీ రామయ్యగారు తమ అవసాన సమయాన్ని ముందుగానే గుర్తించారు. అప్పటికి ఆయన కుమారునికి పదునాల్గు మాసముల వయస్సు. ఆయన పేరు రామలింగశాస్త్రి. ఆ బిడ్డను సవతి కుమార్తెల చేతులలో పెట్టారు. చెప్పవలసిన మాటలు చెప్పారు. అన్ని విషయాల వ్యవహారాలు అప్పగించారు. దర్భాసనం పరుచుకున్నారు. ఆతుర సన్యాసం స్వీకరించారు. యోగములో శవాసనమున శయనించి, బ్రహ్మరంధ్రమును ఛేదించి, ప్రాణోత్క్రమణం చేసి పరమాత్మలో అయిక్యమయినారు. శ్రీ సిద్ధేంద్రయోగి తరువాత కూచిపూడి కళాక్షేత్రంలో ఇంతటి వారు ఇంత దనుక జన్మింపలేదనుట అతిశయోక్తి కాదు.



## శ్రీ రామలింగశాస్త్రి - సంస్కృత విద్యాపీఠము

శ్రీ రామయ్యగారు సిద్ధిపొందిన తరువాత ఘంటమ్మ, శాంతమ్మగారలు పసివాడైన రామలింగశాస్త్రిని తమ స్వంత తోడ బుట్టిన వానిగా భావించి కంటికి రెప్పవలె కాపాడారు. పెంచి పెద్ద చేశారు. గర్భాష్టమ వత్సరంలో ఉపనయన సంస్కారం చేయించారు. భాగవత సంప్రదాయ విద్యలు చెప్పించి పూరారా త్రిప్పుటకు వీరికి మనస్కరించలేదు. కాని ఇపుడు విద్యాభ్యాస సంబంధమైన జటిల సమస్య ఎదురైంది.

ఈ తరుణంలో శ్రీ రామయ్యగారు ఘంటశాలలో గరిడీలు చెప్పే సమయంలో ఆ గ్రామవాస్తవ్యులైన శ్రీ చింతలపాటి లక్ష్మీపతిశాస్త్రిగారితో పరిచయ మేర్పడింది. రామలింగశాస్త్రి జన్మించినది కూడా వీరి ఇంటనే. ఈ లక్ష్మీపతిశాస్త్రిగారు తర్క-వేదాంత, జ్యోతిష, సాహిత్యాది శాస్త్రాల్లో ప్రకాండ పండితులు. ప్రస్తుతం వీరు పశ్చిమ గోదావరి జిల్లా, ఏలూరు తాలూకా కొవ్వలిలో 'గీర్వాణవిద్యాపీఠాన్ని' నెలకొల్పి అక్కడనే నివసిస్తున్నారు. పూర్వ పరిచయాన్ని పురస్కరించుకొని శాంతమ్మ, ఘంటమ్మగారలు తమ సహోదరుని అభివృద్ధిని కాంక్షించి, కొవ్వలి శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారి సన్నిధికి పంపారు. అక్కడ ఆనాటి

విద్యార్థులలో ప్రధానులగు శ్రీ మొటపర్తి చినసోమయ్యాచౌదరి మున్నగు వారితో 'కాళిదాసత్రయము', 'తర్క-సంగ్రహము' 'వివేక చూడామణి' 'పంచదశి' మున్నగు గ్రంథాలు వివరణలతో పాఠము పూర్తిచేసి గృహోన్ముఖు లయ్యారు.

అనంతరము కూచిపూడి అగ్రహారంలో సుప్రతిష్ఠితులైన శ్రీ హరి వేంకటాచలపతిగారి ద్వితీయ పుత్రిక నిచ్చి వివాహం జరిపించి తోబుట్టువులైన శాంతమ్మ, ఘంటమ్మగారలు తమ బాధ్యతలు అరమరికలు లేకుండా నిర్వహించారు.

శ్రీ రామలింగశాస్త్రిగారు తమ విజ్ఞానాన్ని పెంపొందించు కొని స్థానిక దైవజ్ఞ చింతామణియైన శ్రీ పిల్లలమర్రి లక్ష్మీనరసింహ సిద్ధాంతిగారి సాన్నిధ్యంలో సిద్ధాంత, జ్యోతిష శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించారు. వారు తమను అర్థించిన విద్యార్థులకు ఉచితంగా నిరంతరం కావ్యపాఠము, సిద్ధాంత జ్యోతిషాలు అధ్యాపనం చేయటం ధ్యేయంగా చేసుకొన్నారు. వీరి శిష్యులలో శ్రీ సోమయాజుల పురుషోత్తమశాస్త్రి, శ్రీ పిశుపాటి వేంకటరత్న సిద్ధాంతి, శ్రీ పిల్లలమర్రి కనకసుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ భాగవతుల సీతారామస్వామి, శ్రీ చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రి, శ్రీ చింతా నాగేశ్వరశర్మ, శ్రీ జొన్నలగడ్డ వేంకటప్పయ్యశర్మ, శ్రీ చింతా వేంకటేశ్వరశర్మ, శ్రీ పసుమర్తి రామలింగేశ్వరశర్మ, శ్రీ పసుమర్తి వేంకటేశ్వర్లు, శ్రీ మంత్రాల నారాయణమూర్తి, శ్రీ సోమయాజుల సత్యనారాయణ మున్నగువార లెందరో గలరు. వీరిలో కొందరు పంచాంగ కర్తలుగా, ఉన్నత పాఠశాలలో ప్రధానాంధ్రాధ్యాపకులుగా, సంప్రదాయ పండితులుగా గురు పాదుల కీర్తి నినుమడింప చేస్తున్నారు. శ్రీ శాస్త్రిగారు కూచిపూడి నాట్యక్షేత్రానికి సంస్కృత విద్యాపీఠంగా వెలు గొందారు. ఇంతటి మహాపండితులు కూచిపూడి పరిసర ప్రాంతా లలో నేటివరకు అవతరించలేదనుట నిర్వివాదాంశ విషయము.

కాలానంతరంలో వీరి తోడబుట్టువు లిరువురు గతించారు. ప్రాజ్ఞుడై కీర్తి ప్రతిష్ఠలు పెంపొందించగలవాడై సంతానవంతుడైన ప్రథమ కుమారుడు శ్రీ సీతారామస్వామి పరమపదించాడు. ఈయన మరణించిన అచిరకాలంలోనే ప్రథమ కుమార్తె స్వర్గస్థురాలయింది. శ్రీ శాస్త్రిగారి ఆరోగ్యం శిథిలమైంది. కడకు ముగ్గురు కుమార్తెలను, ఇరువురు కుమారులను దుఃఖాబ్ధిలో ముంచి 1962 లో స్వర్గ మలంకరించారు.

శ్రీ రామలింగ శాస్త్రిగారు మహాకవి శ్రీ కాటూరి వేంకటేశ్వర రావుగారు నుడివినట్లు సాక్షాత్తు శారదా స్వరూపులు. వారి పాఠ ప్రవచన విధానము అనితరసాధ్యం. వారి వాక్చమత్కృతి నిరుపమానం. మృదుల మందస్మిత వదనారవిందులై ఎంతటి దుర్ఘట పరిస్థితినైనా ఎదుర్కొనగలిగిన ప్రజ్ఞావంతులు. స్థితప్రజ్ఞులు. వీరు యోగము లేని యోగి. సన్యసించిన గృహస్థు. కూచిపూడి నాట్యకళాసరస్వతికి ఈ శారదమూర్తి లేని లోటు ఏనాటికి తీరని, తీర్చలేని లోటుగానే మిగిలి పోయింది.

# భాగవతుల వారి శాఖ - 2

రామలింగం

లక్ష్మీనారాయణ

రామదాసు　　　　రామలింగం

వేంకటాచలపతి　లక్ష్మీనారాయణ　　సీతారామయ్య　ఆంజనేయులు　వేంకటాచలపతి

శ్రీరామశర్మ

సీతారామయ్య　హనుమంతరావు　మాణిక్యశర్మ　శ్రీరామశర్మ　దుర్గానాగేశ్వరశర్మ

రామేశ్వరరావు　హనుమంతరావు

లక్ష్మీనారాయణశాస్త్రి　రామదాసు　సీతాపతి

## భాగవతులవారు - రెండవ శాఖ

ఈ శాఖలో మరియొక రామలింగంగారు ఆవిర్భవించారు. వీరికి ఏకపుత్ర విశేషం. వీరి నామధేయం లక్ష్మీనారాయణ. వీరి కుమారులు రామదాసు, రామలింగం అను వారలు. వీరుభయులు యక్షగానాది ప్రయోగాలలో బహుముఖప్రజ్ఞ కలవారు. విశ్వామిత్ర, నారద, నక్షత్రక పాత్రలు ధరించడంలో కడు సమర్థులు. వయఃపరిపాకం తగ్గడంతోనే ఆశ్రమ స్వీకారం చేసిన ధన్యులు.

రామదాసు : శ్రీ లక్ష్మీనారాయణగారి కుమారుడు రామదాసుగారు భామాకలాపం, యక్షగానాలు ప్రదర్శించడం లోను, సూత్రధారణలోను సుప్రసిద్ధులు. వీరు చక్కని రూప సంపద కలవారు. మధురమైనగాత్ర సౌకుమార్యము, లలితమైన అభినయ సౌలభ్యము కలవారు. వైశ్వోదేవం రామయ్యగారు రచించిన గొల్లకలాపానికి సందర్భోచితంగా పురుషసూక్త, ఉపనిష ద్వాక్యములను విపులంగా చేర్చి, వ్యాఖ్యానాన్ని కూర్చి గ్రథనం చేసిన ప్రజ్ఞావంతులు.

శ్రీ రామదాసుగారికి వేంకటాచలపతి, లక్ష్మీనారాయణ అను ఇరువురు కుమారులు కలిగారు. శ్రీ వేంకటాచలపతిగారు వ్యవహారదక్షులు. వాక్చాతుర్యం గలవారు. వీరికి రెండు వివాహాలు జరిగాయి. ప్రథమ భార్య ముగ్గురు పుత్రికలను ప్రసవించి మగసంతతి లేకుండగనే స్వర్గస్థురాలయింది. రెండవ భార్యకు శ్రీ కామేశ్వర రావు, శ్రీ హనుమంతరావు అను పుత్రులిరువురు జన్మించారు. వీరు పుత్ర పుత్రికా విలసితులు. వీరికి సంప్రదాయ ప్రయోగాలలో ప్రవేశం లేదు.

శ్రీ రామదాసుగారి ద్వితీయ పుత్రులు శ్రీ లక్ష్మీనారాయణ గారు ఋషివేషధారణలో అమోఘమైన ప్రజ్ఞ గలవారు. వీరి అనంతరం కూచిపూడి సంప్రదాయంలో ఋషివేషధారులకు

కొరత యేర్పడింది. వీరికి సీతారామయ్య, హనుమంతరావు నుఅ ఇరువురు కుమారులు. వీరిలో సీతారామయ్యగారు సంతాన వంతుడు గాకుండగనే పరలోకగతు లయ్యారు. శ్రీ హనుమంతరావు గారు పుత్ర పుత్రికా సంతానవంతులై హోమియోపతి వైద్యవృత్తి నవలంబించారు. వీరి సంతానం ఉన్నతోద్యోగాలలో కుదురు కున్నారు.

రామలింగం : వీరు లక్ష్మీనారాయణగారి ద్వితీయ పుత్రులు, "చిన్నయ్య" అనేవారు. సంప్రదాయ నాట్యంలోను, భామా గొల్లకలాపాదులలో మంచి నేర్పుగలవారు. మంచి రసికులు. వీరికి సీతారామయ్య, ఆంజనేయులు, వేంకటాచలపతి అను మువ్వురు పుత్రులు కలిగారు. వీరిలో వేంకటాచలపతిగారికి మాత్రం పుత్ర సంతానంలేదు. ఈ సోదరత్రయానికి కూచిపూడి సంప్రదాయ ప్రదర్శనలలో ప్రవేశంలేదు.

# భాగవతులవారు - మూడవ శాఖ

శ్రీ లక్ష్మీనారాయణగారు భాగవతుల వారిలో మూడవ శాఖకు చెందినవారు. ఈయనకు కుటుంబశాస్త్రి, బ్రహ్మానందం అను ఇరువురు కుమారులు.

శ్రీ కుటుంబశాస్త్రిగారు భామాకలాప, గొల్లకలాప, యక్ష గానాలలో ప్రఖ్యాతి గడించి ఆరోగ్యం సరిలేనందున ప్రదర్శనలలో పాల్గొనటం మానివేశారు. వీరి మగ సంతానం రామతారకం, లక్ష్మీనారాయణ ............... అనువారు కలరు. శ్రీరామ తారకం సమర్థుడైన నాట్యాచార్యుడు. ఈయన గుడివాడ, విజయవాడ, తెనాలి మున్నగు నగరాలలో నాట్యప్రచారం చేస్తున్నారు. రెండవ కుమారుడు శ్రీ లక్ష్మీనారాయణ శ్రీ భాగవతుల పిచ్చయ్యగారికి దత్తత వెళ్లారు. ఈయనకు సంప్రదాయ విద్యలలో ప్రవేశంలేదు. మూడవ కుమారుడు సంగీతోపాధ్యాయునిగా రాణిస్తున్నారు.

శ్రీ బ్రహ్మానందంగారు ఉపాధ్యాయులుగా స్థిరపడి, తమ సంతానాన్ని కూడ లౌకిక వృత్తులలో చేర్చారు.

# భగవతుల వారు - శాఖ 4

యజ్ఞయ్య

| | |
|---|---|
| సుబ్బారావు | నరసింహం |

# భాగవతులవారు - నాల్గవ శాఖ

ఈ శాఖలో యజ్ఞయ్యగారు సుప్రతిష్ఠితులు. వీరికి సుబ్బారావు, నరసింహం అను కుమారులు ప్రభవించారు.

శ్రీ సుబ్బారావుగారు సమర్థులైన మార్దంగికులు. కూచిపూడి సంప్రదాయ ప్రదర్శనలకు వీరి మృదంగవాద్యం మరింత వన్నె తెచ్చేది. వీరి సంతతివారికి ఈ సంప్రదాయం అబ్బలేదు.

శ్రీ నరసింహంగారు భామవేషం, గొల్లవేషం మున్నగు ప్రదర్శనలలోను, యక్షగానాలను ప్రదర్శించడంలోను ఉపజ్ఞ కలవారు. విశ్వామిత్ర, హిరణ్యకశ్యప, బాణాసుర మున్నగు తామస పాత్రధారణలో ప్రత్యేకప్రావీణ్యం కలవారు. వీరి కుటుంబంలో ఈనాడు సంప్రదాయం లోపించింది.

# భాగవతులవారి - శాఖ 5



చలమయ్య
సీతారామయ్య
కరణం
కుటుంబశాస్త్రి
లక్ష్మీనారాయణ
వేంకటసుబ్బయ్య
రామకోటయ్య
రామకృష్ణశర్మ
కుటుంబశాస్త్రి
శేతురామ్

# భాగవతులవారు - అయిదవ శాఖ

శ్రీ చలమయ్యగారు ఈ శాఖలో లబ్ధ ప్రతిష్ఠులు. వీరికి నల్గురు కుమారులు జన్మించారు. పెద్ద కుమారుడు సీతారామయ్య. రెండు కుటుంబశాస్త్రి. మూడు లక్ష్మీనారాయణ. నాలుగు వేంకట సుబ్బయ్యగారలు.

శ్రీ సీతారామయ్యగారు గ్రామకరణంగా ఉద్యోగించి కీర్తి నార్జించారు. మిగిలిన వీరి సోదరత్రయం సంప్రదాయ ప్రదర్శన లలో ప్రవేశింపక సేద్యం ప్రధాన వృత్తిగా స్వీకరించి జీవయాత్ర సాగించారు.

శ్రీ సీతారామయ్యగారికి పుత్రసంతానం లేదు. శ్రీ కుటుంబ శాస్త్రిగారికి రామకోటయ్య, రామకృష్ణశర్మ అను నిరువురు కుమారులు కలిగారు. శ్రీ లక్ష్మీనారాయణ, శ్రీ వేంకట సుబ్బయ్య గారలు కూడ సంతానవంతులు. వారికి సంప్రదాయ విద్యలలో ప్రవేశం లేదు.



## భాగవతుల రామకోటయ్య

శ్రీ రామకోటయ్య కుటుంబశాస్త్రిగారి ప్రథమ పుత్రుడు. అసాధారణ మేధాసంపత్తిగలవాడు. వ్యక్తిత్వం, మూర్తిమత్వము కలవాడు. సర్వతంత్ర స్వతంత్రుడు. ఆదర్శవాది. నాట్య సంగీత మర్మజ్ఞుడు.

సంప్రదాయ భరతనాట్యంలోను, భామాకలాప, గొల్ల కలాపాదుల ప్రదర్శనలలోను సిద్ధహస్తులు. హైదరాబాదు నగరంలో నాట్యగురుకులాన్ని నెలకొల్పి, తమ కుటుంబ సభ్యులతో మిత్రుల సహకారంతో తాను కులపతియై నాట్యకళా సరస్వతి నారాధించి జన్మచరితార్థం చేసుకొన్న కళాతపస్వి.

నాట్యకళాప్రపూర్ణ, సుప్రసిద్ధ నాట్యాచార్యులు కీ. శే. వేదాంతం రాఘవయ్యగారి తృతీయ సహోదరి శ్రీమతి రామలక్ష్మి వీరి ధర్మపత్ని. ఈ దంపతులకు ఇరువురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు కలిగారు. పెద్ద కుమారుడు చి. కుటుంబశాస్త్రి. ఈయన కళాశాలలో ఉపన్యాసకునిగ ఉద్యోగం చేస్తున్నారు. రెండవ కుమారుడు చి. సేతురామ్. ఇతడు సంప్రదాయ నాట్యాచార్యుడు. పెద్ద కుమార్తె మహాలక్ష్మి సుందరి, రెండవ కుమార్తె ఇందిరాదేవి,

మూడవ కుమార్తె తోయిజ మంగళ. వీరి ముగ్గురకు వివాహములై సలక్షణముగ తమ కాపురములు సరిదిద్దుకుంటున్నారు.

శ్రీ రామకోటయ్య బాల్యంలో కీ. శే. భాగవతుల విస్సయ్యగారికడ గురుకుల సంప్రదాయ పద్ధతిలో భామాకలాపాన్ని అధ్యయనం చేశారు. అనంతరం కీ. శే. శ్రీ చింతా వేంకట రామయ్య గారి సన్నిధిని భరతనాట్యాన్ని, శ్రీ యేలేశ్వరపు సీతా రామాంజనేయులుగారి చరణ సన్నిధిని సంగీతశాస్త్రాన్ని అభ్య సించారు. శ్రీ వేదాంతం వేంకటేశ్వరశాస్త్రిగారు వీరి సంగీతానికి మెరుగులు దిద్దారు. శ్రీ వేదాంతం సాంబశివశాస్త్రి ఈయనకు సహపాఠి, జీవికాజీవి.

శ్రీ రామకోటయ్యను శ్రీ శాంతిదేవ్ ఘోష్ మహోదయులు శాంతినికేతనమునకు వచ్చి భామాకలాప ప్రదర్శన మీయ వలసినదిగా అభ్యర్థించారు. క్రీ. శ. 1955 లో వీరి ప్రజ్ఞా ప్రాభవాలు గుర్తించిన పెదముక్తేవి వాస్తవ్యులు, శాంతినికేతన విద్యార్థులు, రసహృదయులు శ్రీ నర్రా వేంకటరత్నంగారు హైదరాబాదు నగరానికి ఆహ్వానించారు. వీరి అధిపత్యంలో నాట్యకళాక్షేత్రం స్థాపించాలని అభిలషించారు. ఆదిలో కూచిపూడి అగ్రహారంలో సిద్ధేంద్రకళాక్షేత్రానికి నాందీవాచకం పలికిన ఘనత శ్రీ రామకోటయ్యగారికే దక్కింది. కాని స్వార్థ పూరిత వాతావరణంలో ఈ విషయం మరుగు పడింది.

శ్రీ నర్రా వేంకటరత్నంగారి అభిమతం 1960 లో నెరవేరింది. కూచిపూడి నాట్య గురుకులం అవతరించింది. దానికి శ్రీ రామకోటయ్యగారు కులపతి. శ్రీ వేదాంతం సాంబశివశాస్త్రి సంగీత దర్శకులు. శ్రీ భాగవతుల లక్ష్మీనరసింహం మార్దంగికులుగా సహకరించారు. ఈ గురుకులానికి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారి గుర్తింపు లభించింది. నృత్య నాటికలు, యక్ష గానాలు, కలాపాలు, అష్టపదులు, తరంగాలు మున్నగునవి అన్నీ

కూచిపూడి నాట్య సంప్రదాయ పద్ధతిలో బోధింప బడతాయి. సశాస్త్రీయంగా, సులక్షణంగా శిక్షణ ఇవ్వబడుతుంది.

శ్రీ రామకోటయ్య తమకు పరంపరాగతంగా లభించిన పవిత్రమైన నాట్యకళను కేవలం పొట్టకూటి విద్యగా భావింపక నిర్దిష్టమైన, ప్రత్యేకమైన లక్ష్యంతో ప్రచారం చేస్తున్న మహాత్వా కాంక్షి.

సంప్రదాయ పద్ధతిలో కొందరు నవీన నాట్యాచార్యులు కొన్ని మార్పులు, చేర్పులు, కూర్పులు సంప్రదాయ విరుద్ధంగా సమకూర్చి ప్రదర్శించడాన్ని విమర్శిస్తూ, గ్రంథస్థములు కాక కంఠస్థములై ప్రచారమందున్న ప్రాచీన సంప్రదాయ పద్ధతులైన పగటివేషాలు, కలాపాలు, కీర్తనలను " నాట్యకళ " అను మాస పత్రిక ద్వారా ప్రజల కందిస్తూ కళాభిమానులకు, కళావేత్తలకు కుహనా నాట్యాచార్య వృత్తాంతాల నెరుకపరుస్తూ, కొంతమంది ప్రముఖ నాట్యాచార్యమ్మన్యులకు కంటగింపవుతూ, వాటిని లక్ష్య పెట్టక, అవకాశాలకు, అవసరాలకు ఒకరిని ఆశ్రయింపక గురువుల ఆశీర్వచనబలం, స్వయంప్రతిభ ఆధారంగా అభ్యుదయ పథంలో పయనిస్తున్న నవనాట్య సింహకిశోరం శ్రీ భాగవతుల రామ కోటయ్య. ప్రస్తుత నివాసం హైదరాబాదు.

రామకృష్ణశర్మ : ఈయన కుటుంబశాస్త్రిగారి ద్వితీయ పుత్రుడు. సాంఘిక నాటకాలలో పాత్రధారణ చేస్తూ వుండేవారు. ప్రస్తుతం చిత్రకళలో నైపుణ్యాం సంపాదించి ఛాయాచిత్ర గ్రహణ కళలో సమర్థు లయ్యారు. కూచిపూడి నాట్యకళాకారుల ఛాయా చిత్రాలన్నిటిని సేకరించిన కళాహృదయుడు, కళాభిమాని, సరసుడు, సహృదయుడు, స్నేహశీలి.

# భాగవతుల వారి - శాఖ 6

రామయ్య - బాలెంత

|

విస్సయ్య

| | | |
|---|---|---|---|
| సీతారామయ్య | రామయ్య | పూర్ణచంద్రరావు | మురళీకృష్ణ |
| కన్నయ్యశర్మ | | | |

# భాగవతులవారు-ఆరవ శాఖ

ఈ శాఖలో రామయ్యగారు సువిఖ్యాతులు. వీరు వెంపటి వేంకట నారాయణగారికి సమకాలికులు. కూచిపూడి అగ్రహారంలో వున్న రామయ్యగారలలో ఈయన బాలెంత రామయ్యగా ప్రసిద్ధిగాంచారు. బాలెంత వేషం కట్టడంలో వీరి ప్రతిభ ఆధారంగా ఈ పౌరుషనామ మేర్పడింది.

శ్రీ రామయ్యగారు బాలెంత వేషమేకాక భామ, దాదినమ్మ మొదలగు అతిక్లిష్టమైన వేషాలు ధరించి రక్తికట్టించడంలో నిపుణులు. వీరి ప్రదర్శనం రసభరితంగా ఉండేది. సమకాలీన నాట్యాచార్యులలో తాము ఒకరిగా పరిగణించబడినారు. వీరి ఏకైక కుమారులు విస్సయ్య.



## విస్సయ్యగారు

శ్రీ విస్సయ్యగారు కలాపాలు అభినయించడంలో అఖండ ప్రజ్ఞావంతులు. అంత పొడవు పొట్టి కాని, లావు సన్నము కాని చక్కని ఆకారం, భామ వేషం ధరించి నప్పుడు ఈయన నిజమైన స్త్రీగనే అభినయించేవారు. పురుషుడు అని అంటే ఎవ్వరూ విశ్వసించే వారు కాదు. వీరి వాచిక, అంగికాభినయాలు పాత్రోచితంగా, సహజంగా నప్పి వుండేవి

శ్రీ విస్సయ్యగారు నంగిగెడ్డ, ఘంటశాల మున్నగు గ్రామాలలో దేవదాసీలకు నాట్య, కలాపాదులు అధ్యాపనం చేస్తూ అసామాన్యమైన కీర్తి గడించారు. శ్రీ తాడేపల్లి పేరయ్యశాస్త్రి, శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి, శ్రీ చింతా వేంకటరామయ్యగారలు మున్నగు ప్రసిద్ధ భరతనాట్యాచార్యులకు సమకాలికులు. వీరి శిక్షణ కట్టుదిట్టంగా, సమర్థవంతంగా వుండేది. సుప్రసిద్ధ భరత నాట్య గురుకులపతిగా భాసిస్తున్న శ్రీ భాగవతుల రామకోటయ్య లాటి శిష్యకోటిని తయారుచేసిన శేముషీ ధురంధరులు. వీరి అస్తమయముతో కూచిపూడి సంప్రదాయంలో దాదినమ్మ వేషం అస్తమించింది. అంతటి ప్రతిభా సంపత్తి గలవారు ఎప్పుడు జన్మిస్తారా అని కళాపిపాసువులు కాలానికి ఎదురు చూస్తున్నారు. వీరి సంతానంలో కూడ అంతటివారు ప్రభవింపలేదు.

భాగవతుల వారి - శాఖ 7

కోటయ్య

|

సూర్యనారాయణ

| | |
|---|---|---|
| రామను - రి | కృష్ణను - రి | పూర్ణచంద్రరావు |

# భాగవతుల వారు - ఏడవ శాఖ

ఈ శాఖలో ప్రాచీనులు శ్రీ కోటయ్యగారు. ఈయన కుమారులు సూర్యనారాయణగారు. వీరికి రామమూర్తి, కృష్ణమూర్తి, పూర్ణచంద్రరావు అను ముగ్వురు కుమారులు కలిగారు. వీరి కెవ్వరికి కూచిపూడి సంప్రదాయక నాట్యకళాపాదులలో ప్రవేశంలేదు. శ్రీరామమూర్తి, శ్రీ పూర్ణచంద్రరావులు మాత్రం ఉన్నత విద్యాభ్యాసం చేసి ఉన్నతోద్యోగాలు నిర్వహిస్తున్నారు. శ్రీ పూర్ణచంద్రరావుగారు విదేశాలు కూడ పర్యటించి వచ్చిన ప్రతిభాశాలురు.

భాగవతులవారు - ఎనిమిదవ శాఖ: ఈ శాఖలో శ్రీ వేంకట సుబ్బయ్యగారు ప్రాచీనులు. వీరి కుమారులు కన్నయ్య. వీరి కుటుంబాన్ని గురించి వివరంగా తెలియబడుటలేదు.

శ్రీ కుమారస్వామి : శ్రీ కుమారస్వామిగారు భాగవతుల వారు. కాని వీరి కార్యక్షేత్రం, నివాసం తెలంగాణా ప్రాంత మగుటవలన కూచిపూడిలో వీరిని గురించిన సమాచార మెవ్వరూ ఇవ్వలేకపోయారు. వీరికి పుత్రసంతానం లేదు.

వీరిది సుందరమైన ఆకారం. ఆప్యాయంగా, మధురంగా భాషించేవారు. ముప్పది రెండు పగటివేషాలు ధరించి రసవంతంగా ఒప్పించగల ప్రతిభావంతులు. ఉరుదు భాషలో మంచి పాండితీ పటిమ కలవారు. పఠానువేషం వేసి ఉర్దూ మాట్లాడుతూ, ఖురాను లోని ఆయితాలు చదువుతూ వుంటే ముసల్మాన్ ముల్లాలు సైతం సలాం చేసి మెచ్చుకొనేవారు.

సోమయాజులు వేషం ధరించి పంచాంగ శ్రవణం, జట, ఘన, పనసలు స్వరయుక్తంగా, శ్రావ్యంగా చదువుతూ వుంటే సంతతా భ్యాసపరులయిన వేదపండితులు సయితం ఆశ్చర్యచకితులయ్యే వారు. మృదంగ జతులను మధురంగా నోటితో పలికిస్తూ వుంటే యథార్థంగా మృదంగం వాయించినట్లుండేది. ఇంద్రజాల విద్యలో అమోఘమైన ప్రజ్ఞ కలవారు. వీరు బహుముఖప్రజ్ఞాధురీణులు. నిష్కపటి. బంధుప్రేమ, ఆప్యాయత గలవారు. ప్రఖ్యాత నాట్యా చార్యులు, గీతాచార్యులు శ్రీ వేదాంతం పార్వతీశంగారు వీరి జామాత.

భాగవతులవారి వంశాలలో కూచిపూడి నాట్య సంప్రదాయ రీతులలో ప్రసిద్ధులు, ప్రముఖులు అయిన వారిని గూర్చి నేను కన్నంత, విన్నంత, తెలిసినంత వ్రాశాను. వీరిలో మరికొందరు ప్రసిద్ధులు ఉన్న యెడల తెలియజేసిన మలిప్రతిలో సవరణ చేసి కొందువని సవినయముగా తెలియజేయుచున్నాను.

# చింతావారి వంశం

లక్ష్మీనరసింహము

- శివరామయ్య
  - వేంకటరత్నం
  - రామకృష్ణశాస్త్రి
    - భాస్కరశర్మ
  - వేంకటరామయ్య
    - ఆదినారాయణ
      - శివరామయ్య
        - రామేశ్వరశర్మ
        - రమానాథం
        - సత్యనారాయణ
    - రామకృష్ణశాస్త్రి
      - రామనాథం
    - వేంకటరత్నం
      - శ్రీరామశాస్త్రి
        - సీతారామాంజనేయులు
    - సీతారామాంజనేయులు
      - కృష్ణశాస్త్రి
        - రామనాథం
          - నారాయణశాస్త్రి
  - నారాయణశాస్త్రి

# చింతావారి వంశం

చింతావారి వంశంలో లక్ష్మీనరసింహంగారు ప్రధానులు. వీరికి శివరామయ్య అను ఒక్కరే కుమారులు. ఈ శివరామయ్య గారికి వేంకటరత్నం, రాధాకృష్ణమూర్తి, వేంకటరామయ్య, నారాయణమూర్తి అను నలుగురు పుత్రులు జన్మించారు.

శ్రీ వేంకటరత్నంగారు ప్రతిభాశాలి. భామా, గొల్ల కలాపాదులందేగాక శ్రీ హరి మాధవయ్యగారు సంపాదించి తెచ్చిన యక్షగానాలలో కూడా ప్రజ్ఞావంతు లయ్యారు. తమ సహోదరులను కూడ ఆ ప్రయోగాలలో అఖండ ప్రతిభావంతులుగా రూపొందించారు. కూచిపూడి భాగవతులలో చింతావారి కుటుంబానికి ప్రత్యేకత సమకూర్చారు. యక్షగానాలలో స్త్రీ పాత్రలు కడు సమర్థవంతంగా నిర్వహించేవారు. శ్రీ మాధవయ్యగారి అనంతరం తామే మేళానికి ఆధిపత్యం వహించి హరి వేంకటాచలపతిగారిని, సోదరుడు రాధాకృష్ణమూర్తిగారిని తమ వారసులుగా తయారు చేశారు. వీరికి సంతానంలేదు. శ్రీ రాధాకృష్ణమూర్తిగారికి భాస్కరశర్మ అను కుమారుడున్నాడు. కాని, వీరికి సంప్రదాయ ప్రదర్శనలలో ప్రవేశం లేదు.

శ్రీ శివరామయ్యగారి తృతీయ పుత్రుడు శ్రీ వేంకట రామయ్యగారు. వీరు బాల్యం నుండి కొంత వయస్సు వచ్చేవరకు చదువు సంధెల జోలికిగాని, సంప్రదాయ విద్యలపై పుఠుగాని వెళ్ళక తమ ఇచ్ఛవచ్చినరీతి సంచరించారు ఒకరు చెప్పిన మాట విను స్వభావం కాదు. వ్యవసాయమనినా, గొడ్లు గోద అనినా అత్యంత అభిమానముండేది. కాని ఏకసంథాగ్రాహి. గ్రామంలోగాని, తమ యింటివద్ద అగ్రజులు శ్రీ వేంకటరత్నంగారివద్దగాని సంప్రదాయ విద్యలలో శిక్షణ పొందేవారిని తరచు చూస్తూ వుండే వారు. అలా చూచిన దానిని, వినిన దానిని సుశిక్షితుల కంటె

మిన్నగా తాము పాడుతూ, ఆడుతూ అభినయించేవారు. ఈ విషయాన్ని తెలుసుకొన్న సహోదరుడు శ్రీ నారాయణమూర్తి గారు అగ్రజులైన శ్రీ వేంకటరత్నంగారికి తెలియజేశారు.

శ్రీ వేంకటరత్నంగారు అద్భుతమైన తెలివితేటలు గలవారు. వారు సహోదరుని బుజ్జగించి, లాలించి మెల్లమెల్లగా సంప్రదాయ ప్రదర్శనలలో నటించడం అలవాటు చేశారు. క్రమక్రమంగా ప్రయోగ వైదుష్యాన్ని గడించి సమర్థులైన నాట్యాచార్యులుగా శ్రీ వేంకటరత్నంగారి అనంతరం మేళా నాయకునిగా వ్యవహరించారు.

శ్రీ చింతా వేంకటరామయ్యగారి కాలం 1860-1947. వీరు నాలుగు దశాబ్దాలపాటు ఆడి, పాడి అనేక సంస్థానాలలో, అనేక దర్బారులలో అఖండ ఖ్యాతి గడించారు. 'యక్షగాన పితామహ'గా పేరుపొందారు. తమ పుత్రులను సానలు దీరిన జాతిరత్నాలుగా తీర్చి దిద్దారు. ఎంతోమంది శిష్యకోటిని దేశాని కందించారు. ఈనాటి కూచిపూడి నాట్యాచార్యులలో వీరి కడ శిక్షణ పొందనివారు లేరు.

వీరికి శివరామయ్య, రామనాథం, శ్రీరామమూర్తి, కృష్ణమూర్తి అను నలుగురు కుమారు లున్నారు. పెద్దవారయిన శివరామయ్యగారు కర్మిష్ఠి. సంప్రదాయ ప్రదర్శనలలో వేషధారణ చేసేవారు కాదు. శ్రీరామనాథం అద్భుతంగా నటించేవాడు. కాని చిన్నతనంలోనే పరమపదించాడు. శ్రీరామమూర్తిగారు తండ్రిగారికి చేదోడు వాదోడుగా వుంటూ ప్రదర్శనలలో వేషధారణ, నట్టువాంగం కూడ చేస్తూ వుండేవారు. కడగొట్టు కుమారులు జ్యేష్ఠ పుత్రులు శ్రీ శివరామయ్యగారు సేద్యపు పనులు చూచుకుంటూ వుండేవారు.

శ్రీ వేంకటరామయ్యగారు ప్రదర్శన లుంటే వెళ్లడం లేకపోతే ఇంటివద్ద విద్యార్థులకు శిక్షణ ఇస్తూ వుండేవారు. ఒక చిన్న కొయ్య ముందు వుంచుకొని ఒక చిన్నకర్రతో తాళం చూపుతూ

తాను జతులు పలుకుతూ, విద్యార్థులచే పలికించుతూ, అడుగులు, హస్తముద్రలు, భ్రూ నేత్ర గ్రీవాది అంగాభినయాలు చేయిస్తూ, విధి విరామ మెరుగకుండా గరిడీలు నడుపుతూ వుండేవారు. కూచిపూడి నాట్యాచార్యత్రయంలో వీరూ ఒకరుగా ప్రసిద్ధి పొందారు. వీరి శిష్యకోటిలో చాలామంది భరతకళాప్రపూర్ణులు, కళాప్రపూర్ణులు, పద్మశ్రీలు అయినారు. ఇది వీరి కీర్తి ప్రతిష్ఠలకు కీర్తిపతాక.



శ్రీ చింతా కృష్ణమూర్తి

శ్రీ వేంకటరామయ్యగారి మరణంతో కూచిపూడి నాట్య కళాక్షేత్రంలో నిరాశా, నిస్పృహలు వ్యాపించాయి. దిక్కు తోచని స్థితి ఏర్పడింది. ఈ తరుణంలో శ్రీ కృష్ణమూర్తిగారు రంగ ప్రవేశం చేశారు. వేంకటరామ నాట్యమండలిని స్థాపించారు. కాలానుగుణ్యంగా తమ ప్రదర్శనలకు రూపకల్పనలు చేశారు. శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ స్త్రీ పాత్రధారిగా చక్కని శిక్షణ నిచ్చి తీర్చిదిద్దారు. యావద్భారత దేశం శ్రీ బందా కనక లింగేశ్వరరావుగారు సహకరించగా పర్యటన చేశారు. కూచిపూడి నాట్యం అశాస్త్రీయమని వచ్చిన వాదును తుడిచిపెట్టి సశాస్త్రీయ మని, సప్రయోగంగా నిరూపించారు. ఢిల్లీ, జైపూరు, హైదరాబాదు మున్నగు ప్రధాన నగరాలలో ప్రదర్శన లిచ్చారు. ఆనాటి రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాదు లాటి ప్రముఖుల ప్రశంసలకు పాత్రు లయ్యారు. రాష్ట్ర సంగీత నాటక అకాడమీ,

హైదరాబాదువారి "భరతకళాప్రపూర్ణ" బిరుదు నందుకున్నారు. కేంద్ర అకాడమీవారి అవార్డుచే గౌరవింపబడినారు. గతంలో ఏ నాట్యాచార్యులు పొందని గౌరవ సత్కారాలు పొందారు. శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్ర స్థాపనకు ప్రధానకారకులై తదనుబంధంగా నాట్యకళాశాలకు అధ్యక్షులుగా వ్యవహరించారు. తమ ప్రదర్శనలకు ఆకాశవాణిలో ప్రసార సౌభాగ్యాన్ని కలుగజేశారు. అన్నివిధాల కూచిపూడి నాట్యకళను అత్యున్నతస్థితికి తీసుకెళ్లారు.

శ్రీ కృష్ణమూర్తిగారి సూత్రధారిత్వం ప్రత్యేక విశిష్టత గలది. ప్రదర్శనం రక్తికట్టడానికి పాత్రధారుల ప్రతిభకంటె వీరి సంధివచన వక్తృత్వ నైపుణ్యం, సమయోచిత మధుర హాస్యం, ప్రజా హృదయాలను అలరించేవి. శ్రీ బందావారి కూచిపూడి కళాభిమానం, శ్రీ కృష్ణమూర్తిగారి కళావైదుష్యం రెండూ ఏకమై కూచిపూడి నాట్యానికి ఖండాంతర ప్రశస్తి సమకూర్చాయి. వీ రుభయులు పరలోకగతులవడంతో నాట్యకళాక్షేత్రానికి తీరని లోటు ఏర్పడింది.



## శ్రీ చింతా రామనాథం

శ్రీ కృష్ణమూర్తిగారి కుమారుడు చిరంజీవి రామనాథం తెలుగు ప్రధానభాషగా ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి ఎం. ఎ. లో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. అనంతరం ఆచార్య శ్రీ. ఎస్. వి. జోగారావుగారి ఆధ్వర్యంలో "కూచిపూడి యక్షగాన సంప్రదాయం" అను విషయం ఆధారంగా పరిశోధన చేసి "డాక్టరేటు" బిరుదపట్టగ్రహీత లయ్యారు. ప్రస్తుతం శ్రీ చినసత్యంగారి కూచిపూడి ఆర్ట్సు అకాడమీ, హైదరబాదు శాఖలో పనిచేస్తున్నారు.

శ్రీ శివరామయ్యగారి మూడవ కుమారులు శ్రీ నారాయణ మూర్తిగారికి రెండు వివాహాలు జరిగినాయి. మొదటి వివాహానికి శ్రీ ఆదినారాయణ అను కుమారుడు జన్మించారు. అనంతరం ఆమె పరలోకగతురాలైంది. తిరిగి వివాహం చేసుకున్నారు. ఈ సంబంధానికి రాధాకృష్ణమూర్తి, వేంకటేశ్వర్లు, వేంకటరత్నం, సీతారామాంజనేయులు అను నలుగురు కుమారులు జన్మించారు. శ్రీ ఆదినారాయణగారికి సంతానం లేనందున సోదరుడు శ్రీ రాధాకృష్ణమూర్తిగారి కుమారుడు చిరంజీవి శ్రీమన్నారాయణను దత్తత చేసుకొన్నారు.

శ్రీ ఆదినారాయణగారు బాల్యంలో ప్రహ్లాద, లోహిత మున్నగు వేషాలు కట్టేవారు. వీరి వేషధారణ అభినయమే గాక వాచికంకూడ సుస్పష్టంగా, భావస్ఫోరకంగా వుండేది. అటుతరువాత వశిష్ఠ మున్నగు ఋషి వేషాలు ధరించేవారు. ప్రహ్లాద యక్ష గానంలో చండామార్కులు, హాములుకాని వేషం ప్రత్యేకంగా పేర్కొనదగినవి. ఉద్యోగ విజయాలలో విదురుడుగా, ధృతరాష్ట్రునిగా వేషధారణచేసి ప్రజల మన్నన లందుకొన్నారు. కరండక పాత్రధారణ ఆ వాచికాభినయం అనితరసాధ్యం.

వీరు పాత్ర స్వభావాన్ని, వాచక స్వారస్యాన్ని అవగతం చేసుకొని తల్లీనులై ప్రదర్శించేవారు. వయోవృద్ధు లయ్యేవరకు పాత్రధారణ, కళాసేవ మానుకోలేదు. ఈయన బంధుప్రియుడు. నిష్కపట హృదయుడు.



శ్రీ చింతా రాధాకృష్ణమూర్తి

శ్రీ రాధాకృష్ణమూర్తిగారు శాస్త్రబద్ధంగా నాట్య సంగీతాలు అభ్యసించేవారు. చాలా కాలంగా చింతావారి మేళం లోను, మహంకాళివారి మేళంలోను స్త్రీ పాత్రధారణ, పతివ్రతల పాత్రధారణ చేసేవారు. నాట్య, యక్ష గాన మేళాలు చీలిపోయి, ప్రఖ్యాత నాట్యాచార్యులు చలనచిత్రరంగప్రవేశం చేయడంతో కూచిపూడి భాగవతులు కిరాయి నటకు లయ్యారు. ఈవిధమగు హైన్య జీవితానికి ఇచ్చగింపని శ్రీ రాధాకృష్ణమూర్తిగారు నాట్యాచార్యులై తెనాలి, గుంటూరు మున్నగు నగరాలలో నాట్య పాఠాలు చెప్పుకుంటూ, సంప్రదాయ నాట్యప్రచారం చేస్తూ, సుఖమయ జీవితం గౌరవంగా గడుపుకుంటున్నారు.



శ్రీ దర్భా వెంకటేశ్వర్లు

రెండవ కుమారులైన శ్రీ వెంకటేశ్వర్లుగారు, తమ పెద తండ్రిగారయిన శ్రీ దర్భా గోపాలంగారికి దత్తత వెళ్లారు. వీరు సంప్రదాయసిద్ధంగా సంగీత, నాట్యశాస్త్రాలు అభ్యసించారు భామాకలాపంలో మందయానగాను, హరిశ్చంద్ర యక్షగానంలో నక్షత్రకునిగాను వీరి నటన అనన్యసామాన్యమైనది. చాలా కాలంగా చింతావారి మేళంలోను, మహంకాళివారి మేళంలోను పాత్రధారులుగాను, వ్యవస్థాపకులుగాను వ్యవహరించారు. శ్రీ వెంకట్రామ నాట్య మండలిలో కూడా పనిచేశారు. అనిరుద్ధ, విప్రనారాయణ మున్నగు పాత్రలు సమర్థవంతంగా యీనాటికీ శ్రీ వేదాంతం సత్యనారాయణగారి జట్టులో నటిస్తున్నారు. వీరి ఆంగిక వాచికాభినయాలు ఆహార్య నాట్యశాస్త్ర సమ్మతంగా వుంటాయి.

శ్రీ నారాయణమూర్తిగారి సవతి కుమారులలో మూడవ వారైన శ్రీ వేంకటరత్నంగారికి సంప్రదాయ విద్యలలో విషయ వైశారద్యం వున్నా వేషధారణా సౌకుమార్యం ఉండేది కాదు. ఈ విషయాన్ని గమనించిన వీరు బస్సు కండక్టరుగా ప్రవేశించి ఈ వ్యవస్థ జాతీయం కావడంతో ఉద్యోగాభివృద్ధి పొంది పదవీ విరమణచేసి ప్రస్తుతం మచిలీపట్నంలో వుంటున్నారు.

నాల్గవ కుమారు లయిన శ్రీ సీతారామాంజనేయులుగారు కూడ కట్టుదిట్టంగా సంప్రదాయ విద్యలను అభ్యసించారు. భామగా, ఉషాసుందరిగా పేరు గడించారు. కాలాంతరంలో మేళ వ్యవస్థ నశించడంతో గుడివాడ పట్టణంలో చాలాకాలం నాట్యాచార్యులుగా జీవితం గడిపారు. వీరు సరసులు. స్నేహశీలి. బంధుప్రేమ కలవారు. ప్రస్తుతం నాగార్జునసాగరువద్ద నాట్య విద్యార్థులను తయారు చేస్తున్న, కళాసేవ చేస్తున్న నిష్కళంక కళారాధకులు.

# కూచిపూడి నాటక పితామహులు-చింతా వేంకటరామయ్య

ఈ వ్యాసమునకు తగిన సామగ్రిని రచయిత శ్రీ పి. వేంకటేశ్వరరావుగారికి కూచిపూడి నృత్య గురు కులపతి శ్రీ భాగవతుల రామకోటయ్య, హైదరాబాదువారు, 'భరతకళా ప్రపూర్ణ' శ్రీ చింతా కృష్ణమూర్తిగారు అందించిరి. వాని నాధారముగా చేసికొని 'నాట్యకళ' విశేష సంచిక 1967-'68 లో ప్రచురితమైనది.

స్వర్గీయ చింతా వేంకట రామయ్యగారు కూచిపూడి నాటకపితామహులు. నాట్యకళాప్రపూర్ణులు. 1860-వ సంవత్సరములో జన్మించారు. తల్లిదండ్రులు అరుంధతమ్మ, శివ రామయ్యగారలు. సోదరు లందరు ప్రఖ్యాత కళావతంసులు కావడం వల్ల శ్రీ వేంకట రామయ్యగారికి బాల్యంలోనే నాట్యం అబ్బింది. అన్నగారయిన రత్తయ్యగారి శిక్షణలో ఎనిమిదవయేటనే రంగ స్థలం ప్రవేశించగలిగిన అభినివేశాన్ని పొందగలిగారు. ఆక తాయిగా కాలం గడుపుతున్న రోజులలోనే భామ, గొల్లభామ, ఎరుకలసాని మొదలైన పాత్రలు ధరించి ప్రజాభిమానం సంపాదించుకొన్నారు. అన్నగారు సూత్రధారిగా వ్యవహరించిన అనేక ప్రదర్శనలను దీక్షతో గమనిస్తూ సూత్రధారిత్వంలోని మెలకువలను అవగాహనం చేసుకున్నారు. పదహారవ సంవత్సరం వచ్చేసరికి నాట్యంలోనేగాక, నాటక నిర్వహణలోకూడ తగిన సామర్థ్యాన్ని సంపాదించుకున్నారు. శ్రుత పాండిత్యంతో చిన్నప్పుడు భామ వేషపు దరువులు పాడుతూ వుంటే విని తమ సంఘంలో చేర్చుకొని కొంత కాలంపాటు వెంట త్రిప్పిన శ్రీ యేలేశ్వరపు నారాయణప్పగారి శిక్షణానుభవం కూడా ఇందుకు తోడ్పడింది. అన్నగారైన రత్తయ్యగారు నారద పాత్రాభినయంలో అంతటివాడు మరొకడు లేడనిపించుకొన్నారు.

సోదరుడు నారాయణమూర్తి స్త్రీ పాత్రలు ధరించడంలో అద్వితీయుడు. మేనల్లుడు హరిచలపతి విశ్వామిత్ర, బాణాసుర, హిరణ్యకశ్యప మొదలైన పాత్రలను ధరించడంలో మేటి. వీరందరి సహాయ సహకారాలతో అంతకుముందు అన్నగారి నిర్వహణలో ఉన్న నాట్యమండలి నాయకత్వం బాధ్యత స్వీకరించారు.

శ్రీ వేంకట రామయ్యగారు 1875 నుండి 1936 వరకు నాట్య మండలి నాయకత్వం నిర్వహించారు. ఈ కాలంలో కూచిపూడి కీర్తి ప్రతిష్ఠలు ఇనుమడింప చేయడమే కాక అత్యంత సమర్థులైన శిష్యులను శ్రీ వేంకట రామయ్యగారు తయారుచేయ గలిగారు. ఆ కాలంలో వారు గడించిన సువర్ణపతాకాలకు, పొందిన సన్మానాలకు లెక్కలేదు. సరైన ప్రయాణ సౌకర్యం లేని రోజులలో ఆయన కచ్చుటపు పెద్దతో సామానులమ వెంట తీసుకొని ఆంధ్రదేశమంతటా పర్యటనలు చేసిన ఆయన దీక్ష, ఓపిక, ఈనాటి కూచిపూడి కళౌన్నత్యానికి ఎంతగానో దోహదం చేసింది. మొదట్లో 'భాగవత' మనుపేర భామాకలాపమునే ప్రదర్శించిన శ్రీ వేంకట రామయ్యగారు క్రమేణా ప్రజాభిమతమును గమనించి కాలానుగుణముగా యక్షగానములను ప్రవేశపెట్టారు. ప్రహ్లాద, ఉషాపరిణయము, హరిశ్చంద్ర, శశిరేఖాపరిణయము మొదలైన నాటకాలను ప్రారంభించారు. శ్రీ వేంకట రామయ్యగారు సూత్రధారిత్వము ప్రారంభించిననాటినుండి నేటివరకు కూచిపూడిలో గజ్జెకట్టి ఆడనేర్చిన ప్రతి ఒక్కరు ఏదో ఒకవిధంగా శ్రీ వేంకట రామయ్యగారి శిష్యులే అని చెప్పవచ్చు. వారి శిష్యులలో పూర్వతరంవారిపేర్లివి: చింతా నారాయణమూర్తి, వెంపటి పరదేశి, వేదాంతం చలపతి, ఆదినారాయణ. ఈనాడు సినిమా రంగంలో సుప్రసిద్ధులుగా ఉన్న శ్రీ వేదాంతం-రాఘవయ్య, వెంపటి పెదసత్యం, పసుమర్తి కృష్ణమూర్తి, వేదాంతం పార్వతీశం, భాగవతుల రామకోటయ్య, వసుమర్తి వేణుగోపాలకృష్ణశర్మ,

వేము పూర్ణచంద్రరావు, ప్రభృతులు శ్రీ వేంకటరామయ్యగారి శిష్యులే. 'భరత కళాప్రపూర్ణ' బిరుదు నొందిన శ్రీ చింతా కృష్ణమూర్తిగారు శ్రీ వేంకట రామయ్యగారి పుత్రుడు.

శ్రీ వేంకటరామయ్యగారు శిష్యులకు విద్యను బోధించిన తీరు విశిష్టమైనది. ఫలానా సమయంలో బోధన చేస్తారన్న నియమంలేదు. ఏ సమయంలో శిక్షణ ఇవ్వదలుచుకుంటే ఆ సమయంలో శిక్షణ ఇస్తూండేవారు. ఏ క్షణంలో ఏ అడుగు, ఏ భావము, ఏ రీతి, ఏ భంగిమ స్ఫురణకు వస్తే ఆక్షణములో శిష్యులకు చెబుతుండేవారు. విద్యార్జనమే ఏకైక లక్ష్యంగా కలిగిన శిష్యులు కూడా నిరంతరం గురువును వెన్నంటి తిరుగుతుండేవారు. ఇది వీరి శిక్షణా పద్ధతి.

కళావైశిష్ట్యం: శ్రీ వేంకట రామయ్యగారి నాట్య విధానం విశిష్టమైనది. సంప్రదాయాలను పాటిస్తూనే సందర్భానుసారంగా ఏకపాత్రల నృత్యములను గూర్చి బాణీలను రూపొందించి వివిధ గతుల కూచిపూడి నాట్యములో యక్షగానాన్ని ప్రవేశ పెట్టడం ఆయన సాధించిన విశిష్టత. ఆ విధంగా ఆయన కూచిపూడి కళారంగంలో నూతన శకారంభులైనారు.

నాటకములోని కీర్తనలను శ్రీ వేంకట రామయ్యగారు రూపొందించిన బాణీలకు కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి.

ప్రతి పాత్ర నృత్యము చేసే విధానానికి అనువుగా శాస్త్రీయ సంగీతమునే వాడేవారు.

నృత్యపల్లవి: ప్రతి పాత్రకు ప్రవేశ దరువులోని చివరి చరణంలోని నాల్గవ పాద భాగమును నృత్యపల్లవి చేసి అందులో శబ్దమని పిలువబడే నృత్యరీతిని, మరికొన్ని జతులను కలిపి, చరణమును పూర్తిచేయడం మరొక ప్రత్యేకత.

జతి విధానం : రాజమందిర ఉత్సవ సందర్భాలలో ప్రదర్శించే ఏకపాత్రాభినయ నృత్య రీతులలో ప్రత్యేకత ఇది ఒక కీర్తనలో ఎన్ని చరణములుంటే అన్ని జతులను చేర్చి, లయభాగములోని ఐదు జాతుల వరుసలను, సందర్భానుసారంగా నడిపి చివర పల్లవి కల్పించి. చతురస్రములో త్రిశ్రము, త్రిశ్ర నడకలో చతురశ్ర మిళిత విధానములను సరిపరిచి నృత్య పోషణను బలపరచడం.

అందాలు : ప్రతిపాత్రకు ప్రవేశ దరువు కాగానే పద్య వచన లేక సంధి వచనమునకు ముందు నృత్యము, సూత్రధారి రాగాలాపన, జతపరచి, తానము కూర్చి అందాలను ప్రదర్శించడం శ్రీ వేంకట రామయ్యగారి సంప్రదాయం.

జ్యోతిర్నృత్యము : నాట్యయోగము : నటుడు శిరముపై కుంభము ధరించి నాట్యయోగమును అభ్యసించడం సంప్రదాయము. శిరముపై కలశము నిండా నీరు పోసి దానిపై ఒక జ్యోతిని ఉంచి, అరచేతులతో కూడిన ప్రమిదల నుంచుకొని ఘటముమీద, పళ్లెముమీద వివిధరీతులలో నృత్యంచేయడం శ్రీ వేంకటరామయ్య గారి సంప్రదాయము.

ఇలా కూచిపూడి నాటకాలలో నూతన సంప్రదాయాలను ప్రారంభించి కళోపాసనలో ధన్యజీవితం గడిపిన శ్రీ వేంకట రామయ్యగారు 1949-వ సంవత్సరం పుష్య శుద్ధ సప్తమినాడు దివంగతులైనారు.

(నాట్యకళ 1967-68 విశేష సంచిక)

# హరివారి వంశం

- (శ్రీ) రాఘులు
  - మాధవయ్య
  - వేంకటాచలపతి
    - మాధవయ్య
      - వేంకటాచలపతి
    - పున్నయ్య
      - వేంకటరత్నం
- రామనాథం
  - లక్ష్మీనారాయణ

# హరివారు

హరివారిది పూర్వం ఈపూరు. అవంతవరం ప్రాంతం. క్రీ. శ. 16-వ శతాబ్దిలో కూచిపూడి అగ్రహారానికి శ్రీరాములు, రామనాథం అనువారు వచ్చారు. వీరిరువురు సహోదరులు. శ్రీరాములుగారి భార్య శ్రీమతి పేరమ్మ. ఈ దంపతులకు మాధవయ్య, వేంకటాచలపతి అను నిరువురు కుమారులు జన్మించారు.

శ్రీ మాధవయ్యగారు ఆజన్మబ్రహ్మచారిగా జీవితం గడిపారు. వీరు భామా, గొల్లకలాపాలలో అనన్యసామాన్య ప్రతిభగల నాట్యకళావతంసులు. భాగవత మేళానికి నాయకత్వం వహించి దక్షిణ దేశమంతా సంచారం చేశారు. సూత్రధారిత్వంకూడ వీరే వహించి ప్రదర్శనాన్ని రసవంతంగా ప్రదర్శించేవారు.

వీరు తంజావూరు ప్రాంతానికి వెళ్లి అక్కడ తమ ప్రదర్శనల మూలమున ప్రతిష్ఠ నార్జించి, 'ఇచ్చి పుచ్చుకునే' పద్ధతిని తమ భామా, గొల్ల కలాపాలను వారికి నేర్పి, వారి నుండి 'యక్షగాన' సంప్రదాయాన్ని తెచ్చి కూచిపూడి భాగవతులకు ప్రసాదించిన మహామహితాత్ముడు. ఇంతకుపూర్వం కూచిపూడిలో ఈ సంప్రదాయం లేదు. దీనికి ఈయన పితామహుడు.

యక్షగాన ప్రబంధాలలో "ఉషాపరిణయం" రసవంతమైన మధుర శృంగార ప్రబంధం. ఈ ఉషాపరిణయాలు చాలా ఉన్నాయి. వాటిలో శ్రీ రెండుచింతల చిదంబరంగారు రచించినది అత్యంత రమణీయ ప్రబంధం. శ్రీ మాధవయ్యగారు తమ ప్రదర్శనలకు ఈ గ్రంథాన్ని ఎన్నుకొన్నారు. తమ సహోదరులు శ్రీ వేంకటాచలపతిగారికి, తమ పినతండ్రి శ్రీ రామనాథంగారికి ఈ ప్రక్రియలో చక్కని శిక్షణ నిచ్చారు. పరంపరాగతంగా తమకు వస్తున్న సూత్రధారిత్వానికి, శ్రీ పసుమర్తి వేంకట శివుడు

మున్నగు శాస్త్రవేత్తల ద్వారా మెరుగులు దిద్దారు. ఒక విధమైనవినూత్న పద్ధతిలో రసవంతంగా శ్రీ మాధవయ్యగారు సూత్రధారిత్వాన్ని నిర్వహిస్తూ ప్రదర్శనలు సాగించేవారు.

శ్రీ మాధవయ్యగారు రంగప్రవేశం చేయడంతో కూచిపూడి నృత్యప్రదర్శనలకు నూతన వికాసం, సంస్కారం సమకూరింది. వీరికి పూర్వం ఏక, ద్విపాత్రలతో కూడిన ప్రదర్శనలే యుండేవి. వీరి ఆధ్వర్యంలో బహుపాత్ర ప్రవేశయోగ్యము లయిన యక్ష గానాలు అవతరించాయి. ఈ ప్రదర్శనలకు ప్రజాదరణ లభించింది. దేవాలయ ఉత్సవాది కార్యక్రమాల సందర్భంగాను, సంపన్నుల గృహాలలో శుభకార్యాలను పురస్కరించుకొని ఈ ప్రదర్శనలు ప్రదర్శింపబడుతూ వుండేవి. ప్రజాభిమానం, అభిరుచి అభివృద్ధి కావడంతో మరికొన్ని యక్షగానాలను సమకూర్చుకొన్నారు. లవకుశ, ప్రహ్లాద మున్నగు యక్షగానాలను స్వీకరించారు. అభినయంలోను, ప్రదర్శనలలోను వైవిధ్యాన్ని సంతరించుకున్నారు. ఒక్క ప్రహ్లాద నాటకాన్ని మూడురాత్రులు ప్రదర్శించేటంత శక్తి సామర్థ్యాలు సాధించారు. రాజాస్థానాలలో, నవాబుల దర్బారులలో ప్రదర్శించి గౌరవ మర్యాద లందుకొన నారంభించారు. ఇంతటి గౌరవ ప్రతిష్ఠలకు శ్రీ మాధవయ్యగారే ప్రధాన కారకులు. వారి నిరంతరకృషి, పరిశోధనం, పండిత వ్యాసంగం ఈ సంస్కారానికి ఆధారం. వీరు రసిక శిఖామణులు. తరచు దక్షిణదేశం సంచారం చేస్తూ వుండేవారు. అక్కడ ప్రాదుర్భవించిన నూతన ప్రక్రియ లన్నిటిని కూచిపూడి సంప్రదాయ ప్రక్రియల కనుగుణంగా మలచుకొనడం మాధవయ్యగారి ప్రతిభా విశేషం.

**శ్రీ వేంకటాచలపతిగారు :** వీరిది ఆజానుబాహు విగ్రహం. ఎత్తునకు తగిన లావు, గంభీరమైన ధ్వని, చూపరులకు చూడ ముచ్చట గొల్పే సుందరమైన ముఖవర్చస్సుతో విరాజిల్లుతూ వుండేవారు.

శ్రీ చింతా వేంకటరత్నంగారి ఏకైక పుత్రిక శ్రీమతి లక్ష్మీదేవమ్మను వీరికిచ్చి వివాహం చేశారు. ఈ పుణ్యదంపతులకు లక్ష్మీనరసమ్మ, శ్రీరామమ్మ, అన్నపూర్ణమ్మ అను కుమార్తెలు, మాధవయ్య, పున్నయ్య అను కుమారులు ఉద్భవించారు.

శ్రీమతి లక్ష్మీనరసమ్మగారిని చింతా శివరామయ్యగారి చతుర్థ పుత్రుడు నారాయణమూర్తిగారికి, రెండవ కుమార్తె శ్రీరామమ్మను భాగవతుల రామలింగశాస్త్రిగారికి, మూడవ కుమార్తెను వేదాంతం రామయ్యగారికి యిచ్చి వివాహాలు జరిపించారు.

శ్రీ వేంకటాచలపతిగారి జ్యేష్ఠ పుత్రుడు. మాధవయ్యగారు చిన్నతనంలోనే పరలోకగతులయ్యారు. రెండవ కుమారులు శ్రీ పున్నయ్యగారు కొంతకాలం భాగవత, యక్షగానాలలో పాత్రధారణ చేశారు. కాని అంతగా రాణింపనందున ఆ వృత్తి విరమించి సేద్యం ప్రధానవృత్తిగా స్వీకరించారు.

శ్రీ పున్నయ్యగారికి వేంకటాచలపతి, వేంకటరత్నం అను కుమారులు; మాధవమ్మ, శ్రీరామమ్మ, మధుసూదన, అన్నపూర్ణ అను కుమార్తెలు జన్మించారు. మధుసూదన వివాహానంతరం మరణించింది. వీరి కుమారులెవ్వరు కూచిపూడి సంప్రదాయ ప్రయోగాలలో ప్రవేశింపలేదు. శ్రీ వేంకటాచలపతి రైల్వే డిపార్టుమెంటులో ఉద్యోగియై ప్రయోజకుడయ్యాడు. ఈనాడు వీరి వంశంలో నాట్యకళ అంతరించింది.

హరివారి వంశంలో శ్రీ శ్రీరాములుగారు మొదలు శ్రీ పున్నయ్యగారి వరకు అవిచ్ఛిన్నంగా అందరూ ఏదో ఒక అభినయ విషయంలో ప్రవీణులై ప్రఖ్యాతి వహించారు. శ్రీ శ్రీరాములుగారు నాట్యశాస్త్రంలోను, సూత్రధారిత్వంలోను అఖండ ప్రజ్ఞావంతులు. శ్రీ వేంకటాచలపతిగారు 'ఉషాపరిణయం' లో

బాణాసుర, 'ప్రహ్లాద'లో హిరణ్యకశ్యప, 'హరిశ్చంద్ర' లో విశ్వామిత్ర పాత్రలు ధరించేవారు.

శ్రీ వేంకటాచలపతిగారి హిరణ్యకశ్యపుని పాత్ర ప్రత్యేకంగా పేర్కొనదగినది. వీరి ఆహార్యం కూడ వేషానికి తగినట్లు అమరి వుండేది. ఆనాటివారు ఈయనను 'లంకరాజు', 'కలియుగ హిరణ్యకశ్యప' అని పౌరుష నామాలతో వ్యవహరించడం వారి పాత్ర ధారణ, అభినయాలలోని ఔచిత్యానికి తార్కాణం.

ఆనాడు ప్రహ్లాద ప్రదర్శనం సాధారణంగా మూడు రాత్రులు ప్రదర్శించేవారు. ఆ ప్రదర్శనంనాడు శ్రీ వేంకటాచలపతిగారు భుజించేవారు కారు. ప్రాతఃకాలం కాలకృత్యాలు నిర్వర్తించుకొని, స్నానసంధ్యాద్యనుష్ఠానాలు ముగించుకొని, పరాకాష్ఠతో శ్రీ లక్ష్మీనరసింహస్వామి జపం జపిస్తూ ఏకాంతంగా ఏకాగ్రతతో వుండేవారు. సంధ్యా సమయం కావడంతోనే పాత్ర ధారణకు ప్రేరణ లభించేది.

ఆనాటి ప్రదర్శనలకు ఈనాటి గాసులైట్లు, కరంటు దీపాలు లేవు. కాగడాలు, ఇలాయిబుడ్ల కాంతుల ముందు ప్రదర్శనలు జరిగేవి. శ్రీ వేంకటాచలపతిగారు ప్రదర్శించే అన్ని పాత్రలకంటే హిరణ్యకశ్యపపాత్ర అత్యంత భయోత్పాతంగా వుండేది. పాత్ర ప్రవేశానికి ముందు వీరి రెండు జబ్బలకు రెండు పగ్గాలు కట్టి వెనుక నుండి బలవంతులైన ఇరువురు సాహసికులు వెనుకకు లాగుతూ వుండేవారు. ఈ పాత్ర ధరించడంతోనే వీరిని ఉగ్రత ఆవహించేది ఈయన ముందుకు వురుకుతూ వుంటే, వెనుకవారు పగ్గాలతో లాగుతూ వుండేవారు. వీరి ముందు కనకతప్పెటలు పెద్దపెట్టున మ్రోగుతూ వుండేవి, వాటి ధ్వనులు ఛేదించుకొంటూ వీరి రణ క్రేంకారాలు, పెడబొబ్బలు, అట్టహాసాలు, వందిమాగధుల వీర స్తోత్రాలతో అది ఒక వీరరసమహాప్రవాహంగా తోచేది.

రంగప్రవేశానంతరం కాగడాలమీద గుప్పెడు గుగ్గిలం చల్లేవారు. సూత్రధారుడు "రాజు వెడలె సభకు" అని పాత్ర ప్రవేశాన్ని సూచిస్తూ బిరుదు వాచకాలు పఠిస్తూ వుంటే, తదనుగుణమైన భావాభినయాన్ని గంభీరంగా, ఉదాత్తంగా అభినయించేవారు. వీరి ఆంగికాభినయం (నేత్ర, గ్రీవ, హస్త, వాచికాభినయాలు) సహజంగా, ఠీవిగా, దర్పంగా వుండేవి. వీరి పాదాభినయం తదనుగుణంగానే వుండేది. వీరి రాజవేషాభినయ ప్రశస్తి రాష్ట్రమంతటా వ్యాప్తమయింది.

శ్రీ వేంకటాచలపతిగారు బల్లపై ఎక్కి పదాభినయం చేస్తూ, కుప్పించి ఎగిరి చిందులు వేస్తూ వుంటే ఆ బల్ల ముక్కలు చెక్కలు అవుతుందేమోననిపించేది. అభినయానికి అనుగుణంగా మృదంగ జతులను ఉద్ధృతంగా పలికిస్తూ వుంటే మృదంగాలు పగిలిపోయిన సంఘటనలు లేకపోలేదు. వీరి రణాత్కారాలకు, గద్దింపులకు పెద్దలు సైతం భయకంపితులయ్యేవారు. ఇక చిన్నపిల్లల సంగతి చెప్పవలసిన పనేముంటుంది? ఈ వేషం కూచిపూడి సంప్రదాయంలో ఈయనతోనే సరి.

లీలావతిగా శ్రీ వేదాంతం చలపతిగారు ఎంతో ప్రశాంతంగా సాత్వికాభినయాన్ని రసవంతంగా నెరపేవారు. శ్రీ రామనాథంగారి నారదపాత్ర, ప్రహ్లాద కుమారునిగ శ్రీ చింతా ఆదినారాయణ, శ్రీ వేంకటాచలపతిగారి హిరణ్యాకశ్యప పాత్రకు జీవం పోసేవారు.

ప్రహ్లాద కుమారుని హరిభక్తి నుండి మరలించడానికై తండ్రి, "ఓరి వినరా!" అనడం; కుమారుడు, "నేను వినను" అని ఎదురు పలకడం; తండ్రి అగ్రహోదగ్రుడై కుమారుని చురచుర చూచి, మాతృదేవీ కరుణా విలాపాలు కాలదన్ని కుమారుని విసరివేయడం, అతడు 'శ్రీహరీ' అని అల్లంతదూరాన పడటం తలుచుకుంటే ఈనాటి ఆ భయానకదృశ్యం హృదయంలో మెదులుతూనే వుంటుంది.

పాములవాని ఉపజ్ఞ, చండామార్కులవారి జన్మపత్రికా లేఖనం, విద్యాధ్యాపన సమయంలో విద్యార్థులపట్ల వారి బిరిపిలికలు, వారు ధరించే ఆహార్యం, ఆంగిక వాచికాభినయాలు మున్నగునవన్నీ సంభ్రమాశ్చర్య హాస్యాలతో తలమునకలు చేయిస్తాయి. ఆనాటి నటకుల అభినయ వాచికాలు, సూత్రధారుల సమయస్ఫూర్తి చిరస్మరణీయాలు.

హరిశ్చంద్ర నాటకంలోని వీరి విశ్వామిత్ర, వీరబాహు పాత్రలు సహజత్వాన్ని పుణికిపుచ్చుకున్నట్లుండేవి. వీరు, వీరి సహచరులు పాత్రధారలు విరమించుకోవడంతో ప్రహ్లాద, హరిశ్చంద్ర యక్షగానాలపట్ల ప్రజలకు అభిమానం తగ్గిపోయింది. ఇంతటి ప్రతిభావంతుడైన నటకావతంసుడు 18-వ శతాబ్ది చివరి భాగంలో స్వర్గమలంకరించారు.



శ్రీ హరి పున్నయ్య

శ్రీ పున్నయ్యగారు : ఈయన హరివారి వంశంలో కడగొట్టు నటశేఖరులు. తండ్రివలె రాజు వేషాలు ధరించి ప్రజాదరణ పొందాలనే అభిలాష ప్రబలంగా వుండేది. కాని ఆ వ్యక్తిత్వం, గాంభీర్యం, దర్పం, వాచికాభినయం వీరిలో కొరవడినాయి. అయినా కొన్ని ఛాయలు మాత్ర ముండేవి.

కాలం మారింది. ప్రజాభిరుచిలో పరిణామం వచ్చింది. నటులలో ప్రాభవం, ప్రతిభ తగ్గింది. ఒకవైపు రంగస్థల నాటకాలపై సమాదరం పెరిగింది. చలనచిత్ర పరిశ్రమ పెంపొందుతోంది. కూచిపూడి ప్రదర్శనలపట్ల నిరాదరణ పెరుగుతోంది. అయినప్పటికి నిరాశ, నిస్పృహలకు లోనుగాకుండా వంశపరంపరాగత వృత్తిని విడువలేక, నూతన వృత్తిని స్వీకరింపనూలేక, ఎదురవుతున్న కఠిన సమస్యలను చాకచక్యంతో పరిష్కరించుకొంటూ శ్రీ పున్నయ్య గారు వేషధారణ కొనసాగించారు. వీరు 1970లో తనువు చాలించారు.

శ్రీ రామనాధం : వీరు శ్రీరాములుగారికి సహోదరులు. వీరి పాత్రధారణ చూడముచ్చటగా వుండేది. గంభీరమైన గాత్రం,

యక్షగాన సంప్రదాయంలో నారదపాత్ర ధరించడంలో అనన్య సామాన్య ప్రజ్ఞావంతులు. వీరికి ఏకపుత్ర విశేషం. ఈయన పేరు లక్ష్మీనారాయణ. వీరు పగటివేషధారణలో సుప్రసిద్ధులు. ఇతరుల వాచికాన్ని పడికట్టినట్లు అనుకరించడంలో అగ్రగణ్యులు. వీరు సహజంగానే వత్తి వత్తి, ఆచి తూచి మాట్లాడుతూ వుండేవారు. వీరికి పుత్ర సంతాన భాగ్యంలేదు.

# పసుమర్తి వంశం

శేషయ్య

కొండలరాయడు

రాయలు　శేషయ్య　వేంకటాచలపతి*

అచ్చెమ్మ　సత్యనారాయణ　ఆంజనేయులు　కొండలరాయడు　రామకోటయ్య　ఆదినారాయణ　శ్రీరామమూర్తి

రామయ్య　సూర్యప్రకాశరావు　ఆంజనేయులు　సూర్యనారాయణ　సుందరరామయ్య

సీతారామాంజనేయులు　లక్ష్మీనారాయణ　శేషయ్య

వేంకటేశ్వర్లు　కృష్ణమూర్తి　హనుమంతరావు

వేంకటాచలపతి*　వేంకటాచలపతి*　వేంకటాచలపతి*

సత్యనారాయణ　ఆంజనేయులు　కొండలరాయడు

కృష్ణమూర్తి　సీతారామయ్య　సుబ్బారావు　వేంకటాచలపతి　వేంకటేశ్వర్లు　రామలింగేశ్వరశర్మ　పాండురంగవిఠల్　సత్యనారాయణ　సుబ్రహ్మణ్యం　సీతారామయ్య

రామకోటయ్య　ఆదినారాయణ

సత్యసుందరరామయ్య　శ్రీనివాస్　సీతారామాంజనేయులు　శ్రీరామచంద్రమూర్తి　లక్ష్మీనరసింహం　వేంకటమురళీకృష్ణ

# పసుమర్తివారి వంశం

పసుమర్తివారిలో నాలుగు కుటుంబాలవారున్నారు. వీరు 1. శేషయ్య, 2. వేంకట శివయ్య, 3. భగవంతం, 4. సుబ్బయ్య అను వారల కుటుంబాలు.

శ్రీ శేషయ్యగారి కుటుంబం : శ్రీ శేషయ్యగారికి కొండల రాయుడు అను ఒక్క కుమారుడు. ఈయనకు రాయలు, శేషయ్య, వేంకటాచలపతి అను ముగ్గురు పుత్రు లుదయించారు.

శ్రీ రాయలుగారికి అచ్చెమ్మ అను కుమార్తె ఒక్కతె మాత్రమే జన్మించింది.

శ్రీ శేషయ్యగారికి 1. రామయ్య, 2. సూర్యప్రకాశరావు, 3. ఆంజనేయులు, 4. సూర్యనారాయణ, 5. సుందరరామయ్య అను అయిదుగురు కుమారులు కలిగి కుటుంబం విస్తరించింది.

మూడవ కుమారు లయిన శ్రీ వేంకటాచలపతిగారికి 1. సత్యనారాయణ, 2. ఆంజనేయులు, 3. కొండలరాయుడు, 4. రామకోటయ్య, 5. ఆదినారాయణ, 6. శ్రీరామమూర్తి అను అయిదుగురు పుత్రు లుద్భవించారు.

శ్రీ శేషయ్యగారి ప్రథమ పుత్రులు శ్రీ రామయ్యగారు, శ్రీ చింతా వేంకటరామయ్యగారి ద్వితీయ పుత్రిక శ్రీమతి ఆదెమ్మ గారిని పరిణయ మాడారు. ఈ దంపతులకు శ్రీ వేంకటేశ్వర్లు, కృష్ణమూర్తి, హనుమంతరావు అను ముగ్గురు పుత్రు లుద్భవించారు.

శ్రీ సూర్యప్రకాశరావుగారు చిన్నతనంలోనే పరమ పదించారు.

శ్రీ ఆంజనేయులుగారికి పుత్రసంతానప్రాప్తి లేదు.

నాల్గవ కుమారు లయిన శ్రీ సూర్యనారాయణగారికి సీతా రామాంజనేయులు ... ... ... ... ... అను ఇరువురు పుత్రు లున్నారు.

శ్రీ సుందరరామయ్యగారికి లక్ష్మీనారాయణ, శేషయ్య అను ఇరువురు కుమారులు జన్మించారు.

శ్రీ శేషయ్యగారి మూడవ కుమారులయిన వేంకటాచలపతి గారి జ్యేష్ఠ కుమారులు శ్రీ సత్యనారాయణగారికి 1. కృష్ణమూర్తి, 2. సీతారామయ్య, 3. సుబ్బారావు, 4. వేంకటాచలపతి అను నల్గురు కుమారులు ప్రభవించారు.

ద్వితీయ కుమారులైన శ్రీ ఆంజనేయులుగారికి 1. వేంకటేశ్వర శర్మ, 2. రామలింగేశ్వరశర్మ, 3. పాండురంగవిఠల్, 4. సత్య నారాయణ అను నలుగురు కుమారులు జన్మించారు.

తృతీయ పుత్రులు శ్రీ కొండలరాయుడుగారికి ప్రథమ వివాహానికి పుత్ర సంతానంలేదు. ద్వితీయ వివాహం చేసుకొన్న భార్య వలన సుబ్రహ్మణ్యం, సీతారామయ్య అను నిరువురు కుమారులు ప్రభవించారు.

చతుర్థ పుత్రుడైన శ్రీ రామకోటయ్యగారికి సత్యసుందర రామయ్య, శ్రీనివాస్ అను నిరువురు పుత్రు లుద్భవించారు.

అయిదవ కుమారుడైన శ్రీ ఆదినారాయణగారికి సీతా రామాంజనేయులు, శ్రీరామచంద్రమూర్తి, లక్ష్మీనరసింహం, వేంకట మురళీకృష్ణ అను నలుగురు కుమారులు జన్మించారు.

వేంకట శివయ్యగారి కుటుంబం : శ్రీ వేంకట శివయ్యగారికి శ్రీరాములు అను ఒక కుమారుడు మాత్రం కలిగారు. వీరికి రామ లింగం అను ఒక్కడే కుమారుడు. ఈ రామలింగంగారికి శ్రీ విశ్వ నాథం, శ్రీరామమూర్తి అను పుత్రులు కలిగారు. శ్రీ విశ్వనాథం గారికి రెండు వివాహాలు జరిగాయి. మొదటి సంబంధానికి వేంకటేశ్వర్లు అను కుమారుడు కలిగిన అనంతరం ఆమె పరమపదిం చింది. రెండవ వివాహం చేసికొనగా 1. రామలింగం, 2. రత్తయ్య, 3. మల్లికార్జునుడు, 4. పూర్ణచంద్రరావు, 5. సత్యనారాయణ మూర్తి, 6. ఉమామహేశ్వరరావు అను పుత్రులు జన్మించారు.

శ్రీరామమూర్తిగారికి రామలింగం, భాస్కరశర్మ అను ఇరువురు పుత్రు లుద్భవించారు.

పసుమర్తి వారిలో మూడవ శాఖకు చెందిన వారిలో భగవంతంగారు కృష్ణయ్యగారు, గోపాలంగారు సహోదరులు, వీరిలో భగవంతంగారు, కృష్ణయ్యగారలు అన్యవృత్తులు స్వీకరించి పరస్థలాలలో స్థిరనివాసం ఏర్పరచుకున్నందున వారిని గురించిన వివరాలు తెలియలేదు.

శ్రీ గోపాలంగారికి ఆంజనేయులుగారు ఒక్కరే జన్మించారు. వీరు వ్యవహారదక్షులు. వీరికి 1. వేణుగోపాలకృష్ణశర్మ, 2. సీతారామశర్మ, 3. శంకరనారాయణ, 4. చంద్రమౌళి, 5. సత్యనారాయణ, 6. విష్ణుశర్మ అను పుత్రులు జన్మించారు.

పసుమర్తి వారిలో నాల్గవ శాఖ శ్రీ సుబ్బయ్యగారిది. వీరు కృష్ణాపురంనుంచి కూచిపూడి వచ్చి స్థిరపడినట్లుగా చెబుతారు. వీరిలో సుబ్బయ్యగారు సుప్రసిద్ధులు. వీరి కుమారులు శ్రీ సీతారామయ్యగారు. వీరికి వేంకటేశ్వర్లుగారు జన్మించారు. వీరు నిరాడంబరులు. భగవదారాధనాతత్పరులు. తమ జీవితమంతా స్థానిక శ్రీ రామలింగేశ్వరస్వామివారి దేవస్థానానికి ధర్మకర్తృత్వం వహించి పండుగలు, పర్వదినాలలో శాస్త్రసమ్మతంగా ఉత్సవాదులు నిర్వర్తింపచేసేవారు. వీరికి 1. సుబ్రహ్మణ్యశాస్త్రి, 2. రామమూర్తి, 3. సత్యనారాయణ, 4. విశ్వనాథశర్మ, 5. శ్రీహరిప్రసాద్, 6. వేంకటాచలపతిశర్మ అను కుమారులు జన్మించారు.



పసుమర్తి సుబ్రహ్మమణ్యాం

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వినయ సంపత్తికి ఆదరించి శ్రీ వేదాంతం రామకృష్ణయ్యగారి ఏకైక పుత్రిక నిచ్చి వివాహం జరిపించారు. వీరు అత్తవారి ఇంటివద్దనే నివసిస్తున్నారు. తండ్రిగారి మరణానంతరం దేవస్థాన ధర్మకర్తృత్వాన్ని స్వీకరించి సమర్థ వంతంగా నిర్వహిస్తున్నారు. వీరు ఒకప్పుడు పతివ్రత వేషాలను ప్రతిభావంతంగా నటించేవారు.

రెండవ వారైన శ్రీరామమూర్తిగారు నడివయస్సులోనే మరణించారు.

మూడవ కుమారుడు శ్రీ సత్యనారాయణగారు R. T. C. డిపార్టుమెంటులో ఉద్యోగిస్తున్నారు.

నాల్గవవారు శ్రీ విశ్వనాథశర్మ మెడికల్ రిప్రజెంటేటివ్ గా పనిచేస్తూ పరస్థలంలో స్థిరపడ్డారు.

అయిదవవారు శ్రీ శ్రీహరిప్రసాద్ గారు జోస్యులవారికి దత్తత వెళ్లారు. ఆదిలో సంప్రదాయ ప్రదర్శనలతో నటించిన తరువాత కాలంలో లౌకిక వ్యవహారాలలోను, రాజకీయాలలోను రాటు తేలారు. కొంతకాలం గ్రామ సర్పంచిగా పనిచేశారు. ఈయనకు శ్రీ వేదాంతం రాఘవయ్యగారి నాల్గవ సహోదరి శ్రీమతి వేంకటలక్ష్మి నిచ్చి వివాహం చేశారు.


పసుమర్తివారి వంశం-2
వేంకట శివయ్య
శ్రీరాములు
రామలింగం
విశ్వనాథం
శ్రీరామమూర్తి
వేంకటేశ్వర్లు,
రామలింగం
రత్తయ్య,
మల్లికార్జున శర్మ
పూర్ణచంద్రరావు
సత్యనారాయణమూర్తి
ఉమామహేశ్వరరావు
రామలింగం
భాస్కరరావు

కడగొట్టు కుమారుడైన శ్రీ వేంకటాచలపతిశర్మ R. T. C వర్కుషాపులో ఉద్యోగంచేస్తున్నారు.

శ్రీ వేంకటేశ్వర్లుగారు ధన్యజీవులు. సజీవులయిన పుత్రులందరు పుత్రవంతులు. ఏదోవిధమైన ఉద్యోగంతో సుఖమయ జీవితం గడుపుతూ సామాజిక గౌరవప్రతిష్ఠలతో వర్ధిల్లుచున్నారు.

## పసుమర్తివారు, సుప్రతిష్ఠితులు

శ్రీ కొండలరాయడు : వీరు పసుమర్తి వేంకటాచలపతిగారి తృతీయ పుత్రులు. సంప్రదాయసిద్ధంగా సంగీత, నాట్య, యక్షగానాలు అభ్యసించారు. బాల్యంలో లోహిత, ప్రహ్లాద మున్నగు వయోచిత పాత్రలు ధరించి ప్రజామన్నన లందుకొన్నారు. జీర, వారలేని సన్న విడిగల చక్కని కంఠం. ఎలా పలికించితే అలా ఒదిగి పలుకుతూ వుండేది. వయస్సు వచ్చిన తరువాత హరిశ్చంద్ర, ఉషాపరిణయంలో అనిరుద్ధ మున్నగు పాత్రలు ధరించేవారు.

హరిశ్చంద్ర పాత్రలో రాజఠీవి, దర్పం వుట్టిపడేవి. శ్మశాన కోట్టలో వీరి అభినయ విశేషానికి కంట తడిబెట్టని ప్రేక్షకు డుండేవాడుకాదు. వీరి పాట ఎంత శ్రావ్యంగా వుండేదో వాచికం కూడ అంత విస్పష్టంగా, హుందాగా వుండేది. ఈయన ధరించే పాత్రల స్వభావాలను అర్థంచేసుకొని, తల్లీనులై నటించేవారు. ప్రదర్శనానంతరం కొంతసేపటివరకు ఆ పాత్రానుభూతి వీరిని వీడేదికాదు. ఈనాటి నటకులలో ఇట్టివారు చాలా అరుదుగా లభిస్తారు. కనుకనే అనేక సన్మానాలు, బంగారుపతకాలు పొందిన యశస్వి.



## శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి

శ్రీ కృష్ణమూర్తిగారు : వీరు శ్రీ పసుమర్తి రామయ్యగారి ద్వితీయ పుత్రులు. శ్రీ చింతా వేంకటరామయ్యగారికి దౌహిత్రులు. బాల్యంలో సంప్రదాయ పూర్వకంగా తాతగారికడ నాట్యాన్ని అభ్యసించారు. చాలాకాలం చింతావారి మేళంలో స్త్రీ పాత్ర ధరించేవారు. వీరి పాత్రధారణ ఎంతో సమర్థంగా వుండేది. ఆంధ్రప్రాంతంలో కూచిపూడి భాగవతులకు నాట్యమేళాలకు అభిమానం తగ్గిన దినాలలో చలనచిత్ర రంగంలో నృత్యదర్శకులకు ప్రాధాన్యం పెరిగింది. ఇంతకుముందే శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ వెంపటి పెదసత్యంగారలు ఈ రంగప్రవేశం చేసి ప్రసిద్ధి పొందారు. శ్రీ కృష్ణమూర్తిగారు కూడ వారి మార్గాన్ని ఆదర్శంగాగొని చలనచిత్రరంగ ప్రవేశంచేశారు. నృత్యదర్శకులుగా ప్రఖ్యాతి గడించారు. అనేక చలన చిత్రాలకు నాట్యదర్శకత్వం నిర్వహించారు. ప్రస్తుతం మద్రాసులోనే స్థిరపడి కూచిపూడి భరత నాట్యకళామతల్లికి సేవలుచేస్తూ తమ జీవితం ధన్యం చేసుకొంటున్నారు.

# పసుమర్తివారి వంశం - 3

గోపాలం

|

ఆంజనేయశర్మ

| శ్రీ గోపాలకృష్ణశర్మ | సీతారామశర్మ | శంకరనారాయణ | చంద్రమౌళి | సత్యనారాయణ | విష్ణుశర్మ |
|---|---|---|---|---|---|

శ్రీ వేణుగోపాలకృష్ణశర్మ : వీరు నిత్యకర్మానుష్ఠాన పరులు, వ్యవహార దక్షులు, సరసవాక్యరచనాచణులునైన శ్రీ పసుమర్తి ఆంజనేయశర్మగారి ప్రథమ పుత్రులు. విద్యా, విజ్ఞానవంతులు. వివేకపరిపూర్ణులు. ఉచితానుచితజ్ఞులు. అఖండమైన సంగీత ప్రజ్ఞకలవారు. కాని గాత్ర గాంభీర్యం తక్కువ. నాట్యశాస్త్ర రీతులన్నీ పుక్కిటబట్టిన మేధావి. కాని ఆంగికసౌష్ఠవం శూన్యం. కీర్తి గొప్పదేగాని మూర్తి చిన్నది. బాల్యంలో శ్రీ చింతా వేంకట రామయ్యగారికడ నాట్య విద్యాభ్యాసం చేసిన కడపటి జట్టు విద్యార్థి. కూచిపూడి నాట్య కళాక్షేత్ర సంగీత కళాపీఠం. శ్రీ చల్లపల్లి సీతారామయ్యగారి ప్రియాంతేవాసి శ్రీ మేళేశ్వరపు సీతారామాంజనేయులుగారి చరణ సన్నిధిని సంగీత విద్యాభ్యాసం చేశారు. ప్రభుత్వంవారు నిర్వహించే సంగీత పరీక్షలన్నిటిలోను ఉత్తీర్ణులయ్యారు. ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు నిర్వహించే సంగీత డిప్లొమా పరీక్షలోను, ఇంకా నాట్యపరీక్షలలోను కృతార్థులయ్యారు.

ఒకనాటి వాయ్యూరు ఎలిమెంటరీ పాఠశాలలో సంగీతోపాధ్యాయులుగా పనిచేసి లబ్ధప్రతిష్ఠులయ్యారు. అనంతరం శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని సంగీతోపాధ్యాయ పదవిని విసర్జించి, ఏలూరు కళాక్షేత్రంలో నాట్యాచార్య పదవి చేపట్టారు. అక్కడ కొంతకాలం పనిచేసి ప్రస్తుతం కూచిపూడి, సిద్ధేంద్ర కళాక్షేత్రమునకు ప్రిన్సిపాల్ పదవి నిర్వహిస్తున్నారు.

వీరికడ నాట్యాభ్యాసంచేసిన శిష్యులు, శిష్యురాండ్రు పరశ్శతంగా వున్నారు. నాట్యశాస్త్ర సంబంధమైన, పలువిధములైన వ్యాసాలు నాట్యకళద్వారా ప్రకటించారు. నాట్యశాస్త్ర విద్యార్థులకు ప్రణాళికా రచనకూడా రచించారు.

శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు పరమపదించిన తరువాత శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్ర నిర్వహణ బాధ్యతలు స్వీకరించి కార్యదర్శిగా వ్యవహరిస్తున్న శ్రీ గడ్డమణుగు సీతారామాంజనేయులుగారి అభిమానాన్ని కూడ చూరగొని వారికి తలలోనినాల్కరీతిగా మెలగుతూ తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వహిస్తున్న క్రియాశీలి, కర్తవ్యపరాయణుడు శ్రీ వేణుగోపాలకృష్ణశర్మ, శ్రీ సీతారామశాస్త్రి శ్రీ పసుమర్తి సీతారామయ్యగారి ద్వితీయ పుత్రులు సుబ్బయ్యగారికి ఏకైకపుత్రులు. ఈయన శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం, విశాఖపట్నం శాఖలో నాట్యాచార్యులుగా పని చేస్తున్నారు.

# పసుమర్తివారి శాఖ - 4



సుబ్బయ్య
సీతారామయ్య
వేంకటేశ్వర్లు
సుబ్బయ్య
సుబ్రహ్మణ్యశాస్త్రి
రామగిరి
సత్యనారాయణ
విశ్వనాథం
శ్రీ హరిప్రసాదు
వేంకటాచలపతి
సుబ్బయ్య
సీతారామశాస్త్రి

# తాడేపల్లివారి వంశం

సుబ్బరాయుడు

- సు రయ్య
- పేరయ్య
  - సుబ్బరాయుడు
    - పేరయ్య
      - సుబ్రహ్మణ్యం

# తాడేపల్లివారు

తాడేపల్లివారిలో రెండు కుటుంబాలు మాత్రమున్నాయి. 1. సూరయ్యాగారు, 2. పేరయ్యాగారు.

శ్రీ సూరయ్యాగారికి నాట్య, నాటక, కళావాది సంప్రదాయక విద్యలలో ప్రవేశం లేదు. సేద్యం ప్రధాన వృత్తిగా స్వీకరించారు. వారి సంతానం కూడ ఇదే విధాన మవలంబించారు.

రెండవ కుటుంబం వారిలో సుబ్బారాయుడుగారు ప్రధానులు. వీరికి భూవసతి బాగా వుండటంవల్ల సేద్యం చేసుకుంటూ వుండేవారు. వీరి తండ్రి పేరయ్యాగారు. వీరుకూడ ఆవిధంగానే జీవించారు. శ్రీ సుబ్బారాయడుగారి భార్య గారమ్మ. ఈ పుణ్యదంపతులకు ఒకడే కుమారుడు ప్రభవించాడు. ఈయనకు పేరయ్య అని నామకరణం చేశారు.

శ్రీ పేరయ్యాగారు పెరిగి పెద్దవాడై సుప్రసిద్ధ నాట్యాచార్యులయ్యారు. వీరికాలం 1886 ప్రాంతం. వీరికి సుబ్రహ్మణ్యం అను ఒక్క కుమారుడు, ఒక్క కుమార్తె కలిగారు. శ్రీ సుబ్రహ్మణ్యం గారికి సంతానం లేనందున తోటి అల్లుని కుమార్తెను దత్తత తీసుకున్నారు.



## శ్రీ తాడేపల్లి పేరయ్య

శ్రీ పేరయ్యగారు ; శ్రీమతి గౌరమ్మ, సుబ్బారాయుడు దంపతుల గర్భసూక్తి ముక్తాఫలంగా అవతరించిన పుణ్యమూర్తి శ్రీ పేరయ్యగారు. వీరు 1886 ప్రాంతంలో జన్మించారు. సంప్రదాయసిద్ధంగా భామా, గొల్లకలాపాదులలో ఆరితేరారు. భరతనాట్యరీతులన్నీ వీరికి కరతలామలకాలు. నిర్గర్వచూడామణి. అల్పసంతోషి. సునిశిత మేధస్సంపన్నుడు. లలితకళా విశారదుడు. పచ్చని దబ్బ పండువంటి మేని చాయ. రెండు చేతులకు బంగారు మురుగులు. చెవులకు మకరకుండలాలు. మెడలో బంగారు పుచ్చులు వేసిన రుద్రాక్షతో కూడిన బంగారు గొలుసు. మోమున త్రిపుండ్రములు మెరుగు లీనుచుండగా తాళములు చేతబట్టి అభినయము పట్టించుతూ వుంటే దేవేంద్రసభలోని భరతముని తలపునకు వచ్చేవాడు. ఈయన అశేష శేముషీధురంధరుడు.

మేడూరు, నంగెగడ్డ మున్నగు గ్రామాలలోని ఆనాటి దేవదాసీలకు నాట్యము, కలాపాదులు సశాస్త్రీయముగ నేర్పి, వారు ప్రదర్శన మిస్తూవుంటే వీరి సూత్రధారిత్వము చూచి యానందింప వలసినదేగాని చెప్పనలవి కాదు.

వీరి పాత్రధారణ విషయం అంతగా తెలియదుగాని వీరి శిష్యురాండ్రచే ప్రదర్శన లిప్పించటం అందరూ ఎరిగిన విషయమే, వీరి సూత్రధారిత్వ ఫణితి విలక్షణమైనది. భామాకలాప, గొల్ల కలాపాలలో వీరే బ్రాహ్మణపాత్రధారిగా నటించేవారు, తాళం చేత ధరించి ప్రతివిషయాన్ని సాభిప్రాయంగా, ప్రతిమాటను సాగతీస్తూ కర, చరణ, గ్రీవాభినయనాలతో వివరిస్తూ అభినయింప చేసేవారు. తాము నోటితో జతులు పలుకుతూ, మృదంగం మీద పలికింపచేస్తూ, నట్టువరాలిచే చరణ ఘట్టనలతో అనువదింప చేయిస్తూ, తాము మెడతో మెల్లాయిపట్లు పడుతూ, వారు శ్రమిస్తూ వుంటే తాము ఆనందిస్తున్నట్లు అభినయిస్తూ,రసవంతంగా ప్రదర్శనాన్ని నడిపిస్తూ ప్రేక్షక జనాన్ని ఆనంద తరంగ డోలికలలో ఉయ్యాల లూచేవారు. అంతతో ఊరకోక మధ్య మధ్య సహజ ధోరణిలో మృదుమధుర హాస్యంతో గిలిగింతలు పెట్టేవారు. ప్రతి భావాన్ని, ప్రతి ముద్రని, ప్రతి నాయికను శాస్త్రప్రమాణం చూపించి వివరించే వారు, విమర్శించి చెప్పేవారు. వీరి వాచికాభినయం కూడ ప్రదర్శనానుగుణ్యంగా వుండేది.

అనాటి దేవదాసీలకు శ్రీ పేరయ్యగారు గురువే కాదు, తీర్చి దిద్దిన తండ్రి. మానవత్వాన్ని ప్రసాదించిన మహామహితాత్ముడు. ప్రదర్శనా ప్రారంభ సమయంలో రంగస్థల ప్రవేశం చేసి గురు పాదుల చరణారవిందములకు వందన మాచరించిగాని కాలికి గజ్జె కట్టేవారుకారు. గురుదేవులకు కూడ వారిపట్ల పుత్రికా వాత్సల్య ముండేది.

కూచిపూడి సంప్రదాయనాట్యం కూచిపూడి భాగవతు లకు మాత్రమే పరిమితమై యుండరాదు. అది వాడవాడలా, దేశదేశాల, ఖండఖండాంతరాలలో వ్యాప్తమై అజరామరమై అందరకు అందుబాటులో వుండాలి " అనే మహాకాంక్షతో,

విశాల దృక్పథంతో మాయా, మర్మం లేకుండా మడుగులు ఒడుగులు ఉంచకుండా నాట్యకళా ప్రచారం చేసిన నిష్కల్మష నాట్యాచార్యవరేణ్యుడు శ్రీ పేరయ్యగారు. వీరికి కూచిపూడి నాట్యకళా ప్రపంచంలో ప్రత్యేకమైన స్థానమున్నది. శ్రీ భాగవతుల విస్సయ్య, శ్రీ వెంపటి వేంకటనారాయణ, శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి, శ్రీ చింతా వేంకటరామయ్యగారలు ఈ కోవకు చెందిన పవిత్ర నాట్యాచార్యులు. శ్రీ పేరయ్యగారికి సమకాలికులు. ఇంతటి ప్రతిభావంతుడు 1942 లో దివంగతులైనారు. వీరితో తాడేపల్లివారి వంశంలో నాట్యసంప్రదాయం అడుగంటింది.

# గుహంకాళివారి వంశం - 1

- శ్రీరాములు
  - వేంకయ్య
    - శ్రీరాములు
  - సత్యనారాయణ
    - వరదాచారి
    - శ్రీమన్నారాయణ
    - సూర్యనారాయణ
  - సుబ్బారావు
    - శ్రీరాములు
  - కృష్ణమాచారి

# మహంకాళివారు

మహంకాళివారిలో శ్రీరాములుగారి కుటుంబం, లక్ష్మయ్య గారి కుటుంబం అని రెండు కుటుంబాలు కూచిపూడి సంప్రదాయ ప్రదర్శనలో ప్రఖ్యాతి వహించాయి. శ్రీరాములుగారికి వేంకయ్య, సత్యనారాయణ, సుబ్బారావు, కృష్ణమూర్తి అను నలుగురు కుమారులు ప్రభవించారు.

శ్రీ వేంకయ్యగారికి చివరిదశలో ఒక కుమారుడు జన్మించాడు. శ్రీ సత్యనారాయణగారికి శ్రీరాములు, నరహరి, శ్రీమన్నారాయణ, సూర్యనారాయణ అను నలుగురు కుమారులు. శ్రీ సుబ్బారావు గారికి శ్రీరాములు ఒక్క కుమారుడు. శ్రీ కృష్ణమూర్తిగారికి ... ........................... కలిగారు.

శ్రీ వేంకయ్యగారు బాల్యంలో సంప్రదాయసిద్ధంగా సంగీత నాట్యాలు అభ్యసించారు. 'రామనాటక' మను యక్షగానంలో వశిష్ఠునిగా, 'హరిశ్చంద్ర' లోను వశిష్ఠునిగా సాత్త్విక మునివేషాలు వేయడంలో సుప్రసిద్ధులు.



శ్రీ మహంకాళి సత్యనారాయణ

శ్రీ సత్యనారాయణగారు తామసిక వేషాలు వేయడంలో సిద్ధహస్తులు. యక్షగాన సంప్రదాయంలో శ్రీ హరి వేంకటాచలపతిగారు లేని లోటును వీరు భర్తీ చేశారు. ఇంతే కాదు. కొన్ని విషయాలలో ఆయనను కూడ అధిగమించారు. హరిశ్చంద్ర నాటకంలో విశ్వామిత్ర వేషం ధరించి సంస్కృత భాషలో "రేరే పాపిష్ఠా, వశిష్ఠా! కుక్షింభరణార్థం తస్య మహారాజస్య గుణాన్ ప్రకటయసి" అని పళ్లు పటపట, కొరుకుతూ రౌద్రరసం పుట్టిపడునట్లు పలుకుతూ వుంటే ఒళ్లు జలదరించేది. ఇక వీరబాహు వేషం సరే సరి. ఇంతటివారు "నభూతో న భవిష్యతి" అన్నట్లుగా వుండేది. మాటల్లో యాస, చేతల్లో కోస డప్పు మెడను తగిలించుకొని "తొలగిపోనిండయ్యా, దొరలు పెద్దింటోణ్ణి" అని పాడుకుంటూ రంగప్రవేశం చేసే సరికి ప్రేక్షకజనం తన్మయులై పోయేవారు. వీరు ప్రత్యేకంగా వరలు, తప్పెట వాద్యం ఈ వేషానికై నేర్చుకొన్నారు.

ఇక ఉషాపరిణయంలో బాణాసుర, ప్రహ్లాదలో హిరణ్యకశ్యప వేషాలు ధరించి వారు చేసే అట్టహాసం, పరవళ్లు చూచి తీరవలసిందే. ఉషాసుందరి గర్భవతి అయినదని తెలిసినప్పుడు

# మహంకాళివారి వంశం - 2

లక్ష్మయ్య

- పెదసత్యనారాయణ
  - లక్ష్మీనారాయణ
  - రామేశ్వరరావు
  - సీతారామాంజనేయులు
- సుబ్బయ్య
  - లక్ష్మీనారాయణ
  - శేషయ్య
  - పాండురంగశర్మ
  - విఠలు

కుమార్తె చేసిన తప్పిదమూపట్ల కోప తైక్ష్ణ్యము, కన్నకుమార్తె యనెడి వాత్సల్యము—ఈ విపరీత విరుద్ధద్వంద్వ భావముల నభిన యించుపట్ల వీరి నటనా చాతుర్యము, అభినయ సామర్థ్యము పరా కాష్ఠ నందుకొని తన్మయాన్ని కల్గిస్తుంది. ఈయన సహజమైన నటుడు. తాను ధరించే వేషానికి తగిన ప్రణాళికా రచన తనంతట అది ఆ సమయానికి వచ్చి ఆయనను ఆవహిస్తుందని చెప్పేవారు.

హిరణ్యకశ్యపుని పాత్ర ధరించి నప్పుడు కన్నకుమారుడుకదా యని కరుణ, శత్రునామ స్మరణచేస్తూ ఆయనకు భక్తుడగు చున్నాడన్న క్రౌర్యం, ఈ ద్వైధీ భావముల నడుమ చిక్కి కన్నకుమారుని హింసించుటకు, హింసించ కుండుటకు గూడ వీలుగాని స్థితిని కల్పించుకొని, అతిక్లిష్టమైన అభినయము చేయుచు ప్రేక్షక జనుల ప్రశంసలకు పాత్రులైనారు.

శ్రీ సత్యనారాయణగారు ఫెలోషిప్పులు, అవార్డులు, ఘనసన్మానాలు పొందజాలక పోయినా తాము ధరించి అభినయించే పాత్రలను పోషించడంలో సిద్ధహస్తులు. వారి ఆకారము, ఆహార్యము, వాచికాభినయము, ఆంగికాభినయములు అందులకు తగినట్లు అమరి మరింత శోభ గూర్చెడివి. వీరు ఈనాటివరకు జీవించి యున్నచో ఎన్నో విధముల సత్కరింపబడి యుండెడివారు.

చాలాకాలము చింతావారి మేళములో నుండెడివారు. అనంతరము శ్రీ వేదాంతం రాఘవయ్య 'ఉషగా' శ్రీ సత్య నారాయణగారు 'బాణాసురు'నిగా శ్రీ భాగవతుల సూర్యనారాయణ 'చిత్రరేఖగా', శ్రీ దర్భా వేంకటేశ్వర్లుగారు 'అనిరుద్ధుని'గానటించిన 'ఉషాపరిణయము' ప్రజాదరణము నందినది. ఈ మేళమును 'మహాంకాళివారి మేళ'మనెడివారు. దీనికి శ్రీ వేదాంతం రామయ్య గారు నట్టువాంగము నడపెడివారు.

శ్రీ రాఘవయ్యగారి చలనచిత్ర ప్రవేశంతో శ్రీ వేంకట రామ నాట్యమండలి ఆవిర్భావముతో తిరిగి దానిలో ప్రవేశించిరి.

చాలామంది ప్రజలు వీరి వేషధారణమున కంటే, వీరిని దర్శించి భాషించుటకు వచ్చుచుండెడివారు. శ్రీ సత్యనారాయణగారి కళా హృదయము, కళాభినివేశనము ప్రశంసాపాత్రములు.

శ్రీ శ్రీరాములుగారి మూడవ కుమారుడు సరసవచోరచనా నిపుణుడు. నటుల్రితకునిగా, మతంగ కన్యల గురువుగా చిల్లర పాత్రలు ధరించి ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించెడివారు.

నాల్గవ కుమారుడు శ్రీ కృష్ణమూర్తి సంప్రదాయ విద్యలలో రాణించలేదు.



శ్రీ మహంకాళి శ్రీరాములు

శ్రీ సత్యనారాయణగారి పెద్దకుమారుడు శ్రీరాములు. ఈయన ఈనాటి భామాకలాపములో శ్రీకృష్ణునిగా, ఉషాపరిణయములో అనిరుద్ధునిగా ప్రధాన పురుషపాత్రలు ధరిస్తున్నారు. 'పద్మశ్రీ' శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మగారు స్త్రీపాత్ర ధరించినప్పుడు ప్రస్తుతము కూచిపూడియందున్న పురుషపాత్ర ధారణచేయు భాగవతులలో వీరే కడుసమర్థులు. వీరి పాత్రధారణ లలితముగానుండి ప్రేక్షకజనాదరణీయముగనే యుండును.

వీరి తరువాతవారైన శ్రీ నరహరి ఈ సంప్రదాయ విద్యలలో ప్రవేశమున్ననూ R. T. C. లో కండక్టరుగా ఉద్యోగమునందు స్థిరపడిరి.

శ్రీమన్నారాయణ బాణాసురాది పాత్రధారణలకు ఇప్పుడిపుడే సన్నద్ధమగుచున్నాడు. చిరంజీవి సూర్యనారాయణ విద్యాభ్యాసస్థితిలో నుండియు సమయము చిక్కినపుడు పాత్రధారణ చేయుచున్నాడు. వీరుభయులు వృద్ధిలోనికి రాదగిన నటకిశోరములు.

మహంకాళివారిలో రెండవ శాఖ శ్రీ లక్ష్మయ్యగారిది. వీరికి శ్రీ సత్యనారాయణ, శ్రీ సుబ్బయ్య అను నిరువురు కుమారులు గలరు. వీరిలో శ్రీ సుబ్బయ్యగారి కుటుంబము చాలాకాలము క్రితమే

## మహాంకాళివారి వంశం - 3

సుబ్బయ్య

| | | |
|---|---|---|
| వెంకయ్య | శేషయ్య | నరసింహం |

కూచిపూడి అగ్రహారము వదలి అన్యగ్రామములందు అన్యవృత్తుల యందు స్థిరపడిరి.

శ్రీ సత్యనారాయణ నామధారులు ఇరువురున్నందున వీరిని పెదసత్యనారాయణగారనుట వాడుక. వీరు పగటివేషములందు బహుప్రజ్ఞ కలవారు. భట్రాజు వేషం, జంగం వేషం మున్నగు వాటిలో పేరుగడించారు. యక్షగాన సంప్రదాయ మభివృద్ధిలోనికి వచ్చుట తోడనే వీరు తమ వేషధారణమునకు స్వస్తిచెప్పి, కుమారులు శ్రీ లక్ష్మీనారాయణ, కామేశ్వర రావులతో గలసి సేద్యవృత్తియందు స్థిరపడిరి.

మహాంకాళి వారిలో మూడవ శాఖ శ్రీ సుబ్బయ్యగారిది. వీరికి వేంకయ్య, శేషయ్య, నరసింహం అను ముగ్గురు కుమారులు. శ్రీ శేషయ్య, నరసింహంగారలకు కూచిపూడి సంప్రదాయ వృత్తులలో ప్రవేశము లేదు.

శ్రీ వేంకయ్యగారు చలనచిత్రరంగప్రవేశ మొనరించి 'రాజనందిని' మున్నగు చిత్రములలోను, రంగస్థల నాటకముల లోను పాత్రధారణ చేయుచుండెడివారు.

శ్రీ వేంకయ్యగారికి ఇరువురు కుమారులు కలరు. వీరిలో పెద్దకుమారుడు శ్రీ సుబ్బయ్య బాణాసుర వేషధారణకు సర్వ సన్నద్ధ మవుతున్నాడు. ఇతడు ఏకపాత్రాభినయాలలో ఇదివరకే ప్రసిద్ధి వహించాడు. భవిష్యత్తులో రాణించగల నవయువనటు డీతడు.

# బొక్కావారి వంశం

సీతారంగయ్య
|
కుమారస్వామి
|
జానకిరామయ్య

|
సీతారామయ్య

# బొక్కావారి వంశం



శ్రీ బొక్కా కుమారస్వామి

బొక్కావారి వంశంలో వేంకటాచలపతిగారనేవారుండే వారు. వారి పూర్వీకులను గురించి అంతగా తెలియరావడం లేదు. ఈయనకు ఒక కుమారుడు, ఆయనకు ఒక కుమారుడు ఉండేవాడు. ఆయనకు సంతానం లేనందువలన ఆ వేంకటాచలపతిగారి వంశం అంతటితో అంతరించింది.

రెండవ శాఖలో శ్రీ సీతారామయ్యగారు ప్రసిద్ధులు. వీరికి కుమారస్వామి అను ఒక్కరే కుమారులు. వీరు ప్రసిద్ధ నాట్యాచార్యులు శ్రీ చింతా వేంకట్రామయ్యగారి దహిత్రులు. బాల్యంలో మాతామహుని కడ సంప్రదాయసిద్ధంగా భామా, గొల్లకలాపాదుల నభ్యసించారు. భరతనాట్య రీతులు, మర్మాలు ఆకళింపు చేసుకొన్నారు. కొంతకాలం యక్షగానాలలో పాత్రధారణ కూడ నిర్వహించారు. గద్వాల సంస్థాన ఆస్థాన సంగీత విద్వాంసులు, ఘంటశాల వాస్తవ్యులు శ్రీ చల్లపల్లి

సుబ్బయ్య, సీతారామయ్య సోదరుల సన్నిధిని సంగీత శాస్త్రాన్ని అధ్యయనం చేశారు. వాయులీనవాద్య విశేషంలో విశేష పాండిత్యాన్ని గడించారు.

ఈయన ఆధునికభావ సమన్వితులు. సంస్కారాభిలాషులు. తమ గ్రామ సంప్రదాయ నృత్యరీతులలో శాస్త్రవిరుద్ధంగాని పద్ధతిని సంస్కారాలు ప్రవేశపెట్టి కాలానుగుణ్యంగా, రమ్యంగా ప్రదర్శింపజేయాలనే స్వభావం కలవారు

సంగీతంలో పరిశ్రమించి సుప్రసిద్ధ వాగ్గేయకారకులు కావాలని ఆశించి కీ. శే. వారణాసి బ్రహ్మయ్యశాస్త్రి వరేణ్యుల చరణ సన్నిధిని గురుకుల సంప్రదాయ పద్ధతిలో శుశ్రూషించి అధ్యయనం చేశారు. కాని కారణాంతరాల వలన వారి కోరిక తీరకుండగనే నిలిచిపోయింది.

తమ సంప్రదాయ నాట్యకళా ప్రాచీనతను కోల్పోని విధంగా ఆధునికులను అలరించే రీతిగా సంస్కరించి, యక్షగానాలలో వినూతన ప్రక్రియలను శాస్త్రానికి విరుద్ధంగాని విధంగా ప్రవేశపెట్టి శ్రీ వేంకట్రామా నాట్యమండలి వారితో ఢిల్లీ, జయపూరు మున్నగు పలుతావులకు పర్యటించి, వారి ప్రదర్శనలకు తమ వాయులీన గాన సహకారాన్నందించిన ధీశాలి.

శ్రీ కుమారస్వామిగారు చలనచిత్రరంగప్రవేశంచేసి సంగీత దర్శకత్వం నిర్వహించిన మహామనీషి.

మొవ్వ గ్రామంలో నెలకొల్పబడిన ' క్షేత్రయ్య సమితి ' కి కులపతిగా వ్యవహరించి, అందలి విద్యార్థినీ విద్యార్థులకు సంప్రదాయ సిద్ధంగా, శాస్త్రబద్ధంగా, లయాన్వితంగా క్షేత్రయ్య పదాలు, జావళీలు, తరంగాలు, అష్టపదులు మొదలగు ప్రక్రియలు సక్రమ రీతిలో శిక్షణ నిచ్చి గౌరవ సత్కారాలందుకొన్న కళాతపస్వి.

1968 లో క్షేత్రయ్య పదాలకు స్వర రచన కూర్చి సన్మానింపబడిన సంగీతకళామర్మజ్ఞుడు. ఈ స్వర రచన కూచిపూడి

నాట్యసంప్రదాయానుసారం చేయబడినది. ఆంధ్రప్రదేశ్, ఢిల్లీ జయపూరు మున్నగు చోట్ల ఘన సన్మానా లందుకొన్నారు. కొంత కాలం మచిలీపట్టణం 'మాంటుసోరీ' పాఠశాలలో నాట్యాచార్యులుగా పనిచేసి ప్రస్తుతం హైదరాబాదు నగరంలో నివసిస్తున్నారు. వీరి సంతానమంతా ఉన్నతోద్యోగాలు చేసుకొంటున్నారు.

# గోపాలేశ్వరపు వారి వంశం-1

- సీతారామయ్యగారు
  - వేంకట సుబ్బయ్య
    - రామకృష్ణయ్య
    - కనకదుర్గయ్య
      - సీతారామాంజనేయులు
        - వాసుదేవశాస్త్రి
        - జానకిరామయ్య
        - జగన్మోహన లక్ష్మీనరసింహం
        - కనకదుర్గాప్రసాదు

# యేలేశ్వరపువారి వంశం

యేలేశ్వరపువారి వంశంలో మూడు కుటుంబాలవా రున్నారు. 1. సీతారాముడు 2. శివరామయ్య 3. నాగప్ప.

శ్రీ సీతారాముడుగారి కుమారుడు శ్రీ వేంకటసుబ్బయ్యగారు; ఈయన బి. ఏ., బియల్. పట్టభద్రులు. వీరికి రామకృష్ణయ్య, కనకదుర్గయ్య అను ఇరువురు కుమారులు. శ్రీ రామకృష్ణయ్యగారు సంప్రదాయ నాట్యసంగీతాలలో ప్రవీణులేగాక కవులు, సంప్రదాయ కర్తలు కూడ. శ్రీ కనకదుర్గయ్యగారు శావమోళ భజనలో సిద్ధహస్తులు.



## శ్రీ యేలేశ్వరపు సీతారామాంజనేయులు

శ్రీ కనకదుర్గయ్యగారి కుమారుడు శ్రీ సీతారామాంజనేయులు గారు సంప్రదాయసిద్ధంగా ఘంటశాల వాస్తవ్యులు. శ్రీ చల్లపల్లి సీతారామయ్యగారి వద్ద సంగీతాన్ని అధ్యయనం చేశారు వీరు కూచిపూడి నాట్యకళా క్షేత్రానికి సంగీత విద్యాపీఠంగా భాసించారు. నాట్య నాటకాలతో సంబంధం లేకపోయినా అసంఖ్యాకంగా సంగీత విద్వాంసులను తయారు చేశారు. సంగీత విద్యార్థులకు శిక్షణ గరపడమంటే వీరికి మహదానందం. విద్యార్థి లెవ్వరూ రాకపోతే తామే తంబురా చేతగొని పాడుకుంటూ ఆత్మానందాన్ననుభవించే వారు. ఆధ్యాత్మిక చింతన, పరోపకార చింతన వీరిలో గూడుకట్టుకొని యుండేవి. ఎన్నడూ ఎవరినీ పరుషంగా భాషించి యెరుగని శాంతమూర్తి.

శ్రీ సీతారామాంజనేయులుగారికి వాసుదేవశాస్త్రి, జానకిరామశర్మ, జగన్మోహన లక్ష్మీనరసింహం, కనకదుర్గాప్రసాదు అను నలుగురు కుమారులు కలిగారు.

శ్రీ వాసుదేవశాస్త్రి బాల్యంలో ప్రాథమిక సంగీత విద్యాభ్యాసం పితృపాదుల సన్నిధిని చేశారు. అనంతరం 'సంగీతకళానిధి'

# గోలేశ్వరపువారి వంశం - 2

శివరామయ్య

|

కుటుంబయ్య

|

ఆంజనేయులు

శ్రీ ద్రోవి సత్యన్నారాయణగారి చరణ సన్నిధిని గురుకుల సంప్రదాయ పద్ధతిలో అభ్యసించి వాయులీన వాద్య విద్యలో గడితేరారు. వీరి వాదనం మృదుమధురంగా, హృదయాకర్షకంగా నుండేది. మద్రాసు చలనచిత్రరంగంలో ప్రఖ్యాత సంగీతదర్శకులు శ్రీ సుబ్బరామన్‌గారి సంగీత సంఘ సభ్యులై అనేక చలనచిత్రాలకు తమ వాదనం ద్వారా వన్నె తెచ్చారు. ఈయనకు ఇరువురు కుమార్తెలు. తరువాత ఎంతో అభివృద్ధికి రావలసిన తరుణంలో నడివయసులో అకాలమరణానికి గురై కూచిపూడి సంగీత సరస్వతికి వెలితి చేశారు.

శ్రీ జానకిరామయ్యగారు ప్రశాంత హృదయులు. సరసులు. చాలకాలం గణితోపాధ్యాయులుగ పనిచేసి ప్రస్తుతం పరిషత్ ఆధ్వర్యంలో ఉన్నత పాఠశాల ప్రధానాధ్యాపకునిగ పని చేస్తున్నారు.

శ్రీ జగన్మోహన లక్ష్మీనరసింహం మంచి చురుకైన బుద్ధి, వాకచక్యంగలవారు. చూడటంతోనే వ్యక్తి గుణగణాలు, స్వభావం అవగతం చేసుకోగల మేధస్సంపత్తి కలవారు. కార్యసాధన దక్షులు. వీరు ప్రస్తుతం మచిలీపట్నంలో హిందూ కళాశాల ఉన్నత పాఠశాలలో గణితోపాధ్యాయులుగా రాణిస్తున్నారు. అచిర కాలంలో ప్రధానాధ్యాపకులయ్యే అవకాశం వుంది.

శ్రీ కనకదుర్గాప్రసాద్‌గారు తగినంతగా విద్యాభ్యాసం చేసినా తమ సహోదరు లిరువురూ ఉద్యోగిస్తూ వున్నందున తాము సేద్యం ప్రధానవృత్తిగా స్వీకరించారు. ప్రస్తుత కాల వాతావరణా ననుసరించి రాజకీయాలపట్ల అభిరుచి కలిగించుకొన్నారు. ప్రస్తుతం రెండవతూరి గ్రామసర్పంచిగా ఎన్నికై గ్రామాభివృద్ధికి శక్తివంచన లేకుండ పాటుపడుతున్నారు. అనుక్షణం ఏదో యొక పనిలో నిమగ్నమై యుండి అభివృద్ధి పథకాలకు ప్రణాళికా రచనచేస్తూ

## న్యేలేశ్వరపువారి వంశం - 3

నాగప్ప

| | | | |
|---|---|---|---|
| వేంకటేశ్వర్లు | పున్నయ్య | ఆంజనేయులు | నారాయణమూర్తి |

వుంటారు. ఉత్సాహవంతుడయిన నవయువకుడు. తెలివితేటలు గలవాడు.

యేలేశ్వరపు వారిలో రెండవ శాఖకు చెందినవారు శ్రీ శివరామయ్యగారు. వీరి కుమారుడు కుటుంబయ్యగారు. వీరికి నొక్కడే కుమారుడు. వీరి నామధేయం శివరామయ్య. తండ్రిలాగ వీరికి కూడ ఒక్కడే కుమారుడు. వీరి పేరు ఆంజనేయులు. ఈయన చాలకాలం కూచిపూడి సంప్రదాయ ప్రదర్శనలకు మృదంగవాద్య సహకారం చేశారు.

మూడవ శాఖ నాగప్పవారిది. శ్రీ నాగప్పగారి కుమారుడు వేంకటేశ్వర్లు. ఈయన భామవేషం వేయడంలో ప్రతిభా సంపత్తి కలవారు. పగటివేషధారణలోగూడ ప్రజ్ఞావంతులు. రెండవ కుమారుడు పున్నయ్యగారు. ఈయన యక్షగానాది ప్రదర్శనలకు చాలకాలం మృదంగం వాయించేవారు.

మూడవవారయిన శ్రీ ఆంజనేయులుగారికి సంప్రదాయ ప్రదర్శనలలో ప్రవేశం లేదు. నాల్గవవారగు నారాయణమూర్తిగారు కొంతకాలం మేళా నాయకత్వంగూడ వహించారు. అవసరమైతే వేషధారణ, లేకుంటే సూత్రధారిత్వం నెఱపేవారు.

# వెంపటివారి వంశం

వెంపటివారి వంశంలో శ్రీ వేంకట కృష్ణయ్యగారు, శ్రీ కోదండరామయ్యగారు సుప్రసిద్ధులు. వీరుభయులు శ్రీ వేంకట నారాయణగారి పుత్రులు ఋగ్వేద శాఖీయులు.

శ్రీ వేంకట కృష్ణయ్యగారికి శ్రీ సుబ్బారావు, శ్రీ చలమయ్య అను కుమారులిరువురు జన్మించారు. పెద్ద కుమారులైన శ్రీ సుబ్బారావు గారికి సంప్రదాయ ప్రదర్శనలలో ప్రవేశం లేదు. ప్రశాంతమైన స్వభావం. వైద్యంలో ప్రవేశముంది. హరికథాగానం కూడ చేస్తూ వుండేవారు. నిరాడంబరులు. అందరిని ఆప్యాయతతో ఆదర పూర్వకంగా పలుకరించేవారు. ఆధ్యాత్మిక చింతన, పరోపకార బుద్ధిగల వదాన్యులు. ఒకమారు ఉబ్బి తబ్బిబ్బవటంగాని, మరొకమారు నిరాశా నిస్పృహలతో కృంగి పోవడంగాని యెరుగరు. కూచిపూడి యగ్రహారపు పంచాయతీ దారులలో నొకరై నిర్దుష్టమైన అభిప్రాయాన్ని ప్రకటించి తమ వ్యక్తిత్వాన్ని నిరూపించుకోగల వ్యక్తి. ఈయనపట్ల అగ్రహారీకు లందరు ఆదరభావాన్ని చూపేవారు. వారి మాటనే దలదాల్చేవారు.

శ్రీ సుబ్బారావుగారికి శ్రీ రామమూర్తి, కృష్ణమూర్తి, సత్యనారాయణ అను ముప్వురు కుమారులు. శ్రీమతి కామేశ్వరమ్మ అను ఏకైక కుమార్తె కలిగారు.

శ్రీరామమూర్తి: ఈయన సుబ్బారావుగారి ప్రథమ పుత్రులు. వీరు చల్లపల్లి సీతారామయ్యగారి చరణసన్నిధిని గురుకుల పద్ధతిలో సంగీత విద్యాభ్యాసం చేశారు. శ్రీ బాలా కుమారస్వామిగారు వీరి సహాధ్యాయులు. వాయులీన వాద్య విశేషంలో అసాధారణ ప్రజ్ఞావిశేషాలు కలవారు.

ప్రప్రథమంగా కూచిపూడి భాగవతులలో చలనచిత్రరంగ ప్రవేశ మొనర్చిన ఘనత శ్రీ రామమూర్తిగారికే దక్కింది.

వీరు శాంతస్వభావులు. మద్రాసులోని చలనచిత్రరంగంలోనే శుభముహూర్తాన ప్రవేశించారో కాని, వారికి వార్ధక్యం మీదపడే వరకు మరలిరాలేదు. ఎన్నో చలనచిత్రాలకు సంగీత దర్శకత్వం నిర్వహించారు. ఎన్నో చిత్రాలకు వాయులీన సహకార గాన మందించారు. వీరికి నేకపుత్ర విశేషం. ఆయన పేరు హనుమంతరావు. ఇతడు అద్భుతమైన తెలివితేటలు గలవాడు. ఆంగ్లభాషలోను, గణితశాస్త్రమందు మాష్టరు డిగ్రీ పుచ్చుకున్నారు. ప్రస్తుతం విజయవాడ శాతవాహన కళాశాలలో గణితాచార్యులుగ పనిచేస్తున్నారు.

శ్రీ కృష్ణమూర్తి : ఈయన అదృష్టంలేని కళాజీవి. సశాస్త్రీయంగా మృదంగం చెప్పుకున్నారు. తబలా వాద్యంలో సాటిలేని మేటి విద్యావంతులు. నిరంతరం ఆ వాద్య విశేషాలతో అభ్యాసంచేసి పండిపోయిన పండితుడు. అయినా అదృష్టవంతుడు కాకపోవడంవలన తన పాండిత్యం రాణింపుకు రాలేదు. తనకంటే ఎంతో లుజ్జుగా వుండే మార్దంగికులు ఘనసన్మానాలు పొంది ప్రజా గౌరవాన్ని, సభా మర్యాదను అందుకున్నారు. వీరిని చూచినపుడు 'ఎంతమంచి పండితుడైనా, అదృష్టం లేశం కొరవడితే అతని పాండిత్యం అడవిని గాచిన వెన్నెలవలె నుండు'ననిపించక మానదు. తాను నేర్చిన, సాధించిన విద్య 'స్వాంత స్సుఖాయ' అన్నట్లు పరిణమించింది. వీరికి పుత్ర సంతానముంది. కాని వారికి సంప్రదాయ విద్యలలో ప్రవేశంలేదు.



శ్రీ వెంపటి పెదసత్యన్నారాయణ

శ్రీ పెదసత్యన్నారాయణ: వీరు శ్రీ సుబ్బారావుగారి కడగొట్టు సంతానం. వ్యవహారంలో 'పెదసత్యం' గా ప్రఖ్యాతి వహించారు. జననం 1922-వ సంవత్సరం. బాల్యంలో శ్రీ చింతా వేంకట్రామయ్య గారి సాన్నిధ్యంలో ప్రాథమిక నాట్యవిద్యాభ్యాసం చేస్తూ, హైస్కూలులో కూడ చదువుతూ ఉండేవారు. మధ్యలోనే హైస్కూలు విద్యాభ్యాసానికి స్వస్తి చెప్పి నాట్యశాస్త్రంమీద దృష్టి కేంద్రీకరించారు. కట్టుదిట్టంగా విద్య చెప్పుకున్నారు. 'అంతటితో తృప్తిచెందక భరతనాట్య కళాప్రపూర్ణ' శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రివర్యుల కడ లక్ష్య లక్షణ సమన్వితంగా నాట్యంతోపాటు, అభినయదర్పణాది గ్రంథాలు కూడ కంఠస్థం చేశారు.

సాధారణంగా కూచిపూడి నాట్యాచార్యులకు ప్రయోగ నైపుణ్యమే కాని శాస్త్ర పాండిత్యం వుండేది కాదు. ఉదాహరణకు, "అయ్యా! బాణాసుర వేషం మీద తపస్సుచేసి శంకరానుగ్రహాన్ని పొంది లోకాలమీదకు దండు వెడలినపుడు, కత్తి చేతబూని ముమ్మారు ప్రదక్షిణం చేశారు. దాని భావమేమిటండీ?"

అని మహాకవి శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు ప్రశ్నించారు. అంతట ఆ భాగవతుడు "బాబూ! ఆ సమయంలో మా పెద్దలు అలా తిరగమని చెప్పారు. మేము అలా చేస్తున్నామే కాని దాని భావం తెలియదండీ" అన్నారు. శ్రీ రావుగారు వారి యమాయకత్వానికి నాశ్చర్యాన్ని "వెలిబుచ్చి అది మండలమని, అట్లు ఒక మారు తిరిగితే ఒక లోకం జయించి నట్లని, ముమ్మారు తిరగటం వల్ల మూడు లోకాలు జయించిన"ట్లని నాట్యశాస్త్రానుసారం వారి యభినయ విశేషాలు వివరించి చెప్పారు.

శ్రీ సత్యనారాయణగారు ఇటువంటి పరిస్థితి యెక్కడ ఎదురవుతుందోనని కాబోలు నాట్యశాస్త్రాన్ని, అలంకారశాస్త్రాన్ని కూడ పుక్కిటబట్టారు. వారు అభివృద్ధిలోకి వచ్చే సమయంలో అమ్మవారు పోసింది. దాని నుండి కోలుకొన్న తరువాత తమ (వేషధారణ ఎంత పాండిత్యమున్నా) జనాకర్షకంగా నుండదని భావించారు. వెంటనే మచలీపట్టణం జాతీయ కళాశాలలో ఉద్యోగం నిర్వహిస్తున్న సుప్రసిద్ధ చిత్రకళా మర్మజ్ఞులు శ్రీ అడివి బాపిరాజుగారి సన్నిధిలో చిత్రకళ అభ్యసించారు. అప్పటికే వయసు ముదిరింది. అయినా 'చదువుకు ముదురు, సాముకు లేత' అన్న చందంగా మిక్కిలి పట్టుదలతో చిత్రకళా నైపుణ్యాన్ని సాధించారు. తన నాట్యకళా పాండిత్యానికి ఈ చిత్రకళా వైదుష్యం మరింత సహాయ పడింది.

తాను నాట్యశాస్త్రంలో సర్వ సమర్థుడై, చేతగాని వానివలె నింటికడ నుండటం అవమానంగా తోచింది. తన కంటె అన్నివిధాల అసమర్థులయినవారు ప్రఖ్యాత నాట్యాచార్యులుగ రాణించడం సహింపజాలక పోయారు. తమ సహపాఠి శ్రీ అయ్యంకి తాండవకృష్ణ, ఎం. ఏ. గారు సహకరించగా నొక నాట్యసంఘాన్ని సంఘటిత పరిచారు. కూచిపూడి నాట్యకళను యావద్భారత దేశంలోను వ్యాప్తి చేయాలనే మహాత్వాకాంక్షతో పర్యటనకు

బయలుదేరారు. వీరు ప్రదర్శన లిచ్చిన ప్రతి నగరంలోను, పట్టణం లోను, పల్లెలోను అత్యధికమైన ప్రజాదరణ, ప్రశంసలు, సన్మానాలు, సత్కారాలు లభించాయి. సహపాఠుల చిరవాంఛి తాలు నెరవేరాయి.

సహజంగా సత్యనారాయణగారి నాట్యంలో ఒక విశిష్టత వుంది. అది శ్రీచింతా వేంకట్రామయ్యగారి నాట్యవిధానంలోని లాలిత్య సౌకుమార్యాలు, శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి గారి నాట్య విధానంలోని శాస్త్ర గాంభీర్యాలు వీరిలో సంతరించు కున్నాయి. వీరు కూచిపూడి నాట్యశాస్త్రానికి ప్రామాణిక నాట్యాచార్యులుగ రూపొందారు. ఎంతటి ప్రతిభావంతుడైన నాట్యాచార్యుడైనా శాస్త్ర ప్రామాణ్యం కాని విషయాన్ని ప్రతిపాదించితే అంగీకరించేవారు కాదు సరికదా! అవహేళన చేసేవారు. శాస్త్రవిషయాలకు తోడు తదవిరుద్ధమైన ఔచిత్యాన్ని కూడ పాటించేవారు. వీరు శ్రీ చింతా వేంకట్రామయ్యగారి సన్నిధిలో ప్రాథమిక నాట్యాభ్యాసంచేసినా శ్రీ వేదాంతం లక్ష్మీ నారాయణశాస్త్రిగారి శిష్యులుగానే పరిగణింపబడుతున్నారు. శ్రీ శాస్త్రిగారు కూడ తమ కన్న కుమారులు శ్రీ జగన్నాథశర్మ పట్ల కన్న మిన్నగ వీరిని ప్రేమించి యాదరించడమే ఇందుకు కారణం.

చలనచిత్రరంగంలో భరతనాట్యానికి ప్రాముఖ్యత హెచ్చింది. స్థానిక ప్రజలలో దానిపట్ల ఆదరణ సన్నగిల్లింది. ఇంతకు పూర్వమే శ్రీ వేదాంతం రాఘవయ్యగారు మదరాసులో మకాం పెట్టారు. వారు వాహినీ, సారధి స్టూడియోలలో విధివిరామంలేక పని చేస్తున్నారు. ఈ తరుణంలో శ్రీ సత్యనారాయణగారికి కూడ ఆహ్వానం వచ్చింది. మద్రాసులో శ్రీ సత్యనారాయణగారి ప్రజ్ఞా ప్రాభవాలను గుర్తించిన శ్రీ శోభనాచల స్టూడియోవారు తమ సంస్థకు సుస్థిర నాట్యాచార్యునిగా నియమించారు. ఎన్నో చలన చిత్రాలకు నృత్యదర్శకులుగా పనిచేశారు.

ఒకమారు కొందరు విమర్శక పండితులు కూచిపూడి నాట్యం శాస్త్ర సమ్మతమైనది కాదని తీర్మానించారు. ఇది సహించని కూచిపూడి సుప్రసిద్ధ నాట్యాచార్యులు శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ వెంపటి సత్యనారాయణ, శ్రీ చింతా కృష్ణమూర్తి, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి, శ్రీ అయ్యంకి తాండవకృష్ణ మున్నగువారలు సప్రయోగ ప్రదర్శన లిచ్చి తమ నాట్య పద్ధతి సశాస్త్రీయమని నిరూపించి విజయగర్వాన్ని ప్రకటించారు. అది యొక మహత్తర ఘట్టం. చిరస్మరణీయమైన సువర్ణ ఘట్టం.

శ్రీ సత్యనారాయణగారు మదరాసులోనే స్థిరపడి యక్కడనే ఉండి పోవాలనే అభిప్రాయంతో గృహనిర్మాణం కూడ చేసికున్నారు. కాని కారణాంతరాలవలన స్వగ్రామానికి మరలివచ్చి ఇచ్చటనే మరల నూతన గృహ నిర్మాణం చేసుకొన్నారు సిద్ధేంద్ర కళా క్షేత్రానికి, అనుబంధ నాట్యకళాశాలకు ప్రిన్సిపాలుగాకూడ పని చేశారు. అన్నమాచార్య సారస్వత పీఠం స్థాపించారు. అనేక నాట్యరీతులను ప్రచారం చేశారు. ఎన్నో పథకాలు, ప్రణాళికలు రచించారు. ఇంతలోనే 1982 జూన్ లో ఇవి యేవీ తనకు సంబంధం లేనట్లుగా ఈ లోకంవిడిచి దివినలంకరించారు. కూచిపూడి నాట్యాకాశం నుండి యొక కాంతిమత్తారా రాలి నట్లయింది. శ్రీ వేంపటి వేంకట కృష్ణయ్యగారి ద్వితీయ పుత్రులు శ్రీ చలమయ్యగారు. వీరు సాధారణమైన పరిజ్ఞానం కలవారు. అయినా తమ ఏకైక పుత్రుడు సత్యనారాయణ అభివృద్ధికి రావాలని నిరంతరం తపించిపోయేవారు. ఈ సత్యనారాయణనే 'చినసత్యం' అని వ్యవహరిస్తారు.



శ్రీ వెంపటి చినసత్యం

శ్రీ చినసత్యం మహాకష్టజీవి. పట్టుదలకలవాడు. కార్య దక్షుడు. బాల్యంలో కూచిపూడి అగ్రహారంలో నడిబొడ్డునగల శ్రీ చింతా వేంకట్రామయ్యగారి యింటి ముందు అడుగులు పట్టడం నేర్చుకున్నారు. అప్పటికే శ్రీ వేంకట్రామయ్యగారు వయోవృద్ధు లయ్యారు. చూపు సరిగా కనపడని స్థితిలో నున్నారు. ఆయినా 'గెంతు, ఇంకా గెంతు' అని సహజ గంభీర కంఠంతో గద్దించే వారు. చిన్నవాడైన చినసత్యం శరీరమంతా ముచ్చెమటలు చిన్న చిన్న సెలయేరులవలె ప్రవహిస్తూ ఉండగా అలాగే గెంతుతూ ఉండేవారు. ఇంతలో ఈయన అదృష్టం ఫలించినట్లుగ పెద సత్యంగారు మదరాసు వెళ్ళడం సంభవించింది. పెదసత్యం ఈయనకు పెదతండ్రి కుమారుడు. అయినా ఇంతకంటె మించిన

జీవనాంతర సాహచర్యకం వీరిని ఆయన దగ్గరకు చేర్చింది. అక్కడ ఆయన వచ్చిన కార్యం సాధించడమే ప్రధానలక్ష్యంగా పెట్టుకొని ఎన్ని యవాంతరాలు వచ్చినా చలింపక, కష్టాలు కలిగినా సంతోషంతో స్వీకరిస్తూ నాట్యకళాభ్యాసం చేశారు. వీరి విద్యా తపస్సుకు నాట్యభారతి సంతసించింది. దీవెనలు ప్రసాదించింది. అక్కున జేర్చుకుంది. ముద్దాడింది. మృదుమధుర వాగ్విలాసాలు, లాస్యాలు ప్రసాదించింది. 'గురువును మించిన శిష్యుడవు కమ్మని ఆశీర్వదించింది. ఆమె అనుగ్రహాన్ని అందుకున్న సత్యనారాయణ విద్యలో, బుద్ధిలో, కీర్తిలో, వినయసంపత్తిలో పెద్ద అయినా చిన్నగానే వ్యవహరింప బడుతూ అనేక చలనచిత్రాలకు నృత్య దర్శకులుగా పనిచేశారు. కాని యీ వృత్తి ఆర్థికంగా అభివృద్ధి కరంగావున్నా కళాజీవితంలో తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు, అభివృద్ధికి, నూతన విషయాన్వేషణకు, కూచిపూడి నాట్యప్రచారానికి, నిరోధకంగా తోచింది. వెంటనే 'కూచిపూడి ఆర్ట్సు ఎకాడమీ' అను పేరుతో నొక నృత్యకళాశాల స్థాపించారు. వీరి కార్యక్షేత్రం సువిశాలమైంది. తా మాశించిన విధంగా నాట్య ప్రచారం, ప్రయోగాలు, పరిశోధనలు సాగించారు. అనేకరీతులలో నృత్యవిశేషాలతో అధ్యాపనం నెరపుతున్నారు. ఈ ఎకాడమీ పేరు ప్రతిష్ఠలు వాడవాడలా, వ్యాపింప సాగాయి. ప్రాంతీయులేగాక అన్యప్రాంతీయ విద్యార్థులు, తుదకు అన్యదేశీయులు కూడ ఆకర్షితు లయ్యారు. వారి శిక్షణా విధానంపట్ల సంతృప్తి చెందారు. సుశిక్షిత నాట్యాచార్యులుగ రూపొందారు.

శ్రీ చినసత్యంగారికి నూతన ప్రదర్శనాప్రక్రియ లవసర మైనాయి. వీరి క్రియాత్మక కార్యక్రమాలకు కవి పండిత సహాయ సహకారాలు లభ్యమైనాయి. కావలి, జవ్వాదుభారతి ప్రధానాంధ్రోపన్యాసకులు, కవులు, ప్రకాండ పండిత విమర్శకులు శ్రీ యస్. వి. భుజంగరాయశర్మగారు 'పద్మావతీ శ్రీనివాస

కళ్యాణా'న్ని యక్షగాన రూపంగా చిత్రీకరించి వీరి కిచ్చారు. అందు పద్మావతీదేవిగా శ్రీ చినసత్యం శిష్యురాలు కుమారి శోభా నాయుడు, మిగిలిన పాత్రలను తగుసమర్థులు నటింపగా వేల ప్రదర్శన లిచ్చారు. అఖండ గౌరవాన్ని పొందారు. శ్రీనివాసుని యనుగ్రహానికి పాత్రు లయ్యారు. దేవస్థాన ఆస్థాన నాట్యాచార్యులుగ నియమితు లయ్యారు. కళాప్రపూర్ణ లయ్యారు. ప్రభుత్వాదరా న్నందు కొన్నారు. ఆంధ్ర నృత్యనాటక ఎకాడమీ సలహాదారు లయ్యారు. కూచిపూడి నాట్యకళా సరస్వతీ సమారాధనం ఘనంగా జరిగినట్లు ఈ నిర్గర్వచూడామణి చినసత్యం భావించారు.

వీరు స్థాపించిన 'కూచిపూడి ఆర్ట్సు ఎకాడమీ' తాలూకు శాఖలు హైదరాబాదు మున్నగు పలుచోట్ల స్థాపింపబడినాయి. శాస్త్రీయ పద్ధతిలో నాట్యాచార్యులను తయారుచేయడం ప్రధాన లక్ష్యంగా పెట్టుకొన్నారు. అనేక విద్యాసంస్థలకు, కళాసంస్థలకు తమ సహాయ సహకారా లందించిన వితరణశీలి, విశాల హృదయుడు. అద్యతనకాలంలో 'కూచిపూడి నాట్యకళా ప్రామాణిక ప్రతినిధి చినసత్యం' అనడం అతిశయోక్తి కాదు. స్వార్థ మెరుంగని నిరాడంబర వ్యక్తి.

ఈయన కూచిపూడి నృత్య భారతీ పదమంజీర ధ్వానాలు యావద్భారత దేశంలోనేగాక పాశ్చాత్య దేశాలలో కూడ ప్రతిధ్వనింపజేసిన నాట్యకళా తపస్వి. వీరి కళాసేవను గుర్తించిన ఆంధ్ర విశ్వవిద్యాలయం 'డాక్టరేటు' బిరుదాన్నిచ్చి సత్కరించి తన కళాభిమానాన్ని ప్రకటించుకొంది. శ్రీ చినసత్యం పొందిన సన్మానాలకు, సత్కారాలకు అంతులేదు. గురువులకు సత్కరింపబడిన బిరుదు, పండితశాల్వలను సభాముఖంగా తానే దానిని ధరించ దానికి అర్హుడని తీర్మానింపబడిన ప్రతిభావంతుడు.

శ్రీ చినసత్యంగారి తండ్రి కలలు ఫలించాయి. తాను పడిన శ్రమకు నాట్యసరస్వతి మెచ్చింది. గురువుల, పెద్దల ఆశీస్సులు లభించాయి. ఖండఖండాంతర ఖ్యాతి గడించారు. ప్రస్తుతం కూచిపూడి నాట్యకళా సరస్వతి తన సముద్ధరణకు, పునరుజ్జీవానికి వీరిపై ఆశలు నిలుపుకొంది. ఈయన కూడ అందుకు బద్ధకంకణు లయ్యారు. అస్తవ్యస్తంగా తమకు తోచినరీతిని నాట్యప్రచారం చేసే కూచిపూడి నవయువక నాట్యాచార్యులకు క్రమపద్ధతిలో శిక్షణ నిస్తున్నారు. కూచిపూడి అచిరకాలంలోనే విశ్వవిఖ్యాతి నార్జించగలదని కళాభిమానులు ఆశిస్తున్నారు. ఇటీవల వీరికి ఎకాడమీ 'భరతకళాప్రపూర్ణ' బిరుదు నిచ్చి సత్కరించింది.

ప్రస్తుతం తాము ప్రదర్శించే 'పద్మావతీ శ్రీనివాసకళ్యాణా'న్ని తమిళంలో రూపొందించి శ్రీస్వామివారి సన్నిధిలో ప్రదర్శించాలని యత్నిస్తున్నారు. వారి యత్నం అచిరకాలంలోనే ఆ శ్రీనివాసుని యనుగ్రహ విశేషం వలన సిద్ధించగలదు.

వెంపటి వారిలో రెండవ శాఖకు చెందిన కోదండరామయ్య గారి పుత్రులు శ్రీ వేంకటనారాయణగారు. వీరు 18-వ శతాబ్ది ఉత్తరార్ధంలో ప్రభవించారు. బాల్యంలో తండ్రిగారి సన్నిధిలో నాట్యవిద్యాభ్యాసం చేశారు. పండ్రెండు సంవత్సరాల బాల ప్రాయంలోనే భాగవత ప్రదర్శనలో పరిణితి పొందిన నాట్యా చార్యుని వలె సభారంజనం చేశారు. వీరు కాలికి గజ్జెగట్టిన వేళా విశేషమో, విద్యనేర్పిన గురువుల ఆశీఃప్రభావమో కూచిపూడి నాట్యాచార్య త్రయములో నొకరై విశేష గౌరవాదరాలు పొందారు. భామాకలాపంలో వీరి భామ వేషధారణ ఆనాటి రాజాంతఃపురకాంతలకు చక్కదనాలు దిద్దేది.

కూచిపూడి సంప్రదాయ ప్రదర్శనలుగా ప్రసిద్ధి పొందిన ప్రక్రియలు భామాకలాప, గొల్లకలాప, యక్షగానాలు. శ్రీ వేంకట

నారాయణగారు ఈ త్రివిధ ప్రక్రియలలో అసాధారణ ప్రతిభా సంపత్తిగలనారు. ప్రధానంగా 'భామ', 'దాదినమ్మ' వేషధారణం చేసి రక్తికట్టించడం సాధారణమైన విషయంగాదు. ఇవి రెండూ ఎంతో కష్టతరమైన, భావవైవిధ్యంగల ప్రయోగాలు. అంతేగాదు. ఆనాడు ఈ రెండు ప్రయోగాలు బహుళ ప్రచారంలో నున్నాయి. ప్రతి కూచిపూడి భాగవతుడు ప్రత్యేక శ్రద్ధ వహించి, అభ్యసించి, రసవత్తరంగా అభినయించేవారు. అట్టివారిలో శ్రీ వేంకట నారాయణగారు అగ్రగణ్యులు.

భామ వేషాన్ని ధరించి జడను తెరకు వెలుపలకువేసి తాను యవనికాంతరమున నుండి, జడ లక్షణాలను అభివర్ణిస్తూ, అభినయిస్తూ, తనను నాట్యశాస్త్రంలోగాని, అభినయశాస్త్రంలోగాని జయించగల వారుసభలో నున్నట్లయితే జడ కోసి వారి పాదసన్నిధిని నుంచుతానని శపథంచేసి, మోళీకట్టి, మూడుగంటల కాలం తెర నుండి వెలికిరాక లోపల అభినయిస్తూ విజయపతాకను ఎగురవేసిన ప్రకాండ పండిత నాట్యాచార్యులు శ్రీ వేంకటనారాయణగారు.

వీరు అనేక పల్లెలలో, పట్టణాలలో, రాజాస్థానాలలో ప్రదర్శన లిచ్చి సాటిలేని మేటి నటులుగా పేరు గడించారు. వీరి తరువాత ఆ వేషాలు ధరించి వీరిని మించినవారుగాని, సరితూగగల వారుగాని కరువయ్యారు. వీరి ప్రజ్ఞా విశేషాలను ఆ ప్రదర్శనలను తిలకించిన వృద్ధులు, కళాప్రియులు స్మరించి యానందాతిరేకంతో ప్రశంసిస్తూనే వుంటారు.

దాదినమ్మ వేషం ఒక మహత్తర ప్రయోగం. అంతేకాదు, చాల కష్టతరమైనది కూడ. అంతఃపురంలో గాఢనిద్రాపరవశు రాలైన ఒక రాకుమారిని శయ్యతోకూడ ఒక గజదొంగ అపహరించుకొని పోయి, మహారణ్య మధ్యంలో దాచి యుంచుతాడు. రాకుమారి మేల్కాంచి ఆత్మరక్షణకు అర్థించడం, తనకు

సంభవించిన ఆపదకు విలపించడం, తుదకు రక్షింపబడటం ఇందలి ప్రధాన వృత్తం. ఒక మంచంలో నడుమువరకు ప్రవేశించి, దిగువభాగం మరుగు పరచి మంచంతో కూడ రంగ ప్రవేశం చేసి పైభాగమును మాత్రం సర్వాభరణాలతో రాజకుమారికి తగినట్లు అలంకరించుకొని శయనించడం, మేల్కొనడం, తానున్న స్థితిని గుర్తించి భయభీతురాలవటం మున్నగు ప్రక్రియలను అభిన యించడం సులభసాధ్యమయిన కార్యంగాదు. ఈ పాత్రను ధరించి శ్రీ వేంకటనారాయణగారు నవరసభరితంగా ఔచిత్యభంగంకాని, ప్రకరణభంగంకాని రాని విధంగా అభినయించి ప్రజాభిమానాన్ని, పండితాదరణాన్ని, కళావేత్తల మెప్పును పొందారు.

శ్రీ వేంకటనారాయణగారు కేవలం అభినయశాస్త్రంలోనే గాక సంగీతశాస్త్రంలో కూడ అశేష శేముషీధురీణులు. లయవిన్యాసం చేస్తూ వుంటే సంగీతాచార్యులకు తనువులు పులకరించేవి. ఏబదియైదు సంవత్సరముల వయస్సు పైబడినా వేషధారణ చేసినపుడు 16 సంవత్సరముల నవయౌవనవతివలె కనిపించేవారు. ఇంతటి ప్రతిభా వంతుడు తన షష్టిపూర్తి అనంతరం తనువు చాలించారు.

# వేదాంతంగారి వంశం - 1

- చలమయ్య
  - సాంబయ్య
    - వేంకటరత్నం
      - ప్రహ్లాదశర్మ
        - సీతారామశాస్త్రి
        - రత్తయ్యశర్మ
        - మాణిక్యం
        - కొండలరాయుడు
        - కనకలింగేశ్వరరావు
      - వీరరాఘవయ్య
        - రామశేషు
        - రత్తయ్య
        - శివయ్య
        - వేంకటేశ్వర్లు
        - బాబూజీ
      - సత్యనారాయణశర్మ
        - వేంకటనాగప్రసాద్
    - చలమయ్య
      - ప్రకాశరావు
      - బాలకృష్ణయ్య
    - సత్యనారాయణ
      - సాంబయ్య
      - శ్రీమన్నారాయణ
    - నరసింహం
    - ఘంటయ్య
      - మల్లికార్జునశర్మ
    - వేంకటేశ్వర్లు
    - చిదంబరం
      - శ్రీరామమూర్తి

# వేదాంతంవారి వంశం.-

వేదాంతం వారిలో ఆరు శాఖ లున్నాయి. వాటిలో మొదటి శాఖ శ్రీ చలమయ్యగారిది శ్రీ చలమయ్యగారికి సాంబయ్యగారు ఒక్కరే కుమారులు. వీరి కుటుంబం విస్తరించింది. ఏడుగురు కుమారులు ఉద్భవించారు. వీరందరూ ఏదోవిధమగు విద్యలో కీర్తి గడించారు. వీరు 1. వేంకటరత్నంగారు, 2. చలమయ్య గారు, 3. సత్యనారాయణగారు, 4 నరసింహంగారు, 5. ఘంటయ్య గారు, 6. వేంకటేశ్వర్లుగారు, 7. చిదంబరంగారు.

శ్రీవేంకటరత్నంగారు భామాకలాప, గొల్లకలాపాది ప్రదర్శ నాలలో మంచి ప్రజ్ఞకలవారు. వీరికి ప్రహ్లాదశర్మ, వీరరాఘవయ్య, సత్యనారాయణశర్మ అను ముగ్గురు కుమారులు జన్మించారు. వీరు ముగ్గురూ ప్రఖ్యాత నాట్యాచార్యులు.



## శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మ

శ్రీ ప్రహ్లాదశర్మగారు బాల్యంలో తమ తండ్రిగారి సాన్నిధ్యంలో ప్రారంభ నాట్యవిద్యాభ్యాసంచేసి అనంతరం శ్రీ చింతా వేంకట్రామయ్యగారికడ కట్టుదిట్టంగా భామాకలాపం, గొల్లకలాపం మున్నగునవి, యక్షగాన పాత్రలు, అభినయ విశేషాలు, సాకల్యంగా నేర్చుకొన్నారు. కొంతకాలం భామాకలాప ప్రదర్శనలు, గొల్లకలాప ప్రదర్శనలు ఇచ్చారు. తరువాత ఉషాపరిణయ యక్షగానంలో ఉషాసుందరిగా, ప్రహ్లాదలో లీలావతిగా అభినయించారు. తన కడగొట్టు సహోదరుడు శ్రీ సత్యనారాయణగారిని కొంతవరకు తీర్చిదిద్ది శ్రీ చింతా వేంకట్రామయ్యగారికి అప్పగించారు. చిన్నతనంలో తండ్రి గతించిన కారణాన కుటుంబభారం తన భుజస్కంధాల మీద పడింది. చాకచక్యంతో కుటుంబాన్ని సంబాళించుకొంటూ, సహోదరులకు విద్యాబుద్ధులు చూచుకొంటూ అవస్థలు పడ్డారు.

కాలం కలిసివచ్చి కష్టాలు గట్టెక్కినాయి. శ్రీ సత్యనారాయణ మంచి వేషగాడైనాడు. శ్రీ వేంకట్రామా నాట్యమండలిలో సభ్యులయినారు. శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్ర స్థాపన జరిగింది. దానికి

శాఖలు అవతరించాయి. ఏలూరు శాఖకు శ్రీ ప్రహ్లాదశర్మగారు నాట్యాచార్యులుగా నియమితులైనారు. అనేకమంది నాట్య ప్రముఖులను తీర్చిదిద్దారు. కుమారి లత కుమారి జ్యోత్స్న అను నాట్య విద్యార్థినులను వెంట నిడుకొని వాయులీన విద్వాంసులుగా శ్రీ భీమేశ్వరరావు, మార్దంగికులుగా శ్రీ త్యాగరాజు గారలు సహకరించగా అల్జీరియా, ట్యూనీషియా, మొనాస్తీరు మున్నగు విదేశాలలో పర్యటించి కూచిపూడి నృత్య కళాధిదేవతకు ఖండాంతర ప్రశస్తి సమకూర్చారు.

అనేక ప్రదేశాలలో భామాకలాప, గొల్లకలాప ప్రదర్శన లిచ్చారు. ఘనసన్మానాలు, సత్కారాలు పొందారు. ఇటీవలనే గుంటూరు నగరంలో తమ విద్యార్థినులచే ప్రదర్శనల నిప్పించి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ కుప్పుస్వామిగారిచే నీ విధంగా వ్యాఖ్యానింపబడినారు :

కూచిపూడి నాట్య నిష్ణాతుల కొరత : కుప్పుస్వామి ఉద్ఘాటన :

"నిష్ణాతులైన కూచిపూడి నాట్యశాస్త్ర వేత్తల, బోధకుల, కళాకారుల కొఱత నేడుకొట్టవచ్చినట్లు కన్పిస్తున్న"దని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి వ్యాఖ్యానించారు. 22-వ తేదీన ఇక్కడ నాగార్జున సాంస్కృతిక కేంద్రం ఆధ్వర్యాన శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మ అండ్ పార్టీ, ఏలూరు, ఉషాపరిణయం కూచిపూడి రీతి నృత్యనాటికను ప్రదర్శించినపుడు ముఖ్యఅతిథిగా వచ్చిన శ్రీ కుప్పుస్వామి ప్రసంగిస్తూ "కూచిపూడి నాట్యశాస్త్ర ప్రమాణాలు నేడు పలుసందర్భాలలో నత్యున్నతస్థాయిలో నుండడంలే దన్నారు. ఆ ప్రమాణాలకు తగ్గట్టు నాట్యశాస్త్రం బోధించేవారి సంఖ్య, ప్రదర్శించేవారి సంఖ్య, తగ్గిపోతున్నదన్నారు. ఈ లోటు శ్రీ ప్రహ్లాద శర్మవంటి నిష్ణాతులు తీర్చాలని కోరారు ఒక్క కూచిపూడి నాట్యవిషయంలోగాక రాజకీయ విద్యారంగాలలోగూడ ఈ

ప్రమాణాల పతనం కానవస్తున్న''దని శ్రీ కుప్పుస్వామి అన్నారు. సామాన్యప్రమాణాలే పలురంగాలలో కానవస్తున్నట్లు ఆయన వ్యాఖ్యానించారు.

''కూచిపూడి నాట్యం ఆదిలో పురుషులకు మాత్రమే పరిమితమై ఉన్నదనీ, స్త్రీ పాత్రను పురుషులే ధరించేవారనీ, కానీ ఇప్పుడు స్త్రీలు గూడ ఈ నాట్యరీతి నభ్యసించడంవల్ల రంగం విస్తృతంకావడం హర్షదాయకమే'' నన్నారు.

అనంతరం శ్రీ ప్రహ్లాదశర్మను శ్రీ కుప్పుస్వామి నూతన వస్త్రాలతో సత్కరించారు.

తదుపరి శ్రీ ప్రహ్లాదశర్మ ప్రసంగిస్తూ కూచిపూడి పద్ధతి 'ఉషాపరిణయం' దాదాపు 200 సంవత్సరాల క్రితం రూపొందిం దన్నారు. భామాకలాపం 13-వ శతాబ్దిలోనే రూపుదిద్దుకొన్నట్లు తెలిపారు. ఏలూరులో కూచిపూడి నాట్యకళాక్షేత్రం నిర్వహిస్తున్నాననీ, తమ బృందం ఇప్పటికి 'భామాకలాపం' 300 ప్రదర్శనలు, 'ఉషాపరిణయం' 300 ప్రదర్శనలు ఇచ్చినట్లు తెలిపారు. ప్రాచ్య, మధ్యప్రాచ్య, పాశ్చాత్య దేశాలు దాదాపు ముప్పదింట్లో తాము కూచిపూడి నృత్య ప్రదర్శన లిచ్చినట్లు వెల్లడించారు. శ్రీ ప్రహ్లాదశర్మ కుమారులు శ్రీ సీతారామశాస్త్రి ఉషాకన్యగా, శ్రీ మాణిక్యాలరావు చిత్రలేఖగా భూమికలు నిర్వహించారు. కుమారి కె. అన్నపూర్ణ, కుమారి ఎల్. కనకదుర్గ ఉష చెలికత్తెలుగ అభినయించారు. శ్రీ మాణిక్యాలరావు దశావతార వర్ణన రసజ్ఞుల ప్రత్యేక ప్రశంసలు పొందింది.

(శ్రీ వేంకటేశ్వరా విజ్ఞాన మందిరంలో జరిగిన ఈ కార్య క్రమంలో..... ఆంధ్రపత్రిక, జనవరి 23. 1982.)

శ్రీ వేంకటరత్నంగారి ద్వితీయ పుత్రులు వీరరాఘవయ్యా గారు. వీరు తమపినతండ్రి శ్రీ వేంకటేశ్వర్లుగారికి దత్తత వెళ్ళారు. సంప్రదాయసిద్ధంగా సంగీత నాట్యాలు అభ్యసించారు. కొంతకాలం

చింతావారి మేళంలోను, మహంకాళివారి మేళంలోను, శ్రీ వేంకట్రామా నాట్యమండలిలోను వేషధారణచేశారు.

ప్రస్తుతం నట్టువాంగం నడుపగల సమర్థులు కొరవడినందున తమ సోదరుడు శ్రీ సత్యనారాయణశర్మగారి ప్రదర్శనలకు నట్టువాంగం నెరపుతున్నారు. చక్కని గాత్రసంపత్తి, లయజ్ఞానంగల నాట్యాచార్యులు.



శ్రీ వేదాంతం సత్యన్నారాయణశర్మ

మూడవ కుమారులు శ్రీ సత్యనారాయణశర్మగారు. వీరు ప్రారంభ విద్యాభ్యాసం తమ అగ్రజుల కడ చేశారు. అనంతరం శ్రీ చింతా వేంకట్రామయ్యగారివద్ద నాట్యాభ్యాసం, శ్రీ యేలేశ్వరపు సీతారామాంజనేయుల వారి సన్నిధిని సంగీతాభ్యాసం చేశారు ప్రభుత్వమువారి సంగీత పరీక్షలలో కూడ నుత్తీర్ణులయ్యారు.

శ్రీ వేంకట్రామా నాట్యమండలి అవతరించడంతో శ్రీ సత్యనారాయణశర్మగారి అదృష్టం ఫలించింది. శ్రీ కృష్ణమూర్తిగారి కడ తమ నాట్యానికి మెరుగులు దిద్దుకొన్నారు. ప్రధాన స్త్రీ పాత్రధారణలో నైపుణ్యం సంపాదించారు. పెదముక్తేవి వాస్తవ్యులు, కళాప్రియులు, శాంతినికేతన విద్యార్థులు అయిన శ్రీ నట్టా వేంకటరత్నంగారి ప్రశంస లందుకొన్నారు. శుక్ల పక్ష క్షపాకరునివలె ననుదినం కూచిపూడి నాట్యకళాకాశంలో ప్రవర్ధమానం కాసాగారు. ఇంతలో శ్రీ బందా కనకలింగేశ్వర రావుగారి యాధ్వర్యంలో అఖిల భారత దేశ పర్యటనకు బయలు దేరారు. వీరి ప్రదర్శనలపట్ల ప్రజలు, ప్రజాప్రతినిధులు కూడ ఆదర గౌరవాలు చూపారు. అఖండ సన్మానాలు చేశారు. 1961లో కేంద్ర సంగీత నాటక అకాడమీవారి అవార్డును ఆనాటి రాష్ట్రపతి

డా. రాజేంద్రప్రసాదుగారి హస్తకమలాలతో నందుకొన్నారు. 1968 లో అప్పటి రాష్ట్రపతి జాకీరు హుస్సేనుగారి కరకమలాలతో ఫెలోషిప్పు నందుకొన్నారు. 1970 లో నాటి రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరిగారి పాణిపల్లవాలతో 'పద్మశ్రీ' బిరుదు నందుకొన్నారు. కూచిపూడి నాట్యాచార్యులలో నింతటి ఘన గౌరవాలను పొందిన నాట్యాచార్యు లెవ్వరూ ఇంతదనుక లేరని చెప్పుట నతిశయోక్తి కాదు.

శ్రీ చింతా కృష్ణమూర్తిగారు సిద్ధేంద్ర కళాక్షేత్ర నాట్య కళాశాలకు అధ్యక్ష పదవిని విరమించిన తరువాత వీరు ఆ పదవీ బాధ్యతలు స్వీకరించారు. కారణాంతరాలవల్ల ఆ పదవికి రాజీనామా సమర్పించారు. ప్రస్తుతం ఏవిధమైన పదవీ బాధ్యతలు లేక స్వేచ్ఛగా తమ ఇచ్ఛ వచ్చిన విధంగా నాట్య ప్రదర్శనలు ప్రదర్శిస్తూ కూచిపూడి భరతనాట్య కళాసేవ చేస్తూ వున్నారు. వీరు తమ నాట్యవారసునిగ తమ మేనల్లుడు చిరంజీవి పసుమర్తి రత్తయ్యను తయారుచేస్తున్నారు.

శ్రీ వేదాంతం వేంకటరత్నంగారి పుత్రత్రయం పుత్రవంతులు. శ్రీ ప్రహ్లాదశర్మగారికి చిరంజీవి సీతారామశాస్త్రి, రత్తయ్యశర్మ, మాణిక్యం, కొండలరాయుడు, కనకలింగేశ్వరరావు అను అయిదుగురు కుమారు లున్నారు. వీరిలో సీతారామశాస్త్రి మాత్రం సంప్రదాయనాట్యశాస్త్రాన్ని అభ్యసించారు. రెండవ కుమారుడు L. I. C. లోను, మాణిక్యం R. T. C. లోను పనిచేస్తున్నారు. కొండలరాయుడు, కనకలింగేశ్వరరావులు B. Com. చదువు తున్నారు.

శ్రీ వీరరాఘవయ్యగారికి రామశేషం, రత్తయ్య, శివయ్య, వేంకటేశ్వర్లు, బాబూజీ అను అయిదుగురు పుత్రులు. వీరిలో రెండవ కుమారుడయిన రత్తయ్య మాత్రం నాట్య సంప్రదాయాన్ని అవలంబించాడు.

శ్రీ సత్యనారాయణశర్మగారికి ఏకపుత్ర విశేషం. ఇతని పేరు వేంకటనాగప్రసాద్. ఈ చిరంజీవి అవకాశం లభించినపుడు నాట్యాభ్యాసం చేస్తూ మచిలీపట్టణం హిందూ కళాశాలలో ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరం చదువుతున్నాడు.

శ్రీ సాంబయ్యగారి మూడవ కుమారులు శ్రీ సత్యనారాయణ గారికి (శ్రీ) సాంబయ్య, (శ్రీ) శ్రీమన్నారాయణ అను నిరువురు పుత్రులు.

శ్రీసాంబయ్యగారు వాయులీన వాద్యంలోను, శ్రీ శ్రీమన్నారాయణ కంజరివాద్యంలోను నిపుణులు.

అయిదవ వారయిన ఘంటయ్యగారికి ఒక్కరే కుమారులు. ఆయన పేరు మల్లికార్జునశర్మ. ఈయన భాగవత పగటి వేషాలలో ప్రజ్ఞావంతులు.

# వేదాంతంవారి వంశం - 2

వేదాంతంవారి రెండవ శాఖలో ప్రముఖులు శ్రీ రాఘవయ్య గారు. ఈయనకు రామయ్య, ఆంజనేయులు అని ఇరువురు కుమారులు. శ్రీ రామయ్యగారికి రాఘవయ్య, వేంకటేశ్వర్లు, రత్తయ్య అను ముగ్గురు కుమారులు జన్మించారు. శ్రీ ఆంజనేయులు గారికి లక్ష్మీనరసింహం, సీతారామయ్య అను ఇరువురు కుమారులు కలిగారు.

శ్రీ రామయ్యగారికి బాల్యం నుంచి సంప్రదాయ నాట్యంతో సంబంధం వుంది. చాలాకాలం చింతావారి మేళంలో పనిచేశారు. చింతా వేంకట్రామయ్యగారి సాహచర్యంలో సూత్రధారునిగ వ్యవహరించడంలోని మెలకువలు గ్రహించారు. అన్ని వేషాల వాచికాభినయం వీరికి కంఠస్థం. కొంతకాలానికి చింతావారి మేళం చీలిపోయింది. ఆ మేళంలోని మేలురకం పాత్రధారులంతా ఇవతలకు వచ్చారు. వీరంతా కలసి "మహంకాళివారి మేళం" అనే పేరుతో ఒక క్రొత్తమేళాన్ని స్థాపించారు. ఈ మేళానికి వేదాంతం రామయ్యగారు నాయకులుగా వుండేవారు. శ్రీ మహంకాళి చినసత్యనారాయణ, శ్రీ కొఠారు శ్రీరాములు, శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ భాగవతుల రామకోటయ్య, శ్రీ భాగవతుల సూర్యనారాయణ, శ్రీ దర్భా వేంకటేశ్వర్లు, శ్రీ చింతా రాధాకృష్ణమూర్తి, శ్రీ చింతా సీతారామాంజనేయులు వగైరాలంతా సభ్యులుగా ఉండేవారు. ఈ మేళం మూడు పూవులు, ఆరు కాయలుగా విస్తరిల్లి వృద్ధిపొందింది.



శ్రీ వేదాంతం రాఘవయ్య

శ్రీ వేదాంతం రాఘవయ్యగారి వేషధారణ అమోఘంగా వుండేది. వీరు ఎక్కువగా స్త్రీ వేషాలు ధరించేవారు. శృంగార భూమికలు ధరించి, అభినయించడంలో ఈయనకు ఈయనే సాటి. దానికి తగినట్లు శ్రీ రామయ్యగారి సూత్రధారిత్వం మరింత వన్నె కూర్చేది. వీరి ఉషాపరిణయం నాటకం చూచినవారు తమ జన్మ ధన్యమయినట్లు భావించేవారు. శ్రీ రాఘవయ్యగారి ఉషాపరిణయం అన్నవార్త వ్యాపించిన ప్రతి గ్రామంనుండి తిరునాళ్లకువలె బళ్లు కట్టుటకు ప్రయాణమయ్యేవారు.

ఇంతలోనే చలనచిత్రరంగ వ్యామోహం ప్రారంభమైంది. శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారు సారధి ఫిల్మ్సు ప్రారంభించారు. వారు ప్రముఖ చలనచిత్ర వ్యాపారవేత్త. కళాహృదయులు. సరసులు. వారు తీసే "రైతుబిడ్డ" చలనచిత్రంలో నటించవలసినదిగా శ్రీ రాఘవయ్యగారిని ఆహ్వానించారు. వీరు అందుకు అంగీకరించి ఆ చిత్రంలో 'దశావతార నృత్యం' చేశారు. అది ప్రజాహృదయాలను ఆకర్షించింది. శ్రీ రాఘవయ్యగారు సినిమా ఫేమ్ అయ్యారు. మహంకాళివారి మేళానికి విలువ పెరిగింది.

హరిశ్చంద్ర యక్షగానంలో (శ్రీ) పసుమర్తి సుబ్రహ్మణ్యంగారు చంద్రమతిగా, శ్రీ కోరాడ శ్రీరాములుగారు హరిశ్చంద్రుడుగా, శ్రీ దర్భా వేంకటేశ్వర్లుగారు నక్షత్రకునిగా ఎంతో రసవంతంగా ప్రదర్శించేవారు. శ్రీ రాఘవయ్యగారు నీటితో నింపిన చెంబు నెత్తిన పెట్టుకొని, ఇత్తడి పళ్లెం అంచులమీద పాదాలు వుంచి " బాల గోపాల తరంగం " అభినయిస్తూ వుంటే అత్యద్భుతంగా వుండేది. ఆనాడు కూచిపూడి నాట్య సంప్రదాయంలో ఈ ప్రక్రియ నూతనంగా ప్రవేశించింది. ' సావరహేతవదనా ' అను అష్టపది, " కాంతోయాసనాతి దూరదేశమితి " అనే పుష్పబాణ విలాస శ్లోకం మున్నగు శృంగార రసాభినయానికి సంబంధించిన విషయాలు, జావళీలు, క్షేత్రయ్య పదాలు సందర్భోచితంగా వారి యక్షగానా లలో ప్రదర్శించేవారు. వీరి ప్రదర్శనం జరిగేచోట ప్రేక్షకజనాన్ని అదుపుచేయడం పెద్ద సమస్యగా పరిణమించేది. ఈనాటివలె దూర శ్రవణ యంత్రాలులేని కాలం అది ప్రతివారు వీరి వాచికాన్ని వినాలని, దగ్గరకువెళ్లి చూడాలని ఉబలాటపడేవారు. జనసమర్దాన్ని అదుపులోనికి తీసుకొని రాలేకపోవడంతో కొన్ని ప్రదేశాలలో ప్రదర్శనం మధ్యలోనే ముగించవలసివచ్చిన పరిస్థితులు లేకపోలేదు.

శ్రీ రాఘవయ్యగారికి రానురాను యక్షగాన ప్రదర్శనలలో పాల్గొనటం, వూరూర తిరగటం, తమ పాత్రకే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం, తాము రంగస్థల ప్రవేశం చేయగానే ప్రేక్షకులలో తోపులాటలు, గలభాలు ఎక్కువకావడంవల్ల, వీటితో పాత్ర ధారణకు స్వస్తిచెప్పారు. క్రొత్తగా ఒక " నాట్య ఎమెచ్యూర్ " స్థాపించారు. (శ్రీ) బాలాంతరపు రజనీకాంతరావుగారు వ్రాసిన " శత పత్రసుందరి " లాటి భావస్ఫోరకములైన గీతాలకు తమ బాణీలో నాట్య సంగీతాలు సమకూర్చుకున్నారు. తమ సంఘాన్ని నాట్య సంఘాన్ని వెంటబెట్టుకుని యావద్భారతదేశం తిరిగి, ప్రధాన నగరాలలో ప్రదర్శన లిచ్చారు.

ఈవిధంగా సంచారం చేయడం తండ్రికి యిష్టం వుండేది కాదు. అయినా వారి మాట లక్ష్యపెట్టేవారు కాదు. క్రమంగా మద్రాసు నగరంచేరుకొని వాహినీ స్టూడియోవారికి చాలా కాలం నాట్యదర్శకులుగా పనిచేశారు. చలనచిత్రరంగంలో అనుభవం గడించి, అనేక సాంకేతిక విషయాలు గ్రహించి, స్వయం ప్రతిభతో నృత్యదర్శకత్వం నుండి 'దర్శకులు' గా వృద్ధి సాధించారు. 'స్త్రీ సాహసం', 'లైలామజ్ను' 'సువర్ణసుందరి', 'రాజనందిని', 'దేవదాసు' మున్నగు ఉత్తమ చిత్రాలకు దర్శకత్వం నిర్వహించి శాశ్వత కీర్తి నార్జించారు.

"అచట బుట్టిన చిగురు కొమ్మైన చేవ" అన్నట్లుగా భావించి కూచిపూడి అగ్రహారంలో జన్మించిన ప్రతి మగాడు నాట్యాచార్యు డయ్యారు. శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ వెంపటి పెదసత్యనారాయణ, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి గారలు చలనచిత్ర రంగ ప్రవేశం చేశారు. శ్రీ చింతా వేంకట్రామయ్యగారు వయో వృద్ధు లయ్యారు. శ్రీ చింతా కృష్ణమూర్తిగారు ఈ రంగంలో ప్రవేశింపలేదు. ఇటు యక్షగాన విద్యలోను, భామాకలాపాదుల లోను, అటు చలనచిత్రరంగంలో ఏవిధంగానూ రాణింపనివారు నగరాలకు ఎగబ్రాకి కూచిపూడి సంప్రదాయ నాట్యాచార్యులై సంపన్నుల యిండ్లలో నాట్య పాఠాలు బోధింప నారంభించారు. ఇది చూచిన పండితులు, "కూచిపూడి నాట్యమంటే ఇదే కాబోలు" అనుకొని "ఇది గ్రామ్య నాట్యం, కూచిపూడి నాట్యం శాస్త్రీయమైనదికాదు" అని తీర్మానించారు. తమ నాట్యం శాస్త్రీయమైనది, ప్రత్యేకమైన శైలీ సంప్రదాయం కలది" అని నిరూపించుకొన వలసిన బాధ్యత కూచిపూడిలో సుప్రతిష్ఠితులై భరతనాట్యాచార్యులుగా కీర్తి ప్రతిష్ఠ లార్జించిన వారిపై వున్నది. 'కూచిపూడివారి నాట్యం' గ్రామ్యమైనది కాదు. శాస్త్రీయమైనది.

అని 'కృష్ణాపత్రిక', 'ఆంధ్రపత్రిక' మున్నగు వార, దిన పత్రికలు బహుళ ప్రచారం చేశాయి. కూచిపూడి భాగవతులకు గూడ ఇది ప్రతిష్ఠాకర సమస్యగా పరిణమించింది. అపుడు ఢిల్లీ, జయపూరు, హైదరాబాదు, మద్రాసు మున్నగు ప్రధాన నగరాలలో ప్రదర్శన లిచ్చి,సప్రయోగంగా తమనాట్యం సశాస్త్రీయము అనినిరూపించారు. అట్టి వారిలో శ్రీ వేదాంతం రాఘవయ్య, శ్రీ వెంపటి పెదసత్య న్నారాయణ, శ్రీ చింతా కృష్ణమూర్తి, శ్రీ వేదాంతం జగన్నాథశర్మ, శ్రీ వేదాంతం సత్యనారాయణ, శ్రీ వేదాంతం ప్రహ్లాదశర్మ ముఖ్యులు.

ఆంధ్రరాష్ట్ర సంగీత నాట్య అకాడమీ శ్రీ వేదాంతం రాఘవయ్యగారికి "భరతకళాప్రపూర్ణ" బిరుద సత్కారం చేసింది. ఇది వీరి నాట్యకళావైదుష్యానికి కీర్తిపతాక. ఈయన కేవలం నాట్యాచార్యులు, చలనచిత్ర దర్శకులే కాదు, మృదుమధుర మైన సినిమా పాటలు, కథలు, చక్కని సన్నివేశాలు సృష్టించగల రసహృదయుడు. ఇంకా ఎంతో కాలం కళాసరస్వతికి సేవ చేయవలసిన వయస్సు వుండగానే హృద్రోగంవల్ల అకస్మాన్మరణానికి గురియై అశేష కళాపిపాసువుల హృదయాలలో తీరని ఆవేదన కలిగించారు.

శ్రీ రాఘవయ్యగారికి ఒక కుమారుడు, ముగ్గురు కుమార్తెలు ఉన్నారు. కుమారుడు చిరంజీవి రాము శ్రీ వెంపటి చినసత్య నారాయణగారి "కూచిపూడి ఆర్ట్సు అకాడమీ" హైదరాబాదు శాఖలో నాట్యాచార్యులుగా పనిచేస్తున్నారు.

శ్రీ వేదాంతం రామయ్యగారి రెండవ కుమారుడు శ్రీ వేంకటేశ్వర్లు నడివయస్సులోనే కాలధర్మం చెందారు. వీరికి ఒక కుమారుడు, ఒక కుమార్తె జన్మించారు.

మూడవ కుమారుడైన రత్తయ్యశర్మ సంప్రదాయ నాట్య శాస్త్రాన్ని అభ్యసించారు. ఉషాపరిణయ యక్షగానంలో 'బాణాసుర', ప్రహ్లాదలో 'హిరణ్యకశ్యప', హరిశ్చంద్రలో 'విశ్వామిత్ర'

మున్నగు పాత్రలను సమర్థవంతంగా నటిస్తున్నారు. ప్రస్తుతం శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్ర అనుబంధ నాట్యకళాశాలలో నాట్యాచార్యులుగా పనిచేస్తున్నారు. శ్రీ వెంపటి చినసత్యంగారి దర్శకత్వంలో ప్రదర్శింపబడుతున్న "పద్మావతీ శ్రీనివాస కళ్యాణం" లో ఆకాశరాజుగా, భృగుమహర్షిగా వీరి వేషధారణ స్తుతిపాత్రమైనది. ఈయన భవిష్యత్తులో పూర్వుల కీర్తిప్రతిష్ఠలు రాణింపజేయగల ప్రతినిధిగా కళాజగత్తు ఆశలు పెంచుకొంది.

శ్రీ వేదాంతం రాఘువయ్యగారి ద్వితీయ పుత్రులు శ్రీ ఆంజనేయులుగారికి గాని, వారి సంతానానికి గాని ఈ సంప్రదాయ విషయాలలో ప్రవేశం లేదు.

## వేదాంతం వారు - 3

- జనార్దనయ్య
  - వేంకటాచలపతి
    - లక్ష్మీనరసింహం
      - సీతారామ శాస్త్రి (దత్త)
    - సూర్యనారాయణ
      - వేంకటాచలపతి
      - రాధే శ్యామ్
    - పార్వతీశం
  - వేంకటేశ్వర్లు
    - జనార్దనం
      - పార్థసారథి
      - పాండురంగ విఠల్
      - రామలింగ శాస్త్రి
  - లక్ష్మీనారాయణ
  - రామకృష్ణయ్య

# వేదాంతంవారి వంశం - 3

శ్రీ వేదాంతంవారి మూడవ శాఖలో శ్రీ జనార్ధనయ్యగారు ప్రధానులు. వీరికి వేంకటాచలపతి, వేంకటేశ్వర్లు, లక్ష్మీనారాయణ, రామకృష్ణయ్య అను నలుగురు కుమారులు జన్మించారు శ్రీ వేంకటాచలపతిగారికి శ్రీ లక్ష్మీనరసింహం, సూర్యనారాయణ, పార్వతీశం అను ముగ్గురు కుమారులు కలిగారు.

శ్రీ వేంకటాచలపతిగారు శ్రీ హరి వేంకటాచలపతిగారు, శ్రీ వెంపటి వేంకటనారాయణ, శ్రీ చింతా వేంకటరామయ్య, శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారలకు సమకాలికులు. సంప్రదాయసిద్ధంగా కలాపాలు, యక్షగానాలు అభ్యసించారు. చాలాకాలం చంద్రమతి, లీలావతి మున్నగు వేషాలు కట్టి కడు సమర్థవంతంగా నటించారు. వయఃపరిపాకం తగ్గడంతోనే వేష ధారణ విరమించారు. వైశ్వదేవం చేసిన కర్మిష్ఠి. అపర వయస్సంతా నిత్యకర్మానుష్ఠానాలతో నియమవంతంగా గడిపిన పవిత్ర జీవనులు.

శ్రీ వేంకటాచలపతిగారి జ్యేష్ఠ కుమారుడు శ్రీ లక్ష్మీనరసింహం గారు. ఈయన సంప్రదాయ విద్యలు అభ్యసింపలేదు. వైశ్వదేవం చేసిన కర్మిష్ఠి. ఉపాధ్యాయ వృత్తి అవలంబించిన లౌక్యుడు. వీరికి సంతానంలేదు. తమ రెండవ సహోదరులైన శ్రీ సూర్యనారాయణగారి ప్రథమ కుమారుని సశాస్త్రీయంగా దత్తత తీసుకున్నారు. ఉద్యోగ విరమణానంతరం అన్యోన్య ద్రవ్యసహాయంతో స్థానిక శ్రీరామలింగేశ్వరస్వామివారి ఆలయానికి దక్షిణంగా 'శంకర మఠాన్ని' నిర్మాణం చేయించారు. ఆస్తిక్య భావసంపన్నులు, సదాచార సంపత్తిగలవారు.



శ్రీ వేదాంతం సీతారామశాస్త్రి

శ్రీ లక్ష్మీనరసింహంగారి దత్తత పుత్రుడు చిరంజీవి సీతారామ శాస్త్రి అమోఘమైన ప్రతిభాసంపత్తి కలవాడు. పెడసనగల్లు జిల్లా పరిషత్తు హైస్కూలులో విద్యాభ్యాసంచేసి, శ్రీ వెంపటి చినసత్యంగారి 'కూచిపూడి ఆర్ట్సు అకాడమీ' మద్రాసులో సంప్రదాయసిద్ధంగా భామాకలాపం, మయూర నృత్యం, దశావతారాలు, యక్షగానాలు మున్నగు ప్రాచీన, అర్వాచీన నాట్య ప్రక్రియలలో నైపుణ్యం సంపాదించాడు.

విద్యాభ్యాసానంతరం శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్ర నాట్య కళాశాల విజయవాడ శాఖలో శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారి కనుసన్నలలో నాట్యాచార్యులుగా పనిచేశాడు. ఎంతోమంది నట్టువరాండ్రకు శిక్షణ యిచ్చి తీర్చిదిద్దాడు.

ఇతని వేషధారణం, నాట్యశిక్షణ ఎంతో ప్రతిభావంతంగా వుండేది. వృద్ధిలోకి రావలసిన యువకుడు. తూర్పుగోదావరి జిల్లా ప్రదర్శనకు వెళ్ళి తిరుగు ప్రయాణంలో దుర్మరణం పాలయినాడు. ఇతనికి ఒక్క కుమారుడు మాత్రం జన్మించాడు.

శ్రీ వేంకటాచలపతిగారి ద్వితీయ పుత్రుడు శ్రీ సూర్య నారాయణగారు. ఆధ్యాత్మరామాయణ కీర్తనలు గానం చేయడంలో ప్రతిభ కలవాడు. ఈయన పెద్ద కుమారుడు సీతారామశాస్త్రి దత్తత వెళ్లాడు. రెండవ కుమారుడు చిరంజీవి వేంకటాచలపతిశర్మ మృదంగ వాద్యంలో సమర్థుడు. మూడవ కుమారుడు రాధేశ్యామ్. ఇతడు భరతనాట్యంలో ప్రవేశం కలవాడు. కొంతకాలం మచిలీపట్నం నిర్మలా కాన్వెంట్ హైస్కూలులో నాట్యాచార్యుడుగా పనిచేశాడు. ప్రస్తుతం మద్రాసులోని శ్రీ వెంపటి చినసత్యంగారి కూచిపూడి ఆర్ట్సు అకాడమీలో నాట్యాచార్యులుగా పని చేస్తున్నాడు. నాల్గవ కుమారుడు చిరంజీవి పార్థసారథి. ఇతడు ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి భాషాప్రవీణలో ఉత్తీర్ణుడు. అయిదవవాడు చిరంజీవి పాండురంగశర్మ. ఆరవవాడు రామలింగేశ్వరశాస్త్రి. వీరిరువురకు సంప్రదాయ నాట్యాలలో ప్రవేశంలేదు.



## శ్రీ వేదాంతం పార్వతీశం

శ్రీ వేంకటాచలపతిగారి తృతీయ పుత్రులు పార్వతీశంగారు. ఈయన సుప్రసిద్ధ నాట్యాచార్యులు, కవి. ఈయన బహుగ్రంథకర్త. శ్రీ యేలేశ్వరాచార్యులవారి కవితా శిష్యుడు. శ్రీ చింతా వేంకట్రామయ్యగారికడ నాట్యాభ్యాసం చేశారు. వీరిని గురించి శ్రీ పి. యస్. ఆర్. అప్పారావుగారు "కూచిపూడి నృత్య దర్పణం" లో "ఉత్తమ విద్యార్థిగా, నటుడుగా, ఆచార్యుడుగా, గ్రంథ కర్తగా ప్రసిద్ధి వహించిన పార్వతీశంగారు కూచిపూడి కళామ తల్లి ప్రసాదించిన ప్రముఖ కళాకోవిదులలో ఒకరు."

తమ పూర్వులు దేశాటన సమయంలో ఆయా సంస్థానాధీశు లను, ప్రసిద్ధ దేవాలయాలను సందర్శించి, ఆ రాజుల వైభవమును, ఆ దేవతల ప్రభావమును కీర్తించుచు రచించిన ప్రత్యేక నృత్య రీతులను, శబ్దములను, కౌతములు, జతులు, తీరికలు మున్నగు వాటిని సంప్రదాయము బీరుపోకుండా ఈ గ్రంథంలో వరి కూర్చినారు పార్వతీశంగారు. అంతేకాక తాము స్వయముగా రచించిన తిల్లా నాలు, జావళీలు, దక్షయజ్ఞము ( నృత్యనాటిక ), జాతీయ నాటక ప్రశస్తులు, పూరించిన 'ఎరుక, అర్ధనారీశ్వరుడు, శివమోహినులు' అనెడి నృత్యరచనలను కూడా ఈ గ్రంథంలో చేర్చినారు. సుప్రసిద్ధ

కూచిపూడి నాట్యాచార్యులు కీ. శే. చింతా వేంకట్రామయ్య గారికి అంతేవాసులైన శ్రీ పార్వతీశంగారి స్వీయ రచనలు వీరి పూర్వుల రచనలకు దీటుగా ఉన్నవనుటలో అతిశయోక్తి లేదు.''

—శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు

వీరు 'కూచిపూడి నృత్య దర్పణము', 'భామాకలాపము', కూచిపూడి (ఖండకావ్యం), 'చింతామణి' యక్షగానము, 'ప్రహ్లాద'' యక్షగానము, 'రాసలీల' నృత్యనాటిక, 'అశ్రుతర్పణము' ఖండ కావ్యము, 'సిద్ధేంద్రుడు' గేయరచన మున్నగు రచనలు గావించిన బహుకృతులు.

శ్రీ జనార్దనయ్యగారి ద్వితీయ పుత్రులు శ్రీ వేంకటేశ్వర శాస్త్రిగారు. వీరు సంప్రదాయసిద్ధంగా గురుకులపద్ధతిని ఘంటసాలగ్రామ వాస్తవ్యులు శ్రీ చల్లపల్లి సీతారామశాస్త్రి వరేణ్యుల సన్నిధిని సంగీత విద్యాభ్యాసం చేశారు. ఈ శాస్త్రంలో మంచిప్రావీణ్యం సంపాదించారు. తెలంగాణాప్రాంతంలోని జాగీరు దారులను, భూస్వాములను తమ సంగీత విద్యా ప్రావీణ్యంతో అలరించి యినాములు భూరూపంగా సంపాదించారు. వీరు అవసాన కాలం వరకు తెలంగాణాప్రాంతంలోనే నివసించారు. వీరికి జనార్దనం అను ఒక్కడే కుమారులు. ఈయన పుత్రసంతానం లేకుండానే పరమపదించారు.

మూడవ కుమారులు శ్రీ లక్ష్మీనారాయణగారు. వీరు 'విశ్వామిత్ర', 'బాణాసుర' మున్నగు పాత్రలు ప్రతిభావంతంగా ప్రదర్శించేవారు. నడివయస్సులోనే పుత్రసంతానం లేకుండా కాల ధర్మం చెందారు.



శ్రీ వేదాంతం రామకృష్ణయ్య

నాల్గవ కుమారులు శ్రీ రామకృష్ణయ్యగారు. వీరు 'హరిశ్చంద్ర' మున్నగు సాత్విక రాజవేష ధారణలో అసమాన ప్రజ్ఞాధురీణులు. శ్రీ డి. వి. సుబ్బారావుగారికి సమకాలికులు. కొంతకాలం వారి ఇండియన్ డ్రమిటిక్ కంపెనీలో పనిచేశారు. అక్కడ వారి నటనా కౌశలానికి రాణింపురాదను అభిప్రాయంతో మరల కూచిపూడి నాట్యమేళంలో చేరారు. వీరి హరిశ్చంద్రవేషంలోని ఠీవికి, దర్పానికి, భావోచిత అభినయానికి సంతోషించి శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాదు బహద్దరు, చల్లపల్లిరాజాగారు విశేష ఆదర గౌరవాలు యిచ్చేవారు. వీరి పాత్రధారణ సర్వ జనాకర్షకమైనది.

ఒకమారు వీరు చింతావారి మేళంతో కలిసి దివి తాలూకా అవనిగడ్డ గ్రామంలో హరిశ్చంద్ర నాటకం ప్రదర్శించారు. అక్కడి ప్రజలు అంతకుముందు శ్రీ డి. వి. సుబ్బారావుగారి హరిశ్చంద్ర పాత్రధారణ చూచి ఆదరభావం పెంచుకున్నారు. శ్రీ రామకృష్ణయ్య గారు వారిని ఏ విషయంలోనూ అధిగమించలేరు అనే ఉద్దేశ్యంలో ఉన్నారు.

శ్రీ రామకృష్ణయ్యగారిది నిండైన విగ్రహం. వేషధారణ అమోఘుంగా ఉంటుంది. దానికి తగినట్లు కర్ణాటక సంగీత సంప్రదాయబద్ధమైన పాటలు గంభీరమైన, మంచి ఒడుగు కల గాత్రంతో పాడుతూ వుంటే ప్రేక్షకజనం సమ్మోహితులయ్యేవారు.

విశ్వామిత్రునకు తన రాజ్యమంతా ధారాదత్తంచేసి, తాను భార్యాపుత్రసమేతంగా అడవుల పాలవుతూ వుండగా, ఇంకా తనకు బాకీ ఉన్నాడని, ఆ బాకీ వసూలుచేసే నిమిత్తం తన శిష్యుడయిన నక్షత్రకుని హరిశ్చంద్రునివెంట పంపాడు. ఆ నక్షత్రకుడు గురుని బాకీని యిమ్మని హరిశ్చంద్రుని పరిపరివిధాల బాధిస్తూ ఉంటాడు. లేదా బాకీ యీాయ నవసరంలేదని చెప్పమంటాడు. ఈ బాధలు చూడలేని యొక ప్రేక్షకుడు వెంటనే లేచి రంగస్థలం మీాదకు వచ్చి నక్షత్రకుని పట్టుకొని, " ఏంటయ్యా, బాపనయ్యా! ఇందాకణ్ణుంచీ సూత్తాను. మా రాజును పట్టుకు మాబాద పెడుతుంటావు. నీ బాకీ క్రింద ఈ జామకాయలు కట్టుకో, మా రాజును వదలిపెట్టు " అని తాను అమ్ముకుందామని లంకనుంచి తెచ్చుకొన్న జామపండ్లు గంపలు రెండు రంగస్థలంమీాద పోయబోయాడు. ఆయన చర్యకు ప్రేక్షకులంతా గొల్లున నవ్వారు. పాప మా ఆసామీా అది నాటకమనే విషయం భావించక యథార్థమని భ్రమించాడు. ఇది శ్రీ రామకృష్ణయ్యగారి అభినయంలో నున్న ప్రతిభా విశేషం. ఇట్టి సంఘటనలు వారి నట జీవితంలో అనేకం చెబుతూ వుంటారు.

శ్మశాన కోర్టులో వారి కాటికాపరి అభినయాన్ని చూచి కంట తడిబెట్టని ప్రేక్షకుడంటూ వుండడు. ఆ దృశ్యం సమీాపించేసరికి కొందరు ప్రేక్షకులు చూడలేక వెళ్ళిపోతూ వుండేవారు. ఈ విధంగా శ్రీ రామకృష్ణయ్యగారు ఏ రసాన్నయినా ప్రత్యేకమయిన అనుభూతిని పొంది నటించేవారు. వీరు ' మాయాబజారు ' చలన చిత్రంలో ధర్మరాజుపాత్ర ధరించి సమర్థవంతంగా నటించారు. కొంతమంది రామకృష్ణయ్యగారి యభిమానులు, వారికి వృద్ధాప్యం

వచ్చినా హారిశ్చంద్ర నాటకంలోని సంభాషణలు, పద్యాలు చదివించుకొని రసానుభూతిని పొందేవారు. సమర్థుడైన నటునకు ఆహార్యంతో పనిలేదని నిరూపించిన నటశిఖామణి శ్రీ రామ కృష్ణయ్యగారు. వీరికి పుత్రసంతానంలేదు. ఒక పుత్రికమాత్రం జన్మించింది. వీరు పాత్రధారణమందేగాక నిజ జీవితంలోగూడ రాజసంగానే వుండేవారు.



## శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి

వేదాంతంవారి నాల్గవ శాఖలో శ్రీ రామేశయ్యగారు ప్రముఖులు. వీరి కుమారులు 'భరతకళాప్రపూర్ణ' శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు. వీరు సర్వతంత్రస్వతంత్రులు. భరత నాట్యకళా సంప్రదాయంలో అష్టపదులు, జావళీలు, తరంగాలు, పుష్పబాణవిలాసం మున్నగు శృంగార కావ్యాలలో శ్లోకాలు అభినయించే సంప్రదాయాన్ని ప్రవేశపెట్టిన ఘనత వీరికి దక్కింది. భరతశాస్త్రాన్ని పుక్కిట బట్టిన అగస్త్యులు. శ్రీ వెంపటి పెద సత్యనారాయణ, కొంతకాలం వేదాంతం రాఘవయ్య, నటరాజ రామకృష్ణగారలు, ఇంకా అనేకమంది వీరి శిష్యకోటిలోనివారు. వీరికి కూచిపూడిలో కంటె నితరప్రాంతాలలో అనేకమంది స్త్రీ, పురుష శిష్యులున్నారు. సంవత్సరకాలంలో ఆరు, ఏడు మాసాలు అన్యగ్రామ నివాసం చేస్తూ వుండేవారు. కూచిపూడి సంప్రదాయంలో యక్షగాన సంప్రదాయాన్ని శ్రీ చింతా వెంకట్రామయ్యగారు అభివృద్ధి చేయగా, భరతనాట్య సంప్రదాయాన్ని శ్రీ లక్ష్మీనారాయణగారు పెంపొందించారు.

వీరు యావదాంధ్రదేశంలోను కీర్తిప్రతిష్ఠలు గడించారు. భరతశాస్త్రంలో కూచిపూడి అగ్రహారం మొత్తంమీద అధికారికమైన వ్యక్తిగా పేరుగాంచారు. వీరికి వేంకటశాస్త్రి, శ్రీరామమూర్తి, జగన్నాథశర్మ అను ముగ్గురుకుమారులు. రెండవకుమారుడు



## శ్రీ వేదాంతం జగన్నాధశర్మ

శ్రీరామమూర్తిగారు దత్తత వెళ్ళారు. మూడవ కుమారుడు జగన్నాధశర్మ కూచిపూడి సంప్రదాయ భరతనాట్యాది శాస్త్రాలలో తండ్రికి తగిన తనయుడుగా రాణించారు. ఈయన చాలా కాలం మద్రాసులో నున్నారు. అనంతరం హైదరాబాదు ప్రధాన కార్యక్షేత్రంగా చేసికొని నాట్యాచార్యులుగా పనిచేశారు. 'భరత నాట్యకళాప్రపూర్ణ' బిరుదు సత్కారాన్ని పొందారు.

చిన్నతనంలో వీరిని వెంటబెట్టుకొని తండ్రి శ్రీ లక్ష్మ నారాయణశాస్త్రిగారు ప్రముఖ పట్టణాలలోను, పల్లెలలోను భామాకలాపం, గొల్లకలాపం మున్నగు ప్రదర్శన లిప్పించారు. నాట్యశాస్త్రంలోని మర్మాలన్నీ తెలియ చెప్పారు. సమర్థులైన ప్రముఖ నాట్యాచార్యునిగ రూపొందించారు. ఈనాటి కూచిపూడి లోని వారిలో సుప్రసిద్ధ నాట్యాచార్యులుగ పేరుపొందారు. దివితాలూకా అవనిగడ్డలో ఉంటూ అక్టోబరు 82-వ సంవత్సరమున దివంగతులయ్యారు.

# జోస్యులవారి వంశం

నారాయణయ్య - ౧

| | | |
|---|---|---|
| దుర్గయ్య | సీతారామయ్య | కృష్ణయ్య ౧ |

వేదాంతం వారిలో అయిదవ శాఖకు చెందినవారు శ్రీ పేరయ్య గారు. వీరి కుమారులు శ్రీ వేంకటేశ్వర్లుగారు. వీరికి రాధాకృష్ణ, మురహరి యను ఇరువురు కుమారులు. వీరు ప్రస్తుతం కూచిపూడిలో లేరు.

వేదాంతం వారిలో ఆరవ శాఖకు చెందినవారు శ్రీ వేంకట నారాయణగారు. వీరికి శాస్త్రులు అను ఒక్కరే కుమారులు. ఈ తండ్రి, కుమారులకు సంప్రదాయ విద్యలలో ప్రవేశముంది. శ్రీ శాస్త్రులుగారు సూత్రధారునిగా సమర్థవంతంగా వ్యవహరించేవారు.

శ్రీ శాస్త్రులుగారికి వేంకటనారాయణ, నరహరి అను ఇరువురు కుమారులు. శ్రీ వేంకటనారాయణ కూచిపూడి సంప్రదాయక ప్రదర్శనలకు మృదంగవాద్యం నేర్పుగా వాయించేవారు. ప్రస్తుతం వీరి కుటుంబం కూడ కూచిపూడి వదలివేసింది.

జోస్యుల వారి కుటుంబం: శ్రీ జోస్యుల నారాయణ మూర్తిగారికి దుర్గయ్య, కృష్ణమూర్తి, సీతారామయ్య అను ముగ్గురు కుమారులు.

శ్రీ దుర్గయ్యగారికి సంప్రదాయ విద్యలలో ప్రవేశంలేదు. వేద్యం ప్రధాన వృత్తిగా స్వీకరించారు. రెండవ కుమారులు సీతారామయ్యగారికి నాట్యశాస్త్రంలో మంచి నైపుణ్యముంది. ప్రస్తుతం విజయవాడలో స్థిరపడి నాట్యాచార్యులుగ విద్యార్థులను తయారు చేస్తున్నారు. శ్రీ కృష్ణమూర్తిగారు మృదుమధురంగా మృదంగం వాయిస్తారు. కూచిపూడి ప్రదర్శనాలకు ప్రస్తుతం వీరు మృదంగం వాయిస్తూ వుంటారు.

వీరుగాక ఇంకా ఎంతోమంది కూచిపూడి నాట్యకళాకారు లున్నారు. వారిలో నాకు తెలిసినంత వరకు, ఇతరులు తెలిపినంత

వఱకు వివరించగలిగాను. కొందఱు విస్మృతిపథంలోకి పోయి వుండవచ్చు. మరికొందరిని గూర్చి తెలియనందున విస్తృతంగా వ్రాసియుండక పోవచ్చు. అట్టి భ్రమ ప్రమాదాలు సంభవించి యుంటే క్షమింపవలసినదిగా ప్రార్థిస్తున్నాను. అట్టివారు తమను గురించిన విషయాలు నాకు తెలిపినయెడల మరి ప్రతిలో సవరించుకొనగలనని సవినయముగా మనవి చేయుచున్నాను.